# సాంపరభారతయాత్ర



సాధన గ్రంథ మండలి, తెనా

సాధన గ్రంథ మండలి, ౫౮.

# సుందర భారతయాత్ర

## (ప్రథమ భాగము)

గ్రంథకర్త:

బులుసు సూర్యప్రకాశశాస్త్రి

విద్వాన్.



ప్రకాశకులు

సాధన గ్రంథ మండలి - తెనాలి.

 * [వెల: రు. 2_8_0

మన్మథ ∙ శ్రావణము

ప్రతులకు :—

వేంకట్రామ అండ్ కో, వారి అన్ని బ్రాంచీలు.

ఓరియంట్ పబ్లిషింగ్ కంపెనీ వారి అన్ని బ్రాంచీలు.

ప్రభాత్ బైండింగు వర్క్సు, తెనాలి.

★

జానకీరాం ప్రెస్, తెనాలి.

## ACKNOWLEDGMENT

The author is very happy to express his grateful thanks for the help he has received, from the various Ministries of the Government of India, such as Ministry of Information and Broadcasting, Ministry of Transport; Press Information Bureau, Regional Touriest Officer, Madras, Public Relations Officers of various Railways and Directors of Information and Publicity of various State Governments, who have very readily and willingly placed the Choicest Photographic material and other valuable information for use by the author, and this indeed is a clean indication of the value and esteem with which they look upon such efforts as the publication of this book. He further wants to make a special mention of the help he has received from the Executive Officers of various famous temples and to Sri C. Sitaram, Manager, Poorna Pictures, Madras, for the pictorial illustrations lent to adorn this touriest guide, the first of its kind published in Telugu. Author's thanks are also due to the literary giants of Modern Telugu, who have very generously made several good contributions, in the shape of preface etc., which have indeed enhanced the value of this book and also to the State

Governments of Madras, Assam, United Provinces, Orissa, East Punjab, West Bengal, Bombay, Kashmir, Mysore, Rajasthan, Sowrastram, Hyderabad, Ajmir, Kutch, Coorg, Bhopal, Vindhyapradesh & Delhi Etc.

He also wants to express his heart felt gratitude to his valued friend Sri V. Bhanumurty, B. A., ( Secretary, Science Society, Madras-4, and Assistant Information Officer, Press Information Bureau, Govt. of India. ) for the spontaneous and keen interest he has evinced in enabling this book rich in information and illustrations, to be brought out in this present form.

*B. SURYAPRAKASA SASTRY*
AUTHOR.



శ్రీ శివాయ గురవేనమః

# అంకితము



# స్వవిషయము

సాధన గ్రంథ మండలికి ఎనిమిది సంవత్సరములు నిండి తొమ్మిదవసంవత్సరము నడచుచున్నది. కాని అనివార్యమగు కారణములచే నీ వత్సర మింతవరకు గ్రంథ ప్రకటనము జరుగ లేదు. నేడు ఈ సుందరభారతయాత్ర గ్రంథము వెలువడు చున్నది. ప్రధానమగు ఆర్థిక సమస్య నానాటికి తీరని సమస్యగా పరిణమించుచున్నది.

సాధక పాఠక లోకమువలన తగినంత ప్రోత్సాహ సహాయ ములు కలుగుటలేదు. ఇతరుల మనస్సును కష్టపెట్టి గ్రంథ ప్రచు రణ చేయుట మండలి యాశయముకాదు. 4, 5 సంవత్సరముల పారితోషక మివ్వవలసినవారు కలరు. ఎన్నివిధముల నివేదించి నను, వారివలన సమాధానములేదు. ఏకారణముచేనైనను సభ్యు లుగా నుండుట కవకాశములేకున్న, ఆ సంగతి తెలిపిన మండలికి మహోపకారము. మీయందలి విశ్వాసముచే గ్రంథములు పంపుచునే యుంటిమి. విజ్ఞులకు ఇంతకన్న తెలుపవలసినపనిలేదు. తామివ్వవలసిన సభ్యత్వ పారితోషికమును వెంటనేపంపి, మా కృషిని ప్రోత్సహింపుడు. సభ్యులుగా నుండుట కిష్టములేని-చో ఆ విషయము తెలిపిన మహోపకారము చేసినవారగుదురు. యథాప్రకారము తమ సభ్యత్వ పారితోషికమును పంపి, మా యీ కృషిని ప్రోత్సహించు సభ్యులకు మా కృతజ్ఞతలు.

వ్యవస్థాపకుడు?

**సాధన గ్రంథ మండలి**

## సమీక్షింపబడిన గ్రంథములు

౧ స్వానుభవములు
౨ క్షేత్రవాసుల కథనములు
౩ క్షేత్రమాహాత్మ్యములు
౪ ఇతిహాసములు
౫ స్థలపురాణములు
౬ భారతము
౭ భాగవతము
౮ దేవీభాగవతము
౯ గర్గభాగవతము
౧౦ శివపురాణము
౧౧ నారదపురాణము
౧౨ విష్ణుపురాణము
౧౩ వాయుపురాణము
౧౪ స్కాందపురాణము
౧౫ పద్మపురాణము
౧౬ బ్రహ్మవైవర్తము
౧౭ మత్స్యపురాణము
౧౮ కూర్మపురాణము
౧౯ అగ్నిపురాణము
౨౦ మార్కండేయపురాణము
౨౧ వరాహపురాణము
౨౨ గరుడపురాణము
౨౩ బ్రహ్మపురాణము
౨౪ బ్రహ్మాండపురాణము
౨౫ వామనపురాణము
౨౬ శివరహస్యఖండము
౨౭ కేదారఖండము
౨౮ కాశీఖండము
౨౯ భీమఖండము
౩౦ బ్రహ్మోత్తరఖండము
౩౧ అవంత్యఖండము
౩౨ నర్మదాఖండము
౩౩ పాంచరాత్రసంహిత
౩౪ సూతసంహిత
౩౫ సనత్కుమారసంహిత
౩౬ విశ్వేశ్వరసంహిత
౩౭ నారదసంహిత
౩౮ దక్షిణామూర్తిసంహిత
౩౯ యాజ్ఞవల్క్యస్మృతి
౪౦ గోపాలతాపిని
౪౧ గౌతమీమాహాత్మ్యము
౪౨ ఏలామాహాత్మ్యము
౪౩ బృహద్గౌతమీయతంత్రము
౪౪ సాంఖ్యాయనతంత్రము
౪౫ ఋగ్వేదము
౪౬ శతాధ్యాయి
౪౭ భగవద్గీత
౪౮ కాళికాగమము
౪౯ లలితారహస్యము
౫౦ మతంగవృత్తి
౫౧ మేఘసందేశము
౫౨ రఘువంశము
౫౩ చారోంధామ్ (హింది)
౫౪ తీర్థాంక (,,)
౫౫ భారత ప్రభుత్వ యాత్రిక సమాచారశాఖ ప్రచురణలు
౫౬ వివిధరాష్ట్ర ప్రభుత్వ యాత్రిక సమాచారశాఖ ప్రచురణలు
౫౭ వివిధ రైల్వేల యాత్రిక సమాచారశాఖ ప్రచురణలు



# విషయసూచిక

## —♦ ఇందలి ప్రధానములు ♦—

మహాక్షేత్రములు
క్షేత్రాంతరములు
మహానదులు
ఉపనదులు
సరోవరములు
తీర్థములు
కుండములు
పర్వతములు
దేవాలయములు
మహావృక్షములు
చారిత్రక స్థానములు
వివిధరాష్ట్రములు
జలపాతములు
యంత్రాగారములు
విశ్వవిద్యాలయములు
ద్వాదశజ్యోతిర్లింగములు
నవనారసింహాలు
శక్తిపీఠములు
పంచారామములు
సప్తసాగరసంగమములు
శివక్షేత్రములు
విష్ణుక్షేత్రములు
బౌద్ధక్షేత్రములు
ఇతరములు

# ప్రస్తావన

"గచ్ఛ గౌతమ! భద్రం తే గ్రామేషునగరేషు చ,
ఆహారాసనశయ్యాదీన్ కల్పయస్వ మహామునే !"

సుందర భారత పూర్ణయాత్రోత్సుకులైన మహనీయుల అడుగుజాడలలో సంప్రదాయానుసారము ముందుగా గౌతముని ప్రార్థించి, నాకు నాసహ యాత్రికులకు అభ్యుదయ పరంపరాభివృద్ధిని అనుగ్రహించవలసినదని గణనాయ కునికి నాయిష్టదైవమునకు గురువులకు నమోవాకములు పలికి, ఒక శుభ ముహూర్తమున సుస్నాతుడనై దీక్షాకంకణధారినై రత్నాకరమహోదధివలయి తమై వింధ్యమేఖలయై స్వచ్ఛహిమాలయకిరీటినియైన భారతమాతనిసర్గ మనో హర రూపమును కాంచతలచిన తరి; ప్రయాగవాస్తవ్యులు పరమపూజ్యులు ప్రాతఃస్మరణీయులు అగు శ్రీ ౧౦౮ ప్రభుదత్తబ్రహ్మచారి మహారాజులు, లోకకల్యాణార్థమై త్రివేణీతీరమున ౧౧ రోజులు అఖండమహాసంకీర్తన, రుద్ర యాగము చేయసమకట్టి మాకు తెలుపగ, కొందరమిత్రులము పరమానందముతో పయనమై తీర్థరాజమగు ప్రయాగచేరి, వివిధ ప్రదేశములనుండి యేతెంచిన భక్తసంఘములతో వేలాదిమహాత్ములతో కలసిమెలసి, పదిరెండురోజులుగడ పితిమి. పిమ్మట శ్రీ బ్రహ్మచారిగారి ఆజ్ఞ ఆశీర్వచనములబడసి, తీర్థయాత్రకు సమకట్టి పర్యటనాక్రమంబున—

"మలయమనగ శుక్తిమంతంబునా వింధ్యమనగ పారియాత్రమన మహేంద్రమున ఋక్షమున సహ్యమనగ కల సప్తకులనగంబులును; గంగయు, తుంగభద్రయు, వేత్రవతియు, వేదవతియు కృష్ణవేణియు, పెన్నయు, యమునయు, తమసయు, శరావతియు, కావేరియు, గోదావరియు, నర్మదయు, బాహుదయు, సరయువును, శతద్రువును, వితస్తయు, విపాశయు, తామ్రపర్ణియు నను మహానదులును—అటనటకలుగు సరిద్విశేషంబులును, పాంచాల పాండ్య బర్బర వత్స మత్స్య మగధ మళయాళ కళింగ కుళింగ కురుకు కొంకణ టెంకణ త్రిగర్త సాముద్ర సాళ్వ శూరసేన కుధేష్ణ సహ్మ కురు కరూశ కాశ కోసల యవన యుగంధర ఆంధ్ర సింధు చేది చోళ పుళింద పుండ్రక పాండ్య అభీర సౌవీర సౌరాష్ట్ర మహారాష్ట్ర విదేహ విదర్భ ద్రవిడ కుశార్ణ కర్ణాట గౌళాంగ వంగ మరాట లాట బాహ్లిక బహుదాన కిరాత కేకయ అశ్మంతక కాశ్మీర గాంధార కాంభోజ కేరళ మాళవ నేపాల ఘూర్జర కుంతల అవంతిక అనూపాది" పూర్వ జనపదంబులకు ఆధునిక రూప

ములుగా భాసిల్లిన త్రింశ ద్రాష్ట్ర విశాల్రూపమైన నవభారతావనిని యథావకాశముగ సందర్శించి, సర్వ పుణ్యతీర్థంబుల నదీ నదంబుల సమయానుకూలంబుగ గ్రుంకు లిడి, ప్రత్యూషంబుల సవితృ పాద ప్రణామంబు లాచరించి, ముముక్షుజన కల్పతరువులును, భక్త బాంధవులును నగు ప్రత్యక్ష దైవతముల నారాధించి, తదీయ క్షేత్ర మాహాత్మ్య మరసి, అయ్యయితావుల పారలౌకిక క్రియల వేదోక్తంబుగా ననుష్ఠించి, దేశాటన కుతూహలురైన నను బోంట్లకు అనుభవైకవేద్య మగు పుణ్యవినోదఫలము లన్నింటిని సంతరించుకొని ఐహికాముష్మికములు రెండింటిని సముపార్జించుకొని ధన్యులమైతిమి.

స్వగృహముచేరి మా యాత్రానుభవములను భారతమాత నిసర్గ మనోహర రూపమును పాఠకమహాశయుల మనశ్చక్షువులకు ప్రత్యక్షము గావించు తమకంబున సరసపదవిన్యాస విశేషముల యాత్రా కథాక్రమాఖ్యానంబున కుపక్రమించుతరి, స్వయంప్రకాశమాన తేజుండును మిత్రుండును మిత్రసులభుండు నైన నొక మహనీయమూర్తి నన్నావేశించి సర్వ భారతనగర స్థితంబులైన ఎల్ల చోద్యంబులను, మనోజ్ఞదృశ్యంబులను ఆయా పుణ్యతీర్థ వినోదస్థలవిశేషంబులను, కర్ణపేయమైన మధురివ్యంజివచోవిలాసముతో శ్రుతపరచినందున చిరంతనమైన మదీయమనోవాంఛితంబు ద్విగుణితోత్సాహమై అయత్న స్థిరముగా నెఱవేరినట్లయ్యె.

మనోహరమైన మాయీ సుందర భారతయాత్రాక్రమమున ఆయాతావుల తమ యాతిథ్యవిశేషంబులచేతను, చిత్ర విచిత్ర ఛాయాచిత్రదాన మహిమంబుచేతను, మరింతరమణీయముగ నేత్ర పర్వంబుగ రూపొందజేసిన అయ్యాయి ప్రభుత్వాధినేతలకు జోతలువెట్టి, సుందరంబైన అక్షర రూపమిచ్చిన కృపామతులు జానకీరాములకు, జోహారులుపలికి, రామశ్రీ చేలువారు చిత్తరువులచే గ్రంథమునకు అలేఖ్యతనూ విలాసము సమకూర్చిన మునిస్వామి రామగోపాలునికి శ్రీరాములకు, సీతారాములకు ధన్యవాదంబులర్పించి, కృతార్థుండ కాదలంచితి.

ఈబృహత్ప్రయత్నంబునకు ముందునిలిచి, ఆశీఃపురస్సరముగా సువర్ణాక్షతలు దయచేసిన జ్ఞాన వయోవృద్ధులు అభినవతిక్కన శ్రీ సుబ్రహ్మణ్యకవివతంసులకు, సరస సంగీత సాహిత్య చక్రవర్తులు శ్రీ అనంతకృష్ణశర్మాభిధానులకు, కళాప్రపూర్ణులు శ్రీ చిన సీతారామస్వామి శాస్త్రులవారికి, సాహిత్యభూషణులు శ్రీ సత్యనారాయణార్యులకు, వైయాకరణశిరోమణులు శ్రీ వేంకట

రమణాభిధులకు, పూర్ణప్రజ్ఞావతంసులు శ్రీ వేంకటశేషశాస్త్రిశతావధానులకు, విద్వజ్జనమాన్యులు శ్రీ బులుసు పండితులకు, బాలవాఙ్మయబ్రహ్మలు శ్రీ దీక్షితులవారికి, చరిత్రరహస్య ప్రకాశనచణులు శ్రీ సోమశేఖరులకు, విద్యార్థకమల దివాకరులు శ్రీ వేంకటావధాని భట్టాచార్యులకు, రస హృదయ గ్రహణ పారీణులు ఆచార్య! శ్రీసుబ్రహ్మణ్యశాస్త్రివరులకు, మహానుభావులు శతావధానులు శ్రీ శివరామశాస్త్రిపాదులకు, కృతజ్ఞతాపూర్వక సాష్టాంగ నమస్కారము లాచరించి, నీరాజనమర్పించిన సర్వతోముఖ ప్రజ్ఞావంతులు శ్రీ భానుమూర్తి సార్థక నామధేయులను, గ్రంథలేఖనమున సహకరించిన, నా సోదరుడు శ్రీ సూర్యప్రకాశమును, అనురాగపురస్సరముగా ఆశీర్వదించుచున్నాను.

మరియు నా యీ కృషికి బహువిధముల సహకరించిన, శ్రీ కేశవతీర్థ స్వామివారికి, శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి, శ్రీ మద్దులపల్లి వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి, శ్రీ గట్టి లక్ష్మీనరసింహశాస్త్రిగారికి, శ్రీ కుందుర్తి వేంకటనరసయ్యగారికి, శ్రీ అవ్వారి హనుమయ్యగారికి, శ్రీ ఉపాధ్యాయుల సుబ్రహ్మణ్యంగారికి, శ్రీ దోనేపూడి సుబ్రహ్మణ్యంగారికి, శ్రీ ధన్యంరాజు అప్పారావుగారికి, శ్రీ శిష్ట్లా సత్యనారాయణగారికి కృతజ్ఞతాపూర్వక నమస్కారములు.

ఇక యీగ్రంథ విషయం బెట్టిదనిన 'బాణోచ్ఛిష్టమిదం జగత్' అన్నట్టు సర్వము సత్పురుషుల ఉచ్ఛిష్టమే కదా! నాదని సగర్వముగా పేర్కొనదగినది భాష. నా అనుభవములు నా ఎఱిగినంతలో స్థలపురాణాదులనుండి, కైఫీయతులనుండి, ఆయాయి రాష్ట్రప్రభుత్వములు, యాత్రికశాఖాధికారులు, వివిధ రైల్వేల యాత్రిక సమాచారశాఖాధికారులు దయచేసిన గ్రంథములనుండి, తీర్థయాత్రాసక్తులైన అనుభవజ్ఞులవలన విని స్వయముగాకని, విబుధజనులవలన తెలిసికున్నంత సమాచారసర్వస్వమును ఈపొత్తమునందు పొందుపరచితిని.

అల్పజ్ఞుండను, అర్థశూన్యుండను, సామర్థ్యరహితుండను, అయిన నాకీ సుందరభారతయాత్రా సంకల్పము కలుగుటయేమి? దానిని పరమపూజ్యులు, ప్రాతఃస్మరణీయులు శ్రీగంగా ప్రభుదత్తబ్రహ్మచారి మహారాజులు ఆశీర్వదించుటయేమి? శ్రీ వేమరాజుభానుమూర్తి ప్రభృతుల వంటి మిత్రులు కరావలంబన మిచ్చుటయేమి? జానకీరామ నామాంకితమైన ముద్రణాలయాధిపతుల యీగ్రంథమునకు సర్వాంగసుందరస్వరూపంబు సమకూర్చుటయేమి? ఓరియంటు ప్రెస్ సంస్థాపకులు ముఖపత్రము (టైటిల్) తీర్చిదిద్దుటయేమి? శ్రీ సీతారాం

గారి వంటి నిపుణ ఛాయాచిత్రగ్రాహకులు, శ్రీ శ్రీ రామపుణ్యానామధేయులు వంటి వరిష్ఠ కళాకారులు అయాచితముగ యీగ్రంథసరస్వతిని అమూల్యమైన వేష భాషలతో అలంకరించుటయేమి? అడిగిన తడవుగా వివిధ రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాధినేతలు, వివిధరైల్వేల యాత్రికసమాచార శాఖాధికారులు మన స్ఫూర్తిగా సహకరించి సర్వసమాచార వితరణులై సమాదరించుటయేమి? అనుభవజ్ఞాన పరిణతులైన పండితప్రకాండులు శిరోధార్యములైన రచనలతో దీనికి తిలకము దిద్దుటయేమి? గ్రంథావలోకన తత్పరులైన తీర్థయాత్రాచరణశీలురైన పరశ్శతాధిక పాఠకమహాశయులు ముందుగా గ్రంథమూల్యమును పంపుటయేమి? ఈ సర్వశుభశకున ఫలితముగా నే తలపెట్టిన యీసుందరభారత యాత్ర దిగ్విజయముగా పర్యవసన్నమగుటయేమి? ధ్యానించిచూడగా ఇది సర్వము ఆంధ్రదేశపు అభిమానదైవతములైన శ్రీశైల, సింహశైల, శేషశైలేంద్రులవరప్రసాదమేకదా!

"యదత్ర స్ఖలితం కించిత్ ప్రమాదేన భ్రమేణవా,
తత్సర్వం శోధయం త్వార్యా కస్య న స్ఖలితం మనః.
గచ్ఛతః స్ఖలనం క్వాపి భవత్యేవ ప్రమాదతః,
హసంతి దుర్జనా స్తత్ర సమాదధతి సజ్జనః.
బహుచ్ఛిద్రం పరిత్యజ్య గుణలేశ జిఘృక్షయా,
పరిగృహ్ణాం త్వదోషజ్ఞా ఋజవో దంభవర్జితాః."
"యదక్షర పద భ్రష్టం మాత్రాహీనం చ యద్భవేత్,
తత్సర్వం క్షమ్యతాం దేవ! నారాయణ! నమోస్తు తే."

ఇతి శమ్

బుధజన విధేయుడు,

మన్మథ శ్రావణము,
తెనాలి.

బులుసు సూర్యప్రకాశ శాస్త్రి
వ్యవస్థాపకుడు : సాధన గ్రంథ మండలి.

# పీఠిక

పాశ్చాత్యులు దేశాటనమును, విద్యాభ్యాసమున కంగముగాను వినోదపరముగాను భావించియుండఁగా, భారతీయులు ఆ దేశాటనమునే తీర్థయాత్రలఁ జేసి పవిత్రీకరించి, దానిని పరమార్థసాధనముగా పరిణమిలఁ జేసియున్నారు. ప్రపంచమంతయు పరమేశ్వరస్వరూపమనుట తథ్యమేయైనను, ఆ భావమును అత్యంతపరిపక్వచిత్తులుగాని యందుకొన నేరరు. మఱి, అపరిపక్వచిత్తుల గతి యేమి? అట్టివారలకుఁ జేయూఁత నొసఁగి వారి నొక్కొక్కమెట్టు పైకెక్కించుటయు ఉపదేష్టలకుఁ గర్తవ్యము కాదా? "కేషు కేషుచ భావేషు చింత్యోఽసి భగవన్మయా?" అని యర్జునుఁ డంతవాఁడు శ్రీకృష్ణుని ప్రశ్నించెను. ఇఁక నన్యులఁగూర్చి చెప్పవలసినదేమి? ఆకాశము నొరసి కొనిపోవు శిఖరములుగల శిలోచ్చయములు; కూలంకషములై యఖండవేగమునఁ బ్రవహించు నదీనదములు; సృష్ట్యాదినుండియు సూర్యరశ్మియేని చొర నెడమీని గిరిగహ్వరములు, ఇసుకవేసినను రాలనంత దట్టముగా నల్లుకొని బహుశాఖోపశాఖలతో శోభిల్లు మహారణ్యములు — వీనిం జూచునపుడు యాత్రికుని చిత్తవృత్తి క్షణకాలము స్వీయచింతలను మఱచి, ఆ మహనీయ దృశ్యమందు లీనమగును. ఒకవ్యక్తి హృదయమున భక్త్యాదిబీజములు నాటుటకు సరియైన యదను ఇదియే యని యార్యుల నిశ్చయము. భక్తులు సంగీతముచేతఁ గావించు సిద్ధియు నిదియే. రాగతాళములకు వశమై, మనస్సు లయించి యుండఁగా, అందు భగవానునిదివ్యతలలు నాటుటయే గానమందలి యుద్దేశము. సంగీతమునకు శ్రోత్రేంద్రియము సాధనమైన, ప్రకృతిరామణీయక దర్శనమునకు యాత్రికునకు నేత్రేంద్రియము సాధనము. రెంటను కార్యము, మానసమందలి వాసనలఁ దాత్కాలికముగా నడ్డు రానీయకుండుటయే. అప్పుడు చిత్తము ద్రవించి యేది ముద్రించినను దాని నిలుపుకొన సమర్థమై యుండును. తన్నుఁ దా మఱచుటయే పురుషార్థమునకు చివరిఫలము; అవాంతర ఫలము లెన్నియున్నను, విద్యలయొక్క, కళలయొక్క, యోగములయొక్క చరమలక్ష్య మిదియే యని మనము గ్రహింపవలయును. కర్మయోగి క్రియాకలాపమందు నిమగ్నుఁడై తన్నుఁదా మఱచుచున్నాఁడు. రాజయోగి యోగానుష్ఠానమునఁ దన్నుఁదా మఱచుచున్నాఁడు.

ఇఁక, జ్ఞానయోగి తొలినుండియు స్వస్వరూపమున అహంకారమును లయింపఁజేయఁ జూచుచున్నాఁడు. వేయేల? వేదాంతములయందుఁ

గాక విషయ భోగములయందును పరిపూర్ణానందము తన్నుఁదా మఱచు నపుడే. "సురతేచ సమాధౌచ, మాయా యత్ర నలీయతే । ధ్యానేనాపిహి కింతేన కింతేన సురతేనవా?" "When shall I be happy?" అను ప్రశ్నమునకు బుద్ధభగవానుఁడు "When you cease to be" అని ప్రత్యుత్తరము చెప్పినట్లు వినియున్నాము.

2. పురాణేతిహాసములు తీర్థయాత్రాదికమును అత్యర్థము ప్రశంసించి యుండఁగా, ఉపనిషత్తులలోఁ దన్నిరాసక వాక్యములు బహుళముగాఁ గానవచ్చుచున్నవి. గురుముఖమున గ్రంథములఁ జదువువారు, ఈవైరుధ్యము అధికారభేదమునుబట్టి యేర్పడిన దని సులభముగాఁ దెలిసికొనఁగలరు. అగురులగు స్వతంత్రులు ఈభేదమును సమన్వయపఱచుకొనఁజాలక ఈవాక్యములు ఒండొంటికి విరుద్ధమని తలపోసికొని, గ్రంథములయందలివిశ్వాసమును కోల్పోవుదురు. భాగవతమున భక్తియోగము నగ్గించుచోట, కర్మయోగము ఎట్లెట్లు అపకర్షింపఁబడినదియు మన మెఱుఁగుదుము. ఇక్కడి యుద్దేశ్యము భక్తియోగము నుత్కర్షించుటగాని, కర్మయోగమును అపకర్షించుటకాదు. దీనినే పెద్దలు 'నహినిందాన్యాయము' అందురు. అద్వైతు లందఱు మోక్షమే జీవితముయొక్క పరమప్రయోజన మనియు, అవిద్యా నివృత్తియే తత్స్వరూపమనియు, నంగీకరించి యున్నారు; ఈయవిద్యమల, విక్షేప, తిరోధాన రూపముగా నున్న దని తత్త్వజ్ఞు లెల్లరు నెఱింగినవిషయమే. కావునఁ దొలుతఁ దొలఁగవలసినది — చిత్తమాలిన్యము. అది తొలంగినంగాని ఒకనికి ఉపాసనయందలి యధికారము లేదు. ఉపాసనముచేత చిత్తవిక్షేపముగూడ తొలఁగఁగా పురుషుఁడు స్వరూపాచ్ఛాదకమైయున్న తిరోధానరూపకావిద్యను గడకొత్త సమర్థుఁడగుచున్నాడు. ఇవే, బ్రహ్మస్వరూపావగతికి సాధనములు. చిత్తమాలిన్యము తొలఁగించుసాధనములలో నిష్కామ కర్మాచరణము, భగవన్నామోచ్చారణము గంగాస్నానాదికము (తీర్థయాత్రలలో చేరినది) పేర్కొనఁబడినవి. నిష్కామకర్మాచరణమునకు మానవునకుఁ గొంతకుఁ గొంత సంస్కార ముండవలసియున్నది. భగవన్నామోచ్చారణము ఎన్ని యుపాయముల పాల్పఱచినను విసువు కొల్పవచ్చును. మాఁడవ దగు తీర్థయాత్రల నిట్టి యిక్కట్టులు లేవుగాని, దానికి శరీరదార్ఢ్యము, ధన సంపత్తి, మనుష్య సాహాయ్యము అవసరములు. ఈ యన్నియుఁ గలవానికిఁ దీర్థయాత్ర సద్యస్సిద్ధిప్రదము.

3. భారతదేశమునందలి పుణ్యక్షేత్రములు అసంఖ్యాకములు. పురాణములలో (కాశీఖండము మొదలగునవి) వాని పేర్మి అగ్గలముగా నుగ్గడింపఁబడి తత్తత్ క్షేత్రముల దర్శించి, తత్తత్తీర్థముల నాడి కృతార్థులైనవారి చారిత్రములు హృదయంగమముగాఁ జిత్రింపఁబడి యున్నవి. వీనినమ్మి యాత్రలకుఁ దొడఁగువారు ధన్యులు. "శ్లో॥ మంత్రే తీర్థే ద్విజే దైవే దైవజ్ఞే, భేషజే గురౌ, యాదృశీ భావనా యత్ర సిద్ధిర్భవతి తాదృశీ" అనుట నిరవద్యము. బ్రహ్మవిదుల నుద్దేశించి చెప్పఁబడిన పెద్దపెద్దమాటల నూఁది యాత్రలు నిష్ఫలము లని వానికిఁ దొడఁగనివాఁడు రెంటికిం జెడిన రేవఁ డగుచున్నాఁడు. పూర్వపూర్వ నియోగములఁ బాటించి, పైమెట్టుకు రావలయుఁగాని, ఒక్కగంతులోనే గంతవ్యము చేరవలయుననుకొనువాఁడు కాలువిఱుచుకొని పురోగమింప లేకయే పోవచ్చును.

శ్రీపర్వతం శిరస్థానే, కేదారంతు లలాటకే
వారాణసీ మహాప్రాజ్ఞ, భ్రువో ర్ఘ్రాణస్య మధ్యమే.
కురుక్షేత్రం కుచస్థానే, ప్రయాగం హృత్సరోరుహే
చిదంబరంతు హృన్మధ్యే, ఆధారే కమలాలయమ్॥

అని యుపక్రమించి,

ఆత్మతీర్థం సముత్సృజ్య, బహిస్తీర్థాని యో వ్రజేత్
కరస్థంతు మహారత్నం, త్యక్త్వా కాచం విమార్గతే॥

అనియు,

చిత్త మంతర్గతం, దుష్టం తీర్థస్నానై ర్న శుద్ధ్యతి
శతశోఽపి జలై ర్ధౌతం, సురాభాండ మివాశుచి॥

అనియుఁ జెప్పిన యుపనిషత్తే,

విషువాయనకాలేషు, గ్రహణే చాంతరే కదా
వారాణస్యాదికస్థానే, స్నాత్వా శుద్ధో భవేన్నరః॥

అని గంగాస్నానమును వెంబడి కొనియాడియున్నది. సమ్యగ్దర్శనము కల పెద్దలు, సర్వసంగము త్యజించిన పరివ్రాట్టులు, ఈ క్షేత్రముల నప్పటి కప్పటికి దర్శింతురనుటయు తీర్థముల గ్రుంకుదురనుటయు యథార్థము. అట్టివారి సంస్పర్శముచేఁ బావనములైన తీర్థక్షేత్రములలో యాత్రికుఁ డెట్టి యభ్యుదయముల కెదురుచూడరాదు? మహనీయులైన బ్రహ్మశ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రుల వారు వీనింగూర్చిన బహుగ్రంథములను బరిశీలించుటయేగాక తాము స్వయముగా పర్యటించి ఈపుణ్యక్షేత్రములలో ఎక్కడెక్కడ సేవిదర్శనీయములో పోవునెడ నేయేవస్తువులఁ దీసికొని పోవలయునో స్వానుభూతిమీఁద నతినిపుణముగ వివరించియున్నారు. ఈ 'సుందరభారతయాత్ర' పుణ్యక్షేత్ర తీర్థజిగమిషువులపాలిటి పారిజాతవృక్షముగా నున్నది. ఎన్ని చరిత్రాంశములు! ఎన్ని స్థానికకథలు! ఎన్ని ధర్మశాస్త్రవిషయములు — ఇదియొక గ్రంథ సర్వస్వముగా నున్నది. గ్రంథకర్త సంకల్పించిన రెండవభాగమును వెలువడి ఆంధ్రుల కరముల నలంకరించుఁగావుతమని యాశీర్వదించుచున్నాను. శాస్త్రులవారి గ్రంథరచనోద్దేశ్యము భగవంతుని కరుణచే, ఫలవంతమగును గావుత!

నెల్లూరు,
18-5-1955.

మహోపాధ్యాయ,
దుర్భా సుబ్రహ్మణ్యశర్మ

---

'క్షేత్రస్య స్మరణాదేవ
మహాపాతక నాశనమ్.'

......పోయి సేవింపలేకున్న పుణ్యతీర్థ
మహిమ వినుటయు నఖిలకల్మషహరంబు.

# సుందరభారతయాత్ర

## యాత్రావైభవము

### పరిచయము

యాత్రల ఆవశ్యకత ప్రయోజనము వీనినిగూర్చి నేఁడు నేనఁగాని, యెవరుగాని క్రొత్తగా అభిప్రాయ మియ్యవలసినదేమి? తీర్థక్షేత్రములందే ఇంతవఱకు భారతదేశపు జ్ఞాన విజ్ఞాన కళా శిల్పముల యౌన్నత్యము కేంద్రీకృతమైయున్నది. ఆయా స్థలములకు యాత్ర సాగింపనిది మనదేశపు ప్రకృతి సౌందర్యముగాని, మన ప్రాచీనతపస్సుల ఆధ్యాత్మికాధిభౌతికాధిదైవిక సిద్ధులుగాని పరాయణములుగాని గోచరింపవు. ఆ పుణ్యమధురక్షేత్రముల మాహాత్మ్యములను స్వానుభవపూర్వకముగా ప్రకటించు తమ సంకల్పము సర్వశ్లాఘ్యము. అది నిర్విఘ్నముగా నెరవేరుగాక !

ఓరియంటల్ ఇన్‌స్టిట్యూటు
తిరుపతి } రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ



### తీర్థనిషేవణము

ధర్మచింతతో యాత్రలు చేయుట అన్ని మతముల లోను ఉన్న పురాతనాచారము.

పుణ్యపురుషులును అవతార పురుషులును ఉదయించిన ప్రదేశములు, వారు సంచరించిన ప్రదేశములు, వారు నిర్యాణము నొందిన ప్రదేశములు జనసామాన్యమునకు సంసేవ్యములు.

మనుష్యుడు తాను తన దౌర్బల్యమువలన మంచి గుణము లలవర్చుకొని నియమ బద్ధమైన జీవితమును గడపి, ఉత్తమ పురుషుడు కాలేకపోయినను లోకోత్తర చరితులను, అవతార పురుషులను భక్తిప్రపత్తులతో సంభావించి ఆరాధించి, వారి జన్మచేతను సంచారముచేతను నిర్యాణముచేతను పవిత్రము లైన ప్రదేశములను సందర్శించియైనను ధన్యత నొందుటకు కుతూహల పడుచుండును. అప్రాకృతమైన ఈ ధార్మికాకాంక్షయే కుతూహలమే సాధారణముగా యాత్రలను ఆచారమునకు మూలకారణము.

ఇప్పుడిప్పుడు క్రైస్తవులలో తగ్గిపోవుచున్నను మధ్య యుగమునాటి వారి ధార్మికజీవనములో యాత్రలు ప్రముఖస్థానము నాక్రమించినవి. ఏసుక్రీస్తుతో సంబంధముగల పాలస్థానము (Palestine) లోని యెరూషలేము (Gerusalem) ను, అపొస్తలులతో సంబంధముగల ఇటలీలోని రోమునగరమును సందర్శించుటకు ధార్మికచింతగల క్రైస్తవులు యాత్రలు చేయువారు.

మహమ్మదీయులలో మక్కా-మదీనాలకు ఏటేట యాత్ర చేయుట వారి మతాచారవిధులలో ముఖ్యమయినది. మక్కా-మాట అటుండగా హిందూదేశములోనే అసంఖ్యములుగ నున్న పీరుల, ఔలియాల, షహీదుల సమాధులు, వాటిని సందర్శించి పూజించుట ఇస్లాము సనాతన ధర్మసూత్రములకు విరుద్ధమైనను, ఏటేట వేలకొలది ముస్లిమ్ యాత్రికులను ఆకర్షించుచునేయున్నవి.

ఇట్లే జైనులును, బౌద్ధులును సందర్శించు పుణ్యక్షేత్రములు అనేకములు. పాలితాన, ఆబూశిఖరక్షేత్రము, గిర్నారు,

పారస్నాథము మొదలైనవి జైనుల యాత్రాస్థలములు. జైనులును, బౌద్ధులునుగూడ వేదమతావలంబులనుండియే ఈ యాత్రాచార విధిని గ్రహించియుందురనుటకు సందియములేదు.

బౌద్ధములో యాత్రలుసలుపు ఆచారము, బుద్ధుడు భగవానుడుగ పరిగణింపబడిన మహాయానసంప్రదాయముననే ప్రాముఖ్యము కలిగినది. ఈ సంప్రదాయము వర్ధిల్లిన కాలముననే బుద్ధభగవానుడు జన్మించిన కపిలవస్తునగరము, మహాబోధివిజ్ఞానము నొందిన బుద్ధగయ, తన ధర్మమును మొదటిమారు లోకములో ప్రవర్తింపజేసిన కాశీనగరము (ఋషిపట్టణము), ఆయన నిర్వాణము నొందిన కుశినగరము బౌద్ధులకు యాత్రాస్థలములైనవి.

హిందూదేశములో పుణ్యక్షేత్రములను సందర్శించుటకు చేయు ప్రయాణములకు వట్టి యాత్రలని కాక తీర్థయాత్రలని పేరు వచ్చినది. పుణ్యస్థలముల కంటెను, దివ్యక్షేత్రములకంటెను ముఖ్యమైనది తీర్థము. 'తీర్థయాత్ర' లో ఒక్క పుణ్యతీర్థములే కాక దివ్యస్థలములును వచ్చును. మన శాస్త్రములలోను పురాణములలోను వీటికి ఎక్కడలేని పవిత్రత ఆపాదింపబడినది. వైద్యులు కుదుర్పలేని వ్యాధులుకూడ పవిత్ర తీర్థోదకస్నానము వలన పోవునని మన పూర్వుల విశ్వాసము. నీరు గొప్ప రోగనివారిణి పవిత్ర తీర్థస్నానము సకల కల్మషహరము. పాపకర్మములే రోగములకు కారణములు. శరీరమును నీడవలెనే పాపకర్మము మనుష్యుని ఆశ్రయించుకొని జన్మపరంపరకు కారణభూత మగుచున్నది. సంసార దుఃఖసంతరణమునకు ఎన్ని జన్మలవరకో మానవుడు వేచియుండ నక్కరలేదు. జన్మదుఃఖమునుంచి

విముక్తి పొందుటయే ముక్తి, మోక్షము. మనుష్య ప్రయత్నమంతయు చతుర్విధ పురుషార్థములలోని కడపటి పురుషార్థమును సాధించుటకే, మనుష్యుడీజన్మలోకూడ సుశిక్షితమును నియమబద్ధమును అయిన జీవితమును గడపుచు పుణ్యకార్యము లాచరించి తన లక్ష్యమును సమీపించుటకు ప్రయత్నించ వచ్చును. సత్కార్యాచరణము వలన పుణ్యమును అభివృద్ధి నొందించుకొని జన్మ పరంపరను సుదీర్ఘ మొనరించు కర్మశక్తిని క్షయింపజేయవచ్చును. పుణ్య సంపాదనమునకు దానములు, ధర్మములు, ఉపవాసములు, వ్రతములు మొదలైనవి దోహదము లైనను తీర్థయాత్రకు సరిపోవునది వేరొకటిలేదు. పుణ్య నదీతీరములందును, దివ్య క్షేత్రముల యందును చేసిన దానధర్మములును పిండప్రదానములును, క్రతు కర్మాదికములును అధిక పుణ్యప్రదములు. ఈ కారణముచేతనే పుణ్యతీర్థములను సేవించుట, పుణ్యక్షేత్రములను సందర్శించుట భారత వర్షములో చిరకాలముగా వచ్చుచుండిన సనాతనాచారము. తీర్థయాత్రా విశేషములను పులస్త్య, లోమశ, ధౌమ్య, అంగిరసులు మహాభారతములో తెలియ జెప్పియున్నారు. పురాణములును ఉపపురాణములును కూడ తీర్థ, స్థల, క్షేత్ర మాహాత్మ్యములను తెలియజెప్పునవే. మహాభారతమునం దరణ్యపర్వములోని తీర్థయాత్రాపర్వము తీర్థవిశేషముల నెరిగించునదే. తీర్థయాత్రా సంసేవనమువలన గలుగు పుణ్యము ఆంధ్రమహాభారతమునందు ధర్మరాజున కిట్లు తెలుపబడినది.

"క్రతుఫలములు వడయంగ దుర్గతులకు దొరకొనదు తీర్థగమనంబునం ద
త్క్రతుఫలము లందుదురు దుర్గతులును నిది మునుల మతము కౌరవ వృషభా."

ఒక యెత్తు. ఈ కారణముననే కాశీకిపోయినవాడును కాటికిపోయిన వాడును సమానమను నానుడి కలిగినది.

తీర్థయాత్రలను పెట్టి భారతవర్షమునంతను సాంస్కృత ముగ సమైక్యము కావించినవారు మన పూర్వులు.

"గంగేచ యమునే చైవ గోదావరి సరస్వతి
కావేరీ నర్మదే సింధు జలేస్మిన్ సన్నిధిం కురు"

గంగా యమునా సింధు నదులు మొదలుకొని కావేరిపర్యంతము గల భారతవర్షము సాంస్కృతికముగా ఏకఖండము. కాశీనుంచి తెచ్చిన గంగాజలమును సేతుబంధ రామేశ్వరమునొద్ద సముద్రజల మున గలిపినగాని అది పూర్ణయాత్రయే కాదని పూర్వుల భావన.

తీర్థములలో గంగానదియు, దివ్యక్షేత్రములలో కాశీ యును అత్యుత్తమములైనవని చెప్పినను పుణ్యతీర్థములు గణన కెక్కనవి ఇంకను లేకపోలేదు. ఋషిసంచారముచేత పవిత్రమైన ఈ కర్మభూమిని గల ప్రతిబుగ్గయు, ప్రతి నదియు, ప్రతికొండయు, ప్రతి హ్రదమును, ప్రతి కాసారమును పుణ్యమయినదే. శబ్ద కల్పద్రుమకారుని లెక్కప్రకారము ఇట్టితీర్థములు 264. కాని ఇవి యింతకంటెను ఎక్కువే.

"సర్వే ప్రస్రవణాః పుణ్యాః సర్వే పుణ్యాః శిలోచ్చయాః
నద్యః పుణ్యా స్సదా సర్వా జాహ్నవీతు విశేషతః॥"

అన్నారు పెద్దలు. ఒక్కొక్క తీర్థమునకు ఒక్కొక్క ప్రత్యేక ఫలము చెప్పబడినది.

పుణ్యము పురుషార్థము మాట ఎటులున్నను దేశదేశ ములు తిరిగి వేర్వేరుజాతుల జనులతో కలసిమెలసి సంచరించి,

వారి యాచారవ్యవహారములను పరిశీలించుటచేత మన విజ్ఞాన క్షేత్రము విశాలమగును; పుణ్యతీర్థస్నానము హృదయమాలిన్యమును బోగొట్టి మనస్సునకు నిర్మలత్వము చేకూర్చును; ఆయా క్షేత్రములందలి అద్భుత శిల్పాలంకార విరాజితములైన దేవాయతనములను గొప్పభవనములను సందర్శించినచో మనలో చెన్నుమాసి పోయిన సౌందర్యరసానుభూతి మరల చిగిరించినట్లయి, మన దృష్టి కొక క్రొత్తవెలుగు వచ్చును; ప్రశాంతములైన నదీతీరప్రదేశములును, నేత్రపర్వమొనరించు పర్వతోపాంతములనున్న ఆశ్రమభూములును మనస్సునకు నిర్మలత్వమును శాంతిని సమకూర్చును. యాత్రానుభవము మనఃపరిణామమునకు తోడ్పడును. ఈ తీర్థయాత్రలు మానవత, త్యాగబుద్ధి, సర్వభూత దయాపరత, అనుభవజ్ఞానము అలవడుటకు మన పూర్వు లేర్పరచిన సాధనలు.

తీర్థయాత్రలను గురించి చక్కని గ్రంథమును ప్రకటించి ధర్మానురక్తులగువారి కందరికి మహోపకారము కావించినందుకు బ్రహ్మశ్రీ బలుసు సూర్యప్రకాశ శాస్త్రిగారిని ఆశీర్వదించుచున్నాను. వారి సాధన గ్రంథమండలి పరమార్థసాధన కుపయోగించు ఇటువంటి ప్రశస్తగ్రంథములను ప్రకటించి ఆంధ్రదేశ ఆధ్యాత్మికాభివృద్ధికి తోడ్పడుగాతమని కోరుచున్నాను. కష్టనష్టముల కోర్చి సాధన గ్రంథ మండలి ద్వారా ఉత్తమగ్రంథములను బ్రకటించుచున్న శ్రీ సూర్యప్రకాశశాస్త్రిగారికి ధర్మపరాయణులు ఉదారహృదయముతో చేయూత నిచ్చెదరుగాక!

మదరాసు

మల్లంపల్లి సోమశేఖరశర్మ



# ప్రశంసావేశము

**మా**నవుని జీవయాత్రలో యాత్రలు ప్రధానములు. ఇహపరముల కివి ముఖ్యసాధనములు. లౌకిక విషయజ్ఞానము నకును, పారలౌకిక విజ్ఞానమునకును పరమోపాధులు. ఎట్టి వివేకహీనుని కయినను దేశాటనమువలన వివేకము కలుగునని పెద్దలనుడి. ఇట్టియెడ విశిష్టములగు తీర్థయాత్రల వలన సయ్యది యినుమడి యగుననుట అత్యుక్తి కానేరదు.

భారతదేశమునందు పుణ్యస్థలము లసంఖ్యాకములుగు యున్నవి. ఆర్యావర్తమునందును, దక్షిణాపథమునందును శ్రేష్ఠములగు కొన్ని క్షేత్రములున్నవి. నూటయెనిమిది దివ్యతిరుపతు లనంబడు వైష్ణవక్షేత్రములును, పృథివ్యాదిలింగములు, సుబ్రహ్మణ్యాలయములు మున్నగునవికల శైవక్షేత్రములును దక్షిణాపథమున విశిష్టములు. శ్రీకృష్ణుండు ప్రధాన దైవముగాఁగల పుణ్యస్థలములు, శివుఁడు ముఖ్యదైవముగాఁ గల క్షేత్రములును ఆర్యావర్తమున నధికముగా నున్నవి.

అయోధ్యాదులగు మోక్షప్రదములగు సప్తపురములును భారతదేశమునందలి భిన్నభిన్న ప్రాంతములందు వెలసి సర్వజనాకర్షకములై యున్నవి. వీని నన్నింటిని గాకున్నను, కొన్నిటిని దర్శించినను పారలౌకిక ప్రయోజనము కలుగుటయే గాక, దానితోఁబాటు లౌకికజ్ఞానము అధికమగును. భిన్నభాషలు, విభిన్న నాగరకతలు, వివిధ ప్రాంతములవారి ఆచార వ్యవహారములును అవగతము లగును.

యాత్రలు విద్యాసముపార్జనమునకును సాధనములు. ఆ యా క్షేత్రములలోని స్థలజ్ఞులతోడి పరిచయము వలన నది కొంత సిద్ధించును. ఆయా క్షేత్రముల కొక్కొకవిశిష్టత యుండుట వలన, అచటికిఁ బోయినచో యాత్రికులకు మనః పరిపాకము కలుగ నవకాశము కలదు; ప్రకృతి శోభను తిలకించి యానందించుటకును, నైసర్గిక స్థితుల నవగాహన మొనర్చు కొనుటకును వీలుకలుగును. శరీరము శ్రమపడుట కలవాటు పడును; సహన భావము, పరోపకారబుద్ధి కలుగును. ఆయాదేశముల చరిత్రను తెలిసికొన వీలగును. లేనిచో, జనులు కూపస్థ మండూకముల వలె ప్రపంచజ్ఞాన రహితులై యుందురని పలువుర యభిప్రాయము.

యాత్రలు చేయఁదలంచువారి కాయా స్థలముల విశేషములను డెలిసికొనుటలో యాత్రా చరిత్రములు మిక్కిలి యుపయోగించు చున్నవి. యాత్రికు లట్టి గ్రంథముల సాయమున అనన్యాపేక్షముగ తమ తీర్థయాత్రలను ముగించు కొనఁ గలరు. ఇట్టి గ్రంథములు లేనియెడల యాత్రలు చేయుటలో ఎక్కువ శ్రమపడవలసి వచ్చును. ఇట్టి చరిత్రములు పయి దేశములలో నెక్కువగఁ గాన వచ్చుచున్నవి. విదేశీయులు పవిత్ర స్థలములు కేఁగవలెనని కుతూహల పడకున్నను, ప్రపంచమందలి వివిధదేశములలోని వింతలను జూడవలెనని ఎక్కువ కుతూహల పడుచుందురు. ధైర్యసాహసములతో దుర్గమ ప్రదేశములకుఁ గూడఁబోయి యచటి విశేషములను గనుగొను చుందురు. ఇట్లు యాత్ర లొనర్చిన ధీరులు తమ యనుభవముల నన్నిఁటిని గ్రంథ

సము చేయుదురు. వారు సేకరించిన యిట్టి చరిత్రములే యాత్రాచరిత్రములుగా ప్రసిద్ధి కెక్కి యున్నవి. ఈ విషయమున మెగస్తనీసు, హ్యూవన్ త్సాంగు, పాహియాను, అబ్దుల్ రజాక్ మున్నగువారు ప్రశంసనీయులు.

యథార్థములు, సమగ్రములు నగు చరిత్ర గ్రంథములే యరుదుగాఁగల మన భారతదేశమున ప్రాచీనకాలమున యాత్రా చరిత్రములు వెలువడకుండుటలో వింతలేదు. వచన కావ్యములే వెలువడని ప్రాచీనకాలమున తెలుఁగులో యాత్రా చరిత్రములు వెలయలేదని వేఱుగఁ జెప్పనక్కఱలేదు. పందొమ్మిదవ శతాబ్ది తొలిభాగమున ఏనుగుల వీరాస్వామయ్యగారు తాను చేసిన కాశీయాత్రయందలి విషయములను 'కాశీయాత్రా చరిత్ర' అను గ్రంథము రూపమున వెలయించి యున్నారు. కోలా శేషాచలకవి యనునొక చెన్నపురి వాస్తవ్యుఁడు తాను 1846-వ సం॥ లో నొనర్చిన నీలగిరియాత్రను ప్రౌఢవచనమున వివరించియున్నారు. మఱియు 'కాశీయాత్ర, దివ్యస్థలమార్గ దర్శిని' మున్నగు క్షేత్రమాహాత్మ్యాదులను వివరించు గ్రంథములు కొన్ని వెలువడినవి. ఈ శతాబ్దిలో శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారి 'నా మహారాష్ట్రయాత్ర' ఎన్నఁదగినది. ఇవి అన్నియును పరిమిత ప్రయోజనము కలవి.

సాధన గ్రంథమండలి వారు ప్రకటించుచున్న 'ఆనంద భారతయాత్ర' యాత్రాచరిత్ర గ్రంథములలో అగ్రగణ్యమైనది. అపరిమిత ప్రయోజనములు కలది. ఇందు ఆరు ఖండములలో భారతదేశమునందలి పుణ్యక్షేత్రముల వృత్తాంతము సంగ్రహము

గను, సమగ్రముగను వివరింపఁ బడినది. యాత్రార్థుల కిది యెంతయు నుపయుక్తమైనది.

యాత్రాస్థలములను గూర్చిన విషయములు కొంతవఱకును రైల్వే శాఖవారు ప్రకటించుచున్న 'గయిడు'లలోఁ గలవు. కాని, అవి ఏవో కొన్ని ప్రసిద్ధ స్థలములను గూర్చిన సమాచారమునే తెలుపును. ఆవిషయ మాంగ్లభాషయందే ఉండుటవలన, అందరికిని అందుబాటులో లేవు. కావున, అట్టివానివలనఁ బ్రయోజనము తక్కువ.

ఏదో యొక గ్రంథమునుగాని, వివిధ గ్రంథములనుగాని పరిశీలించి, అందలి విషయములను గ్రహించి యిట్టి చరిత్రములను వ్రాయవచ్చును. కాని, వానిలో వివరింపఁబడిన విషయముల సత్యత్వమున సందేహము కలుగవచ్చును. ఈ 'సుందర భారతయాత్ర'ను రచించిన శ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రి గారు, తాము తీర్థయాత్రలు చేయుచు, గడించిన అనుభవమును, సేకరించిన విషయములను క్రోడీకరించి గ్రంథరచన సాగించుటచే, ఇందలి విషయములన్నియు యాత్రాపరుల కత్యంతోపయుక్తములయు, ఏతద్గ్రంథమును దగ్గఱనుంచుకొని పుణ్యస్థలముల కేఁగినచో అనాయాసముగ నభిమతకార్యమును నెఱవేర్చుకొనవచ్చుననియు నొక్కి చెప్పవచ్చును. ఇందు ప్రసిద్ధక్షేత్రములకు సంబంధించిన చిత్రములు కూడఁ జేర్పఁబడియున్నవి. "యాత్రా ఖండ"మను తొలిఖండమునందు సర్వక్షేత్ర సాధారణములగు "తీర్థస్వరూపము, తీర్థభేదములు, యాత్రాప్రయోజనము, తీర్థవిధులు, తద్విశేషములు, యాత్రావస్తు సామగ్రి, ముఖ్యమైన

గమనింపు, ఆహారవిషయము, రైల్వేసమాచారము, డబ్బు, పండాలు, సామాను” మున్నగు విషయములు వివరింపఁబడినవి. యాత్రాది విశేషమునఁ బెక్కు ప్రమాణములు చూపఁబడినవి. యాత్రలం గూర్చిన సమగ్రవిషయములం జెల్పు గ్రంథములలో నాంధ్రమున నిదియే మొదటిదనియుఁ జెప్పవచ్చును.

తెనాలిలోని ‘సాధన గ్రంథ మండలి’ సంస్థాపకులైన శ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రిగారు ఆధ్యాత్మికజ్ఞానమునకును, పారలౌకిక సుఖమునకును సాధనచేయుట కనుకూలములగు గ్రంథములను ప్రకటించుచు ధర్మజిజ్ఞాసలో వెనుకపడియున్న తెలుఁగు నాడు పురోగమించుటకు దోహద మిచ్చినారు; ఇచ్చుచున్నారు. శ్రీ శాస్త్రిగారు పయి యాశయముతోనే తమ యాత్రానుభవముల నీరీతిని గ్రంథరూపమునఁ బ్రకటించుట ఎంతయు నుచితముగా నున్నది. యాత్రాపరులేగాక ఇతరులును, ఈ గ్రంథమును పఠించినచో వివిధ స్థలములలోని పెక్కు విషయములను దెలిసికొనఁగలరు. ఆంధ్రులందఱు నీ తద్గ్రంథమును పఠించి శ్రీ శాస్త్రిగారి పరిశ్రమను కృతార్థ మొనర్చి తమ్ము చరితార్థుల నొనర్చుకొందురుగాక !

మదరాసు
2–5–55

బులుసు వేంకట రమణయ్య



# యాత్రాప్రశంస

తాము ముద్రింపఁదలంచిన పుణ్యక్షేత్ర ప్రదర్శనగ్రంథ మత్యావశ్యకము. అయ్యది జనుల కిహపరసాధకము కాఁగలదు. నారద, రోమశాది మహర్షులవలెఁ దాము దేశాటనముజేసియు వివిధ పుణ్యక్షేత్రముల విషయమున నాయాపురాణాదులలోని విషయముల నేర్చి కూర్చియు, నట్టి యుత్తమ గ్రంథమును రచించి ప్రకటింపఁబూనుట యాంధ్రుల మహాభాగ్యము!

"యాత్రల యావశ్యకత, ప్రయోజనము" మున్నగు వాని ఘనత మహాభారతాది గ్రంథములలో విస్తృతముగ వివరింపఁబడినది.

"క్రతుఫలములు వడయఁగ దు
ర్గతులకు దొరకొనదు తీర్థగమనంబునఁ ద
త్క్రతుఫలము లందుదురు దు
ర్గతులును నిది మునుల నుతము కౌరవవృషభా!"

భా. అ. ఆ. 2. 243

"నిరముగఁ దీర్థసేవా
పరులగు శాంతాత్ములకుఁ దపస్వులకును దు
ష్కరమెద్దియు లేదని చె
చ్చెర ధర్మజుఁ దీర్థసేవ సేయింపు మెుగిన్."

భా. ఆ. ఆ 2. 298

వ. ...అజాతశత్రుండు రోమశున కిట్లనియె... మఱియు నచేత నంబులయ్యును గిరిసరిత్సరోవరంబులు పుణ్యతీర్థంబులై జగత్పావనంబులై జనులకు దురితాపహారంబులైన కారణంబేమి? యని యడిగిన నతనికి రోమశుండిట్లనియె ... ధర్మపరులైన దేవ

తలు ఋషులు నాశ్రయించుటం జేసి తీర్థంబులు పవిత్రంబులై సర్వకామప్రదంబులై వర్థిల్లుచుండు..."

భా. అ. అ. 2. 311-317

వేయేల! తీర్థసేవనమునే కాక పుణ్యక్షేత్రప్రదర్శ గ్రంథములఁ జదివినవారును, వినినవారును నిహపరముల సద్గతు లగుదురు.

"విదితముగఁ దీర్థకీర్తనఁ
జదివిన ధన్యులకు వినిన సజ్జనులకు న
భ్యుదయమగు సర్వతీర్థ స
ముదయస్నాన బహుయాగముల ఫలములగున్." భా. అ. అ. 2. 283

"ఇది నిక్కువ మని మనములఁ
బదిలంబుగఁ దీర్థసేవ భక్తిఁ దలఁచినన్
విదితముగ దురితహరమగు
సదమల సుజ్ఞానులగుట సత్యము ధరణిన్." భా. అ. అ. 2. 284

"సకలదురితముల వాయుదు
రకలంక మనస్కులగుదు రార్యోత్తమ వ
ర్తకులగుదుర సజ్జనగుణ
నికరంబుల వెలయుదురు సునిశ్చితమతులై." భా. అ. అ. 2. 285

తీర్థయాత్రలవిషయమున వివిధ పురాణేతిహాసాదులలోఁ జెప్పఁబడిన విషయములను బ్రదర్శింపనున్న మాకితోధికముగ వ్రాయుట యనావశ్యకము.

కళాప్రపూర్ణ

విజయనగరం

వఝ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి



## ఆశ్చర్యము - పరమాత్మ

మానవుడు తనబుద్ధికి అతీతమయిన దృశ్యమును జూచి నపుడు ఆశ్చర్యములో కూరుకొని పోవును. పరమసుందర మగు దృశ్యమును జూచినపుడును ఆరీతిగనే తన్మయు డగును. అతని అప్పటి స్థితికిని ఈశ్వరతత్త్వమునకును ఏదో సాదృశ్య మున్నది. 'ఆశ్చర్యవత్ పశ్యతి కశ్చిదేవమ్'

## సర్వం ఖల్విదం బ్రహ్మ

బ్రహ్మాండము బ్రహ్మాండము ఈశ్వరుని విభూతి. ప్రతి అణువును విరాడ్రూపము.

ఈ సంగతి ఒకరు చెప్పకున్నను మనకు తెలియును. మనకు తెలిసినను ఇది తెలిసినటు లుండదు. ఏల ? ప్రాణధారణ కును మనోధారణకును ఆవశ్యకములగు పదార్థములతోడి అతి పరిచితి మన తెలివిడికడ్డు. ఎటులు ? మనస్సు చైతన్యోన్ముఖము అనగా విషయోన్ముఖమై కూపాకారము, తటాకారము, నద్యా కారము, సముద్రాకారము తాల్చిన నీ రగు చున్నది. కాని విషయసారమును గుర్తింపదు. విషయసారము సద్వస్తువుకదా! ఇచ్చుట మన కడ్డుపునకు కావలయునది కూడు. మన మనసునకు కావలసినది కోర్కె. ఈ రెండును వాని తృప్తికి చాలును. ఇక వాని సారముతో ఏటిపని ? ఈ రీతిగా ప్రతి విషయాభిముఖత యందును మానవుడు భ్రాంతుడగును.

## క్షేత్రము - శరీరము

ప్రాజ్ఞులిది గుర్తించి కొన్ని విరాట్ విభూతులను క్షేత్ర ములుగా గమనించిరి, గమనించు చున్నారు, గమనింపగలరు —

ఈ క్షేత్రములకును మన అందరయు క్షేత్రములకును ఒక సాదృశ్యము కలదు. _ ఓ కౌంతేయా ! ఈ శరీరము క్షేత్రము. అని శ్రీకృష్ణుడు అర్జునునితో అనును. ఈ క్షేత్రములను దర్శించినపుడైనను మనము క్షేత్రజ్ఞులము కావలయునని మన పితామహుల కోరిక.

## సిద్ధులు - సాధకులు

మన దేశములో ప్రాజ్ఞులును, పామరులును, క్షేత్రదర్శన మొనరింతురు. కాశీయాత్ర జీవయాత్రలో ఒకయాత్రగా అందరు ననుసంధింతురు. సిద్ధుల కీ క్షేత్రములు అఖండాకారముగా కానిపించును. సాధకులకో సర్వమును బ్రహ్మాకారమని తెలిసికొనుట కుపయోగించును. పామరులకు క్షేత్రయాత్రచే దేశజ్ఞానముతో పాటు లోకజ్ఞానమును కలుగును. ఇది అవాంతరఫలము.

## అమృత మందును విషము

యోగ్యుని చేతిలోబడిన విషమును అమృత మగును. అయోగ్యుని చేతిలోబడిన అమృతమును విషమగును. క్షేత్రములందు పామరులచే కలిగిన పాపములుచూచి కాబోలు, వేమన మొదలగువారు క్షేత్రయాత్రలను, నిట్టనిలువుగా నిరసించిరి.

> " తినదే చెట్టులయాకు మేక, గుహగొందిన్ బాము నిద్రింపదే;
> వనవాసంబున భిక్షులున్ మృగములున్ వర్తింపవే ! నీటిలో
> మునుగంజూడవె మత్స్య కచ్ఛపములున్; మోక్షంబటే వీనికిన్
> మనసే మూలము కాదొ ముక్తికిని రామా రాజచూడామణీ "

ఇటులే ప్రాజ్ఞులవిషయములో గూడ క్షేత్రయాత్రతో పనిలేదని వ్యాసుడు భారతమున ;

"తేన చే దవివాద శ్చేన్ మా కాశం మా కురూన్ గమః"

అంతరాత్మతో వివాదము లేకపోయినచో కాశికి వెళ్లకు, కురుక్షేత్రమునకు వెళ్లకు అనిచెప్పెను. ఇది ప్రాజ్ఞుల మాటయని గుర్తుంచుకొనవలెను. మరియును ఈ గ్రంథము చదువువారి మాటకాదనియును గుర్తుంచుకొనవలయును.

శ్రీ బులుసు సూర్యప్రకాశ శాస్త్రిగారు అన్నిక్షేత్రములను దర్శించి ఆ క్షేత్రము లందలి వివిధాంశములను ఈ గ్రంథమునందు వర్ణించియున్నారు. ఈ గ్రంథము చదివినచో క్షేత్రదర్శనము చేయకున్నను చేయుచున్నటులే యనిపించును. కావున పాఠకులారా ! ఇక చదివిచూడుడు.

చిరివాడ. (కృష్ణా)
20–11–54

శ్రీ వేలూరి శివరామశాస్త్రి
శతావధాని.



# పుణ్యక్షేత్రములు

భారతదేశమున భిన్న భాషలు, ఆచారములు కన్పించుచున్నను, ఆధ్యాత్మికవిషయమునకు చెందిన సంప్రదాయము ఒక్కటిమాత్రమే విరాజిల్లినది. నాస్తికులనబడిన వేదబాహ్యులకుగూడ ఈసంప్రదాయము కొంతసోకినది. తద్ద్వారా భారతదేశమున నేమూలలో జనులు నివసించుచున్నను వారికందరకు నఖండ భారత మనుభావ మనూచానముగా సంక్రమించినది. భారతదేశ మొక్క దేశమే; ఉపనిషత్తులతో పూర్తిగా వికసించి

వైదికసంస్కృతియే భారతీయుల సంప్రదాయసిద్ధమగు సంస్క
అను భావములు, విశ్వాసములు మనలో నంతర్లీనముగా ని
యున్నవి. ఈ యఖండ భారతమున కేకత్వమును గూర్చ
శ్రీ ఆచార్య శంకరభగవత్పాదులు దేశమునకు నాల్గుదిక
యందు నాలుగు పీఠపరంపరల నేర్పరచిరి.

ఈవిధమగు నేకత్వము ప్రతిభారతీయుని నిత్యజీవన
మూర్తీభవించవలెననిన, ప్రతివ్యక్తియు దేశమును పూ
చూడకతప్పదు. కాని కేవల మీాఉద్దేశ్యముతో దేశ
దర్శించగలవారు కొద్దిమందిమాత్రమే యుండగలరు. ఆము
భావన, ఆధ్యాత్మిక చింతనగల మనదేశీయులకు భారతదే
ఆధ్యాత్మజగదనుకృతిగా అనాదికాలమునుండి భాసించినది. స
అంతర్యామిగా బ్రహ్మగలడని, వ్యావహారికదశలో అ
వాసనాభ్రమవశమున బ్రహ్మయే ప్రపంచాకృతితో భాసి
చున్నదనియు విశ్వసించు భారతీయునకు మనదేశములోని
స్థలము పూజనీయమైనది. కాని ఆయాసన్ని వేశముల
ముగా కొన్నిప్రదేశములు మహత్తరములు, మహత్తమ
గూడ నైనవి. భారత, భాగవత, రామాయణ, పురాణ
ద్వారా కొన్నిగ్రామములు, తీరములు, ప్రదేశములు తీర్థ
ములుగా పరిణమించినవి. ఈ పరిణామములో దేశము
పుణ్యక్షేత్రములతో నలంకరింప బడజొచ్చినది. అట్టి పుణ
ముల నాశ్రయించుకొని వచ్చినవి తీర్థయాత్రలు.

నదీతీరములు, పర్వతభూములు, లోయలు, మన
ములో పుణ్యక్షేత్రములతో నిండియున్నవి. ఆ యా క్షే

లలో లభించు జలము మొదలగునవి ఆరోగ్యదాయకము లగు టచేగూడ నివి ముఖ్యప్రదేశము లగుచున్నవి. కాశీ ప్రయాగల లోని గంగాజలము నిర్మలమై కొన్ని రసాయనిక పదార్థము లతో నిండియుండుటచే శరీర మాలిన్యమును క్షాలన చేయగల్గు చున్నదని వైజ్ఞానికులు సహేతు మను చున్నారు. సాంద్రమగు జలబిందువుల సంయోగము లేనిచో గంగాజలము ఎక్కువ కాలము నిలువయుండక పోవుటచే కాశీనుండి గృహోన్ముఖులగు వారు గోదావరీస్నానముచేసి, గోదావరీజలమును గంగతో కల్పుచున్నారు. స్వచ్ఛమై, తెల్లగానున్న గంగాజలముతో నే విధమైన సంయోగమును పొందక కృష్ణవర్ణమైన యమునాప్రవా హము ప్రక్కప్రక్కనే ప్రవహించును. త్రివేణీసంగమమున నీ రెండుపాయలకు మధ్యగ కొంతదూరము వరకు పసుపురంగుగల చీలిక యొకటి కన్పించును. దీనినే అంతర్వాహినియగు సరస్వతి యందురు. ఈ వైచిత్ర్యము ప్రకృతిసిద్ధమని కొందరు, దైవ నియంత్రితమని ఇతరులు వచింతురు. కాని ఆ వైచిత్ర్యమును స్వయముగా దర్శించువారికి చిత్తవికాసవిస్ఫారము లుదయింపక పోవు. దానిలోగల మాహాత్మ్య మణుమాత్రమైనను మనలో ప్రవేశించి తీరును.

మన కతిసమీపములోగల మంగళగిరికొండపైన పాన కము ప్రవహించుచున్నను, ఈగలు కన్పించకపోవుట ఆశ్చర్య కరమే. ఒకానొకప్పుడిది అగ్నిపర్వతమని, అందలి గంధకాది ద్రవ్యములకు పానకము విరుగుడగుటచే నృసింహస్వామికి పానక మును పోయుచున్నారని, దేవతాబుద్ధిలేనిచో నిట్టిది చేయరని,

గంధకమున్నచోట ఈగ్రవాలనేరదని వైజ్ఞానికు లనుచున్నారు. ఇది వాస్తవమైనచో మన తీర్థక్షేత్రములలో కొన్నింటిని వైజ్ఞానిక దృష్ట్యా వ్యాఖ్య చేయవచ్చును.

కాశ్మీరమున శ్రావణపూర్ణిమనాడు యాత్రికులు అమరనాథ దర్శనమునకు బయలుదేరుదురు. శీతబాధకు సహించి, కాలినడకపై వెళ్ళి వీరు దర్శించునది ఒకగుహా. ఆగుహాలో శిల్పులు చెక్కిన ప్రతిమలులేవు. ఆగుహాలోనికి మంచువర్షించును. ఈ మంచు పూర్ణిమనాటికి మూడు లింగాకారములుగ మూడు ప్రక్కల పూర్తిగా కన్పించును. అమావాస్యకీమూర్తులు మాయమగును. వీటినే శివ, పార్వతీ, గణేశులని పిలుతురు. ఇది మహాపుణ్యక్షేత్రము. కేవలము దైవసిద్ధముగా నావిర్భవించు నీమూర్తులను సందర్శించుట మహాభాగ్యము. వైజ్ఞానికులు దీనిని గూడ భౌతికముగా వ్యాఖ్య చేయగల్గినను, ఆధ్యాత్మిక దృష్టిగల ప్రతివ్యక్తికి ఇందొక దివ్యమహిమ కన్పించగలదు. నివేదితాదేవి యనినట్లు సమీపమునుండి దర్శించువారికి హిమాలయములే శివాకృతితో భాసించగలవు. కైలాసశిఖరము భారతీయులకు, బౌద్ధులకుగూడ పుణ్యక్షేత్రమే. ఈహిమాలయములలో పవిత్రక్షేత్రము లనేకములు గలవు. ఇందలి ప్రకృతిదృశ్యము లద్భుతరసావహములు. వివిధప్రసూనలతలు, భిన్నభిన్నములైన తరులతాగుల్మములు, ఉచ్చావచములైన భూములు, శీతలముగానున్నను మధ్యమధ్యగల ఉష్ణోదక స్రవంతులుగల హిమాలయములు భారతీయునకు సదా పవిత్రభూములే. కేవలము పర్వతభూముల నధిరోహించుటవలనగూడ అనారోగ్యము సమసి

పోగలదు; మానసము నిర్మలమై, తేలికయై, విస్తృతము కాగలదు. అందలి జలముకూడ మహదుపకారి. కావుననే పూర్వులు పర్వతభూములయందే ఎక్కువగా పుణ్యక్షేత్రములను దర్శించి యున్నారు. వీటిలో నెక్కువగా శక్తిక్షేత్రములు కన్పించుచున్నవి.

శక్తి క్షేత్రములలో ప్రసిద్ధిచెందినది శ్రీశైలము. నిర్జన భూమిలో, కీకారణ్యమధ్యమున, భయంకర జంతువులు స్వేచ్ఛగా విహరించు ప్రదేశమున, అతిలోకసుందరమైన ప్రకృతి రామణీయతలో నీక్షేత్రముగలదు. ఇచటగల భవానీశంకరుల ఆలయములు ఆధ్యాత్మికభావన లేనివారినికూడ నాముష్మిక మార్గములోనికి దింపజాలియున్నవి. కేవలము వీతరాగులే ఇచట తపస్సు చేయగలరని విఖ్యాతి. ఇట్టి భూము లాంధ్రదేశమున చాలగలవు.

మన పుణ్యక్షేత్రములను పరదేశీయులు, మనదేశస్థులు కూడ చాలవరకు తారుమారు చేసినారు. సోమనాథాలయమున నిరాధారముగాగల లింగమును నశింపజేయ దలపెట్టిన మహమ్మదీయుల సంగతి మనకు విశదమే. లింగాయతులు, వైష్ణవులు మార్చివేసిన ఆలయములుగూడ చాల గలవు. తిరుపతిలో గల వేంకటేశ్వరుని నేటి ఔత్తరాహులు సహితము బాలాజీయని పిలుతురు. అది ఒకానొకప్పుడు బాలా యను శక్తియొక్క క్షేత్రము. ఇట్లు వైష్ణవత్వము నందిన ఆలయములలో సింహాచలముగూడ నొకటియని సంప్రదాయము. అతిప్రాచీనములైన తీర్థములలోగల ప్రాచీనదేవాలయములు చాలమార్పులను పొందినవి. కొన్నిచోట్ల బౌద్ధుల చైత్యములకుగూడ నిట్టి రూపాంత

5

రము సంక్రమించినది. పూరీలోని జగన్నాథాలయము వస్తుతః శక్తిక్షేత్రమో, బౌద్ధక్షేత్రమో నేడు చెప్పలేము.

మనదేశమున తీర్థక్షేత్రములను గుర్తించి, వృద్ధిపరచి, ఆలయములను నిర్మించినవారిలో ప్రప్రథములు బౌద్ధులనిగూడ జెప్పవీలున్నది. వైదికసంప్రదాయము ననుసరించువారికి వస్తుతః ఆలయములతో నిమిత్తములేదు. కాని బౌద్ధులు, శాక్తులు నెలకొల్పిన తీర్థక్షేత్రములను భారతీయ సంప్రదాయమున కనుగుణముగా దిద్దిన వారిలో పౌరాణికులను, స్మృతికర్తలను ఎన్నక తప్పదు.

సర్వజనుల నాకర్షింపజాలక తీర్థక్షేత్రములు సౌహార్ద్రమును, సహకరణను, సౌమనస్యమును, ఆధ్యాత్మికవికాసమును చేకూర్పజాలిన వనుటలో నతిశయోక్తి లేదు. ఇట్టి క్షేత్రముల మహాత్మ్యములను, ప్రయోజనములను విశదపరచవలసిన అవసరమున్నది. ఈ యవసరమును గుర్తించి, ప్రజానీకమునకు వీటి విషయమును తెలుప యత్నించుచున్నవారికృషి ప్రశంసనీయము. శ్రీ సూర్యప్రకాశశాస్త్రిగారి యత్న మందరి సానుభూతిని బడయగలదని విశ్వాసము.

జయ శ్రావణము
సాగర్ విశ్వవిద్యాలయము,
సాగర్. (మధ్యప్రదేశము)

పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి
ఎం. ఏ., ఎం. లిట్., పిహెచ్. డి.,

# యాత్రలు : తత్ప్రయోజనము

సుప్రసిద్ధుఁడైన యాంగ్లేయ గ్రంథకర్త యొకఁడు యాత్రలు విద్యాభ్యాసమున నొకభాగ మనియు, నవి వినా విద్యాభ్యాస మసంపూర్ణమే యగుననియు నుడివియుండెను. గ్రంథపఠనమువలన లభించు జ్ఞానము కేవల సిద్ధాంత ప్రాయమైనది. దేశయాత్ర యా జ్ఞానమున కొకవిధమైన ప్రయోగము వంటిది. గ్రంథలబ్ధమైన జ్ఞానము దేశయాత్రలవలనఁ బరిపుష్టమై యనుభవమునకు వచ్చుటయే కాక మానవునిఁ బ్రపంచజ్ఞాన పరిపూర్ణునిగా నొనరించును. అందుచేతనే పై యాంగ్లగ్రంథకర్త బడిచదువు జనుల నర్ధమానవులఁగా నొనరింప దేశాటనము సమగ్ర మానవులఁగా నొనరించునని వాక్రుచ్చి యుండెను.

మన మిప్పుడు శాస్త్రయుగములో జీవించుచున్నాము. పలురకములైన శాస్త్రీయ నిర్మాణములవలన మానవ జీవిత మిప్పుడు సుఖప్రపూర్ణమై విలసిల్లుచున్నది. పూర్వమువలె దూరము, దగ్గఱ యను భేదము మన కిప్పు డంతగాఁ గాన వచ్చుట లేదు. ఎంతదవ్వుననున్న తావునకైన, నెంత యున్నత మైన ప్రదేశమునకైన మనము ధూమశకటములయు, నౌకలయు, విమానములయు సాహాయ్యముతో నచిరకాలముననే యేగి తిరిగివచ్చుట కిప్పు డవకాశ మున్నది. పూర్వము కాశికేగిన వాఁడు కాటికేగినవాఁడుగా భావింపఁబడుచుండుట యంద ఱెఱింగిన విషయమే. కాలినడకనే బహుదూర మరుగవలసివచ్చుటయు, దారినడుమ బాటలులేని దుర్గమారణ్యములను దాఁటవలసివచ్చుటయు నప్పటి వారట్లు భావించుటకుఁ గారణము,

శాస్త్రము సాహాయ్యమున మన మిప్పుడు దూరమును జయింపఁ జాలితిమి. ధనమును దార్ఢ్యము నుండవలెనుగాని కోరిక జనించుచో మన మిప్పుడు మన దేశమునే కాక ఖండఖండాంతరములను ద్వీప ద్వీపాంతరములను దర్శించి కొన్ని నెలలలోనే తిరిగి రావచ్చును. పూర్వుల కిట్టి సౌకర్యములు కొఱవడి యుండుటచే వారికి స్వదేశ వైశాల్యము నెఱుంగుటకుఁగాని, దేశ సమగ్ర మూర్తిని భావించుటకుఁగాని యవకాశము తక్కువగా నుండెను. అట్టిచో నెల్లరు కూపస్థ మండూకములవలె నున్నచోటనే యుండిపోయి తాము నివసించు దేశమునుగూర్చి కూడ సమగ్రజ్ఞానము కలిగియుండుట యసంభవమని వేఱే చెప్పనవసరము లేదు.

దేశీయులలో దేశభావమును రేకెత్తించి వారిని దేశభక్తియుక్తులనుగాఁ జేయుటకు యాత్రలు పూర్వమునుంతో తోడ్పాటు నొసంగి యుండెను. మనపూర్వులు పుణ్యతీర్థాటనమును, బహుక్షేత్ర దర్శనమును ననంత ఫలప్రదాయకములని గ్రంథములలో వ్రాసి యుండిరి. ఆ తీర్థములును, క్షేత్రములును దేశమునందొక్కయెడఁగాక నలుమూలల నిర్దేశింపఁ బడియున్నవి. పూర్ణ యాత్రాఫల మొందఁదలఁచినవాఁడు హిమవంతమునందలి కైలాసమునుండి రామేశ్వరమువఱకును గల పలుక్షేత్రముల దర్శించి, యనేక పుణ్యనదులలోఁ గ్రుంకులిడి రావలసినదే. ఇట్లొనర్చినవానికిఁ బారలౌకికమైన మోక్షముమాట యెట్లున్నను లౌకికమైన దేశవిజ్ఞానమును, మాతృదేశ గౌరవమును సమగ్రముగాఁ గలుగుననుటలో సందేహములేదు. అందుచే దేశయాత్రలకు మానవు

లందు దేశభక్తి దేశగౌరవములను మొలకెత్తించుట ప్రధాన ప్రయోజన మని నుడువవచ్చును.

మనము సంధ్యావందన మొనరించు నప్పుడును, నేదైన పుణ్యకార్యము నొనరించునప్పుడును ముందు సంకల్పము చెప్పుచుందుము. ఈసంకల్పముకూడఁ బై దేశయాత్రవలె మానవులందు దేశభావమును మొలకెత్తించుటకే యుద్దేశింపఁ బడియున్నది. అందు మనము మనమునివసించు ప్రదేశమునకుఁ బరిసరముల నున్న సుప్రసిద్ధములైన నదులను, క్షేత్రములను ఎల్లలుగాఁ జేర్చుకొనుచుందుముగదా! ప్రయాణ సౌకర్యము లంతగా లేని తొల్లింటి కాలమున దేశీయులలో దేశభక్తిని రేకెత్తించి, వారికి దేశవిస్తృతి విజ్ఞానమును గలిగించు కోరికతో ధీమంతులైన మన పూర్వు లిట్టి సాధనముల నెన్నింటినో కల్పించియుండిరి.

పూర్వము దేశాటనము పలుకష్టములతోఁ గూడి యుండి నను వానిని సరకుచేయక పలువురు విజ్ఞాన తృష్ణచేతను మతాభిమానముచేతను బ్రేరేపింపఁబడి దూరప్రయాణము లొనరించి యుండిరి. చంద్రగుప్తుని కాలమున మెగస్తనీసను రాయబారియు, హర్షవర్ధనుని కాలమున హ్యూన్‌త్సాంగను చైనాయాత్రికుఁడును, గుప్తుల కాలమును ఫాహియానును, మొగలుల కాలమునఁ బాశ్చాత్య యాత్రికులును మనదేశమున కరుదెంచి యప్పటి దేశపరిస్థితులను, దేశీయుల పరిస్థితులను వర్ణించుచు గ్రంథములను వ్రాసియుండిరి. ఇటీవలి కాలమున మంగోపార్కు, లివింగ్‌స్టను మున్నగువారు మానవులు చొరరాని ప్రదేశముల కరిగి యచ్చటి పరిస్థితులను లోకమునకుఁ జాటియుండిరి. మఱికొందఱు

విజ్ఞాన తృష్ణచే ధృవప్రదేశములకరిగి యాత్రప్రయాణమునఁ బ్రాణములనుగూడఁ గోల్పోయి యుండిరి. సాహసవంతులైన యీ యాత్రికుల వలనఁ బ్రపంచవిజ్ఞాన మభివృద్ధి నొందెననుటలో నత్యుక్తి లేదు.

దేశాటనమువలనఁ గలుగు లాభము లసంఖ్యాకములై యుండును. అది మానవుల దృక్పథమును విశాలమొనరించి వారి కితరులపైఁగల ద్వేషానుమానములను దొలఁగించును. అది పరదేశీయుల వేషభాషలను గూర్చియు, సంప్రదాయములను గూర్చియు, జీవిత విధానమును గూర్చియు యథార్థమైన జ్ఞానము నొసంగి యందులో నుత్తమములైన వాని నవలంబించుట కవకాశ మొసంగును. అంతేకాక యది దేశముల నడుమ పరస్పర సంబంధ బాంధవ్యముల నభివృద్ధిచేయును. అది మానవ విజ్ఞానమునేకాక ప్రపంచనాగరికతను గూడఁ బెంపొందించును.

యాత్రలవలన లభించు నుత్తమప్రయోజనములలో రమణీయ ప్రకృతి దృశ్యదర్శన భాగ్యమునుగూడ మందు పేర్కొనక తప్పదు. పలుయాత్రాస్థలములు సాధారణముగాఁ బర్వతశిఖరములమీఁదనో నదీతీరములందో నిర్మింపఁబడియుండును. అట్టి చోట్లఁ బ్రకృతిమాత యనంతసౌందర్యవిలాసములతోఁ బ్రత్యక్షమగుచుండును. సుందర గంభీరములైన యచ్చటి దృశ్యములఁ దిలకించునప్పుడు చిత్తము నిర్మలశాంతి భాసురమై యాహ్లాదము నొందుటయేకాక తదనంత సౌందర్యప్రచోదితమై దానిని సృజించిన పరమేశ్వరుని దెసకు మరలును. సంసార బాధాపరంపరా తప్యమానమగు మానవజీవితమున కంతకంటె వాంఛనీయ మేమి

యుండఁజాలును? బదరీ కేదారాది క్షేత్రములకరిగి యచ్చటి ప్రకృతిసౌభాగ్యము నొక్కసారి కన్నులారఁ దిలకించిన వారికి దుర్గంధ కాలుష్య కశ్మలములైన నగరపరిసరాదులపై దృష్టి ప్రసరించునా? "మందార మకరంద మాధుర్యమునఁ దేలు మధుపంబు వోవునే మదనములకు?"

మానవుఁడు విద్యార్థిదశలోను దదనంతరమునను సాధ్య మైనంత యధికముగా దేశాటనము చేయ యత్నింపవలయును. ఒకవేళ ధనాభావముచేఁ బరదేశముల కరుగుటకు వీలులేకున్నను విద్యావంతు లెల్లరు స్వదేశమునైనఁ దప్పక చూచిరావలయును. అది వారి మనోభావముల విశాలమొనరించి విజ్ఞానమును జూలి యొసంగుటేకాక దేశభక్తినిగూడ నధికము కావించును. ఈ విధముగా యాత్రాచరణ మైహికాముష్మిక ఫలప్రదమై మాన వుల యభ్యుదయమున కెన్నియోవిధముల దోహదమొనరించును.

ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు. } దివాకర్ల వేంకటావధాని ఎం. ఏ. ఆనర్సు.



## తీర్థసేవ

భరతదేశము పుణ్యభూమి. ఆసేతు శీతాచలపర్యంతము నిందు అడుగడుగునను పవిత్రనదులును దేవాలయములును ఎన్నియో నెలకొన్నవి. ప్రాచీనార్యమహర్షులు తమయాధ్యాత్మిక భావములకు నొసంగిన రూపకల్పనయే యీ దివ్యతీర్థములు.

ఆక్షేత్రములలో ఆమహానుభావులు గాఢసమాధి నిమగ్నులై ప్రత్యక్షమొనర్చుకొనిన తమ యిష్టదైవతములను శిలాదిప్రతిమా రూపమున శాశ్వతప్రతిష్ఠ గావించిరి. కంచి కామాక్షి, మధుర మీనాక్షి, కాశీవిశాలాక్షి, తిరుపతి తిరువేంగళనాథుడు, సింహాద్రి నరసింహస్వామి, మున్నగు దేవతామూర్తులన్నియు ఈవిధమున నావిర్భవించినవే. ప్రజలును పాలకులును ఆ దివ్య మూర్తులకు ఆయతనములు కట్టించియు, ఆరామములు కల్పించియు, తటాకములు త్రవ్వించియు నిత్యనైవేద్యారాధనములు నెఱపుచు వచ్చిరి.

హిందువులలో చాలమందికి ఆధ్యాత్మికదృష్టి యెక్కువ. ఐహికముకన్న ఆముష్మికమునందే మక్కువ యధికము. కనుకనే యీదేశములో దేవాలయములేని గ్రామమే యుండదు. పుణ్య క్షేత్రములేని మండలమే లేదు. పవిత్రమగు నదిప్రవహింపని దేశమే కన్పట్టదు. ఆ పుణ్యస్థలముల పుట్టుపూర్వోత్తరములను వివరించు స్థలపురాణములుగూడ వందలు వేలును ఆవిర్భవించినవి.

కాశి గయ ప్రయాగ మధుర అమరావతి తక్షశిల మున్నగు దివ్యస్థలములు కేవలము దేవాయతనములేగావు. అవి యొకప్పుడు విశ్వవిద్యాలయములుగాఁ గూడ ప్రఖ్యాతిగన్నవి. వేదశాస్త్రములతోపాటు కవిత్వము గానము శిల్పము మున్నగు లలితకళలుగూడ వీనియందు ఉత్పత్తి వికాసముల నందినవి. అందును భారతీయుల శిల్పకళానైపుణ్యమంతయు ఈపుణ్యస్థల ములయందే పుట్టిపెరిగినది. మన దివ్యతీర్థములయందలి శిల్ప సౌందర్యదిదృక్ష భారతీయులనేగాక పాశ్చాత్యులను గూడ

ఆకర్షించినది. కడచిన శతాబ్దములలో 'ఫాహియాన్' 'హుయన్ సాంగ్' 'హిట్సింగ్' మున్నగు విదేశయాత్రికులు కాలినడకతో పయనమై భారతదేశ పుణ్యస్థలములందలి శిల్పకళాసంపదను గాంచి ముగ్ధులై తమయాత్రావిశేషములను గ్రంథస్థములఁగావించిరిగూడ.

పుణ్యక్షేత్రసందర్శనమువలన నొక యనిర్వచనీయమగు దివ్యానుభూతి గలుగును. పవిత్రనదీమతల్లులయందు గ్రుంకులిడినంతనే పాపసంచయమంతయు పటాపంచలగును. దివ్యతీర్థసంసేవనమువలన మానసిక వికాసముతోపాటు భావోన్నతియు కుదురుకొనును. అద్భుతమగు చిత్తశుద్ధి యేర్పడును. కావుననే పుణ్యతీర్థసంసేవనము ఇహపరసాధకమని మనపురాణములువాకొనుచున్నవి.

మనదేశమందలి పుణ్యస్థలములఁగూర్చి సమగ్రముగానేకముఖమునఁ దెలియఁజేయు గ్రంథములేవియుఁ దెనుఁగులోనంతగాలేవు. ఏనుఁగుల వీరాస్వామి రచించిన 'కాశీయాత్ర', జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు వ్రాసిన 'మహారాష్ట్రయాత్ర' మున్నగునవి యొండు రెండున్నను అవి యేకొన్ని పుణ్యస్థలములను గూర్చియో తెలియఁజేయునుగాని దేశమునందలి దివ్యతీర్థములనుగూర్చి సంపూర్ణముగా వివరింపవు. ఇట్టితఱి యాత్రాస్థలములనుగూర్చి విశదముగను, పాఠకులకు తీర్థసందర్శనాభిలాషగలిగించునట్లుగను ఇట్టిగ్రంథములు తెనుఁగులోరచించుట యెంతయు ముదావహము. ప్రజానీకమునకు మహోపకారకము.

"పోయి సేవింపలేకున్నఁ బుణ్యతీర్థ మహిమ వినుటయు గొంత కల్మషహరంబు"

ఆంధ్ర విశ్వవిద్యాలయము,
వాల్తేరు.

దువ్వూరి వేంకటరమణశాస్త్రి

# అభినందనము

సహజమైన ప్రకృతి సౌందర్యముతో స్వతస్సిద్ధమైన ప్రభావసంపత్తితోఁ బ్రకాశించునవి తీర్థములు - క్షేత్రములు. వాని దర్శనసేవనములు శారీరక మానసిక మలవిమోచనము లగుటయేగాక, సబ్ధజడ ప్రాయమైన మానవుని మేధాశక్తి నుద్దీపింపఁజేయు దివ్యౌషధ జ్యోతిర్లతికలును గాఁగలవు. ఇవి యొకవైపు కనులవిందుచేయు వినోదప్రదర్శనములుగా నుపక రించుచు, మఱియొకవైపు సంస్కృతి సంప్రదాయములకు విజ్ఞాన వివేచనములకు భక్తిప్రబోధములకు గురుముఖముగాని పుస్తక పాఠములేని యుత్తమాత్మసంస్కార రంగములుగాఁ బనిచేయు చుండును. ఒక సంఘముచే నొక సంస్థచే నొక ప్రభుత్వముచేఁ బ్రతిష్ఠింపఁ బడినవిగాక, కేవల ప్రజోపయోగమునకై పరమేశ్వ రానుగ్రహమునఁ బ్రకృతి లీలావిలసితములుగా నెలకొన్నవి గనుకనే వీని యునికి నిరుపాధికము- వీని సేవనము నిర్నిబంధము- వీని ప్రయోజనము నిరవధికము, శాశ్వతము నగుచున్నది. ఇందలి యథార్థత ప్రపంచమునందంతట సర్వసాధారణమే యైనను, భారతదేశమున విశిష్టము - శ్రుతి స్మృతి పురాణేతిహాస నిర్దిష్టము.

శ్రేయస్కాములందఱు తీర్థక్షేత్ర యాత్రాపరులగుట యత్యావశ్యక మని వేఱుగఁ జెప్ప నవసరముండదు. ఈ యాత్రలు విద్యాభ్యాసమున నొకభాగముగా, ననుభవము పొందుట కొక రంగముగా, నాత్మ పరిపాకమున కొక సాధనముగా నున్నవి గనుకనే వయఃపరిమితిని బట్టిగాని స్త్రీపురుష వివక్షనుబట్టిగాని యివి యుపేక్షింపరాని వనుట నిర్వివాదాంశము. వివేకముఁ

ముల నీ గ్రంథరూపమున లోకమున కందించుచున్నారు. ఉచితజ్ఞులైన యాంధ్రజనులందఱు ఈ యుపకారమును సవ్యముగా నుపయోగించుకొని కృతార్థులు కావలెననియు, వీరి పరిశ్రమను జరితార్థము చేయవలెననియుఁ గోరుచున్నాను.

ప్రొద్దుటూరు
7—9—1954

గడియారము వేంకటశేషశాస్త్రి
శతావధాని.

## యాత్ర

గణించడానికి వీలుకానంత పూర్వకాలమునుండిన్నీ ఆస్తికులగు హిందువులు పుణ్యక్షేత్రదర్శనము పుణ్యతీర్థదర్శనము చేస్తూ వస్తూనే ఉన్నారు. రాజులు మారినా ప్రభుత్వములు మారినా ప్రజలలో ఈ అలవాటు మారలేదు. ఎంతటి మహత్తరశక్తి, ఆకర్షణ, ప్రభావము, పుణ్యక్షేత్రములలో నున్నదో! తన ఆధ్యాత్మిక భావములను వెల్లడిచేయని మన ప్రధాని నెహ్రూ సైతము కుంభమేళ యాత్రికుల ఆవేశమును చూచి ముగ్ధుడైనాడు.

పుణ్యక్షేత్రముల, తీర్థముల మహిమను, ఆధ్యాత్మిక శక్తిని, అందు వెలసిన దేవతల మహత్తును కొలిచే శక్తిమాట అటుండగా తెలిసికొనే శక్తికూడ పాశ్చాత్య శాస్త్ర విజ్ఞానమునకు లేదు. అదియే సర్వమూ అని భ్రాంతిచెందేవారు మోసపోతున్నారు.

పుణ్యక్షేత్రములలోను తీర్థములలోను సత్సాంగత్యము మనకు లభించవచ్చును. ఐదు సంవత్సరముల పైబడి భగవాన్ శ్రీరమణమహర్షులు అరుణాచల క్షేత్రమున వసించి ముముక్షువుల నుద్ధరించారు. దక్షిణేశ్వరమున శ్రీరామకృష్ణులు పడమటి వరదలకు ఆనకట్టవేసి పాశ్చాత్య విద్యా వ్యామోహితులను అనుగ్రహించి సరియైన మార్గమున బెట్టి భారత ధర్మమును సంరక్షించారు.

ప్రధానముగా పామరులకున్న ఆధ్యాత్మ సాధనము యాత్రలే. ఇతరులకు అనేక సాధన లుండవచ్చును. యాత్రలయం దున్న దృఢవిశ్వాసమే వారికి ఆధ్యాత్మికాభివృద్ధి చేకూరుస్తున్నది. భారతదేశము ఆధ్యాత్మక దేశము. ఎపుడు ఈ ధర్మము లోపించునో అపుడు లోకమే అంధకారమయ మగును. భారత దేశమును ఆధ్యాత్మికముగా చేసిన ఒకసాధనము యాత్రలు. యాత్రలు చేయలేనివారు సైతము పుణ్యక్షేత్ర తీర్థముల స్మరించినంత మాత్రమున పునీతు లగుచున్నారు.

అహంకారము తగ్గితేగాని మనుష్యుడు బాగుపడడు. అహంకారము తగ్గించే ఒక ప్రబలసాధనము యాత్రలే.

నరసాపురం,
3–9–1954.

**చింతా దీక్షితులు,** బి.ఏ.,యల్.టి.,
ఇన్‌స్పెక్టరు ఆఫ్ స్కూల్సు (రిటైర్డు)

## యాత్రానుభూతిలోని విభూతి

శరీరములోని అంగప్రత్యంగములందు హృదయము ముఖ్యమైనది. వసుంధరలోని సర్వసీమలందు భారతావని ప్రధానమైనది – ఇది కర్మసీమ, పుణ్యభూమి, ధర్మక్షేత్రము, సమస్త వస్తుస్తోమమున నీశ్వరు నవలోకించు దృష్టి భారతీయ సంస్కృతికి స్వతస్సిద్ధమైనది. రాతిలో నాతిని, స్తంభమున దేవుని కన్గొను శక్తి భారతీయునకు కలదు. ధూళిలో పూతభావమును, నీటిలో దైవీసంపదను విలోకించి ఆత డానందించును. వ్రజాంగనా పదస్పర్శవలన పాంశుపటలము కడుంగడు పునీతమైనదని భక్తిభరిత హృదయముతో నుద్ధవుడు తన మస్తకమున దాల్చెను. దివిజకల్లోలినిపై చూపుంచినపుడు, యమునాసరిత్తిలకము నాశ్రయించినపుడు, గోమతీపులిన తలమున నధివసించి నపుడు, గోదావరీ ఝరీవీచికలపై తలపుల నుఱ్ఱూత లూగించినపుడు, సరయూతీరస్థ వాలుకాస్తూపములపై శ్రీరామపదచిహ్నముల నవలోకించినపుడు, గగనచుంబి తుషారాద్రిపై కైలాసమును కాంచినపుడు, సతీకుండమందలి సలిలమును, కుశావర్తమందలి తోయమును తలపై జల్లికొనినపుడు, బదరికాశ్రమ కేదారేశ్వరములను సందర్శించినపుడు, ముని ముఖ్యుల హృదయములందు స్థిరపరితోషమును సృజించిన ప్రశాంతస్థలములను పరిశీలించినపుడు, దేవతలకు లీలాభూములైన క్షేత్రములందు వసించినపుడు, ఉత్తాల తరంగసంకులమైన మహోదధిచెంత నిలిచినపుడు మనస్సులోని తమస్సును పోద్రోలి తపస్సుపై తలపులో నిలుపు సరస్సుల జేరినపుడు, నైమిశ వనమందలి మహీరుహముల

క్రమొక్కినపుడు, చిత్రకూటమునకు పోయి కామదగిరి చుట్టు ప్రదక్షిణ మొనరించినపుడు, రాజస్థాన మరుభూమిపై మసలి నపుడు, ఒంటెలతో పందెమువేసికొని కన్యాకుమారీ పాదము లను, భారతాంబ చరణములను, ప్రక్షాళన మొనరించు సింధు త్రయమును తిలకించునపుడు, ఆరేండ్లు కఠోరదీక్షను నిర్వహించి త్వగస్థిమాత్రావసిష్ట శరీరుడైన తథాగతునకు నీడ నొసగిన బోధిద్రుమమును పరికించినపుడు, బహుళ దేవమందిరములను సందర్శించినపుడు, విజ్ఞాన నిధానములైన సంస్థలందు వసించి నపుడు భారతయాత్రికుని హృదయము పరమానందభరితమై పరిఢవిల్లును.

జిజ్ఞాసతో కూడిన పరిశీలనమువలన, మనన నిధి ధ్యాస ధ్యాన సమాధులవలన, విశేషానుభూతివలన మానవుడు విజ్ఞాన ఖని కాజాలును. దేశాటనమువలన, మానసదిశావలయము విశాల మగునని ప్రాచీనులు గుర్తించిరి. కావున చక్రవర్తులు సయితము తమ బాలురను గురుకులముల కంపుచుండువారు. ఇవి నదీతీరములందును, కుంజవాటికలందును, కుధరసీమలందును, కుంజనిచయము సాంద్రమై వెలయు తావులందును ఉండెడివి. వనస్థలములు సాధనసంస్థలై వెలసెను. ప్రకృతి ప్రదర్శించు కమ నీయదృశ్యములపై కన్నుంచి, సౌందర్యోపాసనమందును, ఆనంద వ్రతమందును, సత్యారాధనమందును బద్ధదీక్షితులై నాటి యంతేవాసులు సర్వతోముఖాభివృద్ధి నందుచుండువారు. ఈ దీక్షవలన ఆత్మసాక్షాత్కార, ఆత్మజ్ఞానముల నంది, ఆత్మవిశ్వాస ముతో ధర్మపథమున వారు ముందంజవేయువారు. వారి వజ్ర

సంకల్పము మంచుమల పునాదికి సహపాఠియై యుండెడిది. దృఢ నిశ్చయము నిరుపమానమై యుండునది. ఇచ్ఛాశక్తి అసంఖ్యాకులకు విశేషోత్సాహము కలిగించెడిది. బ్రాహ్మీస్థితి నంది, అపరోక్షానుభూతిని పడసి, నాటి సాధకులు మహిమోపేతులై యుండు వారు. క్రమనిష్ఠవలన వారు జీవన్ముక్తి నందువారు. సక్రమశిక్షణము వలన వారు యోగారూఢు లగుచుండువారు. ప్రపంచ పథికులే, విజ్ఞానయాత్రికులే ముక్తిదూత లగుచుండువారు.

యాత్రవలన చేకుఱు ప్రయోజనము, లభించు ప్రమోదము అనిర్వాచనీయములు.

భారతీయులేకాక అన్యదేశీయులు సయితము దేశభ్రమణమువలన గలుగు అభ్యుదయమును గుర్తించిరి. పాశ్చాత్యకవులు సౌందర్యసందీప్తములైన స్థలముల కరిగి, భావబంధురమైన ప్రకృతి గ్రంథమును పరిశీలించువారు.

సమస్త వసుంధరలోగల భూగోళస్థితులును, శీతోష్ణపరిస్థితులును భారతదేశమున గలవు. భారతయాత్రవలన నలవడు జ్ఞానము మహత్తరమైనది. జీవితపథమున పాంథులై ముందంజ వేయువారికి, వేర్వేఱు ఘట్టములందు భారతజనయిత్రి ప్రజ్ఞానభిక్ష పెట్టును.

పాఠకు లీయంశమును హృదయంగమ మొనరించుకొని ప్రస్తుత గ్రంథమును పరిశీలింతురుగాక.

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి ఎం. ఎ.
విజయవాడ.



# యాత్రా ఖండము
## తీర్థస్వరూపము

వైదిక యుగమునుండి వర్తమానకాలమువఱకు మానవు డొక్క వస్తువునే కాంక్షించి యత్నించుచున్నాడు. ఏ కార్య మారంభించినను ఆ యొక్క వస్తువు నుద్దేశించియె. 'అది సుఖము' "సుఖం మే భూయాత్, దుఃఖం మే మాభూత్" అనియే మానవుడు కోరుచుండును. అట్టి సుఖ మెట్టివాని కెట్లు లభించునో గీతయందు తెలుపబడెను.

"నాస్తిబుద్ధి రయుక్తస్య న చా యుక్తస్య భావనా,
నచా భావ యతశ్శాంతి రశాంతస్య కుతస్సుఖమ్" — భగవద్గీత.

బుద్ధి స్థిరము కాజాలదు. స్థిరబుద్ధి లేకున్న భావన (తత్వ విచారణకు తగిన మనోవృత్తి) కలుగజాలదు. ఆభావన లేకున్న శాంతియు, శాంతిలేకున్న సుఖమును కలుగజాలవు.

స్థిరబుద్ధియగు మనుజుడు సుఖమును బడయును. చంచల చిత్తుడు సుఖమును బడయజాలడు. దుఃఖము మాత్ర మాతనిని వరించును. అందుచే సుఖప్రాప్తికి, దుఃఖనివృత్తికి మనుజుడు స్థిర బుద్ధియె యుండవలయును. బుద్ధికి చాంచల్యమును కలిగించునవి యింద్రియములు. ఇంద్రియముల కధీనుడై యుండువా డపమార్గ మున బడిపోవును. సుఖదుఃఖములు పరస్పరము భిన్నములైనట్లే,

తన్మార్గములుకూడ విభిన్నములై యున్నవి. అవి సన్మార్గము, అసన్మార్గము. సన్మార్గగామికి సద్దేశ, సత్కాల, సత్పాత్రలు అవలంబము లగును. అసన్మార్గగామికి అసద్దేశ, అసత్కాల, అసత్పాత్ర లాధారములగును.

సన్మార్గగామి (సజ్జనుడు) తన సత్పాత్రతను స్థిరముగ నుంచుకొనుటకు సద్దేశములను సేవించవలయును. సద్దేశము లన తీర్థములు. తీర్థసేవనమువలన మనుష్యునకు, వైరాగ్యోదయ మగును. ప్రాపంచిక సుఖములను రోసి, యాతడాధ్యాత్మిక చింతానిమగ్నుడగును. తోడనే యాతని కీ యసద్దేశ సంజనిత మగు దుఃఖముకూడ దూరమగును.

తీర్థమన తరింపజేయునదని యర్థము. ('తౄప్లవనే' అను ధాతువునుండి) ఈ రూపము నిష్పన్న మగుచున్నది. తీర్థములను సేవించుట యన తరించుట. తీరమును జేరుటయని భావము. అనగా సద్దేశమును ప్రవేశించుట. సద్దేశమును ప్రవేశించగనే, సత్యస్వరూపుడగు భగవంతుని గుణకీర్తనముతో సత్కాలక్షేపము కలుగును. అసత్యరూపము దూరమగును. మానవుని చిరవాంఛిత మగు సుఖ మాతనికి లభించును. ఇదియే తీర్థస్వరూపము.

తీర్థములందుగూడ భగవద్గుణగానముచేయుచు, సత్కాలక్షేపము చేయనివారు సత్ఫలితము నొందజాలరు.

"అత్యుగ్ర భూరికర్మాణో నాస్తికా రౌరవా జనాః,
తేపి తిష్ఠన్తి తీర్థేషు తీర్థసారః పలాయతే"

తీర్థములందు పాపకర్మల నాచరించువారు తీర్థములందే నివసించియున్నను, తీర్థసారము (పుణ్యము)నొసంగి పాపనాశనము

చేయు మహాత్మ్యము) వానికి దూరమగును- అందుచే మనుజుడు సద్భావనతో తీర్థములు సేవించవలయును.

## తీర్థములు - భేదములు

తీర్థములు జంగమ, మానస, స్థావరాత్మకములని మూడు విధములుగ నున్నవి. అందు ___

జంగమ తీర్థములు :-

భగవత్సాక్షాత్కారమును బడసి, తమ జీవితమును భగవత్సేవకై వినియోగించు మహాత్ములు, సాధువులు జంగమతీర్థములనబడుదురు. వీరి హృదయములం దెల్లప్పుడు, భగవత్పాదపద్మములు విరాజిల్లుచుండును గాన, వీర లడుగిడిన ప్రతిస్థానమును, తీర్థరూపమునొంది, పాపములను శమింపజేయును. వారు తీర్థములందే (స్థావర తీర్థముల) నివసించిన, ఆ తీర్థముల మహాత్మ్యమినుమడించును.

"భవద్విధా భాగవతా స్తీర్థ భూతా స్స్వయంవిభో!
తీర్థీకుర్వన్తి, తీర్థాని స్వాంతస్థేన గదాభృతా"

— శ్రీమద్భాగవతము ౧. ౧౩. ౧౦.

నీవంటి భగవద్భక్తులు స్వయముగ తీర్థస్వరూపులై, శ్రీహరిహృదయస్థితుడగుట వలన తీర్థములకు పవిత్రత కలుగజేయుదురు. అని ధర్మరాజు విదురునితో ననెను.

పూర్వము భగీరథుడు గంగను తెచ్చు సమయమున, గంగ యాతనిని యిట్లు ప్రశ్నించెను. రాజన్! భువియందు

పాపాత్ములు తమ పాపములను నాయందు విసర్జింతురు. కాని నే నా పాపములనుండి విముక్తి నెటు లొందుదును ? అందులకు భగీరథుడు —

"సాధవో సన్యాసినశ్శాన్తా బ్రహ్మిష్టా లోకపావనాః
హరన్త్యఘం తేఽఙ్గ సంగాత్తే ..........."

—శ్రీమద్భాగవతము ౯. ౯. ౬.

ఐహికాముష్మిక భోగములను సర్వథా విసర్జించి శాంత చిత్తులై, బ్రహ్మభూతులై యుండు సాధుపుంగవుల శరీరస్పర్శచే నీ పాపములు నశించును — వారి హృదయములందు పాపనాశ కరుడగు శ్రీహరి సర్వదా నివసించుచుండును. మఱియు,

"నహ్యమ్మయాని తీర్థాని న దేవా మృచ్ఛిలామయాః,
తేపునం త్యురుకాలేన దర్శనా దేవసాధవః" —శ్రీమద్భాగవతము

జలమయములగు తీర్థములుకాని, మృత్ శిలారూపులగు దేవతలుకాని పవిత్రత నొసంగజాలవు. అవి దీర్ఘకాలము సేవిం చిన పవిత్రుని జేయును. కాని సాధువులు దర్శనమాత్రముననే మనుజుని పునీతుని చేయుదురు. అందువలననే వారు జంగమ తీర్థము లనబడిరి.

మానస తీర్థములు: —

"సత్యం తీర్థం క్షమా తీర్థం తీర్థ మింద్రియనిగ్రహః,
సర్వభూతదయా తీర్థం తీర్థమార్జవ మేవచ.
..............................
తీర్థానా మపి తత్తీర్థం విశుద్ధిర్మనసః పరా."

— స్కాందము. కా. ఖం.

సత్యము, క్షమ, ఇంద్రియ నిగ్రహము, భూతదయ, ఋజుత్వము, దానము, దమము, సంతోషము, బ్రహ్మచర్యము, మధురభాషణము, జ్ఞానము, ధృతి, తపస్సు, మొదలగునవన్నియు మానసతీర్థములు. మనశ్శుద్ధిమాత్రము తీర్థములకుగూడ తీర్థభూతమైనది. (తీర్థములనుగూడ పునీతము చేయుననిభావము.)

తీర్థయాత్రలు అంతఃకరణ శుద్ధికొఱకు ఏర్పరుప బడెను. అంతఃకరణ శుద్ధిలేని మనుజు డాధ్యాత్మికోన్నతి నందజాలడు. అందుచే నంతఃకరణ శుద్ధిలేక, కామక్రోధాదులకు వశీభూతులై కలుష చిత్తులైన వారలు తీర్థస్నానము వలన పవిత్రులు కాజాలరు. — కాశీఖండము

ఆత్మయే నది. ఇంద్రియ నిగ్రహమే పావన తీర్థము. సత్యమే జలము. శీలము తటములు. దయ యందలి తరంగములు. రాజన్ ! నీవానదియందు స్నానము చేయుము. కేవల బాహ్యశుద్ధి వలన నంతఃకరణము శుద్ధినందజాలదు. కనుక ధ్యానరూపమగు జలముతో నిండియుండి, రాగ ద్వేష రూప మాలిన్యమును బోగొట్టు, జ్ఞానరూపమగు సరస్సున స్నానమాచరించువాడు త్తమ గతుల నొందును. అందుచే మనస్సున సత్యాది తీర్థములను పెంపొందించుట ప్రతి మనుజుని కర్తవ్యము.

స్థావర తీర్థములు:—

భూమియందలి యసంఖ్యాకములగు పవిత్రస్థలములు, జలాశయములు మొదలగునవి యిందుచేరును. కాశీ, గయ, ప్రయాగ, గంగ, యమున, సరస్వతి మొదలగునవి స్థావరతీర్థములు.

ఆర్యఋషులు త్రికాలదర్శులు. వారు జంగమ, మానస తీర్థములనేకాక, మన శరీరావయవములనుగూడ తీర్థరూపములుగ చేసికొనిరి — కుడిచేయి బొటనవ్రేలు బ్రహ్మతీర్థము, తర్జనికి బొటనవ్రేలికి మధ్యభాగము పితృతీర్థము, కనిష్ఠాంగుళి క్రింది భాగము ప్రాజాపత్యతీర్థము, వ్రేళ్లయొక్క యగ్రభాగము దేవతీర్థము అని చెప్పిరి. ఈతీర్థములతో యథాక్రమముగ, నాచమనము, పిండదానము, పితృకార్యము, దేవకార్యము చేయవలయును. నాడు మానవత్వము సార్థకమగును.

## తీర్థయాత్ర లేల చేయవలయును?

మానవజీవిత లక్ష్యము భగవత్ప్రాప్తి. నశ్వరములగు సాంసారిక విషయములను రోసి, మనుజుని మనస్సు స్థిరమై, యానందప్రదమగు భగవత్సాన్నిధ్యమున లగ్నము కావలయును. మహాత్ముల సాంగత్యము లేనిదే చంచలమగు మనస్సు భగవదాయత్తము కాజాలదు. అట్టి మహాత్ములు తీర్థములందే అధికముగ నివసింతురు. అందుచే మనుజునకు తీర్థయాత్ర యవశ్యకర్తవ్యమై యున్నది.

మఱియు, అశ్వమేధము, అగ్నిష్టోమము, మొదలగు మహాక్రతువుల నాచరించి, దేవతల పరితృప్తి నొందించుట సామాన్య జనుల కసాధ్యము. అది ధనికులకు మాత్రము సుసాధ్యము. అందుచే సామాన్య జనులుకూడ, అట్టి మహత్తర క్రతుఫలితము నొందుటకు తీర్థాటనమును ఋషులు విధించిరి.

“తస్మాత్తీర్థేషు గన్తవ్యః నరైస్సంసారభీరుభిః”

యాత్రయందు అశ్రద్ధకు కారణము :—

భావము (మనస్థితి) ననుసరించియే ఫలము లభించును. దృఢమగు భావనయున్న పాషాణమునందు భగవంతుని కనజాలుదుము. ఈ భావమే శిథిలమైన, దైవమెదుట నిలువబడి యున్నను మనము కనజాలము. సర్పమును గాంచి, రజ్జువుగ భావించిన యాతడు భీతి నొందడు. రజ్జువును సర్పముగ భావించిన యాత డెలుగెత్తి యఱచును. సారాంశమేమన—సర్వము మనస్థితిపై నాధారపడి యున్నది. వర్తమానమున భారతీయులు పాశ్చాత్య సభ్యతయందు దగుల్కొని, ప్రతివస్తువును అర్థవాద దృష్టితో పరికించుచు, యథార్థమును కనజాలక, నైహికవిషయములందు చిక్కుకొనియుండిరి. ఇట్టివారు తీర్థాటన మొనరించి, దివ్యదేశములను దర్శించినను వాని మహాత్వమును కనజాలరు. అఖండ మహత్తర మహిమాన్వితము లగు పుణ్యప్రదేశములు, వారికి సామాన్యప్రదేశములుగ దోచును. ఇట్టివా రట్టివాని మహాత్వ మెఱుంగజాలకపోవుటయేకాక "అచ్చట నేమియు లేదని" తోటి వారలకు చెప్పుదురు. ప్రస్తుతము జనులయందు తీర్థయాత్రాభిరతి సన్నగిల్లుట కిది యొక ప్రధాన కారణము.

సర్వమును సంపూర్ణముగ జూచుటకు సమర్థములగు నేత్రములు లేకున్న, నిజముగ తీర్థములందు విశేషమేమియు గోచరించదు. భావనాబలముతో నగాధపైశ్వమును గాంతుమేని, తీర్థములు సర్వదేవతాస్వరూపములుగ గాన్పించును. అందుచే మనము త్రికాల దర్శులు, విజ్ఞాననిధులునగు నార్యఋషులవాక్యముల విశ్వాసముతో నమ్మవలయును. అట్టినమ్మకము నశించుటకూడ నొక కారణము.

మానవుని ధర్మము:—

ఆశ్రమములు నాలుగు. నాల్గు ఆశ్రమములందు నా యా యాశ్రమమునకు తగిన కర్మలు నిర్ణయింపబడినవి. ఐహికపారలౌకికములలో పురుషార్థ సాధనమును సాధించుటకు గృహస్థాశ్రమము ప్రధానము. పురుషార్థములను పత్నీసమేతుడై ఆచరించిన విశేషఫలదాయకముగ నుండును. యాత్రాసమయమున బ్రహ్మచర్యము ఏకభుక్తము చేయవలయును.

"అన్యక్షేత్రే కృతం పాపం పుణ్యక్షేత్రే వినశ్యతి,
పుణ్యక్షేత్రే కృతం పాపం వజ్రలేపో భవిష్యతి"

అన్యస్థానమందు దాచరించిన పాపములు, తీర్థసేవనము వలన నశించును కాని, తీర్థములందు దాచరించిన పాపములు వజ్రలిప్తము లగును. కాబట్టి యాత్రికుడు, క్షేత్రములందు ధర్మాచరణము చేసినను చేయకున్నను, దుష్కృతము మాత్ర మాచరించరాదు.

ఎవనియొక్క హస్తములు, పాదములు, మనస్సు, విద్య, కీర్తి, సంయతములై యున్ననో, ఆతడును — అప్రతిగ్రహీతయై, యదృచ్ఛాలాభ సంతుష్టుడై, యహంకారమును విడనాడినవాడును — దంభరహితుడై, లఘ్వాహారియై, జితేంద్రియుడై, సర్వపాపవిముక్తుడైనవాడును — క్రోధములేక సత్యశీలుడై, దృఢవ్రతియై, సర్వభూతదయాపరుడైన వాడును తీర్థయాత్రాఫలితము నందును.

— భారతము, అరణ్యపర్వము.

## తీర్థవిధి

ఋణత్రయములలో పితృఋణమొకటి. ప్రధానక్షేత్రముల లోను, జీవనదులలోను తీర్థవిధి తర్పణము చేయుటవలన, తాను పితృఋణ విముక్తుడగుటయేకాక, పితృదేవతలును తృప్తినొంది, ఉత్తమగతుల నొందుదురు. ముఖ్యముగ కాశి, గయ, ప్రయాగ యీ క్షేత్రములందు అన్నశ్రాద్ధముచేసి, మిగిలిన క్షేత్రములందు తీర్థవిధి (పిండితో పిండప్రదానము) చేయుదురు. పితృవర్గక్రమము నీ దిగువ నీయబడుచున్నది. ఈ రీతిగా వారి గోత్రములు, పేర్లు యాత్రకు బయలుదేరుటకు ముందుగా వ్రాసి దగ్గర ఉంచుకొన వలయును.

" ఆదౌ పితా తథామాతా, సాపత్నీ జననీ తథా,
మాతామహా స్సపత్నీకా, ఆత్మపత్న్య స్త్వనంతరమ్.

సుతభ్రాతృ పితృవ్యాశ్చ, మాతులాస్సహభార్యకాః,
దుహితా భగినీచైవ, దౌహిత్రో భాగినేయకః.

పితృష్వసామాతృష్వసా, శ్యాలకోభావుకః స్నుషా,
శ్వశురాచార్య గురవః, స్వామినో గురురిక్థినః. "

| | సంస్కృతము | అర్థము |
|---|---|---|
| ౧ | పితరం | తండ్రి |
| ౨ | పితామహం | తండ్రితండ్రి (తాత) |
| ౩ | ప్రపితామహం | ముత్తాత |
| ౪ | మాతరం | తల్లి |
| ౫ | పితామహీం | తండ్రితల్లి |
| ౬ | ప్రపితామహీం | తాతతల్లి |
| ౭ | సాపత్నీమాతరం | సవతితల్లి |
| ౮ | మాతామహం | తల్లితండ్రి |

| | సంస్కృతము | అర్థము |
|---|---|---|
| ౯ | మాతుఃపితామహం | తల్లితాత |
| ౧౦ | మాతుఃప్రపితామహం | తల్లిముత్తాత |
| ౧౧ | మాతామహీం | తల్లితల్లి |
| ౧౨ | మాతుఃపితామహీం | తల్లితండ్రితల్లి |
| ౧౩ | మాతుఃప్రపితామహీం | తల్లితాతతల్లి |
| ౧౪ | ఆత్మపత్నీం | తనభార్య |
| ౧౫ | సుతం | కొడుకు |
| ౧౬ | భ్రాతరం అన్న (జ్యేష్ఠ) లేక తమ్ముడు (కనిష్ఠ) | |
| ౧౭ | పితృవ్యం పెదతండ్రి (జ్యేష్ఠ) లేక పినతండ్రి (కనిష్ఠ) | |
| ౧౮ | మాతులం | మేనమామ |
| ౧౯ | దుహితరం | కూతురు |
| ౨౦ | భగినీం | అక్క లేక చెల్లెలు |
| ౨౧ | దౌహిత్రం | కూతురు కొడుకు |
| ౨౨ | భాగినేయకం | మేనల్లుడు |
| ౨౩ | పితృష్వసారం | మేనత్త |
| ౨౪ | మాతృష్వసారం | పెదతల్లి లేక పినతల్లి |
| ౨౫ | జామాతరం | అల్లుడు |
| ౨౬ | భావుకం | అక్కచెల్లెండ్ర పెనిమిటి |
| ౨౭ | స్నుషాం | కోడలు |
| ౨౮ | శ్వశురం | మామ |
| ౨౯ | శ్యాలకం | భార్యఅన్న లేక తమ్ముడు |
| ౩౦ | స్వామినం | చదువుచెప్పిన గురువు |
| ౩౧ | గురుం | తండ్రి లేక ఉపనయనము చేసినవారు |
| ౩౨ | రిక్థినం | తాను కర్మచేసిన (దిక్కులేని) వారు |

గమనిక:_ పైన సూచించిన పితృవర్గమునకు ప్రతి పేరుకు మొదట సంస్కృతపు మాటయు, గోత్రము, గతించినవారి పేరు, చివర పురుషులకు_ శర్మాణం స్త్రీలకు_ దాయీ అనియు చేర్చవలయును.

## తీర్థవిధి విశేషములు

వీరమిత్రోదయమున శ్రీ మిత్రమిశ్రపండితుడు, సర్వ ధర్మ శాస్త్ర పురాణ సమాలోచనముతో నిరూపించి వివరించుచున్నాడు.

మానసములు, భౌమములు అని తీర్థములు రెండు విధములు. అందు సత్యము, క్షమ, ఇంద్రియనిగ్రహము, సర్వభూతదయ, ఆర్జవము, దానము, ధర్మము, దమము, సంతోషము, బ్రహ్మచర్యము, ప్రియవాదిత్వము, జ్ఞానము, ధృతి, తపము, జపము, మనోనైర్మల్యము మున్నగునవి మానసతీర్థములు.

వీనిలో ముఖ్యమైనది మనోనైర్మల్యము. మనస్సు నిర్మలము గానిదే, ఏదియు ప్రయోజనకారి కానేరదు. కాని మనస్సు సాధారణముగా ఎట్టివానికిని సులభముగ నిర్మలము కాదు. మనస్సు నిర్మలమైనగాని, పురుషార్థము బడయు నవకాశము కలుగదు. కావున, అవశ్యము మనస్సును నిర్మలము చేసికొనవలెను. అందులకు పండితులు పెక్కుసాధనముల నొడివిరి. వానిలో ముఖ్యమైన సాధనము భౌమతీర్థముల సేవించుట.

కాశి, పుష్కరము, కురుక్షేత్రము, ప్రభాసము, ఈ మున్నగునవి, భూమిపై గల తీర్థములు భౌమతీర్థములని యనబడును. కావున ప్రతియొక వ్యక్తియు, పెద్దలు వచించినరీతిని పుణ్యతీర్థములను సేవించి, అందు జేయవలసిన విధులు చక్కగా జేసి, మనస్సు నిర్మలము గావించుకొని, పవిత్రత సంపాదించుకొని, కృతార్థత పొందవలెను.

పుణ్యతీర్థములను, పుణ్యములైన ఆలయములను సేవించు వాడు, అనంతమైన పుణ్యమును సంపాదించి, దేవతలతో సమాన మైన వాడగును. తీర్థ సంకీర్తనముతో, తీర్థ స్నానాదికములతో, తీర్థ తర్పణాదికములతో, పాపమును బోగొట్టుకొని, మానవుడు పుణ్యమూర్తియై పరమసుఖమును పొందును అని స్మృతులు చెప్పుచున్నవి. తీర్థయాత్రలకు పోదలచినవారు, శుభతిథిని, శుభనక్షత్రమున, శుభవారమున, శుభలగ్నమున తన గృహము నుండి బయలుదేర వలయును. ఆతడు క్రిందటిరాత్రి ఉపవసించి, మరునాడుదయమున గణపతిని, ఇష్టదైవమును, దేవతలను, పితృదేవతలను, గురువులను, సాధువులను తన శక్తికొలది పూజించి వారి యాశీర్వచనములపొంది మధురపదార్థముల భుజి యించి, శుభశకునము చూచి, భగవన్నామము చేయుచు బయలుదేరవలయును. ఆతడు సాధ్యమైనంతవరకు వాహనములు లేకుండ పాదచారియై పోవుట మంచిది. పాదచారియై పోయిన వానికి కష్టసుఖము లన్నియు తెలియవచ్చును. కాయశోషణ ముతో మనస్సు తొందరగా నిర్మలము కాగలదు.

కాలినడకకు అశక్తుడైనవాడు వృషభములు మొదలైన వానిని వదలి, గుఱ్ఱములు, బండ్లు మొదలగు వాహనములతో బోవచ్చును. ప్రస్తుతము బహువిధములైన ప్రయాణ సౌకర్యము లున్నవి. కాని ఎచటను మనుష్యులచేత మోయించుకొని పోగూడదు. అట్టివానికి తీర్థయాత్రాఫలము దక్కదు.

ఇతరులకొరకు, ఇతరుల ద్రవ్యముతో తీర్థయాత్ర నిష్ఫల మని పెద్దలమతము. తాను నిర్ధనుడైనచో, ఇతరుల ధనసహాయ

మపేక్షించిన, అపేక్షించవచ్చును కాని, తీర్థవిధులు మున్నగునవి తనకుపయోగించునవిగా నుండవలెను. ఇతరుల నుద్దేశించి చేసిన, అవి, ఆ యితరులకే ఫలమునిచ్చును గాని, తన కేమాత్రము ఉపయోగింపవు.

పోరాని స్థలములు కొన్ని గలవు. వానిని బాగుగ గమనింపవలెను. వర్ణాశ్రమాచార ధర్మములు లేనితావులు అట్టివి. వాని నిట్లు చెప్పవచ్చును. అంగ, వంగ, కళింగ, సౌరాష్ట్ర, మగధ దేశములు, సింధుకు ఉత్తరప్రదేశము, ఈ మొదలైనవి. ఈ ప్రదేశములకు తీర్థయాత్రా సమయములలో తప్ప, ఇతర సమయములందు పోరాదు.

ఈ క్రింద నుదహరింప బడినవి సర్వకాల సర్వావస్థల యందు సేవింపదగిన పుణ్యదేశములుగా వచింప బడినవి. అవి యేవన— సరస్వతీ దృషద్వతీ నదుల మధ్యనున్న దేశము. దీనినే బ్రహ్మావర్తమని యందురు. కురుక్షేత్రము విరాటదేశములు, కన్యాకుబ్జాదిదేశములు, మధురాదిదేశములు, వినశనక్షేత్రము. ఇచ్చట పూర్వము సరస్వతీనది యుండెడిది. వినశనము హిమవద్వింధ్యములకు మధ్యనున్నది. వినశనమునకు తూర్పుగా, ప్రయాగకు పశ్చిమముగా నున్న మధ్యదేశము, ఈ మున్నగునవి అనగా నిషిద్ధదేశములు గాక మిగిలినవన్నియు పుణ్యదేశములే అని యెఱుగునది.

తీర్థయాత్రలకుపోవువారికి ముఖ్యముగా ఈనియమములు పాటింపదగినవిగా పేర్కొనబడినవి. తీర్థయాత్ర చేయువారు, పరాన్నమును, పరభోజనమును మానవలెను. జితేంద్రియుడు,

జితక్రోధుడు, బ్రహ్మచర్యవ్రతపరుడు అయి యుండవలయును. శుచివస్త్రముల ధరియించి, పవిత్రుడుగ నుండవలెను. స్నాన సంధ్యా జపాది నిత్యకర్మలకు లోపము రానీయరాదు. ఆ యా తీర్థములలో జరుపవలసిన విధులు జరుపుచు, తన శక్తికొలది దానము లిచ్చుకొనవలెను. తీర్థ శ్రాద్ధాదికముల నాచరింపవలెను. వీలునొంబడి పంచయజ్ఞము లాచరించవలయును. బ్రహ్మయజ్ఞము, పితృయజ్ఞము (తర్పణము), దేవయజ్ఞము (దేవపూజ), భూత యజ్ఞము (దయ), మనుష్యయజ్ఞము (బ్రాహ్మణభోజనము).

సదాచారసంపన్నుడై యుండవలయును. ఈ నియమ మత్యావశ్యకము.

"ఆచారః పరమోధర్మః ఆచారః పరమం తపః,
ఆచారాద్వర్ధతేహ్యాయుః ఆచారాత్పాప సంక్షయః."

— స్కాందము.

పరమధర్మము, పరమోత్కృష్టతపఃఫలము, పాపనాశము ఆచారమువలన కలుగును. మరియు ఆయుర్వృద్ధియు కలుగును. ప్రయాణవశమున, ఒక్కొక్కప్పుడు మూడుపూటల సంధ్యా వందన మాచరించుటకు వీలుపడక పోవచ్చును. అట్టి సమయ ములలో ఉదయముననే మూడుపూటల సంధ్యయు జరుపవచ్చు నని పెద్దలు చెప్పుచున్నారు.

తీర్థయాత్రలలో, వివాహసమయమున, ప్రయాణ కాల ములో, దేశోపద్రవసమయమున, పురగ్రామములలో అగ్ని ప్రమాదములు సంభవించినపుడు, స్పర్శదోషమును పాటింప నక్కరలేదు. అసలు అట్టి విచారము లేకుండుటయే ఉత్తముని లక్షణము.

తీర్థయాత్రలకు బయలుదేరునపుడు, ఎప్పుడును శుభ సమయము జూచుకొనుట మంచిది. గురు, బుధ, సూర్యులు లగ్నములో నుండగా, తూర్పునకును; శుక్రుడు వ్యయము నందును, లాభమునందు నుండగా, ఆగ్నేయమునకును; శని కుజులు దశమములో నుండగా, దక్షిణమునకును; రాహువు లగ్నాష్టమములలో నుండగా, నైఋతిదిక్కునకును; శని సప్తమములో నుండగా, పడమరకును; చంద్రుడు పంచమషష్ఠములలో నుండగా, వాయువ్యమునకును; శుక్ర చంద్ర బుధులు చతుర్థములో నుండగా, ఉత్తరమునకును; గురువు ద్వితీయ తృతీయములలో నుండగా, ఈశాన్యమునకును; తీర్థయాత్రకు సామాన్యముగా బయలుదేరగూడదని శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు.

తీర్థయాత్రాపరుడు కాలినడకతో పోయినాసరే, లేక ఏదేని వాహనముతో పోయినయెడల, తీర్థమును అల్లంతన జూచినంతనే తానా వాహనమునుండి దిగి, కాలినడకన తీర్థమును సమీపింపవలెను. సాష్టాంగముగ నమస్కరింపవలెను. తీర్థాయ నమః అని పుష్పాంజలిని సమర్పింపవలెను. అనంతరము, ప్రణవము నుచ్చరించుచు, లేదా తమ ఆచారము ననుసరించి, తీర్థమును తాకి, దిగి, సచేలముగా తీర్థస్నానము నాచరింపవలెను. మంత్రములతోగాని, శ్లోకములతోగాని భైరవుని, రుద్రుని, సరస్వతిని, తీర్థరాజును గొలిచి, తన ఆచారము ననుసరించి స్నాన మాచరింపవలెను.

## గంగాధ్యానము:-

గంగా గంగేతియో బ్రూయాత్, యోజనానాం శతైరపి,
ముచ్యతే సర్వపాపేభ్యో, విష్ణులోకం సగచ్ఛతి.
అంబ! త్వద్దర్శనాన్ముక్తిః న జానే స్నానజం ఫలమ్,
స్వర్గారోహణ సోపానే, మహాపుణ్యా తరంగిణీ.
విశ్వేశం మాధవందుండిం, దండపాణించ భైరవమ్,
వందే కాశీం గుహాంగంగాం, భవానీం మణికర్ణికామ్.
అతితీక్ష్ణం! మహాకాయ! కాలాంత దహనోపమ!,
భైరవాయన మస్తుభ్యం, అనుజ్ఞాం దాతుమర్హసి
త్వం రాజా సర్వతీర్థానాం, త్వమేవ జగతః పితా,
యాచితో దేహిమే తీర్థం, సర్వపాపాపనుత్తయే.
నందినీ నలినీ శీతా, మాలినీచ మహాపగా,
విష్ణుపాదాబ్జ సంభూతా, గంగా త్రిపథగామినీ.
భాగీరథీ భోగవతీ, జాహ్నవీ త్రిదశేశ్వరీ,
ద్వాదశైతాని నామాని, మహాపాతక నాశనే. — పాద్మము.

ఉదకము నారాయణస్వరూపము. ఆ యా పర్వములలో, ఆ యా నదులలో గంగ స్వయముగ వచ్చియుండును. స్నానము చేయుతరి నీటియందలి పవిత్రత, తత్స్వరూపమునే భావించవలయును కాని, ఎక్కువ తక్కువలుగాని, పరిశుభ్రతగాని ఎంచరాదు.

బూరుగు, చింత, వేప, గానుగు, కోవిదారము, వెలగ, ఆముదపుచెట్లు ఈచెట్ల నీడన తీర్థస్నానము చేయరాదు. మురుగు నీటి కాలువల కెదురుగా, సుళ్లుగల చోట, నీటిప్రవాహములో, ఎగుడుదిగుడులున్న చోట, తీర్థస్నానము తగదు. తీర్థములయందు క్షేత్రోపవాసము తప్పక చేయవలయును. తీర్థమునకు బోయిన నాడేగాని, మరునాడుగాని ముండనము, సర్వప్రాయశ్చిత్తము,

తీర్థోపవాసము చేయవచ్చును. తీర్థోపవాసము చేయనివానికి, తీర్థయాత్రాఫలము దక్కదు. ఉపవాసదినమున రాత్రి జాగరణము చేయవలయును. ఉపవాసముతో పాటు తీర్థములలో ముండనము కూడ విహితమై యున్నది. శిఖనుమాత్రము వదలి శిరోముండనము గావించుకొనవలయును. తలజుట్టుతో పాటు, మీసములను, గోళ్లనుకూడ తీయించుకొనవలెను.

స్త్రీలుకూడ తీర్థములలో ముండనము చేయించుకొనవలెను. ముత్తయిదువలకు మాత్రము అట్లుకాదు. మొత్తము జుట్టును ఎత్తిపట్టి, కొనలు రెండంగుళముల ప్రమాణముగా కత్తిరింపవలెను. కొందరు నడిమిపాయదీసి, చాలసన్నని జడయల్లి అది కత్తిరింతురు. మరికొందఱు, ఆ నడిపాయి చివర, ఒక అంగుళము లేక, రెండంగుళముల పొడవును కత్తిరింతురు. దీనినే స్త్రీల విషయమున వేణీప్రదాన మందురు. ఈ ఆచారము ముఖ్యముగ త్రివేణీసంగమమున పాటింతురు. (చూ. ప్రయాగ) యతి, శూద్రుడు, విధవ వీరికి మాత్రము సర్వముండనమె.

కాని కురుక్షేత్రమునందును, విశాలాతీర్థమునందును, విరజాతీర్థమునందును, ముండనము నిషిద్ధము. విరజాతీర్థము ఉత్కళదేశములో నున్నది. కొందరు, గంగలో, గయలోకూడ వపనము పనికిరాదని యందురు. కొందరు గంగాతీరమున తప్పక వపనము కావలసినదే యని యందురు. అది వారివారి యాచారము ననుసరించి చేయుట సమంజసము.

తల్లి తండ్రులు కలవారైనను, లేనివారైనను, అందరు తీర్థములలో వపనము చేయించుకొనక తప్పదు. ఆనాడు వపన

ఆ యా వస్తువులను గ్రహించునపుడు, తమ అధికారమును, శక్తిని శ్రాద్ధకర్తలు గమనింపవలెను. హిరణ్య శ్రాద్ధములు కూడ జరుపవచ్చును. అధికారముగలవారికి, అన్నశ్రాద్ధమే ముఖ్యము.

గయలో మాత్రము, పగలుగాని, రాత్రిగాని, ఎప్పుడైనను శ్రాద్ధము పెట్టవచ్చును. ఇతర స్థలములయందు పగటివేళ యందు మాత్రమే పెట్టవలయును.

తీర్థశ్రాద్ధములు, పితృభక్తి హేతువులు. అందువలన పితృదేవతలు, అనుక్షణము, తీర్థశ్రాద్ధములకు ఎదురుచూచుచు నుందురు, అని శాస్త్రవచనము.

ఇట్లు విధివిధానముగ, స్నాన తర్పణ శ్రాద్ధాదికము లాచరించవలెను. యాత్రికుడు, ఆతీర్థస్థలమున దేవతాదర్శనము చేసికొనవలెను. దేవతాదర్శనము చేసికొనకున్నచో, ఆతీర్థసేవ నిష్ఫలము, అని యెఱుగవలెను. దేవతాతిక్రమణమునకు ప్రాయశ్చిత్తము లేదు. దేవాలయమున ప్రవేశించునపుడు, శుచియై విభూతి లేక బొట్టు పెట్టుకొని, పై వస్త్రమును నడుమునకు కట్టి, భక్తితో పవిత్రుడై, భగవన్నామము చేయుచు, ఆలయమున ప్రవేశించి, దేవతాదర్శనము చేసి, శక్తికొలది పూజించి, తీర్థప్రసాదముల స్వీకరించి, క్షణకాలముండి, బయటికి రావలయును. శివాలయములో ఎక్కువకాలముండరాదు. శివాపరాధమునకు ప్రతీకారము లేదు. ఇంద్రియములు చపలములు. ఏ యింద్రియమువలన ఏ యపచారము వాటిల్లినను, మహాదోషముగ పరిణమించును గాన బహుజాగరూకతతో దేవాలయప్రవేశము, దేవతాదర్శనము చేయవలయును. తీర్థములయందు దానము

అనంత ఫలము నిచ్చును. తీర్థములను సేవించువాడు తన శక్తి కొలది దానము చేయవలయును. ఆయా తీర్థములలో దానము చేయవలయునే కాని ప్రతిగ్రహము నాచరింపరాదు. ఆ తీర్థవాసులకుమాత్రము ప్రతిగ్రహదోషము లేదు. అట్టి ప్రతిగ్రహముల చేయు, తీర్థవాసులకును, ఒక నియమము గలదు. వారు తమ కుటుంబ సంరక్షణమునకు వలయునంత మాత్రమె ప్రతిగ్రహించు చుండవలెను. అత్యాశతో, ప్రతియొకదాతయొద్ద చేయిజాపరాదు. అత్యాశాపరుడు సమూలము నశించునని శాస్త్రవచనము.

తీర్థయాత్రాపరుడగువాడు, ఆయా తీర్థములలో, తా నాచరించు ఆయా కర్మలను, బ్రహ్మార్పణబుద్ధి కలిగి చేయ వలెను. అట్టి కర్మలు అనంతకోటి గుణితమైన ఫలమును సమ కూర్పగలవు.

గ్రంథములలో పుణ్యతీర్థములు అనేకములు వచింపబడి నవి. వానిలో అత్యద్భుత మహిమగలిగిన ముఖ్యపుణ్యతీర్థములు కొన్ని, ఈ పేర్లతో ప్రసిద్ధములై యున్నవి. కృతక శౌచము (ఇచట శ్రీమహావిష్ణువు, నరసింహరూపమున వెలసియున్నాడు) ఇక్షుమతి, గంగ, గంగాసంగమము, రుద్రసరస్సు, సర్వమోచనము, మందాకినీ, గోవా, విపాశ, సరస్వతి, ఇంద్రపదము, వైద్యనాథము, సిప్రా, మహాకాలము, కాలంజరము, గయ, శుక్లతీర్థము, సోమేశ్వరము, మహాబోధ, పాటల, నాగతీర్థము, అవంతి, మహారుద్రము, మహాలింగము, దశార్ణ, శతరుద్ర, శతాహ్వా, విష్ణుపదము, అంగారవాహిక, శోణనదము, ఘర్ఘర నదము, ద్వారక, కృష్ణతీర్థము, అర్బుదసరస్వతి, ధూతపాపము,

నిలుచును. ఆ మహానీయుని స్పర్శవలన తమకు పవిత్రత గలుగు నని తీర్థముల కోరిక.

ఒక మహాపతివ్రత వచ్చి, తమలో ఎప్పుడు స్నానము చేయునా ? అని అన్నిపుణ్యాపగలు ఎల్లప్పుడు కోరుకొనుచుండు నట; ఆ పతివ్రతల శరీరముమీది, పరాగమును తమకు అంతరాగముగా గ్రహించి, ఆ నదులు నిర్మలములై పొంగిపోవునట.

మహాపతివ్రత ఒకతే, తనజలములలో అడుగుపెట్టినంతనే, మంగళతరంగిణి యగు గంగసైతము, సంతోషతరంగములతో ఉప్పొంగి పోవునట !

## తీసికొని వెళ్లవలసిన వస్తువులు

సన్నని ధోవతులు 2
చొక్కాలు 2
బనీనులు 2
ఉత్తరీయములు 2
తుండ్లు 2
ధావళి లేక పట్టుపంచ
* గొడుగు
* చెప్పులు
కలము సిరా లేక పెన్
పెన్సిళ్ళు 2
♦ బొట్టుసామాను
విభూతి
గంధం డబ్బా
కుంకుమ
పండ్లపొడి - నాలుకగీయు బద్ద
బ్యాటరీ లైటు

నోటుబుక్కు
గట్టి తాళము (గదికి)
గ్లాసు - ఉద్ధరిణి
యాత్రల గైడు
బట్టల సబ్బు
షీకాయిపొడి - వంటిసబ్బు
♦ గొలుసు - తాళము
కార్డులు - కవర్లు
♦ క్యాలెండరు లేక పంచాంగము
తావళము
♦ యజ్ఞోపవీతములు
♦ దర్భలు
తెల్లకాగితములు
♦ మేకులు
పొడవైన త్రాడు (బట్టలారవేయుటకు, సామానులుకట్టుటకు)

స్నానమును, వివిధ జలములను ద్రాగుటయు మొదలగునవి చేయవలసి యుండును. కొందరు యాత్రికుల కిది తెలియక తమ గ్రామములోవలెనే అన్నియునుండునని భావించి ఆరోగ్యమునుగమనింపకయే బయలుదేరి చాల అవస్థలుపడుటయో లేక మధ్యలో యాత్ర పూర్తికాకమునుపే తిరిగి రావలసి వచ్చుటయో జరుగుచుండును. మరియు తోడువచ్చినవారిని బాధపెట్టి, తాను బాధపడవలసి వచ్చును. కాన యాత్రకు బయలుదేరుటకు వారము రోజులు ముందు భేదికి మందు వాడవలెను. కలరా యింజక్షన్ తప్పక చేయించుకొని, డాక్టరు సర్టిఫికెట్ వెంటనుంచుకొనవలయును. లేనిచో మార్గమధ్యమున కొన్ని తావులలో ఆరోగ్యరక్షణ శాఖవారు, బలవంతముగా ఇంజక్షన్ చేయుదురు. దేహపరిస్థితిని బట్టి జ్వరము రావచ్చును. ఇంజక్షన్ చేయించుకొనినచో ఆహార పానీయములవలన భయముకూడ నుండదు.

యాత్రాసమయమున క్షేత్రములలో చెప్పులతో నడవరాదు. పర్వతప్రదేశములందు, కొన్ని యితరప్రదేశములందును, రాత్రిభాగమున అవసరముండును. అవసరమును బట్టి వినియోగించవలయును. బదరీయాత్ర చేయువారు, కేన్వాస్ బూటు నుపయోగించవలయును. అది వాడుట అలవాటులేనివారికి కాళ్లు పుండ్లు పడును. కనుక పదిరోజులు అలవరచుకొనవలయును. (ఇది స్వానుభవము) ప్రస్తుతము బదరీయాత్ర చాలవరకు కారు మీద ప్రయాణముచేయవచ్చును. (1948 సం॥లో మాయాత్ర) ఆయా క్షేత్రములలో పండాలవలన మనకన్నియు (సంకల్పము మొదలు) తెలియును. కాని ప్రధానస్థానములలోని, సంకల్పము యొక్క మార్పును, ఆయా క్షేత్రములలో వ్రాయబడెను.

బండారములను తినరాదు. ఆరోగ్యము చెడును. ఉత్తరదేశమున ప్రతి-చోట మట్టిపాత్రలు అతిచౌక. వంటకు అవియు ఉపయోగించవచ్చును. వీలువెంబడి స్టౌవ్ గాని, కుక్కరుగాని తీసికొనిపోయిన సౌకర్యముగ నుండును. మంచినీరు కాచి త్రాగుట మంచిది.



## రైల్వే సమాచారము

సాధారణముగ రైల్వేవారి యాత్రా టిక్కెట్లుండును. వాటిని పెద్ద స్టేషనులలోని మేష్టర్లనుగాని, లేక ఛీఫ్ కమర్షియల్ సూపరింటెండెంటును గాని, జిల్లా ట్రాఫిక్ సూపరింటెండెంటును గాని ఉత్తరప్రత్యుత్తరముల ద్వారా అడిగి కనుగొనవలెను. మీ రే క్షేత్రములను, ప్రసిద్ధస్థలములను జూడదలంచితిరో దానికి సంబంధించిన టిక్కెట్టును గొనవలెను. లేదా మీ రేయే క్షేత్రములను దర్శింపదలచితిరో దాని మైళ్లతో సహావేసి పై వారికి వ్రాసుకొనిన వారు దానికగు చార్జి ¾ మాత్రమే చార్జి చేసెదరు. అది మనకు లాభము. ఎప్పటికప్పుడు టిక్కెట్లు తీసికొనుట చాల యాతనవని. దీనిలో మీ సంతకము చేయించుకొందురు. దాని నింకొకరికి యివ్వరాదు. అది నేరము కాగలదు. టిక్కెట్టు ఒకరివెంబడి, ఒకరు నిలుచుండి తీసికొనవలయును. లేనిచో ననేక ప్రమాదములు వాటిల్లును.

టిక్కెట్లు యాత్రికులలో సమర్థుడగువానిచే తెప్పించుట శ్రేయస్కరము. వాటిని ఒకనిదగ్గఱ జాగ్రత్తగనుంచుట మంచిది. వేరువేరు యాత్రికులవద్ద నున్న అన్ని టిక్కెట్ల నెంబర్లు వేసికొని యుంచుకొనవలెను. టిక్కెట్లు దాచినవాడు కూడ ఆ నెంబర్లను

వేసికొనవలెను. ఒకవేళ టిక్కెట్లు పోయిన ఆనెంబర్లు చెప్పినచో ఆలోపము దీరగలదు.

రైల్వే లగ్గేజి - చార్జీలు :—

| | | | | |
|---|---|---|---|---|
| రెండవక్లాసు : | మెయిలు, ఎక్స్‌ప్రెస్, | మైలు 1కి | 16 | పై |
| ఇంటరుక్లాసు : | ,, ,, | ,, | 10½ | ,, |
| | ప్యాసెంజరు | ,, | 9 | ,, |
| మూడవక్లాసు : | మెయిల్, ఎక్స్‌ప్రెస్, | ,, | 6 | ,, |
| | ప్యాసెంజరు | ,, | 5 | ,, |
| 2 వ తరగతి : | ప్రయాణీకుడు | 40 శేర్లు | 123 | పౌ |
| ఇంటరుక్లాసు : | ,, | 30 ,, | 82 | ,, |
| 3 వ తరగతి : | ,, | 25 ,, | 51 | ,, |

పైరీతిగా తూకముగల సామాను ప్రతి ప్రయాణీకుడు వెంట నుంచుకొనవచ్చును. ఎక్కువయున్న లగ్గేజి చేయవలయును. 3 సం॥ పైన 12 సం॥ లోపు వయసువారికి అర్థచార్జి. రైలులో ప్రయాణము చేయునపుడు సామాను తన దగ్గరనే పెట్టుకొనుట మంచిది. దాని నానుకొనియే కూర్చుండవలెను. పైన చెక్కలమీదగాని, బల్లలక్రిందగాని బెట్టవచ్చును. గాని ప్రతి స్టేషన్‌లోను జాగ్రత్తగ చూచుకొనుచుండవలెను. కొందరీ సామానును చెప్పకయే తీసుకొనిపోదురు. పట్టుకొంటే ఇది నాదే ననుకొన్నానండి అని అనుచుందురు. హోల్‌డాల్ అయినచో దానిని పరుచుకొని దానిమీద పరుండుట మంచిది. తలక్రింద పెట్టుకొని పండుకొన్నను కత్తులతో, కత్తెరలతో, బ్లేడులతో కోయుచుందురు. జాగ్రత్త వహించవలెను. సెకండు, ఇంటరుక్లాసు

ప్రయాణీకులు పడకకు సీటు రిజర్వుచేసుకొనవలెననిన టిక్కెట్టు చార్జిమీద అదనముగా 0-8-0 కట్టవలయును.

డబ్బు:-

యాత్ర చేయుట కొక్కసారిగా డబ్బు దొరకకపో వచ్చును. తాను ప్రతినెల కింతింతని ఒక డిబ్బెనలో బడవేసి దాచుకొను చుండవలెను. యాత్ర కెంతకావలయునో ఒక్కసారి మదింపు వేసికొని ఆమదింపు ననుసరించి జాగ్రత్తగ ఖర్చుపెట్టు కొనుచు యాత్ర చేయవలెను. కొంతడబ్బును ఎవరైన ఇంటివద్ద గాని, లేక తనకనుకూలమైన చోటునగాని ఉంచి నీకు కావలసి నప్పుడు ఉత్తరం వ్రాసి తెప్పించుకొనవలెను. నీవద్ద వారం పది దినములకు డబ్బున్నదనగానే ఉత్తరం వ్రాసిననే గాని ఆ ఉత్తరం మీకు డబ్బుపంపు వారిదగ్గరకు చేరి మీకు చేరుట దుస్తరము. ఆడబ్బు ఉత్తరములు మొదలగునవి చేరునాటికి నీవే స్థలములో నుందువో ఆస్థలము చిరునామా యీయవలెను. C/O పోస్టు మేస్టరు అని వ్రాయించవలెను. నీవా స్థలమును జేరగానే ముందుగా పోస్టుమేస్టరుగారిని పరిచయము చేసికొని తనపేర డబ్బు వచ్చునని చెప్పవలెను. లేకున్న యెఱుకలేదని డబ్బీయక చాల యిబ్బంది పెట్టెదరు. బస మేనేజరుతోగాని ఆక్షేత్రమున నింకొకరితోగాని పరిచయమొనర్చుకొని సాక్ష్యమునుగొనిపోవలసి యుండును. లేదా నీ ఫోటో ఒకటి తీయించుకొని దానిమీద నీసంతకముచేసి అది నీఫోటోయేనని ఒక ఆఫీసరుద్వారా ఆఫీసు ముద్రతో దానినంగీకరింపజేసికొని తీసికొనిపోయి దానిని అట్టియెడ చూపించి ఫలాని వాడవు/దానను నీవేనని అచ్చుట ఋజువు

చూపించిన మనిఆర్డరుగాని, రిజిష్టరుగాని ఇన్సూరుగాని యీయగలరు. డబ్బును ప్రక్కజేబులలో పొరపాటుననైన దాచుకొనరాదు. ఎదురు జేబులలోనైన దాచరాదు. జేబులు కొట్టుటలో ప్రతి-చోటను మహానిపుణులు కలరు. మొలలోనో, బొడ్డులోనో కట్టుకొనుట మంచిది. డబ్బంతయు నొక్క-చోట ఉంచరాదు. పోయిన అంతయును బోయి యిబ్బంది పడవలసివచ్చును. కావున రెండుమూడు చోట్ల దాచవలెను. ఒక-చోట పోయినను మరియొక-చోట యుండును. తోడియాత్రికుల నైనను నమ్మరాదు. యాత్రకు యాత్రయే. దొంగతనమునకు దొంగతనమే. కామినీ కాంచనములు ఎట్టివానినైనను మోహమున బడవేయగలవు. క్షేత్రములలో డబ్బు విరివిగా ఖర్చుపెట్టరాదు. జాగ్రత్తగ వాడుకొనవలెను. క్షేత్రములలో పండాలు (యాత్రచేయించువారు) తీర్థపురోహితులు చేయమన్నన్ని దానములు, అంతదానము మనము చేయజాలము. రు. 1-0-0 జరుగుచోట వారు 10-0-0 అడుగుచుందురు. తెలియని అమాయకులు వారి వలలలో బడిపోయి చాల చిక్కులు పడుచుందురు. చిల్లర తీసికొనుచోట చెల్లని నాణెములను, నకలునోట్లు నంటగట్టుదురు. మనము పరాయి గ్రామస్థుల మగుటచే స్థానబల ముండదు. వారిని జయించలేము. ఆ నాణెము లేక ఆనోటు మనము తెచ్చినదే అందురు. పట్టణములలోని, కూలీల, బండ్ల, వస్తువులధరలు మారుచుండును. వర్తకులు, ఒకఅణా వస్తువును రూపాయి చెప్పుదురు. జాగ్రత్తగ బేరమాడవలయును. కూలీల, బండ్ల బాడుగలు తొలుతనే నిర్ణయించుకొనవలయును.

పండాలు:—

ఆ యా క్షేత్రవాసులగు పండాలు, యాత్రికులకు క్షేత్రాధి దేవతలవలె, ఎదురువచ్చి, యాత్రచేయించుటలో తమకు గల యనుభవముల చెప్పి, మా వెంటరండి, అని మాట ముల్లె గ్రహించి తమవెంట తీసికొని వెళ్లుదురు. వీరిలో ప్రారంభమున చూపు భక్తి విశ్వాసములు చివరకుండవు. క్షేత్రములగూర్చియు, అచటచేయు కర్మలగురించియు ఉన్నవియు లేనివియు చెప్పుదురు. తోచిన దానము చేయుడనుచు, ఇచ్చినది గ్రహించక, ఎక్కువ కోరుట వీరికి సహజము. కొందరు పండాలు తాము తృప్తిపడక, యాత్రికునకుకూడ నసంతృప్తి కలిగించుదురు. వీరిలో నెచటనో కాని యోగ్యులు కానరారు. (మాకిట్టి స్థితి సంభవించలేదు. మాలో నొకరు యాత్రా ప్రకరణము తెలిసిన వారుండుటచే, పండా లకు తోచినదిచ్చి, యాత్రను సలక్షణముగా చేసితిమి.) కాని పండాలు లేనిదే యాత్ర చేయజాలము. ఈ పండాల, ఒత్తిడి ముఖ్యముగా గయ, కాశి, జగన్నాథము, మధుర, ద్వారక లోను కలదు. ఏదో విధముగ పండాలను తృప్తిపరచకున్న యాత్రాఫలితముండదు — కాశీలో పండాలు తాము గంగా పుత్రులమనియు, యాత్రికుని తరింపజేయునది తామె యనియు, తమను సంతృప్తిపఱచకున్న యాత్ర వ్యర్థమనియు పలుకుదురు.

యాత్రాచరిత్రలు చదివియు, యాత్ర చేసినవారి వలన వినికిడియు ఉన్నను పండాల యాధారము తప్పదు. గాన జాగ్ర తగ పండాల కిచ్చునది ముందుగా నిర్ణయించుకొని వారివలన యాత్ర పూర్తిచేయవలయును. వారు పదిరూపాయిలు అడిగిన

రు 1, 2 లు యిత్తు మనవలయును. పండాలకు — ఆలయమందలి అర్చకులకు, బజారులోని వర్తకులకు పరస్పర సంబంధముండును. ఈ విషయము యాత్రికుడు గమనింపలేడు. వీరిలో నెవరికి మనము ఏరీతిగా నెంత ముట్టజెప్పినను, అందు ముప్వురు భాగ స్వాములె. వీరిలో నెవరు మాటాడినను దానిని రెండవవారు బలపఱచు చుందురు. దీనిని గ్రహించుటయె యాత్రికుని బుద్ధి కుశలత. ఈ పద్ధతి పై జెప్పిన స్థానములలో ముఖ్యముగ గలదు— నాటి మా యాత్రాసంఘమున, ఎనిమిది భాషలు తెలిసిన వా రుండుటచే, మా యాత్ర మిక్కిలి సుఖముగ, ఆనందదాయక ముగా జరిగెను.

సామాను :—

యాత్రకు బోవుటకు సామాను చాల తేలికైనవి తీసికొని పోవలెను. ఎక్కువ బరువుగల సామానులు, అధిక సామానులు తీసుకొని పోవుట వలనను చాల యాతన పడవలసి వచ్చును. దస్తాగిన్నెల రకము ఒకదానిలో నొకటి ఇముడు గిన్నెలు తీసికొని పోవుటవలన చాలస్థలము కలిసివచ్చును. చిన్న గరిటె మడత పొయ్యి ఉండుట మంచిది. కాశీలో మడతపొయ్యిలు దొరకును. అదే కుంపటిగా గూడ పనికివచ్చును. లేదా పొయ్యి కుంపటి కలిసినది తీసికొనిపోవుట మంచిది. గుడ్డలు తేలికైనవి తీసికొని పోవుట మంచిది. ఉత్తరదేశపు ప్రయాణములో ఒక కంబళి లేక రగ్గు కప్పుకొనుటకు తీసికొనిపోవలెను. సామాన్యునకు గోనెసంచి (గాజులమల్లారమువలె) కుట్టించుకొనుట మంచిది. సమస్త సామాను ఆగోనెలో అటునిటు పెట్టుకొని భుజములమీద వేసి

కొనిన సులభముగ రెండు చేతులతో బస్సులోను రైలులోను సులభముగ నెక్కవచ్చును. కొంచెము సుఖము మరిగినవాడు హోల్డాల్ (పరుపు, పరుపుసంచి) తీసికొనిపోవుట మంచిది. దానిలో సామాను, గుడ్డలు వగైరాలు అన్నిటిని సర్దవచ్చును. డబ్బును దాచుకొనవచ్చును. అయితే దిగేచోట యెక్కేచోట కూలిపెట్టవలసి వచ్చును. సామాన్యముగా రాత్రికాలముననే ప్రయాణముచేయుట మంచిది. కాలము, నిద్ర వ్యర్థములుకావు. రాత్రులందు ప్రయాణము చేసిన ఒకరు విడిచి ఒకరు మేల్కొని సామానును చూచుచుండ వలెను. యాత్రలందు ముఖ్యముగ ఆడవాండ్రకు, కొంతమంది మగవారికిని అలివిమాలిన సామానులు కొనే వ్యసనముండును. వాటిని చేరవేయుట చాల శ్రమయగు పని. అట్టివేవైన కొనిన డబ్బుఖర్చైనను పార్శిల్ చేసి ఇంటికి పంపించుట మంచిది. యాత్రకు పోయి పాత్ర కొనవలయునని శాస్త్రము. కావున ఒకచెంబైనను కనీసము కొనవలసియుండును.

దారిలో కాలక్షేపము జరుగుటకు ఏదైన మంచి ఆధ్యాత్మిక గ్రంథముండుట మంచిది. రైలులోను, క్షేత్రములందు విశ్రాంతి సమయములందును దానిని చక్కగ చదుకొనవచ్చును. గీత చాల ముఖ్యమగు గ్రంథము. యాత్ర పూర్తి అగులోగా దానిని వల్లింపవచ్చును. లేక భాగవతము అటువంటి గ్రంథమును గొనిపోవచ్చును. జ్ఞానమార్గావలంబి మా సాధన గ్రంథ మండలి, గ్రంథములను గొనిపోయిన చక్కని వ్యాసంగము జరుగగలదు.

సామానులలో సబ్బు, గుడ్డలసబ్బు, మందులపెట్టె చాల అవసరము. మేము పైన చెప్పిన భుజముమీాద అటునిటు వేసి

సామాన్యముగ యాత్రకు కొంతమంది సంఘముగ బయలుదేరుట సర్వవిధముల సుఖకరము. అట్టితటి బయలుదేరుటకు ముందుగ, యాత్రాకాలమున జరుగు కార్యక్రమమునకు, సంఘములోని కొందర వ్యక్తులను నిర్ణయించుకొన వలయును. టిక్కెట్లు, డబ్బుఖర్చులను ఒకరు, క్షేత్రమున దేవకార్యముల భారము చూచుట కొకరు, భోజనాది విషయమున కింకొకరు. ఈ రీతిగా నియమించుకొనిన యెట్టి శ్రమయు నుండదు. నిర్ణయించినవారి నిర్ణయమునకు తిరుగప్రశ్న లేకుండ నందరు బద్ధులు కావలయును. ఈ కార్యక్రమము మాయాత్రా సమయమున పాటించి, యాత్రవలనకలుగు పరమప్రయోజనమును సంపూర్తిగ పొందితిమి.

దేశమున, ఒకరోజుకన్న ఒకరోజు నాగరికత, విజ్ఞానము లభివృద్ధి పొందుచున్నవి. జనసామాన్యమునకు, అవసరముగ తెలిసికొనవలసిన విషయములు మాత్రము తెలుప బడినవి. ఈ విషయము లన్నియు బాగుగ తెలిసికొని, యాత్రచేసిన వారి యనుభవములనుగూడ విని, యాత్రకు బయలుదేరవలయును.



# సుందరభారత యాత్ర

## ద్వారకా ఖండము

### [ పశ్చిమము ]



"శుక్లాంబర ధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్నవదనం ధ్యాయేత్, సర్వవిఘ్నోపశాంతయే.
నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్,
దేవీం సరస్వతీం చైవ తతో జయ ముదీరయేత్ "

విజయవాడ పరమపావనియగు కృష్ణాతీరమున గలదు. ఈ క్షేత్రమునుగురించి పురాణములలోను, సూతసంహితాది గ్రంథములలోను వర్ణింపబడినది. ఈ క్షేత్ర విశేషములు యాత్రాంతమున వర్ణితము.



* కృష్ణ బ్రిడ్జి

బెజవాడ భారతదేశమున నలుమూలలకుపోవుమార్గములకు ప్రధాన కేంద్రము. హిందూదేశములలో గల పెదస్టేషనులలో నొకటి. ఈ స్టేషను ప్లాటుఫారము షుమారు 2,100 అ. పొడవు. 1944 సం॥ ఫిబ్రవరి 25 తేది: మధ్యాహ్నము 3 గం॥కు నాటి మాయాత్రాబృందము నలువైపులనుండి బెజవాడస్టేషనుకు చేరితిమి. సా. 6 గం॥లకు భగవన్నామముతో ఢిల్లి ఎక్సుప్రెస్

అధిష్టించితిమి. మేము జయజయధ్వానములు చేయుచుండ మా మిత్రబృందము మా యాత్రను అభినందించుచు 'భగవదనుగ్రహామునకు పాత్రులు కమ్మ'ని దీవించుచుండ ధూమశకటము బుగబుగమని పొగలు అంతరిక్షమునకు విరజిమ్ముచు బయలు దేరెను. క్షేత్రలక్ష్మితో కూడిన భూధరముల ప్రకృతిశోభ నయనానందముగ నుండెను.

## నేలకొండపల్లె (రామదాసు)

బెజవాడనుండి సికింద్రాబాదుపోవు బండిలో నెక్కి ఖమ్మం మెట్టు స్టేషనులో దిగవలయును.

## స్తంభాద్రి నరసింహస్వామి

ఖమ్మంమెట్టుకు 1 మైలు దూరమున కొండమీద నరసింహస్వామి ఆలయము కలదు. ప్రసిద్ధస్థానము. ఇచట చూడదగిన విచిత్రస్థానములు గలవు. గ్రామములో మరియొక నరసింహస్వామి ఆలయము కలదు. ఇటకు నేలకొండపల్లె 16మైళ్ళ దూరమున గలదు. ఖమ్మంమెట్టునుండి బస్సులు కలవు. ఇది రామభక్తుండగు రామదాసు జన్మస్థలము. ఈ గ్రామమునందన్ని సౌకర్యములు కలవు. పూర్వము రామదాసు గృహముండుచోటు నేటికిని గలదు.

## రామదాసు

ఈతనికి తల్లిదండ్రులిడినపేరు గోపన్న. గోపాలుని యనుగ్రహమున జన్మించుటచేత నీతని కీపేరు పెట్టిరి. ఇతని మేనమామ యగు మాదన్న గోల్కొండ నవాబువద్ద మంత్రిగ నుండెను. ఆతనివలన నీతఁడు భద్రాచలప్రాంతమున తహసీలుదారుగ నియు

మింపబడి రామభక్తిప్రేరితుడై రాజధనమునువెచ్చించి భద్రాద్రి శ్రీరామాలయమును కట్టించెను. అందులకు నవాబు కోపించి యాతని జైలునందుంచగ శ్రీరామలక్ష్మణులు స్వయముగవచ్చి నవాబునకు ధనమును చెల్లించి యాతని విడిపించిరి. ఈ భక్తాగ్రేసరుడు రచించిన దాశరథీశతక మాంధ్రులలో చదువనివారుండరు.

ఇదియొక చారిత్రికగ్రామము. ఇట నెనిమిది దిక్కులందు నెనిమిది దేవాలయములు కలవు. **1.** వెంకటేశ్వరస్వామి మందిరము:- ఇది 600 సం॥ లకు పూర్వము స్వయముద్భూత మని చెప్పుదురు. **2.** రాజగోపాలస్వామి మందిరము, 3. భీమేశ్వరస్వామి మందిరము:- ఈరెండును ధర్మరాజు ప్రతిష్ఠించెనని చెప్పుదురు. 4. ఉత్తరేశ్వరస్వామి మందిరము:- దీనిని విరాటుని పుత్రుడగు ఉత్తరుడు ప్రతిష్ఠించెనని చెప్పుదురు. 5. ఆంజనేయస్వామి మందిరము:- ఇది ఉత్తరదిశయందు కలదు. 6. వీరభద్రస్వామి మందిరము:- ఇది యీగ్రామమునకు దక్షిణమున గలదు. ఇవికాక రెండు గ్రామదేవతల యాలయములు కలవు.

ఈ గ్రామమునకు సమీపమునందు 'ఎఱ్ఱదిబ్బ' యను మిట్ట కలదు. ఇది విరాటుని గద్దె యని చెప్పుదురు. పూర్వము పాండవులు అజ్ఞాతవాస సమయము నిచ్చటనే గడపిరనికూడ చెప్పుదురు. భీముడు విరాటు నింట వంటజేసిన పొయ్యి, నాటి భాండశకలములు నేటికిని గానవచ్చును. ఈ ప్రాంతమున త్రవ్విన ప్రాచీన శిథిలము లనేకములు నేటికిని గానవచ్చును. మహాభక్తులు స్వయముగ తీర్థస్వరూపులగుట-రామభక్తుడగు రామదాసుని జన్మస్థలమును యాత్రికులు సందర్శించదగినది.

# వరంగల్

బెజవాడనుండి సికింద్రాబాదుపోవు లైనులో వరంగలు స్టేషన్ గలదు. ఆజిల్లాకు వరంగలు ముఖ్యపట్టణము. ఈపట్టణము 250 సం॥ ముల పాటు అవిచ్ఛిన్నముగ రాజ్యమేలి ఖ్యాతిగాంచిన కాకతీయులకు రాజధాని నగరము. ఈపట్టణము చుట్టూ రెండు కోటగోడలు కలవు. హనుమకొండ, మట్టెవాడ, వరంగలు ఒక దానికొకటి దగ్గరగనుండి యొకే పట్టణముగ నుండును. గవర్నమెంటు గృహములు, ఆఫీసులు హనుమకొండలో గలవు. ఖాజీపేట రైల్వే కాలనీకి 2 మైళ్ళలో గలదు. వరంగలు గొంగళ్ళ నేతకు, కత్తులు, బాకులు తయారుచేయుటకు ప్రసిద్ధి. ఇది పారిశ్రామిక కేంద్రముకూడ.

వరంగల్‌నందు కాకతీయుల కాలమునాటి శేషించిన వస్తు సంపద చాలగలదు. హైదరాబాదుప్రభుత్వము ఈ వస్తుసంపదను త్రవ్వించి సేకరించుచున్నది. కోటలో గుట్టపై గల పద్మాక్షి ఆలయము, వెయ్యి స్తంభముల మంటపము చూచుట కానందమును కల్గించును. వెయ్యి స్తంభములందలిచెక్కడములు—ఆ కాలమునాటి శిల్పచాతుర్యమునకు నిదర్శనము. పితాంబుఖాన్ కచ్చేరి తప్పక చూడవలయును. దాదాపు తెలుగు దేశమంతయు పాలించి రాజ్యమేలిన కాకతీయరాజులలో 30 సం॥ల పాటు సింహాసన మెక్కి రాజ్యమేలిన రుద్రమదేవి, చివరివాడైన ప్రతాపరుద్రుడు ముఖ్యులు. ప్రతాపరుద్రుడు కవులను, పండితులను పోషించిన కవితాప్రియుడు. హైదరాబాదురాష్ట్రములో వరంగల్



స్వాయంభూ దేవాలయ ముఖద్వారము

తెలుగువారికి చెందిన ముఖ్యపట్టణము. ఈ పట్టణమును గురించి మార్కోపోలో యిట్లు వ్రాసెను. 'ఈ రాజ్యములో అతి సున్నితములైన ప్రత్తివస్త్రముల నేయుదురు. అవి చాల ఖరీదు గలవి. సాలెపురుగులోని దారములంత సన్నముగ నుండును. ఇట్టి దుస్తులు ధరించుటకు మురియని ఏ రాజుండును ?'

## సికింద్రాబాదు

స్టేషనుకు సమీపమున ధర్మశాల గలదు. పెద్ద పెద్ద బజారులు, అందమైన భవనములు చూడదగును. మరియు స్టేషనుకు సమీపమున వినాయకాలయము కలదు. ఇందు నవగ్రహములు గలవు. లక్ష్మీనారాయణస్వామి ఆలయము, మహాకాళీ మందిరము చూడతగినవి. కాళి ప్రత్యక్ష దేవత. సికిందాబాదుకు 318 మైళ్లలో ఔరంగాబాదుపట్నము కలదు. ఇక్కడకు 18 మైళ్లదూరమున ఎల్లోరాగుహాలు గలవు. కారు, రైలు మార్గములు కలవు. సికింద్రాబాదుకు 100 మైళ్ల దూరమున నిజాం సాగరు కలదు. దేశములోని పెద్దసరస్సులలో నిది యొకటి. దీని వైశాల్యం 50 చ మై. 2,70,000 ఎకరములు. చూచితీరవలెను.

## హైదరాబాదు

హైదరాబాదు సికింద్రాబాదుకు 7 మైళ్లు. రెండును కలసియే యుండును. హిందూదేశమందలి పెద్దపట్టణములలో హైదరాబాదు ఒకటి. జనాభా 10,85,722. హైదరాబాదు రాష్ట్రమంతయు, పట్టణమున ప్రభుత్వపు బస్సులు గలవు.



* హైకోర్టు

హైదరాబాదు రాష్ట్రానికి రాజధాని. ఇక్కడ మనోహరమైన భవనము లనేకములు గలవు. ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైకోర్టు, రాష్ట్ర కేంద్రగ్రంథాలయము, ఫలకనూమా భవనము, (రాజభవనము ఇది 85 లక్షలు వెచ్చించి కట్టించిరి.)

మిక్కిలి రమ్యమైనవి. సాలార్ జంగ్ మ్యూజియముకూడ గలదు. అందు చూడతగిన అద్భుతవిశేషములు గలవు. ఇక్కడి రమోద్యానములు, జంతుప్రదర్శనశాల, ఉస్మాన్ సాగర సరస్సు, హిమాయిత్ నగర సరస్సు, కుతుబ్ షాహిరాజుల గోరీలు, టౌన్ హాలు, జూబ్లీహాలు, ఉస్మానియా హాస్పటలు, మొగల్ గార్డెను ముఖ్యముగా చూడతగినవి. హైదరాబాదుకు 82 మైళ్ళలో బాదరు పట్టణము కొండమీద కలదు. ఇది ముఖ్యముగ చూడ తగినది. ఇక్కడ బహమనీరాజుల కాలంలో కట్టబడిన పెక్కు సుందరభవన శిథిలములు గలవు.

ఇతరములు:— పర్భణీజిల్లాలోని ఔంధ దగ్గర సంగనాథ దేవాలయము, వరంగల్ జిల్లాలోని సాలంపేట దేవాలయము, రాయచూరు జిల్లాలోని ఇత్తగిదగ్గర మహాదేవ దేవాలయము, నిజామాబాద్ జిల్లాలోని డిచ్చుపల్లి శ్రీవిష్ణుదేవాలయము తప్పక చూడతగినవి. బస్సుమార్గము గలదు — ఇందు సంగనాథ దేవాలయ శిల్పము మైసూరులోని హాలిబీడు శిల్పమును పోలి యుండును — గుల్బర్గాలోని జుమ్మామసీదు, దౌలతాబాదు లోని చాంద్ మినార్, బాదర్ లో మహమ్మద్ ఖాన్ మద్రసా, హైదరాబాదులోని చార్ మినార్ రమణీయమై అవశ్యము దర్శనీయములై యున్నవి.

చార్ మినార్ 1591 లో కట్టబడినది. దీనికి నాలుగు ద్వారములు గలవు. అందమైన కట్టడము. రాత్రిభాగమున దీని యందము చూడతగినది — చక్కని వసతికల పెద్ద సత్రము కలదు. దీనికి సమీపమున పంచముఖ ఆంజనేయ ఆలయము



* గోల్కొండ కోట

స్వతంత్ర రాజు తానీషా. ఈయన కాలముననే భద్రాద్రి దేవాలయమునునిర్మించి రామదాసు బందిఖానా గాథ జరిగినది. చారిత్రకముగ యీకోట కుతుబ్ షా రాజుల ప్రముఖపట్టణముగ తెలియవచ్చుచున్నది. ఈ కోట బురుజుపై నుండి చూచిన చుట్టూ 22 మైళ్ళ వరకు గల ప్రదేశమంతటిని చూడగలము.



గోల్కొండ కోట. ఫొటో: రాజా దీనదయాళ్ & సన్సు

ఇచట ముఖ్యముగ చూడతగినవి- యీ రాజ్యమేలిన రాజుల గోరీలు, ఆ గోరీలపైగల ఎనామిలుపూత, (ప్రస్తుతము చాల శిథిలమైనది) శత్రువులచే భేదింప శక్యముకాని బలమైన గోడలు యీపట్టణముచుట్టూగలవు. చివరకు 10 సం॥ల పిమ్మట ఔరంగజేబు మాయోపాయముచే నెట్లో జయించె నందురు. ఆకాలమునాటి రాజభవనములు, శిథిలములై పడియున్న బ్రహ్మాండమైన తుపాకులు, సుందరమైన తోటలు అన్నిప్రాంతములవారిని ఆ ప్రదేశమును చూచుటకు ఆకర్షించుచున్నవి. రామదాసుని బంధించిన స్థానము చేరునప్పటికే శరీరము పులకరించును. రామదాసు కూర్చుండినస్థానము, జైలు పైభాగమున గల కంతనుండి రామదాసుకు ఆహార మందిచ్చిన స్థానము, ఆంజనేయ విగ్రహము చూడతగినవి.


* రామదాసు బందిఖానా

# పండరిపురము


పండరి క్షేత్రము

సమచరణ సరోజం సాంద్రనీలాంబుదాభం
జఘననిహితపాణిం మండనం మండనానామ్,
తరుణ తులసిమాలా కంధరం కంజనేత్ర
సదయ ధవలహాసం విఠలం చింతయామి॥

సికింద్రాబాద్ నుండి వాడి మీదుగా కురుద్వాడిలో బండిమారి 'పండరిపురము' వెళ్ళవలయును. పండిరి స్టేషనుకు క్షేత్రమొక మైలుదూరమున గలదు. సోలాపూరు నుండి బస్సు మార్గముకూడ గలదు.

మహారాష్ట్ర దేశమున నిదియొక సుప్రసిద్ధ క్షేత్ర రాజము. భావుకులగు భక్తులు దీనిని 'భూవైకుంఠ' మనియు, 'దక్షిణద్వారక' యనియు పిలతురు. ప్రతి సంవత్సర మిచటకు లక్షలకొలది యాత్రికు లరుదెంచి శ్రీ విఠల్‌నాథుని సందర్శించుచుందురు. ఇది 'వార్కరీ' సంప్రదాయమునకు చెందిన ముఖ్య క్షేత్రము. చాలమంది వార్కరీ సంప్రదాయమువారీ క్షేత్ర యాత్రను గావింతురు.

పండరిపురము భీమానదీతీరమున గలదు. భీమానదిని యిచట "చంద్రభాగ" యని పిలతురు. పండరీపురమున చక్కని బజార్లు, రోడ్లు కలవు. బజారులో అన్నివస్తువులు దొరుకును. ఇచటి జను లధికముగ మహారాష్ట్రమును మాట్లాడుదురు. నగర మధ్యమున మహారాష్ట్ర ధర్మశాల యొకటి కలదు. ఇది చాల విశాలమైనది. ఇచట అన్ని సౌకర్యములు కలవు. ఈ ధర్మశాల గుమాస్తాలు అష్టభాషాప్రవీణులు. వారికి తెలుగుకూడా తెలియును. పండరీపురమున పాండాలు యాత్రికులు కోరినరీతిగ యథావిధిగ యాత్రచేయించి, యాత్రికులు భక్తితో తమశక్తికొలది యిచ్చు దక్షిణను గ్రహింతురు.

పండరీపురమున షుమారు ఏబదివేల జనాభా గలదు. షుమారు మూడువేలవరకు పండాలేయుండిరి. వీరు చాల నెమ్మదైనవారు. వీరివలన యాత్రికుల కెట్టికష్టము కలుగనేరదు. నగరమున శ్రీ జ్ఞానేశ్వర, ఏకనాథ భువనదాసాది భక్తుల సమాధులు గలవు. ప్రతి సంవత్సర మా భక్తుల పటములను పాలకీలయందుంచి ఆయాభక్తులు పరమపదించిన దివసములం దుత్సవములు

జరుపుదురు. ఆ సమయమున భక్తులు భగవన్నామ సంకీర్తన గావించుచు నగరమంతయు నూరేగింతురు. నవద్వీపమువలె నీ పుణ్యస్థలము గూడ నిరంతరము హరినామ సంకీర్తనతో విరాజిల్లుచు ప్రతిధ్వనించు చుండును.

## చంద్రభాగానది

ఈక్షేత్రమందలి తీర్థరాజము 'చంద్రభాగానది'. శ్రీవిఠల్ నాథుని సింహద్వారమునుండి చంద్రభాగవరకు మంచి రోడ్డు గలదు. ఈ రోడ్డున కిరువైపులు ఫలములు, పుష్పములు మొదలగు వివిధ పూజాసామగ్రిని విక్రయించు దుకాణములు గలవు. చంద్రభాగానది లోతు చాల తక్కువ. జలము స్వచ్ఛముగ, మధురముగ నుండును. నదీదర్శనము కాగానే యాత్రికులు "జయ జయ విఠల్" అను నామము నుచ్చరించుచు యథావిధిగ నదిలో స్నానమాచరించి శ్రీవిఠల్‌నాథుని యాలయమునకు వత్తురు.

## శ్రీ విఠల్‌నాథుని మందిరము

శ్రీ విఠల్‌నాథుని మందిర మతి ప్రాచీనమైనది. యాత్రికులు దేవాలయ ప్రాంగణమున ప్రవేశించగనే "జయ పుండరీక వరదే హరి విఠల్" అని జయజయధ్వానములు గావింతురు.

జీర్ణమై శిథిలమై పడియున్న యీ మందిరమున క్రీ. శ. 1273 లో పునరుద్ధరించిరి. అందుచేత నీ మందిరముయొక్క వర్తమానరూపముకూడ 650 సం॥లు పురాతనమైనది. ఇది శిల్ప సంపదతో కూడిన రమణీయమందిరము. దీనికి ఎనిమిది దిక్కుల ద్వారములు గలవు. ముఖ్యద్వారము తూర్పున గలదు. శ్రీవిఠల్

నొక రాతిపై నిలువబడి యుండెను. పండరీ క్షేత్రవాసి యగు శ్రీ విఠల్ ప్రభువు వార్కరీ సంప్రదాయులకు ప్రధాన దైవము. పుండరీకుని యనంతరము జ్ఞానదేవుడు, నామదేవుడు, ఏకనాథుడు, తుకారామ్, రామదాస్ మొదలగు మహాత్ములీ సంప్రదాయమున విశేషప్రచారము చేసిరి. ఆషాఢ శు ౧౧, కార్తీక శు ౧౧ దివసములం దీసంప్రదాయమువారు "పండరీ క్షేత్ర యాత్ర" నవశ్యముగ చేయుదురు. ఈ యాత్రకు 'వారీ' యని పేరు. అందుచేతనే యీ సంప్రదాయము 'వార్కరీ' యని పేరొందెను.

ఇతరములు:—— శ్రీ విఠల్‌నాథుని మందిరమునకు వెనుక నా ప్రాకారముననే రుక్మిణీ సత్యభామా, మహాలక్ష్ముల మందిరములు కలవు. రుక్మిణీదేవి నిచ్చట 'రఖుబాయి' అని పిలుతురు. ఈ విగ్రహము చాల సుందరముగ నున్నది. శ్రీ విఠల్‌నాథునికి కుడివైపున బలరాముని మందిరము గలదు. శ్రీ విఠల్‌నాథుని మందిరమునకు ముందుగల ప్రథమ సోపానమును "నామదేవ పాహిరీ" యని పిలతురు. నామదేవుడు నిరంతరము స్వామి కెదుట మందిరద్వారముననే యుండెడివాడు. ఆయన సమాధి కూడ యిచ్చటనే కలదు. ఛోకామేళుని సమాధికూడ దీనికి సమీపముననే కలదు. దేవాలయమున లోపల నొక వృక్షము క్రింద "కాన్హోపాత్రా" సమాధి కలదు.

కాన్హోపాత్రి యొక సుందరియగు వేశ్యకన్య. ఆమె పరమ సుందరుడగు పురుషునిగాని వివాహమాడ నని ప్రతినబట్టెను. శ్రీ విఠల్‌నాథుని సౌందర్యమును గాంచి యామె ముగ్ధురాలయ్యెను. ఆమె తన సర్వస్వమును వీడి శ్రీ విఠల్‌నాథాలయమున

భజనచేయుచు దినములు గడుపుచుండెను. ఇట్లుండ నొకదినమున నొక రాజామెను బలాత్కారముగ గొంపోవనెంచెను. ఆ సమయమున శ్రీకృష్ణవియోగమును భరించజాలని కాన్హోపాత్రి ప్రాణములు విడచెను. ఆమె మరణించిన ప్రదేశమునందొక వృక్షము మొలచెను. అది నేటికి నిచ్చట కానవచ్చును.

## గోపాలపురము

పండరీపురమునకు సుమారొక మైలుదూరమున గోపాలపురముగలదు. ఇచటకు టాంగామీదగాని, చంద్రభాగా నదిలో పడవనెక్కిగాని పోవచ్చును.

గోపాలపురమున భిక్షుకు లధికముగ నుందురు. ఇచట గూడ శ్రీవిఠల్ దేవాలయము కలదు. విగ్రహము పండరిపురము నందువలెనే యున్నది. కాని దానికంటె కొంచెము చిన్నది. ఇచ్చట సక్కుబాయి తిరగలి, మజ్జిగకుండ, రోలు మొదలగునవి చూపి పండాలు దక్షిణను వసూలు చేయుచుందురు. ఈ వస్తువును సక్కుబాయి కాలమువని చెప్పుటకు తగిన నిదర్శనమేమియు గానబడదు. అటులయ్యు భగవత్సన్నిధానమున భక్తురాలగు నామెనుస్మృతికిదెచ్చు నీవస్తువులనుగూడ యాత్రికులు తప్పక చూడవలయును.

పండాలపిల్లలు దేవాలయము బయట గంపలతో గడ్డి తెచ్చి తమ యావులనే యచటకు తోలిదెత్తురు. యాత్రికులను వారు నిలపి 'శ్రీకృష్ణుడు గోవులను మేపెను. తాముకూడ గోవులను పూజించవలయును' అని చెప్పి 0-0-6 ఖరీదు తీసుకొని యొకగుప్పెడు గడ్డిని వారికిచ్చి తమ యావులకే పెట్టింతురు.

తెలిసి వెంటనే గార్హస్థ్యము స్వీకరింపుమని ఆదేశించగ, విఠల్ పంతు మరల గార్హస్థ్యమున చేరగ, పౌరులు వెలివేసిరి.

విఠలపంతుకు ముగ్గురు కుమారులు, ఒక కుమార్తెయు. అందు జ్ఞానదేవుడు రెండవవాడు. ఈతడు శాలివాహన శకం 1197 లో జన్మించెను. దేవాంశసంభూతులగు వారలకు సర్వ విద్యలు బాల్యముననే యలవడెను. దారిద్ర్యముచే ననేక కష్టముల ననుభవించి, సంతానభారము భగవంతునకిచ్చి విఠలపంతు దంపతులు ప్రయాగలో జలసమాధి నందిరి.

నివృత్తిదేవుడు, జ్ఞానదేవుడు, సోపానదేవుడు, ముక్త బాయి సన్యాసి సంతానమగుటచే, ప్రజలు వెలివేసి ఆజన్మము బ్రహ్మచారులుగ నుండుటే దానికి ప్రాయశ్చిత్తమని నిర్ణయించిరి. నివృత్తిదేవుడు నాధ సంప్రదాయమునకు చెందిన గహినీ నాథునివద్ద మంత్రోపదేశ మందెను. జ్ఞానదేవుడు అన్నదగ్గఱ ఉపదేశమందెను. పిమ్మట వారు తీర్థయాత్రలు చేయుచు, నేవాసే గ్రామము చేరిరి. మార్గమధ్యమున, సచ్చిదానందుడు చనిపోగా భార్య విచారించుచుండ, జ్ఞానదేవుడు సమీపించి, సత్, చిత్ ఆనందరూపుడగు నీతడు చనిపోలేదని, తనకరములచే నాశనమును స్పృశించగ, పునర్జీవితుడాయెను. జ్ఞానదేవుని జీవితమున నిట్టి సంఘటనలు చాలకలవు. నేవాసే చేరునప్పటికి జ్ఞానదేవునకు 15 సం॥ల వయసు. ఆపిన్నవయసుననే జ్ఞానేశ్వరి యను పేర భగవద్గీత కొక చక్కని వ్యాఖ్యానము వ్రాసెను. జ్ఞానేశ్వరి మహారాష్ట్ర వాఙ్మయమునకు తలమానికము. జ్ఞానదేవుడింకను కొన్ని గ్రంథముల రచించెను. అనేక మహత్తర శక్తుల ప్రదర్శిం

చుచు, దేశమంతట భక్తిప్రచార మొనర్చి, చివరకతడు తన 21 వ యేట సోదరీ సోదర సహితుడై పండరీక్షేత్రమున జీవ సమాధిని గైకొనెను. శ్రీ జ్ఞానదేవుడు నివసించిన స్థానమగుటచే నేవాసే గ్రామము మహారాష్ట్రులకే కాక, యావన్మందికి పుణ్య క్షేత్రమయ్యెను. ఇచట యాత్రికులకన్ని వసతులు కలవు.

## వాయ్ గ్రామము

ఆలందినుండి మహాబలేశ్వరము పోవు మార్గమున వాథర్ స్టేషనులో దిగవలయును. ఇటకు 20 మై, దూరమున వాయ్ దేవాలయము గలదు. మార్గముపొడవున యిరుప్రక్కల మాత వృక్షములచే మనోహరముగా నుండును. వాయ్ దేవాలయము



వాయ్ దేవాలయము

చూడదగినది. ఇది కృష్ణాతీరమున గలదు. స్నానాది చక్కని సౌకర్యములుగలవు. పాండవులు అరణ్యావాస కాలమున యిచట యొక్కవకాలము గడిపిరని వదంతి. ఈ ప్రాంతమంతయు ప్రకృతి సౌందర్యముచే అలరారుచుండును.

## బాయీ

'వాథర్' నుండి మహాబలేశ్వరమునకు పోవు రోడ్డుమీద కృష్ణానదీతీరమున 'బాయీ' యను నొక గ్రామము కలదు. ఇది చాల పవిత్రమైనప్రదేశము. ఇచ్చట సుమారు 20 మందిరములు గలవు. ఇందుమాధవమందిరము, లక్ష్మీమందిరము, గణేశమంది రము, శివమందిరము చూడదగినవి. బాయీగ్రామ సమీప మునం దొకపర్వతముమీద 'పాండుగఢ్' అను పేరు గల యొక దుర్గము కలదు. బాయీ గ్రామమునకు 5 మైళ్ళదూరమున 'డోమ్' అనుగ్రామము గలదు. ఇచ్చట నొక శివాలయమున్నది. ఈయాలయ ప్రాంగణమంతయు పాలరాతితో గచ్చుచేయబడెను. ఆలయాంతర్భాగమునం దై దడుగుల ఎత్తుగల పాలరాతి స్తంభ మున పంచముఖీ మహాదేవీ విగ్రహము గలదు. ఈ విగ్రహమున సర్వాభరణము లతి లలితముగ చిత్రించబడెను.

## సతారా

వాథర్ నుండి సతారారోడ్ స్టేషనులో దిగవలయును. బాయీ సతారాకు మీరజ్ మీదుగకూడ రావచ్చును. (చూ. దక్షిణ ఖండం) ఇది కృష్ణానదీ యేననదీ సంగమ సమీపమున కలదు. ఈ గ్రామమునకు ప్రాక్పశ్చిమములందు పర్వతములు కలవు. ఒక చిన్న పర్వతశిఖరమున సతారా దుర్గము కలదు. కృష్ణాయేననదీ సంగమస్థానమున రామేశ్వర, భోలేశ్వర మందిర ములు గలవు. రామేశ్వరమందిరము క్రీ. శ. 1700 లోను, భోలే శ్వరమందిరము క్రీ. శ. 1742 లోను కట్టబడెను. ఇచ్చట రాధా శంకర మందిరము కలదు. ఈ మందిరము క్రీ. శ. 1825 లో

మునకు చిహ్నముగ నీ యాలయ శిఖరమును స్వర్ణమయముగా కావించెను. ఇచటి వాతావరణము చాల ప్రశస్తమైనది.

పై బాయీ, సతారా, మహాబలేశ్వరములకు మీరాజ్ నుండి కూడ పోనచ్చును. (చూ. మీరాజ్)

## పూనా

మహాబలేశ్వరమునుండి సతారా మీదుగ పూనా చేర వలయును.

ఇది మహారాష్ట్ర ప్రాంతమునకు ప్రధాననగరము. ఇది 'మూలాతా' నదికి దక్షిణతీరమున సముద్రతలమునకు 1850 అడుగుల ఎత్తునగలదు. ఇచ్చటి శీతోష్ణపరిస్థితి మనోహరమైనది. ఈ నగరమునకు సముద్రము 62 మైళ్ళ దూరమునగలదు. నగరమునకు నలువైపుల కొల్లరాతి ప్రాకారము గలదు. జనాభా 4,80,982 లు.

సంస్కృతమున నీ నగరమును 'పుణ్యాపురి' యని పేర్కొనిరి. పీష్వాల కాలంలో మహారాష్ట్రుల రాజధాని. అందుచే యీ నగరమున 'పేశవా' ల యొక్క సంస్కృతికి చిహ్నములనేకములు గానవచ్చును.

పూర్వ మీనగరమున నధికముగ బ్రాహ్మణులు నివసించెడివారు. దేశసేవకై తమ జీవిత సర్వస్వము నర్పించిన బాలగంగాధరతిలక్, గోఖలేల కీనగరము ప్రధానకార్యస్థానముగా నుండెడిది. ఈ నగరమున నొక 'ఇంజనీరింగ్ విశ్వవిద్యాలయము'ను 'సింధియాచాత్రావాసము'ను గ్రంథాలయమునుచూడ తగినవి. ఇదిగొప్ప సైనికకేంద్రము, వ్యాపారకేంద్రము. ప్రాచీన

దుర్గములు చాలగలవు. ఈనగర పరిసరములు సుమనోహరముగ నుండును.

## పార్వతీ మందిరము

ఇది 'పార్వతీహ్రద' తీరమున 'పార్వతీశిఖరము'న గలదు. ఈమందిరము మహారాష్ట్రమున మిక్కిలి ప్రసిద్ధి చెందినది. ఇదికాక యింకను చాలమందిరములు, రాజప్రాసాదములు గలవు. అందు వృద్ధేశ్వర, భైరవ, పాతాళేశ్వర గుహామందిరము, ఓంకారేశ్వర, హరిహరేశ్వర, నాగేశ్వర, సోమేశ్వర, సంగమేశ్వర, బాలాజీ, మురళీధర మందిరములు చూడదగినది. ఇంకను గోసంపుర్‌లో విష్ణుమందిరము తులసీబాగ్‌లో రామమందిరము. యోగేశ్వరీ, గణపతి మందిరములు దర్శనీయములు. కొండ మీద చూడతగినవి చాలగలవు.



శివాజి

ఈ జిల్లాయందే 'ప్రతాపగఢ్' అను ప్రదేశమున శివాజీమహారాజు యొక్క యిష్టదైవమగు భగవతి "భవానీ" మందిరము గలదు. శివాజీ భక్తికి ప్రసన్నయై దేవి యొసగిన ఖడ్గముచే శివాజీ విజయము బడసెనని చెప్పుదురు. నేటికినిగూడ శివాజీవంశీయుల కీమెయే కులదైవతమై యున్నది.

చూడతగినవి:— కోట ముఖ్యముగ చూడతగినది. కోట సమీపమున నవగ్రహాలయము కలదు. గ్రామములో నెక్కడ చూచినను వాయుపుత్రుని విగ్రహములు, శ్రీరామాలయములు అధికముగ గలవు. దస్తాన్‌పేటలో ఆంజనేయస్వామి ప్రత్యక్షదైవము. చక్కనిమార్కెటు కలదు. అన్నిపదార్థములు దొరుకును.

ఇక్కడికి సమీపమున గల యరవాడ సెంట్రల్ జయిలు గాంధిమహాత్ముని ఉనికిచే పవిత్రమైనది. కస్తూరీబా, మహాదేవదేశాయీల సమాధులుగల ఆగాఖాన్ భవనము ఇటీవల చరిత్రప్రసిద్ధమైనది.



* కస్తూరిబా, మహాదేవ దేశాశాయీల సమాధులు

ఇక్కడకు బొంబాయి 119 మైళ్ళు. ఇటనుండి రైలు అమితవేగములో ప్రయాణించును. పర్వతకందరములనుండి కూడ రైలు నడుచును. రైలు 3 గం. లలో బొంబాయి చేరును.

## భీమశంకరము

ఇది పూనాకు ఉత్తరమునగల తలేగావ్ స్టేషనుకు 21 మై. దూరమున గలదు. నేరాలా స్టేషను నుండియు పోవచ్చును. నేరాలాకు 16 మైళ్ళ దూరమున గలదు. 10 మైళ్ళ వరకు బండి పోవును. తరువాత నడచివెళ్ళవలసి యుండును. ఇది భీమానది పుట్టు చోటు.

భీమశంకరుని చరిత్ర:— ఇచట సహ్యాపర్వతశిఖరమున 'భీమశంకర మహాదేవు' ని లింగము కలదు. ఇచ్చటనుండియే 'భీమా' నది పుట్టుచున్నది. ఈ నదియే పండరిపురప్రాంతమున 'చంద్రభాగ' యని పిలువబడుచున్నది. ఈ శివలింగమునుండి కూడ కొంచెము కొంచెముగ జలము స్రవించుచుండును. భీమశంకరాలయమునకు సమీపమున ప్రసిద్ధ రాజనీతిజ్ఞుడగు నానాఫర్నవీసు నిర్మించిన రెండు కుండములు గలవు. ఇచ్చటకు సమీ

ఎత్తు కలిగియున్నది. గుహాంతర్భాగమున పర్వతమును దొలిచి, నిర్మింపబడిన యష్టకోణ స్తంభములు రెండువరుస లున్నవి. వీనికి ముందున్న సింహ స్తంభమున ప్రాచీనశాసనములు గలవు.

కారలీకి సమీపమున విహారరూపమునగల గుహలు చాల గలవు. ఇచ్చటగల ప్రధానవిహారము మూడు శ్రేణులుగ నున్నది. కారలీగ్రామమునకు దక్షిణపూర్వముగ క్రీ. శ. 200 సం॥ పూర్వము నిర్మింపబడిన గుహలు 18 కలవు. భారతదేశ మునం దీప్రదేశము చాల రమ్యమైనది.

బాడ్‌గాఁవ్ స్టేషనుకు దక్షిణ పశ్చిమములందు 'వేదసా' యను నొక గ్రామము కలదు. ఇచ్చట కూడ చాల గుహలు కలవు. ఇచట 16 స్తూపములందు పాలరాతిశిల్పము చాల సుందరముగ పోషింపబడెను. ఇదికూడ దర్శనీయమైన ప్రదేశము.

## కైవల్యధామము
### ( యోగ విద్యాలయము )

తలేగాఁవ్‌నుండి లోనావాలా స్టేషనులో దిగవలయును. స్టేషనుకు సమీపముననే యోగము - ఆసనములు - ప్రాణాయామములను నేర్పు ప్రసిద్ధ విద్యాలయము గలదు.

ఈ విద్యాలయము పేరు 'కైవల్యధామము'. మాధవదాసుల శిష్యుడగు శ్రీ కువలయానందస్వామివారు దీనిని స్థాపించెను. ఆశ్రమము చాల ప్రశాంతముగ నుండును. స్నానపానాదులకు చక్కని తటాకము గలదు. ఆధునికముగ ఎక్సురే ఫోటోలు తీసి, రోగనిర్ణయముచేసి, దానికి తగు యోగములు ఆసనములు

చున్నది. గర్భాలయమున మహమ్మదీయులు భగ్నము చేయగ మిగిలిన శివలింగము గలదు. ఇందు త్తరముగ నొకచో మూడు తలలు గలిగి యొకస్త్రీని తొడపై గూర్చుండబెట్టుకొనిన విగ్రహము కలదు. సూక్ష్మముగ పరిశీలించిన నిది యుమాశంకరుల విగ్రహమని తోచుచున్నది. ఈమందిరమునకు దక్షిణపూర్వమున కాళీవిగ్రహము కలదు. మందిరద్వారమునకు ముందొక వసారా కలదు. ఈ మందిరద్వారమునం దతి లలితములగు శిల్పములు కలవు. అమరనాథమందిరములోనికి వెడలునప్పుడు వచ్చు ప్రథమ ద్వారమునం దేనుగులు, సింహములు, వీనికి మధ్య మహాదేవుడు చాలసుందరముగ నుంచబడెను. ఇదిచాలప్రసిద్ధమైన పవిత్రస్థానము.

## బొంబాయి

అమరనాథమునుండి కల్యాణ (జం) మీదుగ బొంబాయి చేరవలయును. ఇది పశ్చిమ సముద్రతీరమున గల విశాలమైన నగరము. ఇది యొక ప్రసిద్ధమైన నోడరేవు. ఇది ప్రాచ్య పాశ్చాత్య నాగరికతల సమ్మేళనమునకు నిదర్శనమైన సుందర నగరము. బొంబాయిలో 13 రైలు స్టేషనులు గలవు. అందు విక్టోరియా స్టేషనునుండి మద్రాసు 793 మైళ్ళ దూరమునను, కటక్ 1219 మైళ్ళ దూరమునను, కలకత్తా 1278 మైళ్ళ దూరమునను, ఢిల్లీ 883 మైళ్లదూరమునను గలవు. బొంబాయి రాష్ట్రమున జనాభా 3,59,56,150. బొంబాయి నగరమున జనాభా 28,40,011.


* బొంబాయి

నందంతటను ట్రాముబండ్లు, బస్సులు తిరుగుచుండును. ఎలిఫెంట్ స్టాట్ సర్కిల్, కష్టమ్‌హౌస్, టౌన్‌మహాల్, టంకసాల భవనము లతి సుందరమైనవి, దర్శనీయములు.

మహారాణీబాగ్:— బొంబాయి నగరమునం దుత్తర భాగమున 'పరేలీరోడ్'కు తూర్పుగ 34 ఎకరముల భూమియందు 'మహారాణీబాగ్' లేక విక్టోరియా గార్డెన్ కలదు. దీనికి సమీపమునందే మ్యూజియము కలదు. ఇవి రెండును చూడదగినవి.



హేంగింగ్ గార్డెన్సు దృశ్యము
(బొంబాయిరాష్ట్ర ప్రభుత్వపు సౌజన్యముతో)

మహాలక్ష్మి మందిరము:— పరేల్ రోడ్డుకు దక్షిణపశ్చిమముగ మహాలక్ష్మి మందిరము కలదు. ఈమందిరము చాల సుందరమైనది. ఇది చాల ప్రాచీనమైన ప్రదేశము.

పింజరాపోల్:— (పశువుల ఆశ్రమము):— ఇచ్చట బొంబాయిలోని ప్రజలు చందావేసికొని దుర్బల జంతువులను, రోగమువచ్చిన పశువులను పోషింతురు.

ముంబాదేవి మందిరము:— కాలవాదేవీరోడ్‌కు సమీపమున నొక సరస్తీరమున ముంబాదేవి యాలయము కలదు.

ఈదేవిపేరిటనే యీనగరమునకు 'ముంబయీ' లేక 'బొంబాయి' అను పేరు వచ్చెను.

ద్వారకాధీశమందిరము:— ఇష్టలెనెడ్‌కు సమీపమున పశేల్‌కు పోవురోడ్డుకు కుడివైపున ద్వారకాధీశమందిరముకలదు. ఇది **40** అడుగుల పొడవు, అంతియ వెడల్పు కలిగియున్నది. ఇది చాల ప్రసిద్ధమైన మందిరము.

మలబార్‌పర్వతము:— ఈ పర్వతము బొంబాయి నగరమునకు పశ్చిమప్రాంతమున గలదు. ఇది సముద్రతలమునకు 180 అ. యెత్తుగలిగి యున్నది. ఇచ్చట ప్రభుత్వభవనము, ఫారసీల దోఖిమాలు (టవర్ ఆఫ్ సైలెన్సు) కలవు. ఇవి మొత్తము 5 మినారులు. ఇవి గుండ్రముగ నుండును. ఇందొకటి 176 అ. యెత్తు గలిగియున్నది. దీనిని కట్టించుటకు ౩ లక్షల రూపాయలు ఖర్చయ్యెను. ఈ స్తంభాగ్రములపై ఫారసీలు తమవారి మృత దేహములను గ్రద్దలకు నెగురవేయుదురు.

ఫార్సీలు పర్షియాదేశస్థులు. జొరాష్టరు వీరి మతప్రవక్త. వీరి మతగ్రంథము జెందవేస్తా. ఇది వేదమును పోలియుండును. వీరు భగవంతుని 'అహురమ్‌జదా' యని పిలుతురు. వీరు తేజస్స్వరూపుడగు భగవంతు నారాధింతురు. వీరు భగవంతుడు సర్వవ్యాపి, సృష్టికర్త, దివ్యుడు, గంభీరుడు నని భావింతురు. వీరు ౩ వ శతాబ్దమున పర్షియాయందు మహమ్మదీయులబాధ పడజాలక భారతదేశమునకు కాందిశీకులై వచ్చిరి. వీరు తమ మతమునందెవరిని కలుపుకొనరు. అందుచేత వీరి సంఖ్య ఒక లక్షవరకు మాత్రము కలదు. భూ జలాగ్నులను పవిత్రముగ నుంచుట వీరి

చర్చిగేటు చూడదగినవి. వీనిని దర్శింపజేయుటకు బస్సులు కలవు. బస్సుచార్జీ రోజు 1కి రు. 5-0-0.

## ఎలిఫెంటా

బొంబాయికి 6 మైళ్ళదూరమున 'థానా' జిల్లాలో ఎలిఫెంటా యను ద్వీపము కలదు. ఇటకు బొంబాయి హార్బరులో స్టీమరునెక్కి వెళ్ళవచ్చును. దీనిని ధారాపురి యని కూడ పిలుతురు. పూర్వమిందలి ఱాళ్ళను బొంబాయిలోని విక్టోరియా గార్డెన్సు కట్టుబడికి తీయగ నిందొక ఏనుగువిగ్రహము గాన వచ్చెను. అందుచేత దీనికి (ఎలిఫెంటా) అను పేరు వచ్చెను.

ఇచ్చట 5 గుహామందిరములు కలవు. ఇవి పర్వతమును దొలిచి యచ్చటిరాళ్ళతోనే విగ్రహాదికములను నిర్మించి తయారు చేయబడినవి. ఇందు అతుకుపెట్టిన రాళ్ళు లేవు. ఈ ద్వీపమునకు బశ్చిమమున సముద్రజలమునకు 250 అ. యెత్తున త్రిమూర్తి గుహామందిరము కలదు. ఇది చాల సుందరమైనది. ఈ మందిరమున నొకేచోట బ్రహ్మ విష్ణు మహేశ్వరుల విగ్రహము చిత్రించబడియున్నది. ఈ మూర్తి కంఠము, ముఖము మాత్రము కలవు. ఈ విగ్రహము 18 అడుగుల ఎత్తు గలిగియున్నది. ఈ విగ్రహము యొక్క శిరస్సు 23 అ. చుట్టుకొలత కలిగియున్నది. ఈ రీతిగ నిచట యింకను చూడతగిన పెద్దపెద్దవిగ్రహములు కలవు. శిథిలావస్థయందుండియు శిల్పకళాసంపదను చాటుచున్నవి.

ఈ ద్వీపమున 3 వ శతాబ్దమునుండి 10 వ శతాబ్దము వరకు నొక సుందరమైన నగరముండెడిదని యిచటగల చిహ్నములనుబట్టి యూహించుచుండిరి.

ఎలిఫెంటాగుహా నిర్మాణకాలము తెలియుటలేదు కాని పాండవ నిర్మితములని కొందరు, బాణాసురనిర్మితములని కొందరు చెప్పుదురు. పాశ్చాత్యులు త్రిమూర్తిగుహ 9 లేక 10వ శతాబ్దమున నిర్మింపబడినట్లు చెప్పుదురు. యాత్రికులు తమ వెంట భోజనాదికములు తీసికొనివెళ్లుట అవసరము. ప్రతి ఆదివారము ప్రత్యేక లాంచి సర్వీసు గలదు.



మహేశ్వరమూర్తి (శివ) ఎలిఫెంటాగుహాలు

— బొంబాయి రాష్ట్రప్రభుత్వపు సౌజన్యముతో

## యోగేశ్వరగుహా మందిరము

ఇచ్చటకు బొంబాయి విక్టోరియాస్టేషను నుండి దాదరా స్టేషను, చాందరాస్టేషనుల మీదుగ గురుగాంవ్ స్టేషనులో దిగవలయును. అచటకు యోగేశ్వరగ్రామము 2 మైళ్ల దూరమున గలదు. గ్రామమునకు 2 మైళ్ళ దూరమున 'అంబోలీ' గ్రామ సమీపమున యోగేశ్వర గుహామందిరము గలదు.

ఎల్లోరాలోని కైలాసగుహాదక్క భారతదేశమున గల గుహామందిరము లన్నిటియందు నీయోగేశ్వరగుహ చాల పెద్ద

దని చెప్పుదురు. ఇది 240 అ. పొడవు, 200 అ. వెడల్పు కలిగి యున్నది. ఈ మందిరమున చాలవిగ్రహములు కలవు. యోగేశ్వరగుహా మందిరమున కుత్తరముగ 6 మైళ్ళ దూరమునం దుత్తరముగ ధానాగుహ కలదు.

## మండపేశ్వర గుహామందిరము

గురుగాంవ్ స్టేషను కుత్తరముగ 4 మైళ్ళ దూరమున 'బోర్‌బలీ' స్టేషను కలదు. ఇచ్చట కొక మైలుదూరమున మండపేశ్వర గుహలు కలవు. ఇచ్చట కొండనుదొలిచి మూడు గుహలు నిర్మింపబడెను. ఇవి 9వ శతాబ్దమున నిర్మింపబడెనని జనుల యభిప్రాయము. ఇందు రెండవ గుహామందిరముయొక్క పశ్చిమపు గోడమీద 25 ప్రతిమలతో కూడిన యొక చతుర్భుజవిగ్రహము కలదు. ఇది భీమవిగ్రహమని జనులు చెప్పుదురు. చూడతగిన దేవతామూర్తు లనేకములు గలవు.

## కనారీ గుహామందిరము

బోర్‌బలీస్టేషనుకు 5 మై. దూరమునను, తులసీనదము యొక్క ఆనకట్ట కుత్తరమున 2 మై. దూరమునను 'సాలసర్‌ద్వీప' మధ్యభాగమునందొకపర్వతపార్శ్వమున క్రిందుగ కొన్ని, మీదుగ కొన్ని మొత్తము 109 మందిరములు కలవు. ఇవన్నియును కొండ దొలిచి నిర్మింపబడెను. ఇవి యితరగుహామందిరములవలె రమణీయముగ నుండకున్నను తప్పక చూడదగినవి. పర్వతోపాంతమున పర్వతమును దొలిచి యొకకాలిబాట యన్ని గుహాముఖల యొద్దకు నిర్మింపబడెను. ఈ గుహామందిరములందు పలుతావుల బుద్ధవిగ్రహముల నుంచబడెను. ఇవి 9వ శతాబ్దమునకు పూర్వమే

నిర్మింపబడెను. ఇచ్చట బుద్ధుని దంతమొకటి గలదు. అందుచేత నిది చాలపవిత్రమైనస్థానము. ఇట బుద్ధమందిరము ప్రధానమైనది.

తులసీనదము:— కనారీ గుహామందిరములకు 2 మైళ్ళ దూరమున సాల్ సర్ ద్వీపమున తులసీనదముయొక్క ఆనకట్ట కలదు. ఈనదము (పెద్దకాలువ) క్రీ.శ. 1872 సం॥న 4 లక్షల రూపాయలు వెచ్చించి కట్టబడెను.

విహారనదము:— తులసీనదమునకు 2 మై. దూరమున 2 మై. పొడవు, $1\frac{1}{2}$ మై. వెడల్పుగల విహారనదము గలదు. దీని నొక యింగ్లండుదేశస్థుడు 38 లక్షల రూపాయలు ఖర్చుపెట్టి తయారుచేయించెను.

ఈ రెండు కాలువల ద్వారా బొంబాయి నగరమునకు, బొంబాయికి సమీపమునగల 'మాలాబార్' పర్వతము మీదకు నీరు పంపబడుచుండెను.

బొంబాయినుండి సూరత్ పోరుబందరు మీదుగ ద్వారకకు సముద్రముమీదకూడ ప్రయాణము చేయవచ్చును.

## పంచవటి (నాశిక)

బొంబాయినుండి కల్యాణ (జం) మీదుగ నాసికరోడ్డు స్టేషనుకు చేరవలయును.

పంచవటి గోదావరిపుట్టినచోటున కలదు. గోదావరికి కుడివైపున గల 'నాసిక' గ్రామమే పంచవటి. నాసిక చాల పెద్ద పట్టణము. ఇచ్చట ట్రాంబండ్లుకూడా నడచును. ఇచ్చట ధర్మశాలలు గలవు. భోజనసామగ్రి సర్వము లభించును. ఇచ్చట

పోస్టాఫీసు, తంతికార్యాలయము, సంస్కృతపాఠశాలయు గలవు. నాసిక గిన్నెలకు ప్రసిద్ధి. లక్ష్మణుడు శూర్పణఖ నాసికను కోసిన కారణమున దీనికి నాసిక యని పేరు వచ్చిన దందురు.

ఇట గోదావరి ప్రధాననది. గోదావరి నాసికబస్తీ మధ్యగా చిన్ని కాలువవలె ప్రవహించుచుండును. యాత్రికులు 'రామఘట్ట'మున స్నానముచేసి పితృదేవతలకు పిండప్రదానము చేయుదురు. ఇక్కడ యాత్రికులు ముండనము, ప్రాయశ్చిత్తము, తీర్థవిధియు చేయుదురు. మూసివాయనముకూడ నిత్తురు. గోదావరిని మిక్కిలి భక్తిశ్రద్ధలతో పూజింతురు. ఇచట సంకల్పమున



గోదావరీతీరము – నాసిక

'దండకారణ్యమునగల తపోవన'మని చెప్పుదురు. ఈ ప్రదేశమున శ్రీరాముడు దశరథునకు పిండప్రదానము గావించెను. అందుచే దీనికీపేరు వచ్చెను. రామఘట్టమును 'రామగయ' యని కూడా పిలుతురు. ఇచ్చట చాలకుండములు గలవు. వీనిలోనికి గోదావరీ

జలము వచ్చుచు పోవుచుండును. ఒక సెలయేరు గోముఖీనదిలో కలిసి రామకుండమున పడుచున్నది. దీనిని 'అరుణాసంగమ' మని యందురు. ఇదేవిధముగ 'వరుణాసంగమ'మని మరియొకటి గలదు.

ఇచట నొక గుహ కలదు. లోనికి మెట్లు కలవు. లోపల చిన్న రామాలయము కలదు. ఇచట దీపారాధన నెల్లపుడు ప్రకాశించుచుండును. ఇచటనే లక్ష్మణుడు శూర్పణఖయొక్క నాశికాచ్ఛేదము చేసెనని చెప్పుదురు.

శ్రీరామాలయము:— పంచవటియందు గోదావరీ తీరమున చాల దేవాలయములు గలవు. వీనియందు 'శ్రీరామ మందిరము' చాల పెద్దది. దీనిని కట్టించుటకు 8 లక్షల రూపాయలు వ్యయమయ్యెనట.

ఇచ్చటనే యొకస్థానమున నైదు వటవృక్షములు కలవు. ఈ వటవృక్షములన్నియు నొకే వృక్షముయొక్క యూడలనుండి ప్రాదుర్భవించినటుల తోచుచున్నది. ఇదియే ప్రధానమైన 'పంచవటీ క్షేత్రము'. ఇచ్చటనే శ్రీరాముడు సీతాలక్ష్మణ సహితుడై నివసించెను.

ఇతరములు : గౌతమ తపోవనము:— ఇచ్చట గౌతమ ఋషి తపస్సుచేయుచుండువాడు. దీనికి సమీపమునందే లక్ష్మణుడు శూర్పణఖ ముక్కు, చెవులు కోసిన స్థానము గలదు.

"గౌతమాశ్రమం పుణ్యం వినా సర్వార్థకామదం"

— గౌతమీ మాహాత్మ్యము

పంచతీర్థము:— ఇచ్చట పర్వతమునుండి పడు గోదావరితో కపిలానది కలియుచున్నది. ఇచ్చట నైదుకుండములు

గలవు. వీనిని "పంచతీర్థము" లని యందురు. మహా క్తయోని కుండము, అగ్నియోనికుండము, విష్ణుయోనికుండము, బ్రహ్మ యోనికుండము, రుద్రయోనికుండము అని వాటి పేర్లు. వీని యందు 'అగ్నియోనికుండ'మున జల మధికముగ గలదు.

సప్తర్షి ఆశ్రమము:—గోదావరీ కపిలాసంగమమున కావలి యొడ్డున సప్తర్షిఆశ్రమము కలదు. ఇచట సప్తర్షులు తపస్సుచేసిరి.

జటాయు మోక్షస్థానము:— ఈ ప్రదేశ మిచ్చటకు సుమారు 8 మై. దూరమున గలదు. ఇది జటాయువుయొక్క మహత్తరభక్తిని, త్యాగమును, ధర్మనిష్ఠను గుర్తుకుదెచ్చును.

అగస్త్యకుండము:— దీనికి సమీపమునందే అగస్త్యుని యొక్కయు, సుతీక్ష్ణునియొక్కయు ఆశ్రమములు కలవు. ఇచ్చట 'అగస్త్యకుండ' మనునది యొకటి కలదు.

మారీచ వధస్థానము:— ఇది 'సాయీఖేడా' అను గ్రామమున గలదు. ఈ గ్రామము పంచవటికి సమీపముననే గలదు. శ్రీరాముడు మారీచు నీప్రదేశమునందే వధించెను.

పాండవగుహా:— వనవాససమయమున పాండవు లిచ్చట నివసించిరని చెప్పుదురు. ఇచ్చట సుమారు 20 గుహాలు కలవు. ఇవన్నియు కొండనుదొల్చి తయారుచేయబడెను. వీనిని బౌద్ధులు నిర్మించిరని కొందరుచెప్పుదురు. వీనియందు విశ్వకర్మయొక్కయు భైరవునియొక్కయు విగ్రహాములు కలవు.

సుందరనారాయణ మందిరము:— పంచవటీక్షేత్రపరిక్ర మణమం దీ దేవాలయము కానుపించును. ఇందు నారాయణ మూర్తి కలదు.

కపాలేశ్వరుడు:— ఇది యొక శివాలయము. ఇది రామ కుండమునకు సమీపమున గలదు. ఇది యొక మిట్టమీద గలదు. దీనిమీదకు ఎక్కుటకు క్రిందనుండి సుమారు 500 మెట్లు కలవు.

మాహాత్మ్యము:— పంచవటీక్షేత్ర యాత్రవలన సర్వ పాపములు శమించును. పంచవటిని సేవించిన మనుజుడు దేహావ సానమున స్వర్గమునకు బోవును. ఇచ్చట గోదావరీనదియందు స్నానముచేసి యథావిధిగ తీర్థవిధి, గోదానాది దానములుచేసిన మహాత్తరఫలము గలదు. — మహాభారతము.

# త్ర్యంబకేశ్వరము

ఇది పంచవటికి 18 మై. దూరమున గలదు. బస్సుమీద గాని, టాంగామీదగాని వెళ్ళవచ్చును. పంచవటీ త్ర్యంబకేశ్వ రములకు మధ్యగల మార్గమంతయు ప్రకృతిదృశ్యములతో నతి మనోహరముగనుండును. త్ర్యంబకేశ్వరమున ధర్మశాలలు గలవు.


త్ర్యంబకేశ్వర ఆలయము

కుశావర్తము:— ఇచ్చట 'కుశావర్త' మను నొక సరోవరము కలదు. యాత్రికులు కుశావర్త సరోవరమున స్నానముచేయుదురు. ఈ సరస్సునకు నలువైపుల మంచి సోపానములు కలవు. ఈ సరస్సులోనికి గోదావరిలోని జలము వచ్చుచుండును. ఇచ్చట యాత్రికులు తీర్థవిధికూడా చేయుదురు. దీనికి సమీపముననే 'గంగాసాగర' మను నొక సరోవరము గలదు. దీనియొద్దన 'భగవతీ మందిరము' కలదు.

## గౌతమి (గోదావరి)

గోదావరినది గంగానదివలెనె పరమపవిత్రమైనది. ఈ నది శివ జటాజూటమునుండి యుద్భవించినటుల చెప్పుచుందురు. భగీరథుని తపఃఫలితమగుటచే గంగానది భాగీరథియని పిలువ బడునట్లే, గౌతముని తపఃఫలితమగుటవలన నీనది 'గౌతమీనది' యని కూడ పేరొందెను.

త్ర్యంబకేశ్వరుడు:— శివుని 108 దివ్యస్థానములలో నిది యొకటి. ఈ మందిరము చాల పెద్దది. ఈ శివలింగము వేర్వేరుగ మూడుభాగములుగ నున్నట్లు కాన్పించును. పానువట్టుమీద నెల్లపుడు సుమారు బెత్తెడులోతు నీరు నిలిచియుండును. ఇది ద్వాదశజ్యోతిర్లింగములయం దొకటి. త్ర్యంబకేశ్వర మహాదేవుని యారాధనకు వేలకొలదిరూపాయలు వార్షికాదాయము వచ్చును. ఇదికాక అవసరమునుబట్టి ప్రభుత్వము కూడా సహాయము చేయును. త్ర్యంబకేశ్వరుని యాలయములోని కెల్లపుడు గోదావరి నీరు ప్రవహించుచుండును. యాత్రీకు లీదైవమునకు మహాన్యాసపూర్వకముగ నభిషేకము చేయుదురు.

గంగాద్వారము:—

త్రయంబక జటోద్భూతే సర్వకామప్రదాయినీ
క్షమస్వమాతశ్శాంతాసి సుఖం ఆజ్ఞాం హితంకురు॥ —బ్రహ్మాండపురాణం

ఇది బ్రహ్మగిరిపర్వతముమీద కలదు. ఇచ్చట గోదావరీ నది పుట్టుచున్నది. ఇచట కోతులు మెండుగ గలవు. త్ర్యంబకేశ్వరమునకు సమీపముననే బ్రహ్మగిరి కలదు. పైనగల గంగాద్వారమును చేరుటకు క్రిందినుండి సోపానములు కలవు. ఈ సోపా

నములు సుమారొక 1000 వరకు నుండును. వీనిని బొంబాయి నగరవాసియగు సేఠ్ కరమ్‌జీ కట్టించెను. ఇచ్చట నొక కుండము కలదు. గోముఖమునుండి యీకుండములోనికి యొక జలధార పడుచున్నది. ఇదియే గోదావరి పుట్టుచోటు. ఇచట గోదావరీ దేవి విగ్రహమును ప్రతిష్ఠించిరి. ఈమెకు నిత్యము ఆరాధన జరుగును. ఈ జలము రామకుండము, లక్ష్మణకుండములగుండా కుశావర్త సరోవరమున ప్రవేశించుచున్నది. కుశావర్తమునుదాటి కొలదిదూరముపోయి యీ జలధార యదృశ్య మగుచున్నది. మరల నిది 'చక్రతీర్థము'న ప్రకటమగుచున్నది. ఇచ్చటనుండియే దీనికి గోదావరి యని పేరు.

దత్తమందిరము:— ఈ పర్వతముప్రక్క దత్తపర్వతము కలదు. ఈపర్వతమున దత్తమందిరము కలదు. మరియు నివృత్తి నాథాలయముకూడ కలదు. వీధుల వెంబడి ఆవులు యాచకుల వలె వెంబడించును. వానికిగాను గడ్డి యమ్ముచుందురు. శక్తి కొలది గడ్డిని వానికివేసిన యికి మనవెంటరావు.

కుంభోత్సవము:— ప్రయాగయందువలె యిచ్చటకూడా ప్రతి పండ్రెండు సంవత్సరములకు గురుడు సింహరాశియం దున్న పుడు కుంభోత్సవము జరుగును. దీనినే పుష్కరమందురు. ఆసమయమం దిచ్చటకు దూరదూరదేశములనుండి యాత్రికులు సాధువులు వచ్చెదరు.

మాహాత్మ్యము:— గోదావరీస్నానమువలన గోహత్య, బ్రహ్మహత్య మొదలగు పాపములు శమించుననియు మరణానంత ము శివసాయుజ్యము లభించుననియు "విశ్వేశ్వరసంహిత"

యందు కలదు. త్ర్యంబకేశ్వరుని యథావిధిగ పూజించిన 'జ్యోతిష్టోమాదియజ్ఞములు' చేసిన ఫలము లభించునని "కూర్మ పురాణము"న గలదు. నాసిక, త్ర్యంబకము యీప్రాంతము లందు చలి మిక్కుటముగ నుండును.

## షిరిడి

నాసికనుండి మన్మాడ్‌లో మారి రాహురిస్టేషనులో దిగ వలయును. అజ్ఞానులకు సుజ్ఞానమును కలిగించి, లోకకల్యాణము



శ్రీసాయిబాబా

చేకూర్చుటకయి మహాత్ములు అవతరించుచుందురు. అట్టివారిలో శ్రీసాయిబాబా ఒకరు. ఇతడు జన్మచే బ్రాహ్మణుడయ్యు, తొలుత మహమ్మదీయుని గురువుగా బడసి పిమ్మట బ్రాహ్మణుని గురువుగా స్వీకరించెను. గురుకటాక్షమున అచిరకాలముననే శ్రీ సాయి భక్తి జ్ఞానములు కలవాడాయెను. శ్రీసాయికి గురు, దైవములయెడ భేదబుద్ధి లేదు. కొంతకాల మునకు శ్రీసాయి ఫకీరుభక్తి నవలంబించి తన 16 వ యేట యీ షిరిడి క్షేత్రమునకు జేరెను. కొంతకాలము దేశయాత్ర చేయుచు సర్వకాలములందు భగవన్నామ ముచ్చరించుచు, భగవన్నామముద్వారా భక్తిప్రచారము చేయుటయే ప్రధా నాశయముతో జీవయాత్ర గడపెను. ఇతనికి వైద్యముకూడ తెలియును. అమోఘమైనవ్యాధులను ఒక్కమాత్రతో కుదిర్చెడి వాడు. ఇతనిలోని మహత్తర ఆధ్యాత్మికసంపద వర్ణనాతీతము. ఇతనియందలి మహత్తరశక్తిని నేటికిని భక్తలోకమున పలువురు ప్రత్యక్షముగా గాంచుచుండిరి. ఇట్టి మహనీయుడు క్రీ.శ. 1918

అజంతాగుహలు కెండనమెట్టుపై 250 అ. ఎత్తున గలవు. ఇవియన్నియు ఒక నిడుపైన రాతిపై నుంచి అర్ధవృత్తాకారములో నుండును. ఇట్టి సహజసౌందర్యముగల యీ తావును చూచి, వెనుకటి కళాకారుల నైపుణ్యమును గూర్చి ప్రకృతిమాత ఆనందించుచున్నదా అనిపించును. ఇచట బౌద్ధమతము ఉచ్ఛస్థితిలో నున్న ఆ కాలమునాటి కళాపరిణామములనుకాంచనగును. కొట్టవచ్చినట్లు అగపడు ఆనాటి శిల్ప చాతుర్యములు, సౌందర్యమునకు నిలయమైన రాతిచెక్కడములు, మనోహరములగు తైలచిత్రములు మనలను ఒకసారి గుప్త



అజంతాగుహ ఒక దృశ్యము

రాజుల కాలమునాటి స్వర్ణయుగమునకు తీసికొనిపోయి, అప్పుడు నివసించియున్నట్లు చేయును. సర్వవిధములగు మానవుల జంతువుల ప్రతిమలు ప్రకృతితో సమకూర్చి అత్యద్భుతముగ వర్ణింపబడినవి. ఇచట గాంచనగు ముఖ్యవిషయము వివిధభావపూర్ణములైన చిత్తరువుల సహజసౌందర్య సంపద.

మొత్తము 29 గుహాలు కలవు. అందు 5 స్థలములు పూజార్హములైనవి. మిగిలినవన్నియు బౌద్ధభిక్షుకులు తపస్సు చేసికొనిన స్థలములు. ఇచటనే వీరందరు పవిత్రమైనజీవితములను ఉద్రేకములనుండి ప్రేమజగత్తునకు మరల్చి, బౌద్ధమతకళారాధకులై, వారి జీవితములను గడపిరి. అజంతాగుహాలు చూచుట యన మన ఆత్మలను ఒకసారి సౌందర్యముతో ఏకీభవింపజేయుట.

గ్రిఫిత్, లేడి హారింగుహాము, ముకుల్ డే యీ స్థలములను సందర్శించినప్పుడు లేని వసతులను యీనాడు నేలాది సందర్శకులకు పురాతనవస్తు తత్వశాస్త్రజ్ఞులచే హెచ్చుగ కలుగ జేయించిన H. E. H. నైజామునకు మన ధన్యవాదములు. ఈ గుహాల సమీపమునకు మోటారు ప్రయాణమునకు వీలుగ ఒక రోడ్డు కలదు. ఫరద్‌పూరు యీ ప్రాంతమునకు 3½ మైళ్ళలో గలదు. ఇచట ప్రయాణీకుల సౌకర్యార్థము కట్టబడిన బంగళా, రాష్ట్ర అతిథిగృహము, వీరలకు యీ అజంతాగుహాలను సందర్శించుటలో కలిగిన మార్గాయాసమును తొలగించుచున్నవి.

## ఎల్లోరా

ఎల్లోరా గుహాలు ఔరంగాబాదు జిల్లాలో, ఔరంగాబాదుకు ఈశాన్యముగ 15 మైళ్ళలో గలవు. ఇండియాలో అత్యంత సుందరమైన గుహాలలో యివి యొకటి. అజంతాలో బౌద్ధమతచిత్రములు, చెక్కడములు గాంచుదుము. ఇచట హిందూదేశములోని క్రీ. శ. 5 నుండి 10 వ శతాబ్దము వరకు ఉచ్చస్థితిలో నుండి, మిక్కిలి ప్రాముఖ్యముగనున్న బ్రాహ్మణ, బౌద్ధ, జైన మతములను సంబంధించిన మూడు గుహాలను

జూతును. ఈ గుహాలలో మధ్యగుహాలు బ్రాహ్మణమతమును తెల్పునవిగ నుండి, ఆచివర యీచివర బౌద్ధ జైనమత గుహాలు గల్గి మొత్తము యివిఅన్నియూ కలిసి దాదాపు $1\frac{1}{4}$ మై. పొడవున విస్తరించి యుండును. వీటన్నిటిలోను కొండను తొలిచి నిర్మించబడిన కైలాసదేవాలయము చాల గొప్పది. ఈ గుహాలు చాలమందిచే వర్ణింపబడినవి. చాల తేలికగ సందర్శించవచ్చును.



కైలాసగుహ నెం 16

అజంతాగుహాలవలెనే, ఎల్లోరాగుహాలు గూడ ప్రకృతి సౌందర్యముతో నెలరారు ప్రాంత మధ్యములో గలవు. ఈప్రాంతమునకు పోవు రోడ్డుకూడ అటుయిటు పిప్పల్ వృక్షములు కలిగి చూచుటకు ఎంతో ఆనందము చేకూరును. ఈకొండ ఎక్కుటకు వీలుగ త్రోవయంతయు ఔరంగజేబు సేనానులచే అల్లుపరచి,

చదునుచేయబడినది. ఇప్పటికి ఆసేనానులపేర్లు ద్రోవలో సగము నకు పైన స్తంభములపై చూడగలము. కొండ దిగువత్రోవ కడు రమణీయముగ నుండును. కొన్ని వందల అడుగుల దిగువలో ఎల్లోరా మైదానము కలదు. ఆ మైదానప్రారంభములో చుట్టు గల అడవియందలిచెట్లకు సంబంధించిన పదార్థములతో అంచులు కట్టి తేలుచున్న ఒక చిన్నసరోవరము చూడగలము. ఆ సరో వరము మధ్య ఒక లంక గలదు. ఈ ప్రదేశమంతయు సస్య శ్యామలమై చూచుటకు మనోహరమై ఒప్పారుచుండును.

ఎల్లోరాగుహాలన్నియు కొండయొక్క ఏటవాలువైపున తొలువబడినవి. ప్రతిగుహకు ఆవరణగలదు. కాని బయటిగోడలో ఒక్కరు పోవుటకు వీలగు త్రోవలుండుటచే వాటి ముందు పోవుచూ గూడ, లోపలికి పోవుట గ్రహింపరు. బౌద్ధగుహాలు చాల పురాతనమైనవి. అవి దక్షిణదిశను గలవు. ఇచటినుండి పైనచెప్పిన వరుసలో నుండి, చివరకు ఉత్తరమున జైనమతమునకు చెందిన గుహాలను జూతము.



ఎల్లోరా

అజంతా గుహాలను చూచుటకు వెళ్ళినంత ఎక్కువగ ఎల్లోరా గుహాలను చూచుటకు వెళ్లరు. కారణము అజంతాగుహాలకు సంబంధించిన సాహిత్యము ఎల్లోరాలో కాంచకుండుటయే.

ఈ గుహలేగాక ఈ కొండపై నొకకొనను ఒక భవన మందు క్రీ.శ. 1235 నాటి జైనమతమునకు చెందిన పార్శ్వనాథుని విగ్రహము కలదు. ఎల్లోరాకుచెందిన గ్రామములో ఇండోరు పాలించినఅహల్యాబాయిచేత్రవ్వించబడిన ఒకచెఱువుగూడకలదు.

# ఘుశ్మేశ్వరము

ఈదృశం శైవ లింగంచ దృష్ట్వాపాపైః ప్రముచ్యతే,
సుఖం సంవర్ధతే పుంసాం, శుక్లపక్షే యథా శశీ॥ —శివపురాణము.

ఇట్టి శివలింగమును దర్శించిన మనుజుడు సర్వపాప వినిర్ముక్తుడై శుక్లపక్షచంద్రునివలె నీతని ఫలము వృద్ధిపొందును.

దౌలతాబాద్ స్టేషనుకు 12 మైళ్ళ దూరమున గల 'బేరులాగావ్' లో శ్రీ ఘుశ్మేశ్వరాలయము కలదు. దౌలతాబాద్‌నుండి బేరులాగావ్‌కు బండ్లు దొరకును. ఔరంగాబాదు నందే రైలుదిగిన మోటారుమీదుగ బేరులాగావ్ చేరవచ్చును. ఇచ్చట అన్నిసౌకర్యములు కలవు. బస్సుమీాద వచ్చుమార్గమున సుప్రసిద్ధమగు 'దేవగిరిదుర్గము' కానవచ్చును. ఈ కోట యొక పర్వతశిఖరమున గలదు. ఇచ్చట 'ధారేశ్వర' మహాదేవునియొక్క లింగమును, ఏకనాథజీమహారాజుయొక్క గురువగు శ్రీ జనార్దన మహారాజుయొక్క సమాధియును కలవు. దేవగిరియందు 'కైలాస మందిర' మను నొక శివమందిరము కలదు. కొంద రిదియే 'ఘుశ్మేశ్వర' మని చెప్పుదురు. వర్తమాన ఘుశ్మేశ్వరమునకు దేవగిరికి మధ్య సహస్రలింగము, పాతాళేశ్వర, సూర్యేశ్వర ములు, సూర్యకుండము, శివకుండము మొదలగు ప్రాచీన స్థాన

షులు కలవు. చూడతగినవి. ఘుశ్మేశ్వరమును ఘుసృణేశ్వరమనియు, ఘృష్ణేశ్వరమనియుకూడ పిలుతురు. ఇది ద్వాదశజ్యోతిర్లింగములందొకటిగా పేర్కొనబడెను. యాత్రికులు స్వామికి యథావిధిగ అభిషేకము పూజలు చేయుదురు.

## ద్వాదశ జ్యోతిర్లింగములు

లోకకల్యాణమునకై శంకరుడు సర్వతీర్థములందును లింగరూపమున వెలసియుండెను. శివపురాణమున గలదు. అందు కొన్ని విశిష్టస్థానములందాతడు జ్యోతిర్లింగరూపము నొందెను. ఇట్లు శివలింగము లసంఖ్యాకములుగ నున్నను ద్వాదశ జ్యోతిర్లింగములు అతి ప్రధానమైనవి.

సౌరాష్ట్రే సోమనాథంచ శ్రీశైలే మల్లికార్జునమ్,
ఉజ్జయిన్యాం మహాకాళం ఓంకారం పరమేశ్వరమ్.
కేదారం హిమవత్పృష్ఠే డాకిన్యాం భీమశంకరమ్,
వారాణస్యాంచ విశ్వేశం త్ర్యంబకం గౌతమీతటే.
వైద్యనాథం చితాభూమౌ నాగేశం దారుకావనే,
సేతుబంధేతు రామేశం ఘుశ్మేశంచ శివాలయే.
ద్వాదశైతాని నామాని ప్రాతరుత్థాయ యః పఠేత్,
సప్తజన్మ కృతం పాపం స్మరణేన వినశ్యతి.
యంయం కామ ముపేక్ష్యైవ పఠిష్యన్తి నరోత్తమాః,
తస్యతస్య ఫలప్రాప్తి ర్భవిష్యతి నసంశయః.
ఏతేషాం దర్శనాదేవ పాతకంనైవ తిష్ఠతి,
కర్మక్షయో భవేత్తస్య యస్యతుష్టో మహేశ్వరః.

సౌరాష్ట్ర ప్రదేశమున (కథియవాడ్) సోమనాథుఁడు, శ్రీశైలమున మల్లికార్జునుడు, ఉజ్జయినియందు మహాకాళేశ్వరుడు, ఓంకారేశ్వరుడు, అమరేశ్వరుడు, కేదారఖండమున కేదారనాథుడు, డాకినియనుస్థానమున భీమశంకరుడు, కాశీయందు విశ్వనాథుడు, గౌతమీతీరమున త్ర్యంబకేశ్వరుడు, చితాభూమి యందు వైద్యనాథుడు, దారుకావనమున నాగేశ్వరుడు, సేతుస్థానమున రామేశ్వరుడు, ఘుశ్మేశ్వరుడు యివి ద్వాదశ జ్యోతిర్లింగములు. ప్రాతఃకాలమున నం దీనామములను స్మరించిన సప్త జన్మలయందు గావించిన పాపములు కూడ నశించును. కామనా దృష్టితో పఠించిన కోర్కెలు నెరవేరును. వీనిని దర్శించినవారికి సర్వపాపములు నశించి, అంతమునకు శివసాయుజ్యము కలుగును.

ఇది శివపురాణము నందలి వర్ణన. శివపురాణమే కాక రామాయణము, మహాభారతము, స్కాందపురాణాంతర్గత కాశీ ఖండము, సేతుబంధఖండము, రేవాఖండము, అవంతీఖండము, కేదార ఖండములందీ జ్యోతిర్లింగములనుగూర్చి విస్తృత వివరణ సోదాహరణముగా గలదు.

పూర్వగాథ:— పూర్వము దేవగిరికి పర్వతప్రాంతమున 'సుధర్మ' యను నొక బ్రాహ్మణుడు నివసించుచుండెను. ఆతనికి సుదేహా, ఘుశ్మా యను నిర్వురు భార్యలు కలరు. తనకు సంతానము కలుగనందున 'సుదేహా' తన చెల్లెలగు 'ఘుశ్మా'ను వివాహము చేసుకొనవలసినదని భర్తను బలవంతపెట్టి చెల్లెలితో వివాహము గావించెను. కొంతకాలమునకు సుదేహా హృదయ మీర్ష్య కగ్గలమయ్యెను. ఈ సమయమునకే ఘుశ్మకు ఒక కుమారుడు కలిగెను. ఘుశ్మా శివభక్తురాలు. ఆమె ప్రతిదినము

101 పార్థివశివలింగములను నిర్మించి అర్చించుచుండెడిది. క్రమముగ ఘుశ్మా కుమారుడు పెద్దవాడయ్యెను. ఘుశ్మ యింటికి కోడలుకూడ వచ్చెను. సుదేహ యీర్ష్య హద్దులు దాటెను. ఆమె యొకనాటిరాత్రి సోదరికుమారుని హత్యగావించి యాశవమును ఘుశ్మా పార్థివలింగములను విసర్జించు తటాకమున పారవేసెను. ఘుశ్మ పుత్ర మ్మరణవార్త వినియు యథావిధిగ శివునర్చించి లింగములను తటాకమున విసర్జించెను. వెంటనే యామె కుమారు డాతటాకమునుండి లేచి


ఘృష్ణేశ్వరం – శివమందిరము

వచ్చి తల్లికి నమస్కరించెను. సర్వ మీశ్వరుని లీలయని ఘుశ్మ భావించెను. శివు డామె భక్తికి మెచ్చి ప్రసన్నుడయ్యెను. త్రిశూలముతో నీశ్వరుడు 'సుదేహ' ను చంప నుంకించెను. కాని ఘుశ్మా ప్రార్థించి సోదరి ప్రాణములను రక్షించి శివుని ప్రార్థించగా శివు డామెను వరము కోరు కొమ్మనెను. అంత ఘుశ్మా, దేవా! నీవిచ్చట సర్వదా నివసించుటయే నాకోర్కె యని చెప్పెను. అంత నీశ్వరుడు 'ఘుశ్మేశ్వర' నామముతో జ్యోతిర్లింగరూపమున నిచ్చట యుద్భవించెను. శివపురాణమునందు ఘుశ్మేశ్వర మహాదేవుని మహాత్వ మధికముగ వర్ణింపబడెను.

ఇలాపురే రమ్యవిశాలకేఽస్మిన్ సముల్లసన్తంచ జగద్వరేణ్యమ్,
వన్దేమహోదారతరస్వభావం ఘుశ్మేశ్వరాఖ్యం శరణం ప్రపద్యే.

— శ్రీ శంకరాచార్యులు.

# వైద్యనాథము (పరళీ)

దౌలతాబాదునుండి పర్భనీ లోమారిపరళీవైద్యనాథము స్టేషనులో దిగవలయును. (సికింద్రాబాదునుండి పూర్ణామీదుగ కూడ నిచటకు రావచ్చును.)

వైద్యనాథమను పేర భారతభూమిలో చాలప్రదేశములు గలవు. అందు పరళీవైద్యనాథమొకటి. 'పరళ్యాం వైద్యనాథంచ' అను వాక్యప్రకారము దేవఘర్ నందున్నలింగము ద్వాదశ జ్యోతిర్లింగము కాదనియు, ఈ పరళీవైద్యనాథమె ద్వాదశజ్యోతిర్లింగములలో నొకటనియు చెప్పుదురు. 'వైద్యనాథం చితా భూమౌ' అని మరియొక పాఠాంతరము గలదు. ఈ వాక్యప్రకారము దేవఘర్‌కు చెందిన శివలింగమె జ్యోతిర్లింగమని తోచుచున్నది. కారణమేమన యీ ప్రదేశమునకు 'చితాభూమి' యని పేరు గలదు. సతీదేవి శరీరమును నున్మత్తుడై భుజమున నిడుకొని శివుడు సంచరించుతరి (చూ. మణికర్ణిక) యిచట నాదేవి హృదయము కలిగిపడగా, దానికి శివు డిచట దహన సంస్కారము చేయుటచే నీ ప్రదేశమునకు 'చితాభూమి' యని కలదు. శివపురాణమున వేరొండు ప్రమాణమునుబట్టి చూడగ, దేవఘర్ లోని శివలింగమె జ్యోతిర్లింగమని తోచుచున్నది. పరళీయందలి శివలింగము జ్యోతిర్లింగమనుట కంత ప్రమాణము కానరాదు.

పరళీవైద్యనాథమందిరముకూడ మిక్కిలి పురాతనమైనది. దానిని ఇండోరుమహారాణియగు అహల్యాబాయి శిథిలావస్థనుండి పునరుద్ధరించెను. ఈ మందిర మొక పర్వతశిఖరమున గలదు. దాని క్రిందుభాగమున నొక నది ప్రవహించుచున్నది. ఇచట

నొక శివకుండముకూడ కలదు. ఇచటి శివలింగమె జ్యోతిర్లింగ మని కొందరి యభిప్రాయము. రెండునుగాక ఉజ్జయిని కుత్తర ముగ 'ఆగర్ - మిలరా' యను స్థానమున వేరొక వైద్యనాథము కలదు. (చూ. ఆగర్ మిలరా)

## నాగేశ్వరము (నైజాం)

పర్భనీనుండి పూర్ణాలో మారి చోండే స్టేషనులో దిగ వలయును. ఇటకు 12 మైళ్ళదూరమున ఔఢగ్రామమున నాగే శ్వరమందిరము కలదు. ఇచట అన్ని సౌకర్యములు కలవు. ద్వాదశ జ్యోతిర్లింగములలో నొకటగు నాగేశ్వరమునుగూర్చి భిన్నాభి ప్రాయములు కలవు. (వివరము గోమతీద్వారక వద్ద గల నాగే శ్వరము చూడుము!)

## ఓంకారనాథము

"గాంగం సకృత్స్నానాత్పుణ్యం దర్శనాదేవ నార్మదం,
ఇత్యేష కథితో దేవి! నర్మదాతీర్థ సంగ్రహః." —నారదపురాణము.

భారతదేశమందలి ప్రసిద్ధ క్షేత్రములందు ఓంకారనాథ మొకటి. అచ్చట పురాణోక్తములకు ద్వాదశజ్యోతిర్లింగములకు చెందిన ఓంకారేశ్వర, అమరేశ్వర లింగములు కలవు.

పూర్ణానుండి మన్మాడ్ వచ్చి భూసావాల మీదుగ ఖండ్వా (జం) లో మారి మోర్టక్కా స్టేషనులో దిగవలయును. మోర్టక్కాకు ఓంకారనాథము 8 మైళ్ళు. మోర్టక్కాలో ఎద్దుబండ్లు, లారీలు కలవు. మోర్టక్కా స్టేషనుకు సమీపము నందే యొక ధర్మశాల కలదు. ఈ ధర్మశాలలో నన్ని సౌకర్య ములు కలవు.

ఓంకారేశ్వరమందిరము 'ఓంకారమాంధాతా' యను నొక గ్రామమున నొక పర్వతముమీద కలదు. ఈ పర్వతమునకు దక్షిణమున నర్మద ప్రవహించుచున్నది. ఓంకారపురమున నొక మైలుదూరమున నర్మదనుండి 'కావేరి' యను నొక పాయ చీలి యీ పర్వతము నుత్తరముగ చుట్టి మరల నర్మదయందు కలియుచున్నది. అందుచేత నిది యొక ద్వీపమువలె నున్నది. ఈ ద్వీపము నిచ్చటివారు 'మాంధాత' యని పిలుతురు.

ఓంకారావిర్భావము:— పూర్వము మాంధాతమహారాజీ పర్వతమున చాలకాలము తపస్సు చేసెను. శంకరుడు ప్రసన్నుడుకాగా, శంకరుని 'దేవా! నాకు నీపదపద్మములం దనన్యమగు భక్తిని ప్రసాదించుము. మఱియు లోకకల్యాణమునకై యీ గిరి శిఖరమున సదా నివసించవలసిన'దని కోరగా, నాటినుండియు శంకరుడు ఓంకారేశ్వర జ్యోతిర్లింగరూపమున నిచ్చట విరాజిల్లుచుండెను. అని స్కాందపురాణాంతర్గత నర్మదాఖండమున గలదు.

ఆలయ పరిపాలన:— మాంధాత ద్వీప మొక చతురస్ర మైలుండును. ఈ ద్వీపమున నొక చిన్నగ్రామము కలదు. దీనిని శివపురియని పిలతురు. నర్మదా దక్షిణకూలమున 'శివపురి'యు, 'విష్ణుపురి'యు కలవు. ఈ మూడుగ్రామములు చాల నయనానందకరముగ నుండును. ద్వీపమున కొకవైపున మహారాజ భవనము కలదు. ఈ రాజు 'భిల్ల' జాతికి చెందినవాడు. క్రీ. శ. 1165లో 'భారతసింహచౌహాణ్' యీ పర్వతమునగల నాథూభిల్లుని పరాజితుని గావించెను. నాటినుండియు నీద్వీపము చౌహాను వంశీయుల యధికారమునందే గలదు. నర్మదానదియొక్క రెండు

తీరములందును గల మందిరములకు పోషణయంతయు నీ రాజ వంశమే చేయుచున్నది.

ఓంకారనాథాలయము:— నర్మదా తటమునుండి రాజ భవనమునకు పోవు మార్గమునందే ఓంకారనాథుని మందిరము కలదు. ఓంకారేశ్వరుని మందిరమును, ఆ మందిరమునకు పరిసర ములగల మందిరములను పేశవాలు కట్టించిరి. మందిరముయొక్క ప్రధానద్వారము ఉత్తరదిక్కున గలదు. ఓంకారేశ్వరుని మూర్తి కొక యాకృతిలేదు. మూర్తికి పరిసరములం దెల్లపుడు జలము నిండియుండును. ఇది పాతాళగంగ యందురు. మందిరముయొక్క రెండవయంతస్థున శ్రీమహాకాళేశ్వరుని లింగము కలదు. శ్రీశుకుని యొక్కయు, మాంధాతయొక్కయు విగ్రహములు కూడ కలవు. ఇచ్చట స్వామికి దినమునకు మూడు పర్యాయములు పూజ చేయుదురు. ఈ మందిర పరిసరములందు అవిముక్తేశ్వర, జ్వాలే శ్వర, కేదారేశ్వర, గణపతి మందిరములు కలవు.

ప్రదక్షిణము:— ఓంకారేశ్వరక్షేత్ర పరిక్రమను రెండు విధములుగ చేయవచ్చును. అందొకటి పెద్దది. రెండవది చిన్నది. చిన్నదగు పరిక్రమయందు పశ్చిమమున ఆంజనేయ, కేదారేశ్వర దర్శనమగును. అనంతరము కావేరీసంగమము, దీనికి సమీపమున ఋణముక్తేశ్వర మహాదేవుని మందిరము కలదు. తూర్పునకు తిరిగిన 'గౌరీసోమనాథమందిరము' కలదు.

పూర్వగాథ:— మొదట నీ సోమనాథుని శివలింగము తెల్లగ నుండెడిది. ఆసమయమున నీ లింగమును గాంచిన ప్రతి మనుజునియొక్కయు పూర్వాపరజన్మలయొక్క రూపములు గోచ

రించెడివి. ఒకప్పుడు ఔరంగజేబు తన పరజన్మయందలి రూప మును తెలుసుకొన నెంచి యీ లింగమును దర్శించెను. అంత నాతని కిందు సూకరరూపము గాన్పించెను. అందులకు కుపితుడై యాత డీలింగమును కాల్చివైచెను. నాటినుండియు నీ లింగము నల్లబడెను. అని చెప్పుదురు.

పృథు పరిక్రమ:— పృథుపరిక్రమయందు గౌరీ సోమ నాథమునుండి యింకను తూర్పునకు వెడలుదురు. ఇచ్చట సిద్ధే శ్వరమందిరము కలదు. ద్వారమున భీమార్జున విగ్రహములు కలవు. మందిరము శిల్పకళతో మనోహరముగ నున్నది. లార్డు కర్జన్ వైస్రాయిగ నున్నపుడు దీనిని గాంచుట కాత డిచ్చటికి వచ్చెను.

సిద్ధవరకూటము:— సిద్ధేశ్వరమునకు కొలది దూరమున కావేరీనది కావలియొడ్డున జైనులయొక్క ప్రసిద్ధస్థానముగు 'సిద్ధ వరకూటము' కలదు. దానికి సమీపముననే శ్రీమహావిష్ణువు యొక్క యిరువదినాల్గు అవతారముల చిత్రములు కలవు. దీనికి కొంచెముదూరమున నర్మదాతీరమున నిట్టనిలువుగ నున్న యొక పర్వతము కలదు. పూర్వము ముక్తినొందుటకు జను లీపర్వతము నుండి నర్మదలోనికి దుముకుచుండువారు. కాని క్రీ. శ. 1824 సంవత్సరమునుండి ప్రభుత్వ మీ యాచారమును నిరోధించెను. ఈ ప్రదేశమును 'వీరఖలా' యని పిలతురు. ఇచ్చటనుండి పశ్చి మముగ నర్మదాకూలమునుండివచ్చిన 'చక్రతీర్థము' కాన్పించును. చక్రతీర్థమునుండి ఓంకారేశ్వరము ఈ విధముగ నీ పృథుపరిక్రమ ణము పూర్తియగును.

అన్యస్థానములు:—

అమలేశ్వరజ్యోతిర్లింగము:— నర్మదా దక్షిణకూలమున 'శివపురి' కెదుట నొకపర్వతమున 'బ్రహ్మపురి' కలదు. దీనికి పశ్చిమముగ నొకకొండపైన 'విష్ణుపురి' కలదు. ఈ రెండు పర్వతములకును మధ్య ప్రవహించు ప్రవాహమును 'కపిలధార'యని పిలతురు. ఇది గోముఖమునుండి నర్మదలో కలియుచున్నది. దీనిని కపిలాసంగమ మని పిలతురు. ఈ గోముఖమువద్ద కొంచెము ఎత్తునకెక్కిన శ్రీ అమలేశ్వరమహాదేవుని జ్యోతిర్లింగము కలదు.

పూర్వగాథ:— 'పూర్వము వింధ్యాచలము ఓంకార చక్రమున పార్థివలింగము నుంచి పూజించెను. శివు డందుచే ప్రసన్నుడై వింధ్యమును వర మడుగు మనెను. వింధ్యము 'భగవన్! నీవు సర్వదా యిచ్చట నివసించుము' అనెను. ఆసమయమున నచ్చట రెండు శివలింగములు ప్రాదుర్భవించెను. ఓంకారచక్రమునుండి ఓంకారేశ్వరుడును, పార్థివలింగమునుండి 'అమలేశ్వరుడును' ప్రాదుర్భవించిరి. అనంతరమం దాలింగముల నిచ్చట ప్రతిష్ఠించిరి.' అని శివపురాణమున గలదు.

బ్రహ్మేశ్వరమహాదేవుడు:— ఈ మందిరము బ్రహ్మపురియందు కలదు. అందువలననే దీనికి 'బ్రహ్మపురి' యని పేరు వచ్చెను.

శ్రీమహావిష్ణుమందిరము:— ఇది 'విష్ణుపురి' యందు గలదు. ఇందు శ్రీలక్ష్మీనారాయణుల విగ్రహములు కలవు.

మార్కండేయశిల:— ఇది 'విష్ణుపురి'కి పశ్చిమమున 'నర్మదా' నదియందు గలదు. ఇది యొక పాషాణము. దీనిమీఁద

నుండి నర్మదానదీతోయ మెల్లపుడు ప్రవహించుచుండును. యాత్రికులు యమపాశవిముక్తికై దీనికి నమస్కరింతురు. దీనికి సమీపమునగల పర్వతమున మార్కండేయుని యాలయము గలదు.

కావేరీ నర్మదా సంగమము:— ఓంకారేశ్వరమున కొక మైలున్నరదూరమున తూర్పున నర్మదా దక్షిణతీరమున కావేరీ నర్మదా సంగమము కలదు. కాని యిచ్చటి జనులు కావేరీ జలమిచ్చట నర్మదతో కలియుటలేదనియు, కావేరీ నర్మదకు వేరుగ నొక మైలువరకు ప్రవహించి ఓంకారేశ్వరమును పరిక్రమించి మరల నుత్తరతటమునుండియే నర్మదలో కలియుచున్నదనియు చెప్పుదురు. నర్మదా దక్షిణకూలమున గల కావేరీ సంగమమున 'కావేరీనదికై యొక టెంకాయ' సర్పించిన నది నర్మదలోనికి రాక ఉత్తరముగ కావేరియందే ప్రవేశించునని దీనికి నిదర్శనముగ చెప్పుదురు. దక్షిణతటమునగల కావేరీసంగమమువద్ద నొక శివాలయము కలదు. దీనిని కుబేరుని కోశాధిపతిస్థానముగ చెప్పుదురు. ఇచ్చటివారు దీనిని 'కుబేర్ భండారీ' యందురు. ఇచ్చట కుబేరుడు తపమాచరించెనని కూడా చెప్పుదురు. కుబేరుడు ఈశ్వరుని గణములందు ప్రధానుడు. ఈ స్థానము పరమపవిత్రమైనది.

సప్తమాతృకలు:— కుబేర్ భండారీకి తూర్పున 6 ఫర్లాంగుల దూరమున 'సప్తమాతృతీర్థము' కలదు. ఇచ్చట 'వారాహీ, చాముండీ; వైష్ణవీ, బ్రాహ్మణీ, ఇంద్రాణీ, కౌమారీ, మాహేశ్వరీ' యను సప్తమాతృకల మందిరములు కలవు. ఇచ్చటి ప్రకృతిదృశ్య మతి మనోహరముగ నుండును.

నర్మదేశ్వర శివలింగములు:— సప్తమాతృకలకు 15 మై. దూరమున నీ స్థానము కలదు. మార్గ మరణ్యామయమై కష్ట దాయకముగ నుండును. మోర్టక్కా నుండి యీ స్థాన మిరువది మైళ్ళ దూరమున గలదు. ఇచ్చట నర్మదానది శరవేగమున నొక పర్వతమునుండి యొక కుండమున బడుచున్నది. ఇచ్చట నర్మద 50 అ. ఎత్తునుండి పెద్దపెద్ద పాషాణములను దొర్లుచుకొని పడు చున్నది. ఇది యొక ప్రసిద్ధమగు జలపాతము. నర్మదానదీ వేగమునకు రాళ్లుకూడ యీకుండమున బడుచుండును. ఆ రాళ్లు జలపాతవేగమునకు క్రమముగ గుండ్రని లింగములుగ నేర్పడును. కొందరు స్నాన సమయమున వీనిని బయటకు తీయుదురు. యాత్రికు లీ లింగములను మిగుల శ్రద్ధతో సండ్లకు గొంపోవు దురు. వీనిని నర్మదేశ్వర శివలింగము లందురు. ఈ స్థాన మవశ్యము చూడ దగినది.


శివతాండవము

మాహాత్మ్యము:— పురాణము లందు ఓంకారేశ్వరక్షేత్ర మాహా త్మ్యము అధికముగ వర్ణింపబడినది. ఇచ్చట మాంధాతయేగాక, కుబే రుడు, శ్రీశుకుడుగూడ తప మాచ రించియుండిరి. మధ్యభారతమున నర్మ దను గంగానదివలె పరమపవిత్రమైన దిగ భావింతురు.

నశంకరాత్పరో దేవో నరేవాయాః పరానదీ,
నసత్యాద పరోధర్మో కారుణ్యం సర్వజన్తుషు. —స్కాందపురాణము.

నర్మదామహాత్త్వము సర్వనదులనుమించినది. చాలమంది యాత్రికులు యాత్రాదృష్టి లేకున్నను యిచ్చటి ప్రకృతినిర్మిత సుమనోహరదృశ్యములను గాంచ నేతెంచుచుందురు. ఇచ్చటి వాతావరణ మారోగ్యదాయకముగ నుండును. భోజనసామగ్రి సర్వము లభించును. ఇచ్చట కొన్ని ధర్మశాలలు, పాఠశాలలు, అన్నసత్రములు గలవు.

## దేవాస్

మోర్టక్కానుండి ఇండోర్‌లో దిగవలయును.

ఇండోర్ నగరమునకు, పూర్వోత్తరముగ 20 మై. దూరమున మాలవారాజ్యమున దేవాస్‌నగరము గలదు. ఇండోర్ నుండి దేవాస్‌కు రోడ్డు కలదు. ఇది రాజధానీ నగరము. ఈ నగరమున పశ్చిమోత్తరముగ 300 అ. యెత్తుగల యొక చిన్న పర్వతముమీద చాముండా మందిరము గలదు. నిట్టనిలువుగనున్న పర్వతమును దొలిచి యొక గుహాలో విశాలమైన దేవీమందిరము నిర్మింపబడెను. దీనికి క్రిందిభాగమున నొక సరస్సు కలదు.

## ఉజ్జయిని

అయోధ్యా మథురామాయా కాశీ కాంచీ అవన్తికా,
పురీ ద్వారవతీ చైవ సప్తైతే మోక్షదాయకాః.

ఇండోర్‌నుండి ఉజ్జయిని చేరవలయును.

ఉజ్జయిని (అవంతికా) మోక్షదాయకములగు సప్తపురములం దొకటి. ఇచ్చట స్టేషనుకు సమీపముననే సింధియాప్రభు

త్వాపు ధర్మశాల యొకటి కలదు. అందు సుమారు 300 మంది యాత్రికులు సుఖముగ బసచేయవచ్చును. ఇదికాక వేరొక ధర్మశాల 'క్షిప్రా' నదీతీరమున రామఘట్టమునను, ఇంకొకధర్మశాల 'కార్తికచౌక్' సమీపమునను కలదు. ఇవికాక యింకను ధర్మశాలలు కలవు. పండాల గృహములందును బసచేయవచ్చును. ఉజ్జయిని గ్వాలియరుసంస్థానములోనిది.



మహాకాళేశ్వర మందిరము

ఇది మహాకాలక్షేత్రము. ఇచ్చటి లింగము జ్యోతిర్లింగము. ఈ నగరము 'క్షిప్రా'నదీ తీరమున గలదు. ప్రాచీనకావ్యములందును, పురాణములందును యీ నగర వైభవ మతిశయముగ వర్ణింపబడెను. ఈ నగరము ప్రత్యేక కల్పములందు ప్రత్యేక నామములతో నొప్పుచుండును. 'కనకశృంగా, కుశస్థలీ, అవన్తికా, పద్మావతీ, కుముద్వతీ, విశాలా, ఉజ్జయిని' యని వివిధ నామములతో నీ నగరము పేర్కొనబడుచుండును. అని నారదపురా

ణమున గలదు. 'ఉజ్జయిని'యన జైనధర్మమున కుత్పత్తిస్థానము. (ఉద్గతో జైనః జైనధర్మః యస్యాస్సా ఉజ్జైనీ) ఇచట బ్రాహ్మణులు గౌడులు. వారణాసియందువలె నిట మృతిపొందినవారికి మోక్షము కలదని పురాణములు చెప్పుచున్నవి. ఇట వేలాది లింగములు కలవు. ఇట జీవహింస లేనికారణమున నెమిళ్లు వివిధ పతంగసంతతులు స్వేచ్ఛగా విహరించుచుండును.

పూర్వమీనగరము మహారాజుల కనేకులకు రాజధానియై యుండెడిది. ప్రాచీనకాలమున నిది యొక ప్రసిద్ధవిద్యాకేంద్రము. శ్రీ శంకరాచార్యుని సమయమునం దిచ్చట 'సుధన్వుడు' రాజ్యముచేయుచుండెను. అతడు వైదికధర్మమును పరిత్యజించి జైనధర్మమును స్వీకరించెను. నాటినుండియు నీ నగరమునకు 'ఉజ్జయిని' యని పేరు వచ్చెను. జైనధర్మావలంబియగు సుధన్వుడు శంకరాచార్యుని ప్రఖ్యాతిని విని యాయనను సగౌరవముగ పిలిపించి జైనాచార్యులతో శాస్త్రార్థము చేయించెను. ఆ వాదనయందు శంకరాచార్యుడే గెలిచెను. అందుచేత నాతడు మరల వైదికధర్మమును స్వీకరించెను.

గ్రామదేవత 'అవంతికాదేవి'. దీనినిబట్టియు నీనగరమునకీ నామము కలిగెను. ఇచట సంస్కృతపాఠశాలలు చాల కలవు. ఆవశ్యకవస్తువు లన్నియు లభించును.

భర్తృహరి, విక్రమాదిత్యులు కూడ యీ నగరమును పాలించిరి. విక్రమాదిత్యుని యాస్థానముననే కాళిదాసాది మహాకవు లుండెడివారు. మహమ్మదీయులపాలన యారంభముకాగానే ఉజ్జయినియొక్క వైభవమంతయు నశించెను. పూర్వపునగరము

భూకంపమువలనను, క్షిప్రానది వరదలవలనను నశించిపోయెను. నాటి శిథిలములు మాత్రము నేడు కానవచ్చును. పూర్వము భోజునకు విక్రమార్కుని అపూర్వసింహాసనము దొరకిన చెరువు ఇచ్చట కానవచ్చును. ఇప్పుడు రైల్వేస్టేషనుకు ఒక మైలు దూరమున నూతనముగ నిర్మింపబడిన ఉజ్జయినీనగరము కలదు. యాత్రికులు మొదట క్షిప్రానదిలో రామఘాట్ నందును, పిశాచముక్తి తీర్థములోను స్నానముచేసి తీర్థవిధుల నాచరించి మహాకాళేశ్వరుని దర్శింతురు.

మహాకాళేశ్వరుడు:— ఇది 5 అంతస్థుల దేవాలయము. శివలింగము మాత్రము క్రిందనే గలదు. యాత్రికులు మహాకాళేశ్వరుని అభిషేకముతో, బిల్వపత్రములతో పూజింతురు. ప్రతిదినము బ్రాహ్మీముహూర్తమున 4 గం.లకు స్వామిని స్నానము చేయించుచుందురు. అనంతరము చితాభస్మమును స్వామికి పూయుదురు. తరువాత పుష్పపత్రాదికములతో పూజించి హారతి నొసంగుదురు. స్వామికి సేవాకైంకర్యములను సింధియా మహారాజు హోల్కరు, మరియు నితరజమీందారులు జరిపించుచుందురు. ఇచ్చటి పూజారులు 'తైలంగ్' బ్రాహ్మణులు.

కోటితీర్థము:— మహాకాళేశ్వరుని మందిరమునకు నలువైపుల సుందరములగు భవనములు, ధర్మశాలలు కలవు. మందిరాంతరమున నొక కుండము కలదు. దానిని 'కోటితీర్థ' మని పిలుతురు. మహాకాళేశ్వరుని మందిరముయొక్క రెండవ యంతస్థున ఓంకారేశ్వరుని శివలింగము కలదు. ఈ మందిరమునకు దక్షిణమున నొక విశాలభవనము, దానికి సమీపమున వృద్ధ

మహాకాళేశ్వరుని జ్యోతిర్లింగము కలదు. ఈ జ్యోతిర్లింగము 'పద్మపురాణము'న జెప్పబడిన ముఖ్యములగు మూడు జ్యోతిర్లింగములయం దొకటి.

> ఆకాశే తారకం లింగం పాతాళే హాటకేశ్వరం,
> మర్త్యలోకే మహాకాళం లింగత్రయ! నమోస్తుతే! —పద్మపురాణము.

ఇతిహాసము:— ఈ జ్యోతిర్లింగమునుగూర్చి 'శివపురాణము'న నొక గాథ కలదు. పూర్వము ఉజ్జయినియం దొక బ్రాహ్మణుడు నివసించుచుండెను. అతనికి నలుగురు పుత్రులు. వారందరును శివభక్తులు. రత్నమాలాపర్వతమున 'దూషణు'డను దైత్యు డొక డుద్భవించెను. అతడు బ్రహ్మనుగూర్చి ఘోరమగు తపముజేసి యనేకవరములను పొంది, గర్వించి, యందరను బాధించసాగెను. అతడు శివభక్తులను పీడించుచు నొక పర్యాయము ఉజ్జయినికి వచ్చెను. శివపూజాతత్పరులై యున్న బ్రాహ్మణపుత్రులను చంప నుద్యోగించగా, మహాదేవుడు మహాకాళరూపమున ప్రాదుర్భవించి దూషణుని సంహరించెను. తరువాత నా బ్రాహ్మణులు మహాదేవు నచ్చటనే స్థిరముగ నివసించవలసినదిగ ప్రార్థించిరి. భక్తులకోర్కెను భగవంతుడు మన్నించెను. నాటినుండియు 'ఉజ్జయిని' మహాకాళక్షేత్ర మయ్యెను.

ప్రధాన తీర్థములు:—

హరసిద్ధిదేవి:— మహాకాళేశ్వర దేవాలయమున కెదుట 'రుద్రప్రయాగకుండము' గలదు. దానికి సమీపమున శ్రీహరసిద్ధి దేవిమందిరము కలదు. ఈమె విక్రమాదిత్యుని కులదేవత. తాంత్రికు లిది యొక సిద్ధపీఠమని చెప్పుదురు. సతీదేవి మృతశరీర

మందలి 'మోచెయ్యి' యిచట పడెను. (చూ. మణికర్ణిక) నవ దుర్గా పీఠములం దిదియొకటి.

ఇరువదనాల్గు స్తంభముల తలుపు:— ఇది యొక ప్రాచీన మైన తలుపు. ఇది విక్రమాదిత్యుని కోటలోని యొక భాగమని ప్రజలు చెప్పుదురు. దీనికి రెండువైపులను దేవతామూర్తులు కలవు. ఈ తలుపునకు మధ్య 24 స్తంభములు కలవు. యాత్రికు లీ దేవతామూర్తులను పూజింతురు. నవరాత్రులందు గ్వాలియర్ మహారాజిచ్చట దేవీపూజ చేయుచుండును.

గోపాలమందిరము:— ఈ మందిరమును గ్వాలియరు మహారాణి బౌజాబాయి కట్టించెను. ఆలయము చాల సుందర మైనది. ఈ యాలయమునం దొక సత్రముకూడ గలదు.



మహాకాళేశ్వరము
ఒక దృశ్యము

శ్రీ విష్ణుమందిరము:— గోపాల మందిరమునకు సుమా రొక మైలుదూర మున శ్రీ మహావిష్ణుమందిరము కలదు. దీనికి సమీపమున 'క్షీరసాగర' మను నొక సరస్సు కలదు. ఆలయమున శేష శయనుడగు శ్రీ మహావిష్ణువుయొక్క విగ్రహము కలదు. దానికి సమీపముననే శ్రీమహాలక్ష్మి, బ్రహ్మ, శ్రీ సీతారామ లక్ష్మణుల, శ్రీ ఆంజనేయ విగ్రహములు కలవు.

సిద్ధవటము:— ఇది పట్టణమునకు మూడుమైళ్ళ దూర మున క్షిప్రానదీతీరమున గలదు. దీనికి దిగువ క్షిప్రానదిలోనికి

రాతిమెట్లు కలవు. సమీపమున నొక ధర్మశాల కలదు. ఇచ్చట కార్తిక శు ౧౪ కు ఉత్సవములు జరుగును. ఇచ్చట ప్రకృతి దృశ్య మతి మనోహరముగ నుండును.

శ్రీ నాగచండేశ్వరుడు:— మహాకాళేశ్వరున కితడు దీవాన్ అని చెప్పుదురు.

సప్తసరోవరములు:— ఇవికాక యింకను కొన్ని మందిరములు కలవు. అందు శ్రీనాథ, వైకుంఠనాథ, సత్యనారాయణ మందిరములు ప్రధానములైనవి. రుద్రప్రయాగకుండము, క్షీరసాగరసరస్సు గాక యిచ్చట నింకను 5 సరస్సులు కలవు. 1 విష్ణుపాదసాగరము 2 గోవర్ధనసాగరము 3 పురుషోత్తమసాగరము 4 పుష్కరసాగరము 5 రత్నాకరసాగరము. మొత్తమివియన్నియు కలిసి సప్తసరోవరములని పిలువబడుచుండును. ఇందు యాత్రికులు స్నానముచేసి తర్పణము చేయుదురు.

చూడదగిన ఇతరస్థానములు:—

సాందీపనిఋషి ఆశ్రమము:— ఈయాశ్రమము నగరమునకు రెండుమైళ్ళదూరమున 'గోమతీగంగా' సరోవరతీరమున గలదు. పూర్వ మిచ్చటనే సాందీపుని విద్యాపీఠ ముండెడిది. శ్రీకృష్ణుడు, బలరాముడు, కుచేలుడు సహపాఠులై యిచ్చటనే విద్యాభ్యాసము చేసిరి. ప్రస్తుత మిచ్చట కొన్ని మందిరములు కలవు. అందు సాందీపునియొక్కయు, బలరామ, కృష్ణ, కుచేలుల యొక్కయు విగ్రహములు కలవు.

భర్తృహరి గుహ:— భర్తృహరిమహారాజు విక్రమాదిత్యుని కగ్రజుడు. అతడు సంస్కృతపండితుడు, కవి. ఈతడు

'నీతి, శృంగార, వైరాగ్య' విషయకములగు మూడు శతకములను సంస్కృతమున రచించెను. అతడు రాజ్యోపభోగములనుండి విరక్తిచెంది శ్రీ గోరఖనాథునికి శిష్యుడై యీ గుహాయందు చిరకాలము తపస్సుచేసెను. ఆనాటి అగ్ని నేడుకూడ యిందు కానవచ్చును.

గోపీచంద్ గుహ:— ఈ గుహాయందు గోపీచంద్ తపస్సు చేసెను. ఈతడు భర్తృహరికి మేనల్లుడని కింవదంతి గలదు.

గోరఖనాథ్ గుహ:— గోరఖనాథ్ సుప్రసిద్ధుడగు యోగీంద్రుడు. భారతదేశమునందు చాలప్రదేశములం దాతడు తపస్సు చేసెను. ఈ గుహకూడ యీ మహాసీయుని తపస్స్థాన ములం దొకటి.

కాళియద్రహదభవనము:— ఇది ఉజ్జయినికి 6, 7 మైళ్ళ దూరమున గలదు. ఇది మిగుల ప్రాచీనమైన యైతిహాసిక భవ నము. ఈ భవనసమీపమున నొక విచిత్రమగు కుండము కలదు. పురాణములందిది "బ్రహ్మకుండ" మని చెప్పబడెను. ఈ భవ నమును "సుల్తాన్ నాసిరుద్దీన్ ఖిల్జీ" కట్టించెను. ఇది 'క్షిప్రా' నదీతీరమున మిగుల నున్నతమగు ప్రదేశమున కట్టబడెను. ఇచ్చట 52 కుండములు గలవు. వీనిలోనికి క్షిప్రానదీతోయము వచ్చుచు పోవుచుండును. కాని చిత్రమేమన! నదీజలముయొక్క రాక పోక లను మనము గమనించజాలము. ఇచ్చట తిరగలివంటి యొక జలయంత్రము కలదు. అందు జల మొకపర్యాయ మెడమవైపున కును, రెండవపర్యాయము కుడివైపునకును తిరుగుచుండును. ఈ దృశ్యము నెంతజూచినను తనివితీరదు.

ఈ భవనమున అక్బరుచక్రవర్తియు, నాతని కుమారుడగు 'జహాంగీరును' అప్పుడప్పుడు నివసించుచుండువారు. ఈ భవనమున నివసించునపుడు జహాంగీరు వనవాసియైయుండు 'జయరూపు' డను యోగీంద్రుని దర్శించుటకు నెడలుచుండువాడని చెప్పుదురు. క్రమముగ శిథిలమైన యీభవనమును శ్రీ మహారాజు మాధవసింధియా క్రీ. శ. 1910 లో బాగుచేయించెను. దీనికి సమీపమం దాత డొక యుద్యానవనమునుకూడా నాటించెను. ఈ భవన రామణీయకతను తప్పక చూడవలెను.

న్యాయాలయము:— ఇది విక్రమాదిత్యుని న్యాయస్థానమని చెప్పుదురు. ఇది శిథిలమైయున్నది.

లంబేశ్వరమహాదేవుడు:— ఉజ్జయినికి మైలున్నర దూరమున క్షిప్రానదీతీరమున భైరవఘడ్ కలదు. ఇచ్చట లంబేశ్వర మహాదేవుని లింగము కలదు. ఇది ఉజ్జయనియందుగల 84 శివలింగములయం దొకటి. ఇచ్చట వైశాఖ శు ౧౫, ఆషాఢ శు ౧౫, కార్తీక శు ౧౫ లకు, శివరాత్రికి ఉత్సవములు జరుగును.


క్షిప్రానదీ ఘట్టము

ఉజ్జయినీలో కుంభమేలా:— ప్రయాగయందు, నాసికయందు వలె నుజ్జయినియందుకూడ ప్రతి పండ్రెండు సంవత్సరములకు సింహారాశియందు గురుడున్నపుడు కుంభోత్సవము జరుగును. అప్పుడు లక్షలకొలది యాత్రికు లరుదెంచుచుందురు. గ్వాలియరు ప్రభుత్వ మాయుత్సవమునకు తగు

గలదు. ఈ నది నర్మదలో కలియుచున్నది. ఈ సంగమమునకు 11 మై. దూరమున యీ మందిరము కలదు. ఇచట యింకను కొన్ని మందిరములు కలవు. క్రీ. శ. 1694 లో వింధ్యాచలాధిపతి శ్రీరాజసింహమహారాజీ మందిరముల పునరుద్ధరించెను.

హనుమన్తేశ్వరస్వామి:— కుంభేశ్వరమునకు కొన్ని మైళ్ళ దూరమున గలదు. అది చాల యందమైనది.

శుక్రేశ్వరస్వామి:— ఇది నాగేశ్వరఘట్టమున కొక మైలు దూరమున గలదు. మాండవ్యేశ్వరస్వామి:— ఇది నాగవా గ్రామమునకు 6 మై. దూరమున గలదు. నాగవా స్టేషను. మాండవ్యఋషివలన నీ మందిరమున కీపేరు వచ్చెను. దశాశ్వమేధ తీర్థము:— ఇది గుజరాత్ ప్రాంతమున గల భడోచ్ గ్రామమున నర్మదా తీరమున గలదు. ఇచట సరస్వతి స్వయముగ నివసించి ఛాత్రులకు సర్వవిద్యలు సుకరముగ నిచ్చునని ప్రసిద్ధి. కుబేరేశ్వర తీర్థము:— ఇది కోరల్ కు ఒక మైలు దూరము. ఇచట చాల మందిరములు గలవు. వ్యాసేశ్వరము:- వ్యాసమహర్షి యిచట చిరకాలము తపస్సుచేసి తాను స్వయముగ శంకరుని యిచట ప్రతిష్ఠించెను. ఇది నర్మదకు దక్షిణమున గలదు. ఆదిత్యేశ్వరుడు:— సూర్యుడీస్థానమున తపమాచరించి యీ లింగమును ప్రతిష్ఠించెనట. సూర్యుని విగ్రహముకూడ కలదు. హాయేశ్వరము:— ఇది నర్మదాతీరమున గల యొక పర్వతము.


సరస్వతీదేవి

ఇచట 20 స్తంభముల మందిరము గలదు. ఇది వరుణ ప్రతిష్ఠ. ఇచట వరుణాసంగమ తీర్థము గలదు.

పౌరాణికగాథ:— పూర్వ మొకప్పు డీ నగరమును శివభక్తు డగు చంద్రసేనుడను రాజు పాలించుచుండెను. చంద్రసేనుడు శివపూజ చేయుటతో పంచవర్షప్రాయుఁడగు గోపబాలుడు తన తల్లితో నచట కేతెంచెను. రాజు చేయు పూజా వివరములు తన తల్లివలన తెలుసుకొని తానుకూడ శివపూజ చేయుదునని యింటికివచ్చి ఒక రాతిని శివునిగా భావించి ధ్యానించెను. తల్లి కుపితురాలై ఆశివమూర్తిని దూరముగ విసరివైచెను. కాని పుత్రుడు ధ్యానమునందే యుండెను. కరుణామయుడగు శంకరుడు బాలునికి జ్యోతిర్లింగరూపమున ప్రత్యక్షమాయెను. వెంటనే యీవార్త రాజుకు తెలిసి అచ్చటకువచ్చి గోపబాలుని భక్తికి సంతసించి, నీలకంఠుని అనేకవిధముల స్తుతించెను. ఆ సమయమున వాయుపుత్రుడు ప్రత్యక్షమై ఈ స్థానమున జ్యోతిర్లింగ రూపమున నవతరించిన రుద్రుని మీ రందరర్చించి ధన్యులం గండని యాదేశించి యంతర్హితుండాయెను. గోపబాలుడు శివసాయుజ్యమును బడసెను.

## వైద్యనాథము

ఉజ్జయిని కుత్తరముగ ప్రాచీనమగు ఆగర్ గ్రామము కలదు. ఇది రైలుస్టేషను. ఇటకు $1\frac{1}{2}$ మై. దూరమున వైద్యనాథ మందిరము కలదు. ఈ లింగ మెవ్వ డెవరిచే ప్రతిష్ఠింపబడెనో తెలియదు.

ఒకప్పుడు మిసెస్ మార్టిన్ అను ఆంగ్లవనిత యొక్క భర్త కాబూలునకు యుద్ధసైనికుడుగ వెళ్లెను. భర్త క్షేమవార్త తెలియక దిగులొంది, తన భర్త క్షేమముగ నిలుచేరిన జీర్ణావస్థ యందున్న యీ మందిరము పునరుద్ధరింతునని మ్రొక్కుకొనెను. వెంటనే భర్తను శూలపాణి రక్షించుచున్నటుల క్షేమవార్త వచ్చెను. కొలదికాలమునకు భర్త సురక్షితముగ నిల్లు చేరిన తోడనే మిసెస్ మార్టిన్ తన మ్రొక్కు తెలుపగా భర్తయు సంతసించెను. అతడు జమీందారులవలన కొంత, తాను కొంత ధనము వెచ్చించి యీ మందిరమును పునరుద్ధరించెను. ఇందులకు రు. 4566 లు ఖర్చు అయినదట. ఇచట యొక సరోవరము కలదు. ఈ ప్రాంతము మిక్కిలి రమణీయముగ నుండును.

## బరోడా

ఉజ్జయినినుండి నాగదా (జం) గోధ్రా (జం) మీదుగ బరోడా చేరవలయును. ఇది విశ్వామిత్రనదీతీరమున గలదు ఇది యొక రాజధానీ నగరము. బరోడా స్టేషనుకు సమీపమునందే ధర్మశాలలు గలవు. ఇచ్చట విశ్వామిత్రనదికి రాతితో 4 వంతెనలు కట్టబడెను. ఇప్పుడు బరోడా బొంబాయి రాష్ట్రములో అంతర్భాగము. విశాలమైన వీధులతో, రమ్యోద్యానములతో, అందమైన భవనములతో కన్నులపండువుగా నుండు ఆధునిక నగరము.

చూడతగినవి:— లక్ష్మీవిలాస ప్యాలెస్, జంతుప్రదర్శనశాల, చిత్రాలయము, ప్రాచ్య పరిశోధకసంస్థ, సూరసాగర సరస్సు, నాజర్ బాగ్ భవనము, కుటీరపరిశ్రమల కేంద్రప్రదర్శనా

లయము, వస్తుప్రదర్శనశాల, 125 ఎకరముల పై వైశాల్యముగల పబ్లిక్ పార్కు మొదలైనవి.



లక్ష్మీవిలాస్ ప్యాలెస్

బరోడా నగరమున శ్రీ విఠల్‌జీ మందిరము కలదు. ఈ మందిరమునకు బరోడారాజ్యము పెద్దజాగీరు నిచ్చెను. ఇదికాక ఖండోవా దేవీ, నారాయణస్వామి, బలదేవ, గణపతి, భీమనాథ మొదలగు మందిరములు గలవు. భీమనాథమందిరమున గాయకవాడ్ మహారాజు తరఫున బ్రాహ్మణులు పురశ్చరణ చేయుచుందురు. ఇచట నింకను పవిత్రస్థానము లనేకములు కలవు.

## భృగుపురము

బరోడాస్టేషనుకు దక్షిణ పశ్చిమముగ 44 మై. దూరమున బ్రోచ్ రైల్వేస్టేషను కలదు. ఇది నర్మదానదీతీరమున

గలదు. ఇది యొక రేవుపట్నము. ఇచ్చట నర్మదానది మీదుగ సముద్రమునుండి యితరదేశములకు వ్యాపారము జరుగుచుండును. ఇదియొక జిల్లా, భరోచ్‌కు 8 మై. దూరమున నర్మదా తీరమున 'భాదభూత' గ్రామమున భాదేశ్వర మహాదేవి మందిరము గలదు. భాద్రపద మధికమాసము వచ్చినపు డిచ్చట పెద్ద యుత్సవము జరుగును. భృగుమహర్షి భరోచ్‌ను నిర్మించెనని చెప్పుదురు. పూర్వము దీనిని భృగుపురమని పిలచెడివారు. నగరమునకు పరిసరములందు కొండలు మిట్టలు గలవు. ఇచ్చట కొన్ని దేవాలయములు గలవు. ఇవి చూడదగినవి.

## శుక్లతీర్థము

బ్రోచ్ నగరమునకు తూర్పున 10 మై. దూరమున నర్మదాతీరమున ప్రసిద్ధమగు శుక్లతీర్థము గలదు. ఇచ్చట కవి కుండము, ఓంకారేశ్వరకుండము, శుక్లతీర్థము నను మూడుకుండములు కలవు. ఓంకారేశ్వరకుండమునకు సమీపమున 'శ్రీ శుక్ల నారాయణస్వామి' మందిరము గలదు. ఇచ్చట కార్తికమాసమున పెద్దయుత్సవము జరుగును. మగధచక్రవర్తియగు చంద్రగుప్తుడు తన సోదరులను జంపిన పాపమునుండి విముక్తిబడయుటకై శుక్లతీర్థమున స్నానము గావించెను. 11 వ శతాబ్దమున 'అనహిల్‌వాడా' మహారాజు పశ్చాత్తప్తుడై శుక్లతీర్థమున దన శేషజీవితమును గడపెను. ఈ స్థానము మిక్కిలి మహత్తరమైనది. కార్తిక బ ౧౧ కు పార్వతీపరమేశ్వరు లీక్షేత్రమునకు విచ్చేయుదురు. ఆనా డుపవసించి స్వామిని దర్శించిన బ్రహ్మహత్యాది మహాపాపములు నశించును.

కబీరువటము:— శుక్లతీర్థమున కొక మైలుదూరమున నర్మదాద్వీపమున 'కబీరు వట'మను ప్రసిద్ధిజెందిన పురాతన వట వృక్షము కలదు. కబీరుదాసు దంతమునుండీ వృక్షము పుట్టినదని కింవదంతి. ఈ వృక్షమూలమున నొక మందిరము కలదు.

## సూరత్

బ్రోచ్ స్టేషనుకు 37 మై. దూరమున సూరత్ స్టేషను కలదు. ఇది గుజరాత్ ప్రాంతమున తపతీనదీతీరమున సముద్రమునకు 10 మై. తూర్పున గలదు. సూరత్ నగరము బొంబాయి ప్రాంతమున గల ముఖ్యనగరములందొకటి. ఇటకు బొంబాయి నుండి కూడ రావచ్చును. 136 మైళ్లు. ఇచట క్రీ. శ. 1540 లో కట్టబడిన కోట యొకటి కలదు. ఈ దుర్గ ద్వారమునం దొక శిలా శాసనము కలదు. పశ్చిమ ఇండియాలోని పెద్ద రేవు పట్టణము. మొగలుల కాలములో ఇక్కడనుంచి మక్కా యాత్రికులు వెళ్లేవారు. దానిచుట్టూ 5½ మై. కోట గోడకలదు. 12 సింహద్వారములు (గేట్లు) కలవు.



వల్లభాచార్యులు

సూరత్ నగరమున హిందువుల మందిరములు చాల గలవు. ఇందు నారాయణస్వామి మందిరము, ఆంజనేయ మందిరము ప్రధానమైనవి. తపతీనదీ మాహాత్మ్యము భవిష్యపురాణమునం దధికముగ నభివర్ణింపబడెను. చాల ధర్మశాలలు కలవు. మోటామందిరమను పేరుగల వల్లభసంప్రదాయమునకు చెందిన ప్రధానపీఠ మిచ్చట గలదు. దక్షిణభారతదేశమున వల్లభాచార్య సంప్రదాయమునకిది ప్రధానమగు కేంద్రము. ఈనగరమున హైందవ మందిరములేకాక మహమ్మదీయుల మసీదులుకూడ చాలగలవు.

## ధర్మవతి

సూరత్ నుండి డభోయి (జం) లో దిగవలయును.

బరోడాకు దక్షిణపూర్వమున 14 మైళ్ళ దూరమున 'డభోయి' స్టేషను కలదు. ఇది గుజరాతుప్రాంతమునకు చెందిన గ్రామము. ఈ గ్రామమునకు నలువైపుల ప్రాకారము గలదు. ఈప్రాకారగోడమీద సుందరమగు శిల్పము కలదు. ఈగ్రామము యొక్క పూర్వద్వారసమీపమున మహాకాళీమందిరము కలదు. ఈ మందిరము నూతనముగ చాల సుందరముగ నిర్మింపబడెను. ఈ గ్రామమునందొక వృక్షమున కొక పెద్ద తొఱ్ఱ గలదు. ఈ తొఱ్ఱనుండి దూరిన మనుజుడు సర్వపాప విముక్తుడగునని జనులు చెప్పుదురు. డభోయిని పూర్వము ధర్మవతి యని పిలచెడివారు. ఇది రమణీయముగ నుండును.

## చంద్రోదయము

డభోయికి దక్షిణపూర్వముగ 10 మై. దూరమున చంద్రోదయ స్టేషను కలదు. ఇదికూడ నర్మదాతీరముననే గలదు.

చంద్రోదయగ్రామమునం దనేక దేవమందిరములు కలవు. గంగా తీరమున కాశీవలె నర్మదాతీరమున చంద్రోదయముకూడ చాల ప్రసిద్ధమైనది. ప్రతిపూర్ణిమకు నిచ్చటకు చాలమంది జనులు స్నానమునకు వచ్చుచుందురు. కార్తిక పూర్ణిమకు, చైత్ర పూర్ణిమకు నిచ్చట పెద్దయుత్సవము జరుగును. ఈ యుత్సవము లకు 20 వేలకు మించి యాత్రికు లిచ్చటకు వచ్చుచుందురు. ఇచ్చట కొన్ని సంస్కృతపాఠశాలలు గలవు. భారతదేశమున నవద్వీపమువలె పశ్చిమభారతమున చంద్రోదయము వైదుష్య మున బ్రసిద్ధిగాంచెను.

## డంకేశ్వర క్షేత్రము (డాకోరు)

డభోయినుండి బరోడామీదుగ ఆనంద (జం) కు 19 మై. డాకోర్ స్టేషను కలదు. బొంబాయికి ఆనందకు 266 మైళ్లు. డంకేశ్వరస్టేషను చిన్నది. ఇచట ప్రతిసంవత్సరము లక్షలకొలది యాత్రికులు 'శ్రీ రణభోడ్ మహారాజును' దర్శించుటకు వచ్చు చుందురు. స్టేషన్ వద్దనే పండాలు యాత్రికులను తమ చిట్టావర్జా లతో ముట్టడింతురు.

డంకేశ్వరమున దామోదరభవన ధర్మశాల కలదు. ఈ ధర్మశాలలో యాత్రికులవలన రు. 5 లు అడ్వాన్సు పుచ్చుకొని వారికి కావలసిన వస్తుసామగ్రి యేర్పరచి మరలివచ్చునపుడు రు. 5 యిచ్చివేతురు. ఇచట భోజనసామగ్రి సర్వము లభించును.

గోమతి:— దామోదర భవనమునకు సమీపముననే గోమతీ సరోవరము కలదు. యాత్రికు లిచట తీర్థవిధి చేయవల

యును. సరస్సునందలి జలము స్వచ్ఛముగ నుండును. సరస్తీర మున మహాత్ముల కుటీరములు గలవు.

డంకేశ్వరమహాదేవుడు:— గోమతీతీరముననే డంకేశ్వర మహాదేవుని మందిరము గలదు. పూర్వ మిచట 'డంక' యను ఋషి తపస్సుచేసెను. ఆయనపేర నిది డంకేశ్వరమయ్యెను. రాను రాను డాకోరుగా మారెను. డంకేశ్వరశివలింగము నిరాకృతిగ నున్నది. యాత్రికు లీమహాదేవుని స్వయముగ నర్చించవచ్చును.

డంకేశ్వరాలయమున గల ద్వారకాధీశమందిరము క్రీ. శ. 1215 లో నిర్మింపబడెను. ఈ మందిర నిర్మాణమునకు 5 లక్షల రూపాయలు వ్యయమయ్యెను. ఇది తెల్లరాతితో నిర్మింపబడిన సుందరమగు దేవాలయము. ఇందు స్వామి శ్యామలవర్ణుడై, పీతాంబరధారియై, రత్నాభరణ భూషితాంగుడై, మణిమయ మకుటధారియై, పాణిపల్లవమున వేణువును ధరించి సుమనోహర రూపమున విరాజిల్లుచుండును. ఈయాలయమున భక్తులగు రామదాసు, గంగాబాయి దంపతుల మూర్తులుకూడ కలవు. స్వామికి నిత్యము శర్కరామిశ్రిత నవనీతము భోగము చేయుదురు.


శ్రీకృష్ణుడు

పూర్వచరిత్ర:— పూర్వము డంకేశ్వరమున రామదాసు, గంగాబాయి యను పుణ్యదంపతులు కలరు. వారు ప్రతిపూర్ణిమకు కాలినడకన ద్వారకాధీశుని దర్శించి వచ్చుచుండెడివారు. వారు వృద్ధులైనను ఈనియమమును పాటించుచుండిరి. ఒకప్పుడు వారు ద్వారకకువెళ్లి ద్వారకాధీశమందిర ప్రదక్షిణము చేయుచు అలసి యచటనే నిద్రించిరి. భగవంతుడు వారలకు స్వప్నమున

గాన్పించి 'మీ రీ రీతిగా శ్రమచెందుట నేను చూడజాలను. ఆలయద్వారమున నొక బండి కలదు. అందు నా ప్రతిమనుంచి డంకేశ్వరమునకు గొంపోవు'డని యాజ్ఞాపించగ, ఆ దంపతులు మేల్కాంచి ద్వారకాధీశుని విగ్రహమును బండియందుంచి డంకేశ్వరమునకు తీసికొనివచ్చిరి. బండి తోలినదెవరో తెలియదు.

మరురోజు ద్వారకాధీశమూర్తి కాన్పించక, పూజారులు విస్మితులై నలుదెసలకు వెతకుటకు వెడలిరి. ఈ సంగతి తెలిసి, రామదాసు ద్వారకాధీశుమూర్తిని గోమతీనదిలో దాచెను. పూజారులు గ్రామమంతయు గాలించి చివరకు గోమతీనదిలో స్వామిని బల్లెములతో వెదకిరి. అప్పుడా బల్లెము స్వామి కటిస్థలమున దగిలెను. ఆ గుర్తు నేటికిని గానవచ్చును. చివరకు పండాలు స్వామి విగ్రహమును బయటకు దీసిరి. రామదాసు, గంగాబాయి ఖిన్నులై చింతించుచుండ పౌరులందరు కలసి, స్వామి యాజ్ఞచే రామదాసు యీ మూర్తిని తీసికొనివచ్చెను. గాన యిచ్చట విడచివెళ్ళుమని పౌరులు చెప్పగ పూజారులు ఈవిగ్రహ మెత్తున బంగారమిచ్చిన విడతుము, లేదా మేమిత్తుమని పలికిరి. పాపము నిర్ధనుండగు రామదాసు చేయునదిలేక విచారించుచుండ నాటిరేయి రామదాసుకు భగవంతుడు స్వప్నమున కనిపించి 'దుఃఖించకుము. నీ భార్య చెవి యాభరణముతో నా మూర్తిని తూచు'మని యాజ్ఞాపించగ మరురోజు పౌరసమక్షమున నట్లు చేయగ, చెవి యాభరణమె భారముకాగా పూజారులు, పౌరులు విస్మితులైరి. నాటిరాత్రి స్వామి పూజారులకు స్వప్నమున కాన్పించి 'మీరు ద్వారకకు వెడలుడు. అచట చక్రతీర్థమున

నా ప్రతిమ గలదు. దానిని తీసి ప్రతిష్ఠింపుడు. నేను నిత్యము ఏడుముహూర్తములు డంకేశ్వరమున, ఒక ముహూర్తము ద్వారకయందున నుండగలనని చెప్పెను.

ఇట్లు భక్తజనసులభుడగు ద్వారకాధీశుడు భక్తుని సంతోష పెట్టుటకు, డంకేశ్వరమునకు వచ్చెను. డంకేశ్వరాలయ సమీప మున గంగాబాయి విశ్రాంతి తీసికొనిన పరమపవిత్ర ప్రదేశము, ఆమె చెవి యాభరణముతో స్వామిని తూచిన స్మృతిచిహ్నముగ నొక త్రాసును కలదు.

స్వర్గధామము:— ఈ మందిరమునకు చేరియే స్వర్గ ధామము కలదు. ఇందు పుణ్యాత్ములకు, మహాత్ములకు దేహా నంతరము కలుగు స్వర్గభోగములను చిత్రములద్వారా చిత్రించిరి.

కపిధ్వజకుండము:— డాకోరునుండి కపిధ్వజమునకు పోవు మార్గమున 18 మై. దూరమున కపిధ్వజకుండము కలదు. ఇందు స్నానముచేసిన చాలరోగములు నశించును.

డాకోరునందే ద్వారకాధీశుని ప్రధానమూర్తి యుండు టచే యాత్రికులు ముఖ్యముగ నిచట దిగి స్వామిని దర్శించి, ద్వారకకు వెళ్లుదురు. కార్తిక శు ౧౫ కు లక్షలకొలది యాత్రి కులు వత్తురు.

మాహాత్మ్యము:— గోమతీసరోవరమున స్నానముచేసి, డంకేశ్వరమహాదేవుని, శ్రీ రణఛోడ్‌జీనామధారియగు ద్వారకా ధీశుని దర్శించిన మనుజుడు పాపవిముక్తుడై సర్వసుఖముల ననుభ వించి, పుణ్యలోకముల బడయును. — నారదపురాణము.

## అహమదాబాద్

డాకోరునుండి ఆనంద్‌మీదుగ అహమదాబాదు చేర వలయును. అమహదాబాదు భారతదేశమునకు పశ్చిమమున గలదు. ఇది యొక ప్రసిద్ధమగు పట్టణము. స్టేషనుకు సమీపము ననే ధర్మశాల కలదు. ఈ నగరమునకు నలువైపుల ప్రాకారము కలదు. ఈ ప్రాకారమునకు 12 ద్వారములు గలవు. ఈ నగర మున 14 బజారులు కలవు. నగరసమీపమున సబర్మతీనదికలదు. షుమారు లండన్ అంత పెద్దపట్టణము.

ఈ నగరమున షుమారు 125 జైనమందిరములు గలవు. ఇవికాక హిందూమందిరములు కూడ చాల గలవు. ఇందు 'నారాయణమందిరము' చాల పెద్దది. ప్రాచీనమగు భవానీ కూపము, హరిదాదాకూపము, కాకరియానదము, శాంతిదాస మందిరము మొదలగు దర్శనీయస్థానములు గలవు. ఈ నగరము నకు సమీపమున సారసపురమునందు చింతామణీజైనమందిరము గలదు. అహమదాబాదులో ప్రతిసంవత్సరము చాల యుత్సవ ములు జరుగుచుండును. 400 సంవత్సరములకు పూర్వము యీ నగరమున దాదూ సంప్రదాయ ప్రవర్తకుడగు దాదూజీ జన్మిం చెను. ఈ నగరముయొక్క ఉత్తరద్వారమునకు 600 గజముల దూరమున హస్తిసింహుని జైనమందిరము గలదు. ఇచ్చట 130 అ. పొడవు, 100 అ. వెడల్పుగల విశాలప్రాంగణమందు జైనుల 17వ తీర్థంకరుడగు ధర్మనాధుని మందిరము గలదు. ఈ యాలయప్రాంగణమున నలువైపుల శిఖరములు గల మందిర ములు 53 కలవు. వీనియందు జైనవిగ్రములు కలవు. నగర

దక్షిణ ద్వారమునకు 2 ఫర్లాంగుల దూరమున 72 యకర ముల భూమియందు వ్యాపించియున్న కాకరియానదము గలదు. ఈనగరమునకు పశ్చిమమున సాబర్మతీనదిగలదు. సాబర్మతీతీరము నందహమ్మదాబాదు జిల్లాలో నీలకంఠ, ఖడ్గధారేశ్వర, భీమనాథ మందిరములు గలవు. సబర్మతీనదియొక్క ప్రాచీన నామము 'సాభ్రమతీనది'. ఈ నది 'అర్బలీ' నుండి పుట్టి సుమారు 200 మైళ్ళు ప్రవహించి 'కాంబా' వద్ద సముద్రమున కలియుచున్నది. ఇక్కడి మశీదులు, గోరీలు చాల యందమైనవి. ముస్లిం శిల్ప సంపదకు నిదర్శనములు. క్రీ. శ. 1424 లో నిర్మించిన జుమ్మా మశీదు యంత అందమైనది ప్రాచ్యఖండములోనే లేదు. దీని సమీపమున 'తీన్ దర్వాజా' (ద్వారత్రయము) కలదు. గాంధీజీ సబర్మతి ఆశ్రమము ముఖ్యమైనది.

## సాబర్మతి (వేదాశ్రమము)

అహమదాబాదునుండి సాబర్మతీస్టేషను చేరవలయును. సాబర్మతినది ప్రసిద్ధమగు నది. యాత్రికు లందు స్నాన తీర్థవిధు లాచరించుదురు. సాబర్మతినది కావలియొడ్డున దుగ్ధనాథ మహా దేవుని మందిరము కలదు. ఈ మందిర మొక యేకాంతస్థానమున గలదు.

దుగ్ధనాథమహాదేవుడు:— దుగ్ధనాథమహాదేవుని మంది రమునుండియే వేదాశ్రమమునకు పోవలెను. ఈమార్గ మరణ్యము నుండి పోవును. ఈ శివలింగము స్వయముద్భూతము. ఇచట ప్రసాదరూపమున భస్మము నిత్తురు.

యాత్రికులు మహాదేవుని పూజించి వేదాశ్రమమునకు వెళ్ళుదురు. ఈ యాశ్రమము నిరాడంబరముగ ప్రశాంతముగ నుండును. ఈ యాశ్రమమున కెదుట నొక విష్ణుమందిరము, దీనికి కుడివైపున శివమందిరము కలదు. ఇచటి విద్యార్థులకు వేదాధ్యయనము, గోసేవ ముఖ్యకర్తవ్యములు.

శ్రీ మహారాజు:— ఈ యాశ్రమమున పూర్వము 'శ్రీ మహారాజు' అను నొక మహాత్ముడు చిరకాలము వసించెను. ఆయన చాల కర్మిష్ఠి. ఆయన తన జీవితకాలమున 12 జ్యోతిర్లింగ యజ్ఞములు, కొన్ని విష్ణుయాగములును గావించెను. ఈయన పూర్వాశ్రమమునందు దక్షిణదేశమందలి యొకానొక 'ఎస్టేటునకు' దీవానుగా నుండెడివాడట. ఈ మహనీయుడు క్రీ.శ. 1905 సం॥న పాంచభౌతికదేహమును వీడెను.

## లింబడి (సత్యనారాయణ)

అహమదాబాదునుండి సురేంద్రనగర్ మీదుగ లింబడీ స్టేషనుకు చేరవలయును. ఇది మొదలు ద్వారకవరకు సౌరాష్ట్ర ప్రాంతము. సౌరాష్ట్రమున ముఖ్యముగా చూడ తగినవి:- శత్రుంజయపర్వతము, గిరినార్, జునాగడ్, రాజకోట, జామ్నగరు మొదలైనవి.


సత్యనారాయణ స్వామి

ఇది లింబడీరాజ్యమునకు రాజధాని. ఇచ్చట ననేక మందిరములు, దర్శనీయస్థానములు గలవు. ఇందు సత్యనారాయణ మందిరము చాల ప్రసిద్ధమైనది.

# శ్రీ ఛేలా సోమనాథేశ్వరుఁడు

లింబడీనుండి బోటడ్ (జం) మీఁదుగ జసదణ్ స్టేషనులో దిగవలయును. ఈమందిరము కథియవాడ్‌లో జసదణరాజ్యమున ఛేలగంగాతీరమున పర్వతములమధ్య గలదు. ప్రభాసమున గల సోమనాథేశ్వరలింగముతో దీనికి సంబంధము గలదు.

నేటికి 350 సం॥ లకు పూర్వ మీ ప్రాంతమంతయు మహమ్మదీయుల యధికారమునకు లోబడియుండెను. ఆ సమయమున ప్రభాసమునందొక రాజపుత్రవీరుడు మహమ్మదీయుల క్రింద సామంతునిగ నుండి రాజ్యము చేయుచుండెను. ఆతనికి 'మీనల్‌దేవి' యను నొక కుమార్తె గలదు. ఆమె శివభక్తురాలు. కాని తండ్రి యామెను తురుష్కచక్రవర్తి కిచ్చి వివాహము గావించెను. చివరకు యవనులామెను తమ రాజ్యమునకు గొంపోవనే తెంచిరి. కాని యామె సోమనాథుని వీడి రాజాలక, సోమనాథుని తనవెంట రమ్మని ప్రార్థించగ, ఈశ్వరు డందులకు సమ్మతించి 'నన్ను నీవు నీ రథమువెనుక నొక రథమునందుంచి గొంపొమ్ము. కాని నీవు వెనుదిరిగి చూడరాదు. అట్లు చూచిన నేనచ్చటనే యుండిపోవుదు' నని చెప్పెను.

రాజకుమార్తె యట్లే శివప్రసాదితమగు నోంకారేశ్వర లింగము నొక రథముమీఁదనుంచి తీసుకొనివెళ్లుచుండెను. ప్రస్తుత జసదణ రాజ్యమున రథము ప్రవేశించగనే యామె వెనుదిరిగి చూచెను. వెంటనే ఓంకారేశ్వరలింగముగల రథము ప్రయ్యలై యాలింగ మచ్చటనే పాతుకొనిపోయెను. అంత నారాజకుమార్తె మిక్కిలి విచారించి తానుకూడ నచ్చటనే యుండి శంకరుని

ప్రార్థించి చివర కామె సఖీసమేతయై యచ్చట గల యొక పర్వతమున లీనమైపోయెను.

ఆ స్థానమునందామె చరణచిహ్నములు నేడును గాన వచ్చును. ప్రస్తుత మిచ్చట నోంకారేశ్వరునకు మందిరము కట్టబడెను. దీనిని చిన్నసోమనాథమని యిచ్చటివారు పిలతురు.

## శత్రుంజయ పర్వతము

జసదణ్‌నుండి బోటడ్ (జం) లో మారి ధోలా, శిహోర్ (జం) మీదుగ పాలీటానా చేరవలయును.

పాలీటానాకు 1½ మైలు దూరమున శత్రుంజయపర్వతము కలదు. జైనుల పంచ పవిత్రపర్వతములందు శత్రుంజయము ప్రధానమైనది. 'శత్రుంజయ మాహాత్మ్య' మను పేరుగల యొక గ్రంథముకూడ గలదు. జైను లీ పర్వతమునకు యాత్ర గావింతురు. యాత్రికులు ఉదయము పర్వతముమీద కెక్కి సాయంకాలము క్రిందకు దిగివత్తురు. ఈ పర్వతమున వండుకొనుట, శయనించుట జైనమతాచారమునకు విరుద్ధము.

పాలిటానా:— ఇది ప్రసిద్ధ జైనక్షేత్రము. ఇక్కడి అయిదుపర్వతములలో శత్రుంజయము ప్రధానమైనది. ఈ కొండ మీద 863 జైనదేవాలయములు గలవు. ఇందలికొన్ని ఆలయాలు 11 వ శతాబ్దమున నిర్మించబడెను. ఇచటి ప్రకృతిశోభ, ఎంత చూచినను తనివితీరదు.

ఈ పర్వతము సముద్రతలమునకు 1980 అ. యెత్తుగలిగి యున్నది. కొండమీదకు పోవుమార్గము కష్టదాయకముగ నుం

డును. భూమికి కొద్దియెత్తున ఆంజనేయమందిరము గలదు. కొండ పైన రెండుశిఖరములు కలసియున్నవి. ఈ శిఖరములకు ప్రాకారము కలదు. ఈ ప్రాకారాంతరమున ప్రధాన మందిరములు గలవు. ఈ ప్రాకారమునకు 19 ద్వారములు గలవు. అనేక చిన్న మందిరములు గలవు. ఈమందిరములు నూటికి మించియుండును. ఇందు ఆదినాథ, కుమార్‌పాల్, విమలశాహ్, చతుర్ముఖ మందిరములు ముఖ్యములు. వీనియందు చతుర్ముఖమందిర మన్నిటి కంటెనెత్తైనది. గర్భాలయమునగల నాల్గు ద్వారములకు నాల్గు మూర్తులు కనబడుచుండును. అందుచేతనే దీనిని చతుర్ముఖ మందిరమని పిలచుచుందురు. ఈ మందిరమున సుమారు 125 విగ్రహములు కలవు. ఒకేచోట నిన్ని మందిరములు భారతదేశమునం దెచ్చటను గానరావు. కాశీ మొదలగు పుణ్యక్షేత్రములం దసంఖ్యాకములగు దేవాలయము లున్నను యవి దూరదూరము లందున్నవి. ఈ ప్రదేశము రమణీయముగ నుండును.

## ప్రభాసక్షేత్రము

పాలీటాణానుండి ధోలా(జం), ఖిజాదియా(జం) మీదుగ వీరవల్ చేరవలయును. బొంబాయినుండి కరాచీపోవు ఓడమీదుగ కూడ రావచ్చును.

ప్రభాసక్షేత్రమునే సోమనాథపట్టణమనియు పిలతురు. ఇటకు 1½ మై. దూరమున ప్రభాసక్షేత్రము గలదు. ఇట చాల ధర్మశాలలు కలవు. అన్నివసతు లున్నవి. ప్రభాసము భారతదేశమందలి పుణ్యక్షేత్రములందు చాల ప్రసిద్ధమైనది. పెద్దనగరము. అందమైనది. పురాతనచిహ్నములు కనుపించును. ఇట పోస్టాఫీసు,

తంతికార్యాలయము, పాఠశాలలు కలవు. ఇచటి వాతావరణము చాల బాగుండును. ఇచటి భాష గుజరాతి. కాని హిందీకూడ నందరకు తెలియును.

త్రివేణీ సంగమము:— ఇచ్చట సరస్వతీ, హిరణ్యా ఇలంకూ, కపిలానదులు సంగమించుచున్నవి. శ్రీకృష్ణు డీ స్థానమందే నిర్యాణమందెను. యాత్రికులిందు స్నానము, తీర్థవిధియు చేయుదురు.

బాణతీర్థము:— 'జర' యను వ్యాధుడు శ్రీకృష్ణుని పాదమును బాణముతో ఛేదించిన స్థానమిదియే. యదువంశము నశించినతరువాత శ్రీకృష్ణు డిచ్చటనే తనదేహముతో స్వధామమునకు వెళ్లెను.

పద్మతీర్థము:— శ్రీకృష్ణుడు తనపాదమునకు బాణము తగిలినతరువాత నిచ్చట తన పాదపద్మమును కడుగుకొనెను.

పూర్వగాథ:— దక్షునికిగల 27 కుమార్తెలను చంద్రునకిచ్చి వివాహము చేసెను. చంద్రుడు రోహిణియందు మిక్కిలి యనురాగముకలిగియుండుట గాంచి దక్షుడు, చంద్రుని 'క్షీణించిపొమ్మని' శపించగ, చంద్రుని సుధావర్ష మాగిపోగా, చంద్రుడు తన శాపవిముక్తికై దేవతలను ప్రార్థింపగ, వారందరును బ్రహ్మను ప్రార్థించిరి. బ్రహ్మ చంద్రునితో 'నీవు ప్రభాసక్షేత్రమున యీశ్వరుని ఆరాధించిన శాపవిముక్తుడ వగుదు'వని పలుకగా చంద్రుడు ప్రభాసమున 6 మాసములు మృత్యుంజయ మంత్రమును 10 కోట్లు జపించగా శంకరుడు ప్రసన్నుడై చంద్రున కమరత్వము నొసంగెను. మఱియు శుక్లపక్షమున క్రమాభి

వృద్ధి, కృష్ణపక్షమున క్రమక్షీణత నొందుమని చెప్పి చంద్రుని ప్రార్థనవలన పార్వతీసమేతుడై జ్యోతిర్లింగరూపమున వెలసెను. అందుచే నిచట మహాదేవుడు 'సోమనాథు' డని ప్రసిద్ధిగాంచెను. ఈ క్షేత్రమహాత్మ్యమును భారత, భాగవత, స్కాందాది పురాణములు విపులముగ వర్ణించినవి.

ప్రభాసక్షేత్రమున కేతెంచినవెంటనే యదువంశనాశనము కళ్లకుగట్టినట్లుండును. శ్రీకృష్ణుడే గురువు, తండ్రి, స్నేహితుడు గాగల 56 కోట్ల యాదవవరులనుగూడ వారి మదము నాశనము చేసివైచినది. ఇంక యితరుల విషయమున జెప్పనదేమున్నది ? ఈవిషయము చాల ప్రసిద్ధమైనది. ఈ గాథ శ్రీమద్భాగవత మున గలదు.

## సోమనాథము

ప్రభాసక్షేత్రమున యీ దేవాలయము కలదు.

సోమనాథమందిరము ప్రాచీనమైనది. క్రీ. శ. 1024 లో గజనీమహమ్మదు నాశనము చేసెను. నాటి శిథిలదేవాలయమే నేడు సముద్రతీరమున గలదు. గజనీ, ఈ శివలింగమును పెకలించుట కెత్నించి విఫలుడై కాల్చివేసెను. ఆలయమున ఇంద్రనీల మణి నిర్మితములగు 56 స్తంభములను పగులగొట్టి దోచుకొనెను. పిమ్మట భీమదేవుడను రాజు పునరుద్ధరించెను. క్రీ.శ. 1168 లో విజయేశ్వరకుమారపాల్, జైనాచార్యుడగు హేమచంద్ర సూరితో కలిసి సోమనాథయాత్రచేసి మందిరమును బాగుచేయించెను. క్రీ. శ. 1277 లో అల్లాయుద్దీన్, 1375 లో ముజఫర్, క్రీ.శ. 1413 అహమ్మద్ శాహ్ నాశనముచేసిరి. ఈ రీతిగా కరకు

తురకలచే భారతీయసంపద పలుతావులలో ధ్వంసముచేయబడి నేడునామమాత్రావశిష్టమైనది. నేడీమందిరమున శివలింగము లేదు. ఆలయపరికరమంతయు జీర్ణావస్థయందున్నది. ఈ భగ్నాంశము లను గాంచిన, ఈ మందిరమును నిర్మించిన కళాకారుల ప్రతిభ ప్రస్ఫుటమగును. క్రీ.శ. 1775 లో మహారాణి అహల్యాబాయి నిర్మించిన సోమనాథమందిరము కలదు. ఇది ద్వాదశజ్యోతిర్లింగ ములలో నొకటి. (చూ. ఘుశ్మేశ్వరము)

ఇవికాక నింకను యీ క్షేత్రమున చాల మందిరములు గలవు. అందు సూర్య, దేవీమందిరములు చాల ప్రసిద్ధమైనవి. బలరామకృష్ణుల మందిరముకూడ కలదు. బలరాముడు యోగ మార్గమున శరీరమును త్యజించిన స్థానముకూడ కలదు.

## రైవతకాద్రి (గిరినార్ పర్వతము)

వీరవల్ నుండి జునాగఢ్ (జం 51 మై.) లో దిగవలయును. జూనాగఢ్ స్టేషనుకు గిరినార్ పర్వతము 9 మై. దూరమున గలదు. జూనాగఢ్ నకే గిరినార్ పర్వతశిఖరము కనుపించుచుండును. ఇచట డోలీలు దొరకును. కొంతమంది యాత్రికు లొకేదినమున పర్వ తము నధిరోహించి, నాడే దిగివత్తురు.

గిరినార్ యెక్కుటకు వెడల్పయిన మెట్లు కలవు. మధ్య మధ్య విశ్రాంతిస్థానములు గలవు, తమ కర్మసంచితము క్షయ మగునట్లు భగవన్నామ ముచ్చరించుచు, నేత్రపర్వ మొనర్చుచు మార్గాయాసమును మరపించు ప్రకృతిసౌందర్యమును గాంచుచు యాత్రికులు పర్వతమును అధిరోహింతురు. మార్గమధ్యలో నొక సుందరమగు ధర్మశాల కలదు. తిరిగి రాజాలని యాత్రికు

లిందు బసచేసి మరురోజున వత్తురు. మరియు క్రమముగ 'గోముఖిగంగ' కొన్ని కుండములు, 'గోరఖనాథజీ' అగ్నిహోత్ర కుండములు, దేవిమందిరము కానగును. ఇచటి ప్రకృతిదృశ్యము చూచినకొలదియు చూడవలెనని యభిరుచి పుట్టించును.

ఈ పర్వతము హిందువులకేకాక, జైనులకును, బౌద్ధుల కును గూడ యాత్రాస్థలమైయున్నది. ఇచట కొన్ని మందిరములు గలవు. దానికి తరువాత పాండవగుహ, ముచికుందగుహ కలవు. ఈ ముచికుందగుహయందే ముచికుందమహాముని క్రోధదృష్టిచే కాలయవనుడు భస్మముచేయ బడెను. ఈ పరిసరములందు చాల గుహలు గలవు. కాని వానినిగూర్చి ఇచటి పండాలు పలువిధముల చెప్పుదురు. ఆ విషయములు తృప్తికరముగ నుండవు.



నేమనాథ్ మందిరము

గిరినార్‌కు 5 ప్రధానశిఖరములు కలవు. 1 నేమనాథ్, 2 గౌముఖి 3 గంగా 4 అంబాజీ 5 గోరఖ్‌నాథ్. గోరఖ్‌నాథ్ సముద్రమునకు 3666 అ. ఎత్తు. ఇవి యన్నియు సున్నితమైన శిలాశిల్పమునకు ఆదర్శములు.

దత్తాత్రేయస్వామి:— ఈ విధముగ క్రమముగ యాత్రికులు శ్రీదత్తాత్రేయుని పర్వత మధిరోహింతురు. ఇచట దత్తాత్రేయుని, కాళి మందిరములు కలవు. శ్రీ మహావిష్ణువు 24 అవతారములలో దత్తాత్రేయావతార మొకటి. ఈ ప్రాంతమందలి జనులు దత్తాత్రేయు నధికముగ నారాధించుచుందురు. దత్తాత్రేయుడు మార్గశిరమున జన్మించుటచే నీ మాసమున యాత్రికు లధికముగ నిచట వత్తురు.

కమండలుతీర్థము:— ఇచటనుండి సుమారు రెండువందల యడుగులక్రింద కమండలు తీర్థము కలదు. శ్రీ దత్తాత్రేయు లిచటనే స్నానముచేసెడివారు. అక్కడకువెళ్లుట చాల కష్టము

ఈ పర్వతమున నశోకునియొక్కయు, నాతని తరువాతి రాజులయొక్కయు, శిలాశాసనము లనేకములు గలవు. పర్వతము క్రింద 'దామోదరకుండము, రేవతీకుండము' లు కలవు. గిరినార్‌ను పూర్వము రైవతకాద్రియని పిలచెడివారు. ఈ పర్వతమున బలరాము డధికముగ విహరించుచుండెడివాడు.

జూనాగఢ్:— గిరినార్‌నుండి మరల జునాగఢ్‌కు రావలయును. జూనాగఢ్ చక్కని నగరము. అన్నివస్తువులు లభించును. ఇచట పోస్టాఫీసు, తంతికార్యాలయము, హాస్పటలు, పాఠశాలలు, ధర్మశాలలు కలవు. నరసీమెహతా:— జూనాగఢ్ నరసీమెహతా జన్మస్థలము. జూనాగఢ్ చేరగానే నరసీమెహతా యొక్క నిశ్చలమగు భగవద్భక్తి గుర్తునకు వచ్చును. ప్రేమోన్మత్తుడగు నరసింహామెహతా సర్వదా భగవత్కథాకీర్తనమున తన్మయుడై యుండువాడు. నరసీహామెతా గృహస్థుడు. ఆతనికి

సంతానముకూడ కలదు. అయినను నరసీమెహతా సంసారమును గూర్చి యేమాత్రమును శ్రద్ధవహించక భగవచ్చింతనయందు తల్లీనుడై యుండువాడు. నరసీమెహతా జీవితగాథను వినుచున్న దేహము పులకరించును. ఆతని భక్తి నిరుపమానము, అదర్శ ప్రాయము.

## సుదామాపురి (కుచేలుని పట్టణము)

జునాగఢ్‌నుండి జతలసర్ (జం 16 మై.) మీదుగ పోర్ బందరు (78 మై) స్టేషనులో దిగవలయును.

పోరుబందరుకు సమీపమున సుదామాపురము కలదు. ఇచటకు రాగానే మహాభక్తుడగు కుచేలుని సారళ్యత, భగవద్భక్తి మనస్సునకు తట్టును. కుచేలుని జీవిత శేషము లన్నియు స్మృతిపథమున దట్టును. సంతోషమునకు చాలిన యైశ్వర్యము, భగవద్భజనానందమునకు జాలిన యానందమును వేరొండు లేదు. ఇచట కుచేలునిమందిరము కలదు. ఇది పాలరాతితో కట్టబడినది. మిక్కిలి సుందరము. ఇటనుండి సముద్రమున స్టీమరులో ద్వారకకు వెళ్ళవచ్చును. బొంబాయినుండియు సముద్రముమీాద నిటకు రావచ్చును. (చూ. బొంబాయి)

త్రిభువనాధిపతియగు శ్రీకృష్ణు డాతనిబాల్యస్నేహితుడు. అయినను తన భక్తుని విషయము శ్రీకృష్ణునకు పట్టలేదు. ఇదియు శ్రీకృష్ణుని ప్రభావమె. చివరకు పిడికెడు అటుకులవలన మహైశ్వర్యసంపన్ను డాయెను. అట్లయ్యును కుచేలుడు తన జీవితమంతయు భగవద్భక్తిభావముతో గడపెను.

మహాత్మాగాంధి:— ఆదర్శమూర్తి, సత్యస్వరూపుడు, భారతపితయగు మహాత్మాగాంధి యీ పురముననే జన్మించెను. మహాత్ముని జీవిత మెరుగని మానవు డుండడు.

## రాజకోట

పోరుబందరునుండి జునాగఢ్ మీదుగ రాజకోట చేరవల యును. ఇది జంక్షన్, పెద్దస్టేషను. స్టేషనుకు సమీపమున ధర్మ శాల కలదు. ఇచటకు అహమ్మదాబాదు 155 మై. ఇది సౌరా ష్ట్రమునకు రాజధాని. ఇచట రాజావారి కోట, మ్యూజియము గలవు. ఆధునికపద్ధతులు గల చక్కని నగరము. ఇచట విష్ణ్వా లయము, అందుగల లక్ష్మీదేవి విగ్రహము చూడతగినవి.

## జామ్‌నగరు

రాజకోటనుండి జామ్‌నగరు చేరవలయును. ఇది రాజకోటకు 51 మైళ్లు. స్టేషనుకుసమీపమున ధర్మశాలగలదు. ఇది సౌరాష్ట్ర మున గల ప్రధాననగరములలో నొకటి. ఈ నగరమును రాజ పుత్రులు పాలించిరి. విశాలమైన వీధులు, సుందరభవనములు మ్యూజియము, శ్రీ రాజావారి ఆసుపత్రి చూడ ముచ్చటగ నుండును. కోట చాల యందమైనది. ఇచట పట్టు, జరి పనులు అందముగ చేయుదురు. ఇచట జైనదేవాలయములు చాలగలవు.

## ద్వారకా

నిశాచరైర్నాశిత సర్వధర్మా మాలోక్యభూమిం వసుదేవసూనుః,
జంఘానరక్షో గణమాత్మశక్త్యా తం ద్వారకేశం ఖలు సం భజేహమ్.

పోరుబందరునుండి రాజకోటమీదుగ ద్వారకకు వెళ్ళ వచ్చును. రాజకోటస్టేషను - పోరుబందరుకు 130 మైళ్ళు. రాజ

కోటకు 138 మై. ద్వారక. లేక ఓడమీదుగ ప్రయాణముచేసిన పోరుబందరుకు ద్వారక 52మై. మాత్ర ముండును. ఇట్లు ప్రయాణము చేయుటకు 'బొంబాయి - పోరుబందరు - కరాచీ' స్టీమరు నెక్కవలయును. (చూ. బొంబాయి - పోరుబందరు) పూర్వము రైళ్ళు ఓడలు లేనపుడు యాత్రికులు పోరుబందరునుండి నడచి కాని,ఎద్దుబండ్లమీద కాని ప్రయాణముచేసెడివారు. మార్గమధ్యమున దొంగలభయ ముండెడిది. నేడు చక్కనిమార్గములుకలవు.

ద్వారకాస్టేషనుకు ద్వారకాధీశుని మందిరము 2 మైళ్ళుండును. స్టేషనుకు ద్వారకాధీశ మందిర ధ్వజము కాన్పించును. యాత్రికు లాధ్వజమునకు నమస్కరింతురు. రైలుమీద ప్రయాణముచేయు యాత్రికులకు రాజకోట, లేదా జాంనగరునుండియు పండాలు వెంబడింతురు. ద్వారకాస్టేషనులో యాత్రికులు మిగుల జాగ్రతగా నుండవలయును. ఇచ్చట దొంగలభయ మధికము.

స్టేషనుకు సమీపమందే రావ్‌బహదూర్ బలదేవదాస్ దుధ్‌వాలా ధర్మశాల కలదు. ఇచట నన్నిసౌకర్యములు, మంచి నీటి వసతియు కలదు. కాని యిటకు ద్వారకాధీశుని మందిరము $1\frac{1}{2}$ మైలు దూరముండును. అందుచేత యాత్రికు లధికముగ ద్వారకాధీశమందిర సమీపమందే బసచేయుచుందురు. ద్వారక సప్తపురములలో నొకటి. చతుర్ధామములందొకటి. అందుచే నిది చాల పవిత్రమైనది. ఇచట జగద్గురు శ్రీశంకరాచార్యులవారి మఠముకూడ కలదు. ప్రస్తుతపు మఠాధిపతులు నూతన శిష్యవర్గమునకు మంత్రోపదేశము చేయుచుందురు.

గోమతి:— ద్వారకలో ప్రధాననది గోమతి. ఈ నది ధనురాకారము కలిగియున్నది. ఇది సముద్రమున కలియును. గోమతీతీరమున చాల మందిరములు, ఘట్టములు కలవు. అందు



గోమతి ద్వారక

గోమతీఘాట్ (దీనిని సంగమఘాట్ అనికూడ నందురు), వాసుదేవఘట్టము, గంగాఘట్టము, బ్రహ్మఘట్టము, పాండవఘట్టము, రూపఘట్టము, పార్వతీఘట్టము ప్రసిద్ధమైనవి. గోమతీ దక్షిణ తీరమందైదు సరోవరములు గలవు.

గోమతికి స్నానమునకు వెళ్ళునపుడు యాత్రికులు బరోడా ప్రభుత్వమునకు రు. 1-8-0 పన్ను కట్టవలయును. రైళ్లులేని కాలమున రు. 5 లు తీసికొనెడివారు. ఈ రీతిగా యాత్రికులవలన మొదటిరోజునమాత్రము తీసికొని రశీదులు యిత్తురు. ఇక మరల చెల్లించనవసరములేదు. గోమతినదిలోనికి చక్కని మెట్లు కలవు. యాత్రికులు యథావిధిగ స్నానముచేసి తీర్థవిధి చేయుదురు. గోమతియందు చేప లధికముగ గలవు.

ద్వారకాధీశమందిరము:— క్రిందనుండి 56 మెట్లు ఎక్కిన మీదట మందిర ముఖ్యద్వారము కనుపించును. మెట్లపొడవున వెన్న, పంచదార, పూలు, తెరలు అమ్ము దుకాణములు గలవు. శ్రీద్వారకాధీశునివిగ్రహము చతుర్భుజములతో శిరమున మనోహరమగు మకుటముతో, చెవులకు మకరకుండలములు, చేతులందు శంఖ, చక్ర, గదా, పద్మములతో, వక్షస్థలమున కౌస్తుభమణితో, శ్యామలవర్ణముగలిగి యతిమనోహరముగ నుండును. పచ్చనిపట్టుబట్టల నీ స్వామి నలంకరింతురు. ఇచట భగవంతుడు రాజరాజేశ్వరుడు. యాత్రికులు వివిధస్తోత్రములతో భగవంతుని స్తుతించి నమస్కరింతురు. దక్షిణదేశమునందువలె నిచ్చట భక్తులు భగవంతునకు దూరముగ నుండనవసరము లేదు. స్వహస్తములతో భగవంతుని పూజించవచ్చును. ద్వారకాధీశ మందిరమున ప్రవేశశుల్కముగ రోజు 1 కి రు. 0-8-0 లు తీసికొందురు.

ద్వారకాధీశునిపూజ:— స్వయముగ భగవంతుని పూజింప నెంచు భక్తులు రు. 1-8-0 లు దక్షిణ యీయవలయును. ఇచ్చుకొనలేనివారు రు. 0-8-0 యిచ్చిన స్వామిపాదములను మాత్రము స్పృశించవచ్చును. శ్రీ ద్వారకాధీశున సేవా కైంకర్యములకు వలయు నేర్పాట్లన్నియు బరోడాప్రభుత్వము గావించును. యాత్రికులవలనగూడ వేలకొలది యాదాయము వచ్చును.

పూర్వము జరాసంధునితో యుద్ధముచేయలేక శ్రీకృష్ణుడిచటికి పారివచ్చెను. ఈ కారణముచే స్వామిని 'రణఛోడ్, రణచోర్ = యుద్ధమునుండి పారిపోయినవాడు' అని యీ ప్రాంతమువారు పిలుతురు.

ప్రదక్షిణమందు కుశేశ్వరమహాదేవుడు, బలరాముడు, ప్రద్యుమ్నుడు, రుక్మిణ్యాద్యష్టమహిషులు, వేణీమాధవుడు, లక్ష్మీ నారాయణస్వామి, పురుషోత్తముడు, దేవకీ మొదలైన మందిరములు గానవచ్చును. ఈ మందిరములలో రు. 0-4-0 లు, లేక 0-8-0 లు దక్షిణ నిచ్చిన యాత్రికులు పూజసేయవచ్చును.

ద్వారకాధీశ మందిరమునుగూర్చియు, గోమతిని గురించియు నిచటివార లొక కథ చెప్పుదురు. యదువంశమంతయు నశించినమీదట మిగిలినస్త్రీలను శిశువులను అర్జునుడు హస్తినాపురమునకు తీసికొనివెళ్లెను. శోభావిహీనమగు నానగరరాజమును సముద్రుడు తనలో లీనముగావించుకొనెను. ఉద్యానవనములు, కోటలు, సౌధములు సర్వము సముద్రునిలో లీనమయ్యెను.

ఇదిచూచి బ్రహ్మ మరల ద్వారక నుద్ధరింపనెంచి సముద్ర తీరమున తపముచేయ నారంభించెను. కొంతకాలమున కొకనాడు ఆకాశవాణి 'చక్రతీర్థమున శ్రీకృష్ణుని ప్రతిమకలదు. అది గోమతీ తీరమున ప్రతిష్ఠించిన, కృష్ణు డందు నివసింపగల'డని పలికెను. అంత చతురాననుడు తపము చాలించి, చక్రతీర్థమునుండి విగ్రహమును తెచ్చి గోమతిని యావాహ్వానించి, ఆ జలముతో స్వామి నభిషేకించి యథావిధిగా ప్రతిష్ఠించెను. విశ్వకర్మ యొకరాత్రియె యీమందిరము నిర్మించెను. ఇటు లీ ద్వారకాధీశుడు బ్రహ్మచే ప్రతిష్ఠింపబడెను.

ద్వారకాపరిక్రమణము:—— ద్వారకా పరిక్రమణమునం దనేకతీర్థముల దర్శించవచ్చును. అందు స్వర్గద్వారము, దామోదరకుండము, గంగాకుండము, కృకలాకుండము, దూర్వాస కుం

డము ప్రధానములైనవి. శ్రీకృష్ణుని పట్టమహిషియగు 'జాంబవతీదేవి' శరీరత్యాగము గావించిన ప్రదేశమును, నరసీమెహతా హుండీకి భగవంతుడు సొమ్మియిచ్చిన స్థలమును గానవచ్చును.

ధ్వజారోహణము:— ధనికులు భక్తులు యిచట నూతన ధ్వజారోహణముచేయునపుడు పెద్దయుత్సవము జరుగును. ధ్వజమునకు 50 గజముల పొడవు వస్త్రము కావలయును. బ్రహ్మపురియందు వివిధభక్ష్యములు తయారుచేసి స్వామి కర్పింతురు. ఈ సమయమున భక్తులు, యాత్రికు లందరు ఆలయమునకు ముందు నిలువబడి భగవన్నామసంకీర్తన చేయుచుండ, పూజారి మందిరముమీదకెక్కి పాతధ్వజము తీసి నూతనధ్వజమును స్థాపించును. వెంటనే అక్కడనుండి పూజారి యొక టెంకాయ క్రిందకు పడవేయును. దానిని ప్రసాదముగ నందరకు పంచుదురు. పిమ్మట బ్రాహ్మణ సమారాధన జరుగును. ఈ కార్యమున కంతటికి షుమా రొక వెయ్యిరూపాయలు వ్యయమగును.

గోపీకుండము:— ఇది ద్వారకాధామమునకు ప్రధానమైన తీర్థము. ఇచ్చటకు పోవుటకు మోటార్లు, ఎద్దుబండ్లు కలవు. గోపీకుండము పరమపవిత్రమైనది. ఇటకు పోవుమార్గము అరణ్యప్రదేశము. ఇది యొక చిన్న సరస్సు. ఈ సరస్తీరమున గోపీనాథుని యాలయము కలదు. దీనికి సమీపముననే ఒక ధర్మశాలయు, సాధువుల మఠమును గలవు. యాత్రికులు గోపీకుండమున స్నానతీర్థవిధుల భక్తిపురస్సరముగ గావించి, గోపీనాథుని దర్శించి పూజింతురు. ఆగదలచినవారు ధర్మశాలలో బసచేయవచ్చును. ఈ సరస్సులో పచ్చనిరజస్సు తేలియాడుచుండును. దీనిని గోపీ

చందనమని చెప్పుదురు. ఇది పవిత్రమైనదని భావింతురు. దీనిని భక్తులు గృహములకు తీసికొనిపోయెదరు. బేటద్వారకకు యిచటి నుండి ఓడమీద వెళ్ళవచ్చును. ఖర్చు తక్కువ, దూరమెక్కువ. ద్వారకనుండియు వెళ్లవచ్చును.

## నాగేశ్వరము

ఇది గోమతీద్వారకనుండి బేటద్వారకకు పోవుమార్గమున పూర్వోత్తరములందు గలదు. షుమారు 12, 13 మైళ్లుండును. ఇట నాగేశ్వరదేవాలయము గలదు. ఇది ద్వాదశజ్యోతిర్లింగము లందొకటి. ఈ విషయమునకు 'నాగేశం దారుకావనే' యని ప్రమాణముగూడ చూపుదురు. కొందరిది నిజాము రాష్ట్రమున గల ఔంఢగ్రామమున గలదందురు. ఈ గ్రామము 'చోండీ' స్టేషనుకు 12 మై. — మరికొందరు అల్మోడాకు 17 మైళ్లు పూర్వోత్తరమున గలదందురు. 'యాగేశ్ లేక జాగేశ్వర్' లింగమని చెప్పుదురు.

నాగేశ్వరక్షేత్రోత్పత్తినిగురించి శివపురాణమునందీవిధముగ గాథ కలదు — పూర్వము శివభక్తుడు, సదాచార సంపన్నుడు నగు సుప్రియుడను నొక వైశ్యుడొకప్పుడు పరివారముతో నావికాయానము చేయుచుండ, దారుకుడను రాక్షసుడు సుప్రియుని పరివారసహితముగ బట్టుకొని పట్టణమునకుగొంపోయి కారాగారబద్ధులగావించెను. సుప్రియుడు యథాప్రకార మిచ్చట కూడ శివధ్యానరతుడై పరివారమునకు శివమాహాత్మ్యము చెప్పుచు కాలము గడుపుచుండ, దారుకునకిది తెలిసి యొక నాడు సుప్రియునికడ కరుదెంచి శివధ్యానములోనున్న సుప్రియుని

గాంచి రాక్షసుడు క్రోధోద్దీపితుడై వెంటనే సుప్రియుని వధించుటకు సేవకుల కాజ్ఞయిచ్చెను. భక్తపరాధీనుడగు పరమేశ్వరుడు వెంటనె ప్రత్యక్షమై సుప్రియునకు పాశుపతమిచ్చి రాక్షస సంహారము చేయ నాజ్ఞాపింప, సుప్రియుడు రాక్షససంహారము చేసి, శంకరుని స్తుతించెను. సుప్రియుని భక్తికిమెచ్చి శంకరుడు జ్యోతిర్లింగరూపమున నిచట యావిర్భవించెను. ఈ లింగమునకు నాగేశ్వరలింగమని నామము కలిగెను. ఈ నాగేశ్వరదర్శనము సర్వపాప ప్రశమనము, సర్వకామ్యదాయకమని శివపురాణము చెప్పుచున్నది. సుప్రియుడు శివానుగ్రహముచే శివలోకముచుబొందెను.

## చిన్న ద్వారక

"కృష్ణాయ యాదవేంద్రాయ హరయే పరమాత్మనే,
ప్రణతక్లేశ నాశాయ గోవిందాయ నమోనమః."

గోమతీ ద్వారకనుండి బేట (చిన్న) ద్వారక వెళ్ళుటకు ద్వారకలో రైలెక్కి 'ఓఖా పోర్టుస్టేషను'లో దిగవలయును.

ఓఖాపోర్టు:— ఇది సౌరాష్ట్రదేశమునకు ఆగ్నేయమున ఒక ముఖ్యమగు రేవుపట్టణము. ఇచట ద్వారకాపీఠ్ కలదు. ఇది హిందువుల ముఖ్య యాత్రాస్థలము. శ్రీమహావిష్ణువు 'శంఖుడు' అను రాక్షసుని సంహరించి, ఆతని భార్యను మన హిందువులు నిత్యము పూజించు 'తులసి'గా నిర్మించెను. ఇచటి దేవాలయములన్నియు కృష్ణపరమాత్మ గోపికల గాఢభక్తిని చూపునవియే.

ఇచట గొప్ప సిమెంటు ఫ్యాక్టరీ, ఆంగ్లేయులకు వసతి భవనము గలదు.

ఇచటకు కొలదిదూరమున జేశీఘాటు కలదు. ఇటనుండి సముద్రమున స్టీమరులో రెండు మైళ్లు ప్రయాణము గావించిన బేటద్వారక దర్శించవచ్చును.

బేటద్వారకయందు చాల ధర్మశాలలు గలవు. అన్నిటి లోను సేట్ నన్వాయ్యాలాల్ కలకత్తావాలా ధర్మశాల చాల సుందరమైనది. ఇచట నన్నివసతులు కలవు. పద్మసరోవరములో (రణభోడ్‌సాగర్) యథావిధిగ స్నాన తర్పణాదు లాచరించి, భగవద్దర్శనమునకు బయలుదేరుదురు. ఇచట మందిర ప్రవేశము నకు రు. 1-4-0 తీసికొందురు. ఈ రుసుముచెల్లించనిదే భగవద్దర్శ నము లేదు. ఈమందిరము పెద్దభవనమువలెనున్నది. మందిరాంత రమున (గర్భాలయమున) ప్రవేశించుటకు రు. 0-8-0 చెల్లించ వలయును. ఎన్నిమారులుప్రవేశించిన అన్నిమారులు రు. 0-8-0 చొప్పున చెల్లించవలసినదే! ఇచట భగవంతుని శృంగారమంతయు గోమతీద్వారకయందువలెనె గలదు. ఇచట స్వామియాభరణము లొక లక్షరూపాయలు విలువనుండునని చెప్పుదురు.

స్వర్గధామము:— ఇచట పుణ్యపురుషులకు లభించు స్వర్గభోగములు దిగ్దర్శముగ జూపబడెను. ఇచట నొకయద్దమున భగవన్మందిరదర్శనము చూడనచ్చును. ఇది చాల నాశ్చర్యజన కముగ నుండును. ప్రదక్షిణము చేయునపుడు ప్రద్యుమ్నుడు, దేవకి, రుక్మిణ్యాద్యష్టమహిషుల దర్శనముకూడ నగును.

స్వామియొక్క మహాపూజయందు పాల్గొనదలచినవారు ఆ ఖర్చంతయు భరించవలయును. ఈ మందిరముయొక్క సేవా కైంకర్యములన్నియుకూడా బరోడాప్రభుత్వమె గావించును.

ఈ స్థానము గోమతీద్వారకకంటె నెక్కుడు మనోహర మైనది. నలువైపుల సముద్రము, ఉత్తాలతరంగాకులసంకులమై యుండును. సాయంకాలము మందిరమందలి శంఖనాదములు యాత్రికుల హృదయములను గంభీర భక్తిభావ ప్రపూరితము గావించును.

స్వర్ణద్వారక:— ఇచట నొకప్రదేశమున స్వర్ణద్వారక కలదు. ఇది భగవంతుని స్వర్ణద్వారకకు ప్రతికృతి. దీనిని దర్శించుట కొక యణా దక్షిణ దీసికొందురు.

పీపాభక్తుని ముద్ర:— మందిరమునకు బయట నొక యశ్వత్థవృక్షముక్రింద "పీపాభక్తునిముద్ర" వేయుదురు. చాల మంది సన్న్యాసులు, బైరాగులు ఈముద్రను వేయించుకొందురు. ఈముద్ర వేయించుకొనిన యమదండనయుండదనియు, పుత్రులు లేకున్నను, పిండదానాదికము జరుగకున్నను దుర్గతి నొందవలసిన యగత్య ముండదనియు చాలిమంది విశ్వాసము.

## శంఖోద్ధార తీర్థము

బేటద్వారకకు సమీపమున శంఖసరోవరము గలదు. పూర్వమిచట నొకఋషి తపస్సుచేయుచుండెను. ఆయనశిష్యుడు గురువుశంఖమును యీసరస్సులో దాచెను. ఈ విషయము దివ్య దృష్టిచే ఋషి తెలిసికొని, శిష్యుని 'నీవు శంఖ మవుగాక' యని శపించెను. శిష్యుడు తప్పును మన్నించుమని ప్రార్థించగ, 'ద్వాపరమున శ్రీకృష్ణుడు నిన్నుద్ధరించును. నాటినుండియు నీ సరస్సునకు శంఖోద్ధార సరోవరమని పరగును. మరియు నీ సరస్సున స్నానముచేసిన — ప్రభాసము, గంగ, గోదావరి, నర్మద మొదలగు

నదులయందు స్నానముచేసినఫలము కలుగు'నని ముని చెప్పెను. వెంటనే శిష్యుడు శంఖరూపములోనుండి పైవిధముగ నుద్ధరింపబడెను. ఈ సరస్తీరమున 'శంఖనారాయణ' మందిర మొండు గలదు. ఈ సరస్సునుగూర్చి పురాణములలో వర్ణింపబడినది.

బేటద్వారకాప్రదక్షిణము:— యాత్రికులు సముద్రమున స్టీమరుమీద బేటద్వారకకు ప్రదక్షిణము చేయుదురు. ఇదియొక చిన్నద్వీపము. ఈ ద్వీపమున సాలగ్రామములు, చక్రములు (సుదర్శనచక్రప్రకృతి) లభించును. యాత్రికులు వీనిని గృహములకు గొంపోవుదురు.

ఇక్కడితో సౌరాష్ట్ర ప్రాంతము సమాప్తము. దీని వైశాల్యము 21,451 చ. మై. ఈ రాష్ట్రమున చిన్నవి పెద్దవి వందలాది సంస్థానములు గలవు. జనాభా షుమారు 41,37,359. రాజధానీ నగరము రాజకోట.

## భావనగర్

పాలీటానాలో బండిమారి భావనగరు చేరవలయును.

ఇది రేవుస్థలము, విద్యా కేంద్రము. విశ్వవిద్యాలయ భాగములన్నిటికి ప్రత్యేకముగ కళాశాలలు గలవు. పెద్ద గ్రంథాలయము కలదు. మ్యూజియము, హాస్పటలు, యంత్రశాలలు, గౌరీశంకరసరస్సు, విక్టోరియాపార్కు, తక్తేగంగా చూడతగినవి. ఇచట చలువరాతి సుందరదేవాలయములు గలవు.

# బీజాపూర్

ఇక్కడి శిల్పము మిక్కిలిచక్కనైనది. హిందూ మహమ్మదీయ సంప్రదాయములు యిందులో చక్కగ మేళవించబడెను. ఇక్కడ ముఖ్యముగా చూడతగినవి గోల్ గుంబజ్. ఇది ఆరువందల చదరపు అడుగుల వేదికమీద నిర్మింపబడినది. ఇది ప్రపంచములో నితరత్ర నిర్మించబడిన డోమ్‌లన్నిటిలో రెండవది. దీనిలో మరొక విచిత్రలక్షణము – రహస్యముగ మాట్లాడిన గట్టిగ వినిపించుట. ఈ ప్రాంతమంతయు ప్రాచీనశిల్పకళకు కేంద్రము.

# సిద్ధపురము (మాతృగయ)

ద్వారకనుండి రాజకోట్ (జం) – సురేంద్రనగర్ (జం), వీరమ్‌గాఁవ్ (జం) ల మీదుగ సిద్ధపురం చేరవలెను. ద్వారక రాజకోటకు 138 మైళ్లు. అహమ్మదాబాదుకు సిద్ధపురము 43 మైళ్ళు. ఇది కపిలుని జన్మభూమి. దీనిని మాతృగయ యని కూడ పిలతురు. గయ పితృతారకము. ఇది మాతృతారకము. గయా శ్రాద్ధమువలన పితృ పితామహాదులు తరింతురు. ఇచ్చట మాతృ పక్షీయులందరు తరింతురు. స్టేషనుకు సమీపమున బరోడా మహారాజావారి ధర్మశాల కలదు.

బిందుసరోవరము:— ఇచట ప్రధాననది సరస్వతి. ముఖ్య తీర్థము బిందుసరోవరము. ఇది గ్రామమునకు సుమారొక మైలు దూరమున గలదు. బిందుసరోవర మొక చక్కనిసరస్సు. నలు వైపుల చక్కనిమెట్లు గలవు. ఈ సరోవరతీరమున పాండవులు కొంతకాలము వసించినటుల భారతారణ్యపర్వమున గలదు. ఈ సరస్తీరమునందే కర్దమమహాముని తపమాచరించెను. భగవంతుడు

కర్దముని తపమునకు ప్రసన్నుడై ప్రత్యక్షమగుడు, యాతని యనన్యభక్తి గాంచినంతనే భగవంతుని నేత్రములనుండి యానం దాశ్రువులు జారి యీ సరస్సున బడినవి. అందుచే నిది బింను సరోవరమని సార్థకమాయెను. ఈ సరస్తీరమున శేషశాయి, లక్ష్మీనారాయణ, సీతారామ మందిరములు ప్రధానములు. కర్దమ దేవహూతు (కర్దముని భార్య) ల మందిరముకూడ కలదు. యాత్రికులు బిందుసరోవరమున స్నాన తీర్థవిధులు ఆచరించవల యును. ఇచట సిద్ధేశ్వరమహాదేవమందిరము గలదు. దీనికి సమీ పమున జ్ఞానవాపియను నొక బావి కలదు. దిగుటకు మెట్లు కలవు.

ఇది కపిలుని జన్మభూమి. కపిలుడు తనతల్లి (దేవహూతి) కి సాంఖ్యశాస్త్రము నుపదేశించి, పిమ్మట నాతడు గంగాసాగర సంగమమునకు వెడలిపోయెను. దేవహూతి యిచటనే దేహ త్యాగముగావించెను. సాధ్వీమణియగు దేవహూతి మృతశరీరమె సరస్వతీనదీరూపమున ప్రవహించినటుల భాగవతమున గలదు. ఈ నదియం దొకవిధమగు పాములు కలవు. కాని యవి యెవ్వరికిని బాధను కలిగించవు.

రుద్రమాలమందిరము:— ఈమందిరమున నొకరిమీద నొకరుగ నేకాదశరుద్రులు చిత్రింపబడిరి. ఈ విగ్రహములు చాల సుందరముగనున్నవి. ఈ మందిరము చూడతగినది.

ఇవి గాక "గోవిందరాయమందిరము, రుద్రమహాలాయ మందిరము"లు చూడతగినవి. ఈ మందిరమును అల్లాయుద్దీన్ క్రీ.శ. 1300 సం॥లో పడగొట్టించెను. మరల పునరుద్ధరింపబడినది.

మాహాత్మ్యము:— బిందుసరోవరమున స్నాన తర్పణ శ్రాద్ధములవలన పితృదేవతలు తరించి రుద్రలోకమును పొందుదురు. మాతృపక్షమునకు చెందిన పితృదేవతా శ్రాద్ధమువలన యధికఫలము కలదు. ఇది కేదారమువలె మిక్కిలి పవిత్రమైన క్షేత్రము. — పద్మపురాణము.

## పాలన్ పూర్

సిద్ధపూర్ (మాతృగయ) స్టేషనుకు ఉత్తరముగ 19 మైళ్ళదూరమున పాలన్‌పూర్ స్టేషను కలదు. ఇది యొక రాజధానీనగరము. ఇచ్చట పర్వతము లధికముగ గలవు. ఈ రాజ్యమున బనాస్, సరస్వతీనదులు గలవు. ఇచ్చట ననేకమందిరములు, సరస్వతీనదీతీరమున చాలదర్శనీయస్థానములును గలవు.

## అర్బుదగిరి (ఆబూ)

ఆబూపర్వతము లేక మౌంటు ఆబూ రాజపుత్రస్థానము. గుజరాతునకుచెందిన ప్రధాన పర్వతశ్రేణి. అహమ్మదాబాదు ఢిల్లీకిపోవు రైలులో 'ఆబూరోడ్' స్టేషనులో దిగవలయును. ఇచ్చటకు 18 మైళ్ళదూరమున ఆబూపర్వతముకలదు. బస్సులు కలవు. మౌంటుఆబూలో ధర్మశాలలు లేవు. హోటలునందు గాని, మందిరములందుగాని బసచేయవలయును. ఇది జైనుల యాత్రాకేంద్రము. ఇక్కడి దిల్వారాదేవాలయము జైన శిల్ప వైభవమునకు నిదర్శనము. ఇది పాలరాతితో నిర్మించబడెను.

ప్రకృతిసౌందర్యముచే నీ ప్రదేశ మొంతయు మనోహరముగ నుండును. ఉన్నత పర్వతశిఖరమధ్యభాగమున సువిశాల

మగు 'నక్కీ-సరోవరము' నయనానందకరముగ నుండును. ఇది ఇచ్చటి ప్రధానతీర్థము. గౌతమమహర్షి దీనిని గోళ్ళతో త్రవ్వె ననియు, నందుచేతనే దీనికి నఖసరోవరమని పేరువచ్చెననియు, అదియే నేడు నక్కీ-సరోవరముగ మారెననియు చెప్పుదురు. ఇది యొక మైలు వైశాల్యము కలిగియున్నది. ఈ సరస్సునకు పరిసర పర్వతశిఖరములందు రాజపుత్రస్థానమునకుచెందిన ప్రభుత్వకార్యాలయభవనము లతి మనోహరముగ నుండెను. ప్రకృతిసౌందర్య వైభవమునకు రాజనైతికమహత్త్వమునకు నీ ప్రదేశమెంత ఖ్యాతి గాంచెనో ధార్మికదృష్టియందుగూడ నంత ప్రసిద్ధి నొందెను.

రఘునాథ మందిరము:— ఇది నక్కీ-సరోవరతీరమున గలదు. ఇందు సుమారు రెండువందలమంది యాత్రికులు బస చేయవచ్చును. మందిరాధికారులు యాత్రికుల కన్ని సౌకర్యములు కలుగజేయుదురు. రఘునాథస్వామి విగ్రహము మిక్కిలి సుందరముగ నున్నది.

శ్రీధూలేశ్వరమహాదేవిమందిరము:— ఇది శ్రీ రఘునాథమందిర సమీపమున గలదు. ఇందును సుమారు నూరుమంది యాత్రికులు బసచేయనగును. ఇక్కడను అన్ని సౌకర్యములు గలవు.

ప్రధానతీర్థములు:—

అర్బుదాదేవి:— ఆబూయొక్క అసలుపేరు అర్బుదగిరి. ఈ పర్వత ప్రధానశిఖరమున అర్బుదాదేవి మందిరము గలదు. ఇది 51 దేవపీఠములందొకటి. మందిరమువరకు చక్కని మెట్లు

కలవు. దేవీవిగ్రహ మొక చీకటిగుహాయందు కలదు. ఈ గుహ లోనికి కూర్చొనియే వెళ్ళవలెను.

వసిష్ఠాశ్రమము - గోముఖము:— ఇది యిచ్చటకు 4 మైళ్ళ దూరమున గలదు. తొలుత పర్వతమునుండి ½ మైలు క్రిందికి దిగవలయును. ఇచ్చట వసిష్ఠమందిరము గలదు.

అచలేశ్వరమందిరము:— ఇది యొక వేయిసంవత్సరములకు పూర్వము నిర్మింపబడినట్లు తోచెడిని. దీనికి సమీపమునగల కొన్ని స్థానములు చూడతగినవి.

దిల్ వాడా:— ఇచ్చట నొక సుప్రసిద్ధ జైనమందిరము కలదు. శిల్పకళ కిది భారతదేశమున మిక్కిలి ప్రసిద్ధిగాంచినది. ఇది ఆబూపర్వతమునకు షుమారు రెండుమైళ్ళుండును. ఇట 3, 4 జైనమందిరములు గలవు. పాలరాతిమీద చెక్కబడిన యీ శిల్పకళనుగాంచి శిల్పమర్మముల నెరింగినవారు సైతము ఆశ్చర్యచకితులగుచుందురు. ఇందొక మందిరము నిర్మించుటకు 18 కోట్ల, 51 లక్షల రూపాయలును, రెండవ మందిరమునకు 12 కోట్ల 51 లక్షలరూపాయలు వ్యయమైనది.

గురుశిఖరము:— ఇచట దత్తాత్రేయస్వామి పాదుకలు కలవు. ఈ శిఖరము చాల యున్నతమైనది. ఇది ఆబూపర్వతమునకు 6 మైళ్ళ దూరమున గలదు.

## అంబికాజీ

ఆబూకు సమీపమునగల అర్బుదారణ్యమందలి 'ఆరాసుర' మను పేరుగల పర్వతశిఖరమునం దంబికామందిరము కలదు.

ఇది శాక్తపీఠములందొకటి. ఇట సతీదేవి హృదయము పడెను. (చూ. మణికర్ణిక) ఇది ఆబూరోడ్ స్టేషనుకు 14 మైళ్లు. ఈ మార్గము సుందరమగు వనముమధ్యనుండి పోయెను. బస్సులు ఎద్దుబండ్లు, టాంగాలు కలవు.

ఆబూపర్వతము ధవళశిలాసంయుతము. ఈ కారణముచే నిచటివారు అంబికాదేవిని 'ధొలాగఢ్ వాలీ'యని పిలతురు. ఇది పాలరాతిమందిరము. మిక్కిలి పురాతనమైనది. మందిరప్రాంతమున షుమారు 60 ధర్మశాలలు కలవు. వీనియందు మంచము, పరుపు, వంటపాత్రలు యిత్తురు. గుజరాత్ ప్రాంతమున అంబికాదేవి యారాధన లేని గ్రామమే లేదు. శ్రీకృష్ణుని కిచటనే కేశఖండన జరిగెనని చెప్పుదురు. అంబికాదేవిని హిందువులేకాక పారసీకులు, జైనులు, ముసల్మానులుకూడ నుపాసించుచుందురు.

అంబికాదేవిని ఉదయము బాలగా, మధ్యాహ్నము యువతీరూపమున, సాయంకాలము వృద్ధరూపమున నలంకరింతురు. ఇచట దేవికి వాస్తవముగ నాకృతి యేమియును లేదు. యంత్రముమాత్రము కలదు.

మందిరసమీపమున విశాలప్రదేశము గలదు. అచ్చట పెద్దపెనమునం దెల్లపుడు నేయి సలసలకాగుచుండును. ఈ స్థానమును 'చాచర్' అందురు. ఇచటకు రజస్వలయైన స్త్రీలుగాని, సంవత్సర సూతకులుగాని రారాదు. వచ్చినచో నీఘృతభాండమున భయంకరమగు పెద్ద పెద్ద ధ్వను లుత్పన్నములగును. భాద్రపద, ఆశ్వయుజ, కార్తిక పూర్ణిమల కిచ్చట విశేషోత్సవముజరుగును.

అంబికాఖేలనము:— మందిరమునకు వెనుక కొంచెము దూరమున 'మానససరోవర'మను నొక సరస్సు కలదు. ఈ సరస్సునకు దక్షిణముగ 'అజాయీ'మాత మందిరము కలదు. ఇచ్చట కొక క్రోసుదూరమున గహ్వారమను శిఖర మొుదు కలదు. ఇక్కడ మూడు ముఖ్యస్థానములుకలవు. 1 అంబికాఖేలనస్థానము, 2 నిపార్ధ పీపలా 3 శ్రీకృష్ణుడు తోటపనిచేసినది. శ్రీకృష్ణు డిచ్చటనె రుక్మిణిని హరించెనని చెప్పుదురు.

అంబికామందిరమునకు మూడుమైళ్ళదూరమున ఉదుంబుర వనము గలదు, బస్సులు గలవు. ఇక్కడ 'శంకరకోటీశ్వర' మందిరము కలదు. ఇచ్చటనె సరస్వతీనది యుద్భవించినది. ఈనది 'సిద్ధపురము, పాట్నా'ల మీదుగ 'కచ్ఛ'మైదానమున పలీనమగుచున్నది. అంబికాజీస్థానము 'దాంతా' రాజ్యాంతర్గతము.' ఉత్సవ సమయములందు ప్రభుత్వము విశేషసహాయము చేయును.

## జోధపూర్

ఇది మొదలు రాజస్థానము. ఈ రాష్ట్ర వైశాల్యము 1,30,207 చ.మై. జనాభా షుమారు 1,52,90,797. రాజధానీ నగరము జయపూర్. ఈ రాష్ట్రమున చాలభాగము కొండలు, ఎడారులు, మధ్యమధ్య దట్టమైన యడవులు, సారవంతమయిన భూములు గలవు. ఈ దేశాన్ని రెండుగా చీల్చుతూ ఆరావళీ పర్వతములు ఉత్తర దక్షిణములుగా వ్యాపించియున్నవి. ఇటీవల వరకు దీనిని రాజపుత్రస్థాన మనినారు. ఇందులో ఉదయపూర్, జయపూర్, జోధపూర్ సంస్థానములు చేరియున్నవి. అజ్మీరు, మార్వారు యిప్పుడు ప్రత్యేకరాష్ట్రములుగా నున్నను చారిత్ర

కముగా రాజస్థానమున యంతర్భాగములనే చెప్పవచ్చును. ఇక్కడిప్రజలు, రాజపుత్రవీరులు మహావీరులు. అభిమానధనులు. మర్యాదస్తులు, ఉదారులు. వీరు 'సమరభూమిలో వెన్ను చూపుటకంటె ఆత్మార్పణము చేయడమే మే'లని భావించే ఖడ్గోపజీవులు.



జైనమందిరము - పాలీటానా (168 పేజీ చూడుడు)

ఆబూరోడ్‌నుండి మార్వార్ (జం) లూనీ(జం) మీదుగ జోధపూర్ స్టేషను167 మైల్లు. రాజపుత్రస్థానమునమార్వార్ ప్రాంత మున జోధపూర్ ప్రసిద్ధమైన రాజధానీనగరము. ఈ నగరమునకు నలువైపుల దృఢమైన ప్రాకారముగలదు. ఇట ఏడు సరస్సులు గలవు. 1 పద్మసాగరము. ఇదినగరమునకు పశ్చిమోత్తరములందు గలదు. 2 రాణీసాగరము. ఇది నగర పశ్చిమద్వార సమీపమున కోటలో గలదు. 3 సుందర గులాబ్ సాగరము. ఇది తూర్పున గలదు. రాతితో నిర్మింపబడెను. 4 బాయీసాగరము. ఇది పట్ట

ణమునకు దక్షిణమున గలదు. 5. సరదార్ సాగరము. ఇది పూర్వోత్తర దిశయందున్నది. 6 అఖేరజీసాగరము. ఇది నగరమునకు పశ్చిమముగ నొక మైలుదూరమున గలదు. 7 సుందర సాగరము. ఇది నగరమున కుత్తరముగ 7 మైళ్ళ దూరమున గలదు. ఇచ్చట నొక సుందరమగుభవనము, వనము గలవు.

జోధపురమున చైత్రమాసమందు ధార్మికసంఘ సమావేశము జరుగును. లూనీకి పశ్చిమముగ 60 మై. దూరమున 'పంచభద్ర' దగ్గఱ ఉప్పునుతయారుచేయు కార్యాలయము కలదు.

## క్షీరపురము (खेड़)

ఇది యొక యైతిహాసికప్రదేశము. జోధపూరునుండి లూనీ (జం) మీదుగ పశ్చిమముగ 'సింధు'కు పోవు బండి నెక్కి 'బాలోతరా' లో దిగవలయును. బాలోతరా కీ క్షీరస్థానము పశ్చిమముగ 5 మైళ్ల దూరమున గలదు. ఇచ్చట రణఛోరజీ మందిరము, పంచముఖిమహాదేవ మందిరము కలవు.

రణఛోరజీమందిరము:— ఈ మందిరము ప్రాచీన శిల్పకళను ప్రదర్శించు నొక కళాఖండము. ఇచ్చట నొక ఎఱ్ఱరాయి అద్దమువలె ముఖము ప్రతిబింబించునట్లు నునుపుచేయబడెను. ఎట్లీ రాతి కీ సౌందర్యము, నైగనిగ్యము వచ్చెనో యింతవరకు విజ్ఞానవేత్తలకు తెలియలేదు. ఇందు 4, 5 అడుగులు యెత్తుగల రణఛోరజీ విగ్రహము కలదు. ఈ మందిరముననే శివ, బ్రహ్మ, గణపతి, ఆంజనేయ మందిరములు కూడ కలవు.

పంచముఖీమహాదేవమందిరము:— ఇది రైలుస్టేషనుకు సమీపమున గలదు. ఇందు పంచముఖీమహాదేవుని విగ్రహము కలదు. ఇచ్చటకు సమీపముననే దుర్గామందిరము గలదు.

పూర్వమిది యొక పెద్దనగరమని తోచుచున్నది. ఇచ్చట గల మిట్టలను త్రవ్విన యసదృశ శిల్పకళామండితములగు ననేక ప్రస్తరఖండములు లభించుచుండును. ఈ నగరమునకు సమీపమున కొన్ని గ్రామములు కలవు.

# నాథద్వారము

బాలోతరా నుండి లూనీ (జం) మార్వార్ మీదుగ మావలీపోవు బండినెక్కి నాథద్వారములో దిగవలయును.

నాథద్వారమున వల్లభసంప్రదాయమునకుజెందిన మఠము గలదు. ఇట ధర్మశాలలు గలవు. యాత్రికులు బసచేయుటకు యోగ్యముగ నుండును. ఇచట 'బనాస్'యను నది కలదు. యాత్రికులిందు గ్రుంకులిడుదురు. ఇట కావలసిన వస్తువులన్నియు లభించును. ఇచట చిత్రకళ చాలప్రసిద్ధమైనది. చేతితో తయారు చేసిన విచిత్రవస్తునిచయమున కిది యాలవాలము.

శ్రీనాథమందిరము:— వల్లభసంప్రదాయమున సేవా శుశ్రూషల కధికప్రాధాన్యత కలదు. ఈ సేవాశుశ్రూషలు ఇచట పరాకాష్ఠవహించినవి. ఇచట శ్రీనాథస్వామికి జరుగు సేవా కైంకర్యము లితరస్థానమందెచటను గాన్పించవు. ఇచట భగవంతుని 7, 8 సంవత్సరములు వయసుగల బాల్యరూపమును ఉపాసింతురు. నిత్యము వందలకొలదిరూప్యములు వెచ్చించి, నేతితో

తయారించిన వివిధభక్ష్య భోగములు సేతురు. లక్షలకొలది రూపాయలు విలువజేయు ఆభరణములు స్వామికి గలవు. నిత్యము 3, 4 తడవులు వేర్వేర యాభరణములతో స్వామిని యలంకరింతురు. నిత్యనూతనవేషముతో స్వామి విరాజిల్లుచుండును. వివిధములైన స్వర్ణమయయాటవస్తువులతో స్వామిని యాడించుచుందురు. ఇట్టి దేవభోగము లనుభవించు శ్రీనాథస్వామిని దర్శించి యాత్రికులు ముగ్ధులగుచుందురు.

శ్రీవల్లభాచార్యులవారు భగవదాదేశానుసారము శ్రీనాథ విగ్రహమును గోకులమునుండి తెచ్చిరని చెప్పుదురు. ఆచార్యులవారీ విగ్రహమును రథమందుంచి తీసికొని వచ్చుచుండ రథమిచటకు వచ్చునప్పటికి రథకూబరము లిసుకలో దిగబడి రాకుండగ నుండిన, స్వామిచట నుండుటయే యిష్టమని తలచి వల్లభాచార్యులవారు వెంటనె చిత్తూరుకు మహారాణాగానున్న రాజసింహునకు కబురుచేయ, మహారాజువచ్చి ఈ చిత్రమునుచూచి స్వామికి కొంతభూమియు, నొక గ్రామమును యిచ్చెను. వల్లభాచార్యులవారు స్వామిని యిచట స్థాపించిరి.

నాథద్వారమునకు సమీపమున 'కాంకరొలీ' యను గ్రామము గలదు. ఇచట వల్లభసంప్రదాయమునకు చెందిన ప్రధానపీఠము కలదు. యాత్రికు లీస్థానమునుకూడ దర్శించుదురు.

# ఉదయపురము

నాథద్వారమునుండి మావలీ (జం) మారి ఉదయపూర్ స్టేషనుకు చేరవలయును.

ఉదయపుర మొక సుందరమగు రాజధానీ నగరము. ఈ నగరమునకు నలువైపుల ప్రాకారము గలదు. ఈ రాజ్యమున చాల సరస్సులు, నదములు గలవు. ఇందు కొన్ని సరస్సులు చాల పెద్దవి. ఇందు ఢేవర్ నదము చాల పెద్దది. దీనిని జయసముద్రమని కూడ పిలుచుచుందురు. రాజసముద్రము, ఉదయసాగరముకూడ చాల పెద్దవి. ఈ సరస్సులలోని దీవులలోగల భవనముల సౌందర్యము చూచితీరవలయును.

ఉదయపుర ప్రధాన ద్వార సమీపమున బాయీజీ రాజకుండము గలదు. ఇచ్చట శ్రీ నింబార్క - సంప్రదాయమునకు చెందిన ప్రధాన పీఠము కలదు. ఉదయపురమున శ్రీ రామానంద సంప్రదాయమునకు చెందిన మందిరము లనేకములు గలవు. ఈ నగరమునకు బయట స్వతంత్రతా మూర్తియగు రాణా ప్రతాపుని పర్వత ప్రదేశములు గలవు. ఇవిచాల సుందరమైనవి.



శ్రీ నింబార్కాచార్యులు

ఉదయపురమునకు 70 మైళ్ళదూరమున పర్వతప్రాంతమున సుప్రసిద్ధ జైనాచార్యుడగు శ్రీ ఋషభదేవమందిరము

గలదు. నగరమునకు 80 మైళ్లదూరమున కనేరా గ్రామమున శ్రీ శుకమందిరము కలదు. ఇచట నొక చిన్నకుండముకుండి యుష్ణోదకము ప్రవహించుచుండును.

ఉదయపురమన సూర్యోదయపట్టణమని యర్థము. ఇంత అందమైన పట్టణము చూచినవారు నేటికి ధన్యులమని భావింతురు. మహోజ్వలచరిత్ర కీపట్టణము నిదర్శనము. పచ్చనికొండల మధ్య చిన్నచిన్నదీవులలో నీ యుదయపూరు కలదు. సూర్య కాంతిలో నిచటగల చలువరాతి భవనములు మెరయుచుండును. అన్నిటికన్న మిన్నయైనది మహారాణాప్రాసాదము. ఈ భవనము చూచిన తన్మయులగుదురు. ఒకప్పుడు జహంగీరు కుమారుడగు 'ఖుర్రమ్'కు (షాజహాన్-చక్రవర్తి) ఆశ్రయమిచ్చిన జగ్ మందిర్ చూడవలయును. ఈ పురమున గులాబీతోటలు ఎక్కువ. 17 వ శతాబ్దమున జగత్ సింగ్ చేనిర్మించబడిన జగన్నాథదేవాలయము, ఇందలిశిల్పము, మహారాణా బంగారముతో తులాభారముతూగిన భవనము చూడతగినవి. ఇచటకు 3 మైళ్ళలో వున్న అహార్ గ్రామములోని చలువరాతితో నిర్మించిన మహారాణాల సమాధులనేకములు గలవు. వైధవ్యమును నొల్లక తమతమ పతులతో సహగమనము చేసిన రసపుత్రరాణుల సమాధు లనేకములు గలవు. ఇచటకు 30 మై.లో యున్న జయసమంద్ సరస్సు ఇండియాలో నున్న సరస్సులన్నిటిలోకి అందమైనది. ఉదయపూర్ ఆరోగ్యానికి కేంద్రము. ఇది సముద్రమట్టమునకు 25 వందల అడుగుల యెత్తున గలదు. వాతావరణము చక్కగ నుండును. ఇచట చూడతగిన సుందరములు చాల గలవు.

## ఏకలింగము (కైలాసపురి)

రాజపుత్రస్థానమున మేవాడ్ ప్రాంతము చాల ప్రసిద్ధమైనది. మేవాడ్ రాజధానియగు ఉదయపురమునకు 13½ మైళ్ళ దూరమునందుత్తరముగ శ్రీ ఏకలింగస్వామి మందిరము కలదు. ఈగ్రామమును 'కైలాసపురి, ఏకలింగజీ'యనియు పిలతురు. ఈ గ్రామము చాలపురాతనమైనది. మిక్కిలి సుందరమైనది. ఉదయపురమునుండి ఏకలింగేశ్వరస్వామి యాలయమువరకు చక్కని రోడ్డు కలదు. 5 మైళ్లు. ఈ ఆలయసమీపమున నొక కుండము గలదు. ఇందలి జలము స్వచ్ఛముగ నుండును. ఇచ్చట నొక చిత్రము గలదు. ఈ సరస్సున నొకలింగము స్వయముగ నలు మూలల తేలి తిరుగుచుండును.

శ్రీ ఏకలింగస్వామిని రాణాలకు పూర్వుడగు "బాప్పా రావల్" క్రీ.శ. 740 సం॥ ప్రాంతమున ప్రతిష్ఠించెను. ఆ సమయమున బాప్పారావల్ నాగదాలో రాజ్యము చేయుచుండెను. నాగదాకు సమీపమునగల యొక వెదురుపొదలో నీ లింగము స్వయముద్భూతము. బాప్పారావల్ యీ స్వామికి మందిరము కట్టించి, ఆతని యనుగ్రహమున మౌర్యవంశమునకు చెందిన 'మానమహారాజు' పాలించు చిత్తూరుమీదికి దాడివెడలి మహా రాజునుజయించి చిత్తూరును వశపరచుకొనియెను. అప్పటినుండియు 'బాప్పారావల్' వంశీయులే మేవాడ్‌ను పరిపాలించుచు వచ్చుచుండిరి. ఈ ప్రభువులు శ్రీ ఏకలింగస్వామిని మేవాడ్‌కు ప్రభువనియు, తామాతని 'దీవాన్'లమనియు భావించెడివారు. ద్వాదశజ్యోతిర్లింగములవలె నీ ఏకలింగముకూడ మహాత్మ్యపూర్ణ

మైనది. ముసల్మానుల పరిపాలనాసమయమునం దన్య దేవాలయములవలెనే యిదికూడ ఛిన్నభిన్నము గావింపబడెను. కాని రాణా వంశజులు భక్తితత్పరులగుటచే వెంటనే యీ యాలయమును బాగుచేయించిరి.

ఏకలింగస్వామి మందిరము:— శ్రీఏకలింగస్వామి విగ్రహము నల్లరాతివిగ్రహము. ఇది చతుర్ముఖవిగ్రహము. ఈనాల్గు ముఖములు క్రమముగ బ్రహ్మ, విష్ణు, మహేశ, సూర్య ద్యోతకములు. ఇది సుమారొక $1\frac{1}{2}$ అ. యెత్తు గలిగియున్నది. మందిరము 50 అ. ఎత్తు, 60 అ. వ్యాసము గలిగియున్నది. దీనికి రెండు ముఖద్వారములు



ఏకలింగమందిరము – కైలాసపురి

గలవు. పశ్చిమ ద్వారమునుండి సర్వసాధారణులు దర్శనము చేయుదురు. దక్షిణద్వారమునుండి క్రైస్తవులు, ముసల్మానులు మొదలగు యితరమతస్థులు దర్శింతురు.

ఇతరమందిరములు:— శ్రీ ఏకలింగస్వామిమందిరమునకు పరిసరములందు అనేకమందిరములు, సరోవరములు గలవు. అందు మీరాబాయి, అంబికా, కాళికా, సోమనాథ, చతుర్భుజాదేవి, విఘ్నేశ్వర మందిరములు ప్రసిద్ధమైనవి. ఏకలింగేశ్వరస్వామి మందిరమునకు సమీపమున ఇంద్రసాగరమను నొకసరస్సు గలదు. ఈ సరస్తీరమునగూడ ననేకమందిరములు గలవు. ఇచట తక్షక

కుండము గలదు. జనమేజయుడు సర్పయాగము జేయుచుండ, తక్షకుడు పారిపోయి యిచ్చట దాగొనెనని చెప్పుదురు. ఈకుండ మందలి జల మొక దోసెడు త్రాగిన పాము విషము దిగిపోవును. ఈ ఆలయము లన్నియు శిల్పకళకు మిక్కిలి ప్రఖ్యాతి జెందినవి.



మహామందిరము - జోధపూర్
(193 పేజీ చూడుడు)

స్వామి కైంకర్యము:— దినమునకు మూడు పర్యాయములు ఏకలింగేశ్వరస్వామిని తాంత్రికవైదికవిధానముల రెంటితోను పూజింతురు. ఈ స్వామి సేవాకైంకర్యములకు రాజ్యము నుండి ప్రతిసంవత్సర మొక లక్షరూపాయ లాదాయము వచ్చుచుండును. ఇదికాక ప్రతి సోమవారమున, ప్రదోషమునకు స్వామికి విశేషముగ పూజచేయుదురు. వసంతపంచమీ, మకర సంక్రాంతి, మహాశివరాత్రులకు ఉత్సవములుజరుగును. శ్రావణ శు ౧౪ కి దీపమాలికోత్సవము జరుగును. చైత్ర శు ౧౩ కు హోలీయుత్సవము జరుగును. వైశాఖ బ ౧ దివసమునందు స్వామి ప్రతిష్ఠ జరిగెను.

## చిత్తూర్ ఘుర్

ఉదయపురమునుండి మావల్ మీదుగ చిత్తూరుస్టేషను (61 మై) లో దిగవలయును. ఇది మేవాడ్‌లో ఉదయపురరాజ్యమున పర్వతదుర్గముక్రింద ప్రాకారవేష్టితమై నిర్మింపబడినది.

రాజస్థానమున ధైర్యసాహసకృత్యములకు చిత్తూర్ ఘుర్ ఆదర్శప్రాయమైనది. నేడీ పట్టణమందలి చాలభాగములు శిథిలములై రాజపుత్రుల సంస్మరణార్థము కోటమాత్రము నిలచియున్నది. ఇది పర్వతముపై గలదు. ఇక్కడి ప్రతిశిలాఖండము పూర్వపుచరిత్రను చాటుచుండును.

కోట:— చిత్తూరుకోటను చూడదలచిన ఉదయపుర ప్రభుత్వోద్యోగుల యనుమతి నొందవలయును. ఈ దుర్గము రైలుస్టేషనుకు తూర్పున గలదు. ప్రస్తుత మీ ప్రసిద్ధదుర్గము శిథిలమైయున్నది. బాప్పారావల్ యీదుర్గమును క్రీ. శ. 728లో గుప్తవంశీయులగు రాజులను జయించి స్వాధీనము జేసుకొనెను. నాటినుండియు క్రీ. శ. 1568 వరకు మేవాడ్‌రాజ్యమునకు రాజధానియై యుండెను.

ఈ దుర్గము నిర్మింపబడిన కొండ పరిసరప్రదేశములకంటె 450 అ. యెత్తు కలిగియున్నది. ఇది $3\frac{1}{2}$ మైళ్ళు పొడవు గలిగియున్నది. ఈ పర్వతశిఖరమున చాల శిథిలమైనభవనములు, మందిరములు గలవు. పర్వతపార్శ్వములందు దట్టమైన యడవి గలదు. కోటకు లోపల 32, దక్షిణముగ 5 సరస్సులు గలవు. క్రిందనుండి కోటదగ్గరకు పోవు మార్గ మొక మైలుండును. ఈ మార్గమున 'పదల్‌పోల్, భైరవపోల్, హనుమాన్‌పోల్, గణేశపోల్, లక్ష్మణపోల్, జోరలాపోల్, రామపోల్' అను పేర్లు గల ద్వారములు గలవు. వీనికిసమీపమున చిత్తూరువీరులస్మారకచిహ్నములుగలవు.

చిత్తూరునగరమునకు తూర్పున ప్రాకారముదగ్గఱ 75 అ. యెత్తుగల ప్రాచీనమగు కీర్తిస్తంభము గలదు. దీనిమీద పాల

రాతిపని చాల సుందరముగ జేయబడెను. పాలరాతితో నిర్మింపబడిన మరియొక జయస్తంభము కలదు. ఇది 122 అ. యెత్తు గలిగియున్నది. చిత్తూరును పాలించిన కుంభరాణా 'మాలవా' రాజ్యాధిపతియగు మహమ్మదునుజయించి తత్స్మారకచిహ్నముగ దీనిని క్రీ.శ. 1449 కి పూర్వమందు కట్టించెను.



మీరాబాయి మందిరము

ఇచ్చటనే కుంభరాణాభవనము, రత్నసింహుని భవనము కూడ గలదు. ఇందు 13 వ శతాబ్దమున హిందువులకుగల భవననిర్మాణకౌశలము కానవచ్చును. ఇచ్చటనే కుంభరాణా కట్టించిన యున్నతశిఖర సంయుతమగు దేవీమందిరము గలదు. దీనికిసమీపముననే కుంభరాణా భార్యయు, ప్రసిద్ధ కృష్ణభక్తురాలు నగు మీరాబాయి నిర్మించిన 'శ్రీకృష్ణ మందిరము' గలదు. మీరాబాయి పేరు విననివారుండరు. ఆమె యిచ్చటనే శ్రీకృష్ణసాక్షాత్కారమును బడసెను. ఆమె క్రీ. శ. 1418 లో జన్మించెను.

# అజ్మీరు

చిత్తూరునుండి అజ్మీరుస్టేషను 116 మైళ్ళ దూరమున గలదు. ఇది రాజపుత్రస్థానమున ప్రసిద్ధిగాంచిన నగరములం దొకటి. దీని వైశాల్యము 2,417 చ.మై. జనాభా షుమారు 6,93,372. ఈ ప్రాంతమున మొక్క-జొన్న, రాగులు, బార్లీ, ప్రత్తి, గోధుమ ప్రధానముగ పండును.

అజ్మీరు మార్వార్ కు ముఖ్యపట్టణము. తొలుత అగ్ని రుచే నీపట్టణము పాలించబడెను. క్రీ.శ. 1200 సం॥లో 'అజయ' యను రాజుచే దీనికి 'అజ్మీరు' అను పేరు పెట్టబడెను.

స్టేషనుకు సమీపము ననే ధర్మశాల లనేకము గలవు. ఈనగరమునకు త్తరముగ 'ఆనా - సాగర' మను నొకనదము కలదు. దీనిని 800 సం॥లకు పూర్వము 'ఆనా' యను రాజు నిర్మించెను. ఈ నద మునకు 500 సం॥ లకు పూర్వము షాజహాన్ చక్రవర్తి సుందరమైన చలువరాతి కట్టడమును కట్టించెను. చూడతగినద్ది.



అయోధ్యానగర్ - అజ్మీర్

ఈ నదమునుండి సాగర్మలీనదము వెలువడి సరస్వతీ నదియందు

గలియుచున్నది. కలిసినమీదట 'లూసీ' నది యని పిలువబడు చుండెను. పూర్వమిచ్చట సద్దుగని యుండెడిది. ఇచ్చట నొక యెత్తైనకొండమీద 'తారాగఢ్' అను నొక దుర్గము కలదు. ఇది యారోగ్యప్రదమగు స్థానము. అజ్మీరునగరమున శ్రీ లక్ష్మీ నారాయణ, నృసింహామందిరములు గలవు. ఈ నగరము చూడ దగినది. ఇటనుండి నసీరాబాదుస్టేషనులో దిగిన, రోడ్డుమార్గమున రాజధాని చేరవచ్చును.

## పుష్కరము



పుష్కరఘాట్

ఇది అజ్మీరుకు 7 మైళ్లు. మోటార్లు, టాంగాలు కలవు. పుష్కరమునకు పర్వతముల మధ్యనుండి ప్రయాణము చేయ నగును. ఈ ప్రయాణ మున కలుగు నానందము వర్ణనాతీతము. ప్రకృతిలక్ష్మి పరమా నందముతో తాండవించుచుండును. ఒక్కొక్కతటి నెత్తైనభూధర ముల నధిరోహించుచు, ఇంకొకతటి గిరిమార్గములనుండి క్రింది భాగమున కవతరణముసేయుచు, నింకొకతరి పామువలె మెలికలు తిరుగుచు ప్రయాణము చేయవలయును. మార్గమునందనేక ధర్మ శాలలు; మరియు 'అనంతసాగర'మను నొక సెలయేరును కలవు. అనంతసాగర మొకమైలు పొడవు కలిగియుండును. ఇందు చాల మంది నౌకాయానము చేయుచు, ప్రకృతిసౌందర్యమును నయనా నందకరముగ గాంతురు. పుష్కరము చేరుట కొక మైలుముందు

సుందరమగు వనమొండు గలదు. ఇందుగల మందిరమున అతిథులకు భోజనము పెట్టుదురు.


రామవైకుంఠ మందిరము

పుష్కరముయొక్క ప్రకృతిశోభ కనులార గాంచవలయునే కాని వ్రాయ నలవికాదు. పుష్కరమునకు నలువైపుల గల సుందర భూధరపంక్తులన్నియు పుష్కరమును దర్శించుట కేతెంచినవా యన్నట్లుండును. ఇక్కడ ధర్మశాలలు గలవు.

పుష్కరము భారతదేశమునంగల పవిత్రక్షేత్రములలో నొకటి. ప్రతి కార్తిక శు॥౧౫ కు లక్షలకొలదియాత్రికులు వత్తురు. ఈ సరస్సున బ్రహ్మఘట్టము, రామఘట్టము, బదరీనారాయణ ఘట్టము, కోటితీర్థఘట్టము, గోఘట్టము ప్రధానములు. ఇచట కొన్ని దేవాలయములుకూడ గలవు.

పండాలు యాత్రికులవెంటనుండి యాత్రను సక్రమముగ చేయింతురు. మొదట బ్రహ్మఘట్టమున యథావిధిగా స్నానము, తీర్థవిధి యవశ్యముగ చేయవలయును. అట్లు చేయకున్న యాత్రాఫలము వ్యర్థము. పుష్కరమున మొసళ్ళు చాల కలవు. యాత్రికులు స్నానము చేయునపుడు పండాలు, సేవకులు కఱ్ఱలతో నీటిని చప్పుడుచేయుదురు. ఇక్కడ జీవహింస చేయరు.

బ్రహ్మమందిరము:— ఇచట బ్రహ్మాలయము గలదు. భారతదేశమున పుష్కరమున దక్క బ్రహ్మమందిర మెచటను లేదు. శాస్త్రములుకూడ పుష్కరక్షేత్రముననే బ్రహ్మోపాసన

చేయుమని చెప్పుచున్నవి. బ్రహ్మవిగ్రహము పాలరాతితో నిర్మింపబడెను. స్వామికి శ్వేతవస్త్రము లలంకరింతురు. నాల్గు చేతులలోను నాల్గు వేదములు కలవు. ఇరువైపుల గాయత్రీ సావిత్రీ దేవతలు గలరు. అర్జునుడు భూప్రదక్షిణకాలమున శాపదగ్ధలైన యప్సరసలను యీ పుష్కరమునందే యుద్ధరించెనని ప్రసిద్ధి.


పుష్కరము - బ్రహ్మమందిరము

సావిత్రీదేవి:— ఇక్కడి నుండి ౬౫౦మెట్లెక్కిన సావిత్రీ దేవిని దర్శింపవచ్చును.

వృద్ధపుష్కరము:— ఇది యొక సరోవరము. ఇది అజ్మీరునకు - పుష్కరమునకు మధ్య యొకమార్గమున గలదు. ఇచటి ప్రకృతిదృశ్యము కనులకు విందొనర్చుచుండును.

ప్రదక్షిణము:— పుష్కరమును మూడు విధములుగ ప్రదక్షిణము చేయుదురు. అది క్రమముగ 3, 25, 50 మైళ్ళ ప్రమాణము కలిగియున్నది. చాలమంది యాత్రికులు చిన్న పరిక్రమణమును చేయుదురు. ఈ పరిక్రమణము లన్నిటియందు అనేక దేవాలయములు, కుండములు దర్శింపవచ్చును.

మాహాత్మ్యము:— శాస్త్రములు పుష్కరక్షేత్ర మాహాత్మ్యమును అధికముగ వర్ణించినవి. పుష్కరమున శ్రాద్ధముచేసిన యెడల కొన్నితరముల పితృదేవతలు తరింతురు. ఇచట బ్రహ్మ వేలకొలది సంవత్సరములు తప మాచరించెను. పుష్కరమును సేవించినగాని తీర్థయాత్రాఫలము చేకూరదు.

## కోటా నగరము

అజ్మీరునుండి నసీరాబాద్‌లోదిగి రోడ్డుమార్గమున పోవచ్చును. భోపాల్, బీనా (జం) మీదుగ కూడా కోటాస్టేషను చేరవచ్చును. చంబల్‌నదీ తీరమున కోటానగరము గలదు. ఇక్కడ యొక సరస్సు గలదు. దానిప్రక్కన యుద్యానవనములు, ప్రాచీన రాజప్రాసాదము, 'ఉమేదు' భవనము, కొత్తభవనము, ప్రాచీనపాలకుల సమాధులు తప్పక చూడతగినవి. కోటానగరము రాజపుత్రస్థానములోని రాజధానీ నగరములందొకటి. ఇందు దేవ మందిరములు శతాధికముగ గలవు. వీనియందు మథురియాజీ మందిరము చాల ప్రసిద్ధమైనది. ఈ మందిరములందు దేవతా కైంకర్యమునకై చక్కనియేర్పాట్లు కలవు.

## బూందీ


బుద్ధుడు

కోటానగరమునకు పశ్చిమోత్తరముగ 20 మైళ్ళదూరమున బూందీరాజధాని గలదు. ఇచ్చట కొండపైన నొక కోట, విశాలమైన మందిరము గలదు. దక్షిణమున వేరొక మందిరము గలదు. ఈ నగరమున 12 జైనమందిరములు, షుమారు 425 హైందవమందిరములు గలవు. తప్పక చూడతగినవి.

బూందీపట్టణము 'సర్' యను కొండకనుమల మధ్య నున్నది. దీని చుట్టూ యున్న కోటగోడను బ్రహ్మాండమైన సింహా ద్వారము లనేకములు గలవు. సరస్సుయొడ్డునగల రాజభవనము, సరస్సులో గల ద్వీపములపై నిర్మింపబడిన దేవాలయములు ఎంతో అందముగా, మనోహరముగా నుండును. ఇక్కడి రాజభవనము రాజస్థాన మొత్తములో కెల్ల అందమైనది. బూందీ అడవులు పులివేటకు చాల ప్రసిద్ధమైనవి.

## కిషన్‌గఢ్

అజ్మీరునుండి కిషన్‌గఢ్ (18 మై.) కు వెళ్ళువలయును. స్టేషను కలదు. ఇచ్చట నొక సరస్సు గలదు. ఈ నగరమున బ్రజరాజమందిరము, మోహనలాల్ మందిరము, మదనమోహన, నృసింహ, చింతామణీ మందిరములు గలవు. ఇచ్చట నొక ధర్మ శాల కూడ కలదు. ఈ నగరము చాల సుందరమైనది.

## పరశురామపురము

కిషన్‌గఢ్‌కు షుమారు 7 మైళ్ళదూరమున సలేమాబాద్ గలదు. ఇచ్చట నింబార్కాచార్య సంప్రదాయమునకు చెందిన ముఖ్యపీఠము గలదు. ఇచట విశాలమైన రాధా మందిరముకూడ కలదు. ఈ మందిర సమీపమున సరస్సు గలదు. శ్రీ నింబార్కాచార్య సంప్రదా యమునకు చెందిన శ్రీపరశురామాచార్యు డిచ్చట తపము కావించెను. అందుచే దీనికి పరశురామ పురమను పేరు వచ్చెను. ఇచ్చట నింబార్క సంప్రదాయమునకు చెందిన యాచార్యులు పారంపర్యముగ పీఠాధిపతులై వసించు


రాధాకృష్ణులు

చుందురు. ఇచ్చట నొక చిన్న సర్వేశ్వరమందిరము గలదు. ఈ నగరమునకు సమీపమున సుందరపర్వతములు గలవు.

## సాంభర్

కిషన్‌గఢ్ నుండి ఫులేరా (జం) మీదుగ సాంభర్ చేర వలయును. ఫులేరాకు పశ్చిమోత్తరముగ 4, 5 మైళ్ళదూరమున 'సాంభర్' స్టేషను కలదు. ఇచ్చట నొక విశాలమగు నుప్పుటేరు గలదు. సాంభర్‌కు సమీపమున 'వరాహానా'యందు దాదూ సంప్రదాయమునకు జెందిన యొక ముఖ్యస్థానము గలదు. దాదూ సంప్రదాయప్రవర్తకుడగు దాదూజీ యిచ్చటనే మరణించెను.

## దేవయాని

సాంభరుకు 2 మైళ్ళ దూరమున 'దేవయాని' యను నొక స్థానము గలదు. శుక్రాచార్యుని కుమార్తెయగు దేవయాని పేరునుబట్టి యీ స్థానమున కీపేరు కలిగెను. ఇచ్చట నొక సరోవరమువద్ద కొన్ని చిన్నమందిరములు గలవు. ఇందు శుక్రాచార్యుడు దేవయాని మొదలగువారల విగ్రహములు గలవు. ఇచ్చటనే రాక్షసరాజపుత్రికయగు శర్మిష్ఠ దేవయానను కూపమున బడద్రోసెను. ఆ దేవయానను బయటకుతీసి యయాతి వివాహము చేసుకొనెను. ఇచ్చట వైశాఖపూర్ణిమకు పెద్ద యుత్సవము జరుగును. ఈ స్థానమహిమ పురాణములం దభివర్ణితము

## నిరానా

ఫులేరాజంక్షనుకు పశ్చిమముగ 6 మైళ్ళదూరమున నిరానా స్టేషను కలదు. ఇచ్చట నొక సరస్సు గలదు. ఇచ్చట దాదూజీ

తన మతమును ప్రచారముజేసెను. ఇచ్చట దాదూసంప్రదాయమునకు జెందిన ముఖ్యస్థాన మొకటి గలదు. చూడతగినది.

## జయపూరు

పులేరాజంక్షను నుండి 37 మైళ్ళదూరమున జయపూరు స్టేషను కలదు. ఇది రాజపుత్రస్థానమున బ్రసిద్ధిగాంచిన రాజధానీ నగరము. దీనిని క్రీ.శ. 1738 లో మహారాజా జయసింగ్ నిర్మించెను. ఇచ్చటి వీధులు భారతదేశమునగల యన్యనగరములందరుదుగ గానవచ్చును. ఇచ్చటగల 'నహార్‌గఢ్' అను పేరు గల పర్వతదుర్గము చూడతగినది. మహారాజుయొక్క వాయుభవనము (Aire Palace) చాల సుందరమైనది. ఇందు ప్రాచీన కాలమునాటి ఆయుధములు, ముద్దులొల్కు తివాచీలు, భూర్జపత్ర గ్రంథములు, వర్ణచిత్రములు చూడదగినవి. ఇచ్చట శ్రీ గోవిందదేవజీ, శ్రీ గోపీనాథజీ మందిరములు గలవు. ఇవి చాల సుందరమైనవి. ఇచ్చట 'రామనివాస బాగ్' అను నుద్యానము గలదు. మదనమోహన మందిరము, బలరామమందిరము, గోకులనాథమందిరము, రాధా దామోదరమందిరము, శ్రీరామచంద్రమందిరము మొదలగు ననేక మందిరములు గలవు. మరియు నక్షత్రవేధశాల గలదు. ఇది ప్రపంచ ప్రసిద్ధమైనది.



* హవా మహల్

ఈ నగరమునకు $1\frac{1}{2}$ మైలుదూరమున తూర్పుగ నొక కొండమీద సుమారు 400 అ. యెత్తున సూర్యమందిర మొకటి


* జయఘడ్ కోట

గలదు. ఇచ్చట గోముఖమునుండి యొక పవిత్రమగు ప్రవాహము వెలువడుచున్నది. ఇచట కోతు లధికముగ నుండును. జయపూరుకు పూర్వోత్తరములందు 5 మైళ్ళ దూరమున 'అంబరు' అను ప్రసిద్ధస్థానము గలదు. ఇది 1600 సం॥లో నిర్మింపబడెను. ఇందు జయగఢ్ (విజయ దుర్గము) రమ్యమైనది. జయపూర్ లక్క పనికి, వజ్రములకోతకు, ఇత్తడి ముఱేదారీకి ప్రసిద్ధమైనది.


* నక్షత్ర సూచీశాల

రాజస్థాన్‌కు రాజధాని జయపూరు. జనాభా షుమారు 2,91,130. ఇది 18వ శతాబ్దమునకట్టబడిన పట్టణము. ఈ నగరముచుట్టూ గల పర్వతముల మీద యనేకకోటలు గలవు. ఆధునిక పద్ధతులన్నియు తీర్చి దిద్దినట్లున్నవి. రమ్యోద్యానములమధ్య మహారాజ ప్రాసాదము నగరమునకు నడిబొడ్డున యున్నది. వీథుల కిరువైపుల జాలరులు వ్రేలకట్టబడిన కిటికీలతో నలగారు గృహములు చూడ ముచ్చటగ నుండును. ఎఱ్ఱయిటుకతో కట్టిన యీ గృహములయందము సంధ్యాకాలమున చూడతగినది. ఈ నగరమును క్రీ. శ. 1728 లో మహారాజా సవాయ్ జయ్‌సింగ్ గారి పేరున నిర్మించబడినది. ఈయన గొప్ప ఖగోళశాస్త్రవేత్త. ఈయన పెద్దపెద్ద యంత్రములతో ఒక గొప్ప ఖగోళవేధశాల నిర్మించెను. ఇచటకు 7 మై. దూర

మునగల 'అంబర్' పాతకోట కలదు. ఇది 300 సం.కు పూర్వము నిర్మితము. దీనియందలి శిల్పవైభవము నిరుపమానము.



* నాగేశ్వరమందిరము (చూ. 182 పే.)

## అలవర్

జయపూరునుండి బాందీకుయీ జంక్షను మీదుగ 93 మైళ్లదూరమున అలవర్ స్టేషను గలదు. ఇది రాజపుత్రస్థానమునందలి యొక రాజధానీనగరము. ఇచ్చట కొన్ని వనములు, 5 జైన మందిరములు, కొన్ని దేవమందిరములు గలవు. ఇచ్చట రాజభవనమునకు పశ్చిమదిశయందు గల రోడ్డుమీద శ్రీ జగన్నాథమందిరము గలదు. ఈ మందిరము చాల సుందరముగ నున్నది. ఇది పర్వతప్రాంతము. రాజభవనమునకు సమీపమున 150 గజముల పొడవు, 100 గజముల వెడల్పుగల చెరువొకటి కలదు. ఇచ్చట కొన్ని దేవమందిరములు కలవు. ఈ నగరమునకు 14 మైళ్ళదూరమున తాళవృక్షకుండము గలదు. ఇచ్చట భూమినుండి జలముద్భవించి మూడు కుండములను నింపుచున్నది. ఇచ్చట స్నానముచేయుటకు చాలమంది యాత్రికులు వెడలుచుందురు. అలవర్‌కోట సెట్టనిలువుగానున్న ఒక కొండ చివరను నిర్మించబడినది. ఇక్కడి రాజభవనములో నెలకొల్పబడిన వస్తుప్రదర్శనశాల, ఆయుధాగారము తప్పక చూడతగినవి. ఇక్కడి అరణ్యములు వేటకు మంచి అనుకూలములైనవి.

## పిండారా (పిండతారక కుండము)

ఇది ద్వారకకు షుమారు 20 మైళ్ళదూరమున గలదు. ఇది యొక విచిత్రమయిన కుండము. పితృదేవతలకు పిండదానము గావించి వాని నీ కుండమునందు వీడిన నవి నీటియందు మునుగక తేలియుండును,

పూర్వము ధర్మరాజు కురుక్షేత్ర రణనిహతులగువారలుత్తమగతి నొందిరో లేదో యని సందేహించి కృష్ణుని ప్రశ్నించెను. ఆతడు వారందరు స్వర్గాది దివ్యలోకములం దెనలేని సౌఖ్యముల నొందుచుండిరని చెప్పెను. కాని ధర్మజునకు విశ్వాసము కలుగలేదు. అంత కృష్ణు 'డీ కుండమున పిండదానము చేయుము, వారలు తరించిన పిండములు పైకి తేలును, లేకున్న నీట మునుగును' అని చెప్పెను. ధర్మరాజు పిండదానము చేయగా నా పిండము లిందు తేలియాడెను. నాటినుండియు నీ కుండము పితృతారకమై వర్ధిల్లెను. ఇచ్చట పితృ మాతృ శ్రాద్ధ పిండప్రదానాదు లధిక ఫలదములు.

## బికనీరు

జోథపూర్ వలెనే యిదికూడా ఎడారులమధ్య నున్నది. ఇక్కడకూడా పెద్దకోట, అందమైన ఆధునికభవనములు గలవు. ఇక్కడగల సంస్కృత, పర్షియన్ గ్రంథాలయము, ఆయుధాగారము, జైనమతదేవాలయములు, మసీదులు తప్పక చూడదగినవి. నగరపు సరిహద్దులలో యిటీవల ఒక గొప్పశివాలయము నిర్మించబడినది. బికనీరు తివాచీలు ప్రపంచప్రఖ్యాతి గాంచినవి.

# భరత్ పూర్

భరత్ పూరుకోట చరిత్రప్రసిద్ధమైనది. ఇది చాలాక్కాలము బ్రిటిషువారిని ఎదిరించి పోరాడినది. ఇక్కడికి 8 మైళ్ళ దూరములో 'డిగ్' పట్టణమున భారతీయ శిల్పగరిమకు నిదర్శనమైన పెక్కుభవనములు కలవు. చూచితీరవలయును.



# సుందరభారత యాత్ర

## కాశీ ఖండము

### ( ఉత్తరము )

### ఢిల్లీ

అల్వర్ నుండి రేవారీ(జం) మీదుగ ఢిల్లీ చేరవలయును. ఇది మొదలు హరిద్వారము, ప్రయాగ, కాశీ, గయ, పాట్నాల వరకు గల ప్రదేశమంతయు కాశీఖండముగా పరిగణించబడినది.

ఢిల్లి అనేకవేల సంవత్సరములనుండి భారతదేశమునకు రాజధానిగా నుండుచువచ్చెను. అందుచే నిది క్షేత్రము కాకున్నను ఐతిహాసికప్రదేశమయిన పెద్దనగరము. మథురనుండియు ఢిల్లీకిరావచ్చును. ఢిల్లి పెద్దజంక్షను, పెద్దస్టేషను. ఇటకు నలుమూలలనుండి రైలుబండ్లు వచ్చును. ఇట హోటల్లు, ధర్మశాలలు, చాలకలవు. చున్నామల్ వాలాధర్మశాల, లక్ష్మీనారాయణ ధర్మశాల ప్రధానములు. ఇప్పుడిది ఇండియన్ యూనియన్ ప్రభుత్వపు రాజధాని. దీని వైశాల్యము 578 చ.మై. జనాభా 17,43,992. దీని పరిసరము లన్నియు ప్రాచీన భారతసామ్రాజ్య శిథిలావశేషములతో నిండియున్నవి.



* ఎఱ్ఱకోట

పాండవులకాలమున రాజధానియై గణుతికెక్కిన ఇంద్రప్రస్థపురమే నేటి ఢిల్లి. నాటినుండి నేటివరకీనగర మనేకపర్యాయములు పతనము నొందియు, మరల నున్నతినందుచువచ్చెను. రానురాను నగరముపెరుగుచుండెను. కాని నేడా యింద్రప్రస్థపుర చిహ్నము లేమియు గానుపించవు. కోటశిథిలములు మాత్రముకానుపించును. కొందరు దీనిని పాండవులకోట యని చెప్పుదురు. మరికొందరు పృథ్వీరాజుకోట యని చెప్పుదురు. ప్రాచీన చిహ్నములుగా కుతుబ్ మినార్, లోహ స్తంభమును గలవు. ఇవి ప్రస్తుతము నగరమునకు 12 మైళ్ళ దూరమున గలవు. ఇవి ప్రాచీనభారతవర్షమందలి కళాకౌశలమును దిఙ్మాత్రముగ ప్రదర్శించి, జనుల కాశ్చర్యమును కలుగజేయును. వీరితరువాత ఢిల్లీని పఠానులు పాలించిరి. వారి స్మృతిచిహ్నములనేకములు గానుపించుచున్నవి. ఇందు తుగలకాబాద్, తుగలక్ సమాధి, బహలోర్ లోడీ సమాధి, ఫిరోజిషాహీకోతవాల్, అల్లాఉద్దీన్ ఖిల్జీ, సమాధి, గయాసుద్దీన్ ఖిలిజీగోరీ, పాత కోట, సికందర్ లోడీసమాధియు ముఖ్యములు. ఇవి చూడతగినవి.



* ఇంద్రప్రస్థం



* ఇంద్రప్రస్థం – హవనకుండము

ఆపిమ్మట మొగలులుపాలించిరి. ఆకాలమున ఢిల్లి అనన్యసాదృశ్యమగు నౌన్నత్యము నందెను. మొగలుల స్మృతిచిహ్న

ములుగ నేడు లాల్‌ఖిల్లా జుమ్మామసీదు, హుమాయూను గోరీ, నిజాముద్దీను గోరీ, రోశనార్ గోరీ, ఫతేహపుర్ మసీదు చూడతగినవి. ఇందు లాల్‌ఖిల్లా, జుమ్మామసీదులను షాజహాన్ కట్టించెను. దీనిలో షాజహాన్ నివసించిన దివ్యసౌధములు, అతనుదర్బారుతీర్చిన మహామందిరములు, గోడలు, వాటి మీదచెక్కబడిన లతలు, పుష్పములు



* కుతుబ్ మీనార్

యిప్పటికిని కన్నులపండువుగ నున్నవి. స్వర్గమనునది భూమిమీద యున్న యెడల ఆస్వర్గమిదేనని ఇక్కడి యొకగోడమీద పర్షియన్ భాషలో లిఖించబడియున్నది. ఈ కోటలోపల రంగమహాల్, ముత్యాలమసీదు, మొగల్ వస్తుప్రదర్శనశాలగా మార్చబడిన ముంతాజ్‌మహాల్ చూడదగినవి. పై చెప్పిన ఐతిహాసికములేకాక ఇచట నింకను ననేక దర్శనీయస్థానములు గలవు. ఇట 'తిబ్బీ కాలేజి' కలదు. ఇందు ఇంగ్లీషు వైద్యముల నేర్పుదురు. ఈ కాలేజి చాల ప్రసిద్ధమైనది. ఇదికాక నింకను చాల కాలేజీలు, హైస్కూలులు, విశ్వవిద్యాలయము, పాఠశాలలు గలవు. ఇచట పోష్టాఫీసు, తంతి కార్యాలయము టౌనుహాలు, బ్యాంకులు గలవు.



* పార్లమెంటు భవనము

దీని దక్షిణభాగమంతయు నదీమైదానము. ఉత్తరమున కాంగ్రా, కులూ లోయలు గలవు. యమునానది పశ్చిమముగ

విరగడయైన పంజాబు కలదు. యమునాతీరమున రాజధాని విజయనగరము. ఈ నదికి తూర్పున, ఉత్తరమున సారవంతమైన మైదానములు గలవు. షాజహాన్ చక్రవర్తి నిర్మించిన తాజమహాల్ గల ఆగ్రానగరము దీనికూలముననే గలదు. గంగానదీతీరమున పవిత్రమైన వారణాసి కలదు. ఇండియాలో అతి ప్రాచీనమయిన నగరములలో నిది యొకటి.

ఢిల్లీ సుందరమయిన విశాలనగరము. ఇచట బజారులు చాల వెడల్పుగా నుండును. అందు చాందినీచౌకుయొక్క సౌందర్యమును చూచితీరవలయును. ఇది భారతవర్షమునకు ప్రధానమయిన వ్యాపార కేంద్రము. ఇచట వ్యాపార మధికముగ టోకుగనే జరుగుచుండును. ఇట వెండి, బంగారు నగిషీపని మిక్కిలి మనోహరముగ చేయుదురు. ఒకప్పుడు ఇక్కడ రత్నములు, వజ్రములు రాసిగపోసి అమ్మెడివారట. నగరమునకు దక్షిణమున నైఋతిమూలగా హుమాయూన్ సమాధి, తుగ్లకాబాద్ కలవు.

ఢిల్లీలో యమునానది ముఖ్యమయినది. యాత్రికు లీ నదీస్నానము చేయుదురు. ఇచట 'గౌరీశంకరుడు', 'దావ్జూజీ' (బలరాముడు), యోగమాయ, ఆంజనేయమందిరములు గలవు. నయాఢిల్లి (నూతనముగా నిర్మించినది) లో 'యంత్ర, మంత్ర' స్థానము గలదు. ఇది యొక నక్షత్రవేధశాల. దీనిద్వారా గ్రహముల గతులను పరీక్షింతురు.

నూతనముగనిర్మించిన క్రొత్తఢిల్లీలో భవనములు, చెట్లలో వరుసగా తీర్చిదిద్దిన వీధులు ఆధునిక నగరనిర్మాణమునకు నిదర్శనములు. ఈ నగరమునకు మధ్య గుండ్రముగానిర్మించబడిన పార్ల

మెంటుభవనము, ఆతరువాత గంభీరముగానుండు కేంద్రప్రభుత్వ కార్యాలయము, రాష్ట్రపతిభవనము, ఇటీవలనే నిర్మింపబడిన లక్ష్మీనారాయణభవనము, గాంధీమహాత్ముని సమాధిగల రాజఘాటు యిక్కడ అవశ్య దర్శనీయస్థానములు.

## కురుక్షేత్రము

"కురుక్షేత్రం గమిష్యామి కురుక్షేత్రే వసామ్యహమ్,
య ఏవం సతతం బ్రూయాత్ సర్వపాపైః ప్రముచ్యతే."

— మహాభారతము - అరణ్యము.

ఢిల్లీమీదుగా కురుక్షేత్రమునకు చేరవలయును. స్టేషనుకు సమీపమున నొక సత్రము గలదు. మహాభారత యుద్ధక్షేత్ర మిదియే. 18 అక్షౌహిణీల సైన్యముయొక్క రక్తనదులు ప్రవహించిన దీ ప్రదేశముననే. భారతవర్ష చరమాన్నత్యమును దలపునకు దెచ్చు భీషణరంగ మిదియే. వీరాధివీరులగు 'భీష్ముడు, కర్ణుడు, ద్రోణుడు' మొదలగువారు వీరగతి నందిన ప్రదేశమిదియే. ఆనాటి రక్తపాతముచే నేటికిని యీభూమి ఎరుపెక్కియున్నది.



కృష్ణసారథ్యము

కురుమహారాజుకీర్తి కిది యొక ప్రబలచిహ్నము. ఆరాజర్షి లోకోపకారమునకై యిచ్చట నింద్రుని గూర్చి తపము కావించెను. ఇంద్రుడా రాజర్షి తపమునకు మెచ్చి నీ కోర్కె ఏమని ప్రశ్నించెను. రాజు 'ఈ ప్రదేశమున మరణించినవారలకు

సద్గతి కలుగుటయే నాకోర్కె' యని తెలిపెను. ఇంద్రు డాతని కట్లే వరము నిచ్చెను. కురుమహారాజు తపమాచరించి శిబివలె, రంతిదేవునివలె లోకకల్యాణమునే కాంక్షించెను గాని, స్వర్గాది పారలౌకిక భోగములనుకూడ వాంఛింపలేదు. పూర్వము శిబి చక్రవర్తికి దేవతలు ప్రసన్నులై వర మడుగుమన నా మహా త్యాగి —

న రాజ్యం కామయే నాహం న స్వర్గం నా పునర్భవం,
కామయే దుఃఖ తప్తానాం ప్రాణినా మార్తినాశనమ్॥

అని కోరెను. రంతిదేవుడుకూడ అటులే లోకకల్యాణమును వాంఛించి —

"న కామయేఽహం గతి మీశ్వరాత్పరా మష్టర్ధియుక్తా మపునర్భవంవా,
ఆర్తిం ప్రపద్యేఖిల దేహభాజా మంతస్థితో యేనభవ న్తి దుఃఖాః"

అని లోకకల్యాణమును, సర్వప్రాణి సౌఖ్యమును వాంఛించెను. అట్టి త్యాగశీలురగుమహారాజులను బోలినవాడే కురుమహారాజు.

కురురాజుతపమువలన నీక్షేత్రము పరమపవిత్రమయ్యెను. శ్రాద్ధసమయమునం దీ క్షేత్రనామమును స్మరించినమాత్రమున పితృదేవతల కుత్తమగతులు కలుగును.

"కురుక్షేత్రం గయాం గంగాం ప్రభాస పుష్కరాణిచ,
ఏతాని మనసా ధ్యాత్వా..................."

కురుక్షేత్రమందలి ముఖ్యస్థానములు:—

సూర్యకుండము:— (సూర్యకుండ శమంతపచము) ఈ కుండము 3550 అ. పొడవు, 1950 అ. వెడల్పు కలిగియున్నది. ఇందు తాబేళ్ళధికముగ గలవు. మంచి ఘట్టములున్నవి. ఈ కుండ

మున సూర్యగ్రహణ సమయమున స్నానము చేసిన ననంతమగు ఫలము లభించును.

"సూర్యతీర్థమున స్నానముచేసి యథావిధిగ దేవతలను, పితృదేవతలను పూజించి యుపవాసము చేసిన 'అగ్నిష్టోమ యజ్ఞము' చేసినఫలము లభించును." మఱియు మరణానంతరము సూర్యలోకము లభించును. — మహాభారతము.

సూర్యగ్రహణ సమయమున కిచ్చటకు లక్షలకొలది యాత్రికు లరుదెంతురు. ఈ సూర్యకుండమున పాండవులు స్నానముచేసి యుద్ధయాత్రకు వెడలినట్లు చెప్పుదురు.

గీతాభవనము:— సూర్యకుండమునకు సమీపమున 'గీతాభవన' మను పేరుగల పుస్తకాలయము కలదు. ఇందు పురాతనములైన వ్రాతప్రతు లనేకము కలవు. దీనికి సమీపమునం దొక మందిరమునందు పంచపాండవుల విగ్రహములు కలవు.

భీష్ముని అంపశయ్య:— ఇది మహావీరుడగు భీష్ముడు బాణములపై శయనించిన ప్రదేశము. దీనికి సమీపమున 'బాణ గంగా సరోవరము' కలదు. బాణములపై శయనించియున్న భీష్మునకు దాహమువేయగా, అర్జునునివంక జూచెను. అర్జునుడు పితామహుని యుద్దేశమును గుర్తించి, గాండీవము నెక్కుపెట్టి, భీష్ముని శిరస్సునకు సమీపమున పృథ్విని భేదించెను. వెంటనే యచటినుండి యొక శీతలజలధార వెడలెను. భీష్ము డానీరముతో దాహము తీర్చుకొనెను. అదియే నేటి 'బాణగంగాసరోవరము'.

గురునానక్ మఠము:— బాణగంగ ఆవలియొడ్డుకు వెళ్ళి కొంతదూరము నడచిన గురునానక్ మఠము (సిక్కుల) కలదు.

దృషద్వతీ సరస్వతీనదులు:— ఇందు సరస్వతీనది యంతర్వాహిని. పురాణము లీనదిని మిగుల ప్రశంసించెను. ఈ నది భారతదేశమునందు వివిధప్రదేశములందు ప్రవహించి తుదకు 'పటియాలా' రాజ్యమున దృషద్వతీ నదిలో కలియుచున్నది.

దక్షిణేన సరస్వత్యా దృషద్వత్యుత్తరేణచ,
యేవసన్తి కురుక్షేత్రే తేవసన్తి త్రివిష్టపే. — మహాభారతము.

'సరస్వతీనదికి దక్షిణదిశయందు దృషద్వతీనది కుత్తరదిశ యందు వసించువారలు స్వర్గమున నివసింతురు.


గీతోపదేశము

ఇచ్చట దుర్యోధనుడు, ద్రోణుడు, కర్ణుడు, ఘటోత్కచుడు వీరగతినందిన స్థానములుకూడా కన్పించును. శ్రీకృష్ణుడర్జునునకు గీతోపదేశము గావించిన ప్రదేశము కూడా కాన్పించును. ఇచ్చటి ప్రతియణువు భారతవీరుల మహత్త్వము నగ్గడించుచుండును. వాతావరణము ప్రశస్తమైనది.

## హరిద్వారము

కురుక్షేత్రమునుండి అంబాలాకాంటీ (జం) సహారాన్‌పూర్ (జం) లక్సరా మీదుగా హరిద్వారము చేరవలయును.

హరిద్వారము స్టేషనుకు ½ మైలు దూరమున మద్రాసు వారిసత్రము గంగాతీరమున గలదు. కూలీలు, బండ్లు కలవు.

☞ సిమ్లాపోవువారు అంబాలాకాంటీలో బండిమార్చి, కల్కాస్టేషనులో దిగవచ్చును. (సిమ్లా చూడుడు. పరిశిష్టఖండము.)

ఆంధ్రులు తఱచు యిందే బసచేయుదురు. మఱియు పంచాయతీ ధర్మశాల, సింధీ మహారాజా ధర్మశాల మొదలగునవి యనేకములు గలవు. మద్రాసుధర్మశాలలో 5 రోజు లుండవచ్చును. రు. 5 లు అడ్వాన్సు కట్టవలయును. యాత్రికుడు వెడలునపుడు తిరిగి యిచ్చెదరు. హరిద్వారముయొక్క ప్రకృతిశోభ చూడని వాని జన్మ వ్యర్థము. పోస్టు, టెలిగ్రాం, హాస్పటల్, మునిసిపాలిటి కలవు. ఇచ్చట కోతులు విపరీతము.

హరిద్వారమునకు ప్రాచీననామములు 'మాయాపురి, గంగాద్వార'మనియు గలవు. గంగ మొదలగాయతు సమతెల ప్రదేశమున ప్రవహించునుగాన 'గంగాద్వార' మనియు లేక గంగోత్తరికి పోవుమార్గ మిచటనుండి ప్రారంభముగాన 'గంగాద్వార' మనియు దర్శనమాత్రము చేతనే అజ్ఞానమును నశింపజేయునుగాన 'మాయాపుర'మనియు, బదరీనాథునీ దర్శించుట కిచటనుండియే పోవలయునుగాన 'హరిద్వార'మనియు కేదారనాథుడగు ఈశ్వరుని దర్శించుట కిచటనుండియే పోవలయునుగాన 'హరద్వార' మనియు వ్యవహరింతురు. హరిద్వారము మోక్షమునిచ్చు సాధనములలో నొకటి.

"అయోధ్యా మథురా మాయా కాశీ కాంచీ అవంతికా
పురీ ద్వారవతీ చైవ సప్తైతే మోక్షదాయకాః"

మాయాపురిలో (హరిద్వారము) గంగాస్నానము దుర్లభము. అందును హరిద్వారము, ప్రయాగ, గంగాసాగర సంగమము యీ మూడుస్థానములలో స్నానము మిక్కిలి దుర్లభము.

— పద్మపురాణము

గంగా ఘాట్:— ఇది చాల పెద్దది. విశాలమయినది. వేలకొలది ప్రజలు కూర్చుండవచ్చును. సాయంకాల దృశ్యము చూడతగినది. సాయంకాలము గం. 4–8 వరకు పురాణములు, ఉపన్యాసములు, హరికథలు మొదలగు కాలక్షేపములు జరుగును. సాయంత్రము గంగకు సహస్రవర్తియుతమగు కర్పూరహారతి యిత్తురు. ఇచట ఐదుతీర్థములు ప్రధానముగా గలవు. హరిద్వార ములో స్నాన, దాన, శ్రాద్ధ, తర్పణాదులవలన మహత్తరఫలము గలదు. హరిద్వారము, కుశావర్తము, బిల్వకేశ్వరము, నీలపర్వ తము, కనఖలము యీ యైదుక్షేత్రములు ముఖ్యముగ సేవింప వలయును.



బ్రహ్మకుండు – హరిద్వారము

బ్రహ్మకుండము:— దీనికి పూర్వ పశ్చిమములయందు యెత్తయిన మెట్లు గలవు. స్నానమునకు మిక్కిలి యోగ్యముగ

నుండును. ఇందు స్నాన, పిండదానములవలన మిక్కిలి పుణ్యము గలదు. ఇందు అస్థికలు కలిపిన పితృదేవతలు విష్ణులోకమును బొందుదురు. ఇందు పెద్దపెద్ద మత్స్యములు తిరుగుచుండును. ఇచట కుంభమేళము (మాఘమాసములో) జరుగును. వేలకొలది యాత్రికులు నానాప్రాంతములనుండి వచ్చెదురు.

బ్రహ్మకుండమున కెదుటతీరమున గంగ, శివ, రాధాకృష్ణ, సీతారామ, సరస్వతి, బ్రహ్మ మొదలగు చిన్నచిన్న ఆలయములు గలవు. యాత్రికు లిచటనుండియె గంగను తమతమ గ్రామములకు తీసికొనిపోవుదురు.

ఉత్తరమునుండి గంగ మిక్కిలి వేగముగ ప్రవహించుచుండును. మరియొకవైపునుండి నీలగంగ ప్రవహించుచుండును. నీలగంగ (భాగీరథిలో నొక పాయ), భాగిరథియు నిచటకు సుమారు 2 మైళ్ళదూరమున గల కనఖలువద్ద కలియును.

కుశావర్తము:— ఇది బ్రహ్మకుండమునకు దక్షిణమున సామీప్యముననే గలదు. కుశావర్తము మహత్తరతీర్థము. ఇందు స్నానముచేయుటచే పునర్జన్మయుండదు. ఇచట శ్రాద్ధాదు లాచరించుకొందురు. ఇట మేషసంక్రాంతికి యాత్రికులనేకులు వత్తురు.

గోఘాటు:— ఇది కుశావర్తమునకు సమీపమున గలదు. గోహత్యచేసినవారి కిచట ప్రాయశ్చిత్తము చేయింతురు.

భీమకుండము:— భీమకుండుకు పోవుమార్గమున గంగాతీరమందు 'విష్ణుమూర్తి యిరువదినాల్గు యవతారములు' గల చిన్నచిన్న మందిరములు గలవు. పాండుపుత్రుడగు 'భీమునిచే'

స్థాపింపబడిన చిన్నకుండ మొకటి కలదు. దీనినే 'భీమకుండ' మందురు. ఇచట భీమాలయము కలదు. ఇంకను కొన్ని ఆలయములు కలవు.

మహాదేవి:— ఈ మందిరము 11 వ శతాబ్దము నాటిది. దేవికి మూడుశిరములు, ఐదుభుజములు గలవు. సమీపమున 'అష్టభుజములుగల శివుని', 'భైరవుని' మందిరములు గలవు. ఈ మూడుమందిరములు మిక్కిలి ప్రాచీనములు.

సప్తసరోవరము:— హరిద్వారమున కుత్తరమున గలదు. ఇచటకు గంగానది ఏడుపాయలుగావచ్చి కలసి ప్రవహించుచుండును. ఇది సప్తమహామునులు తపమాచరించిన స్థలము. ఇచటనే ధృతరాష్ట్రుడు, విదురుడు దేహత్యాగము చేసినారు.

బిల్వకేశ్వరము:— హరిద్వారమునకు పశ్చిమమున బిల్వపర్వతము గలదు. ఇచట బిల్వవృక్షము లధికముగ నుండుటచే నీపేరు గలిగెను. ఇచట బిల్వకేశ్వరుని ఆలయము గలదు. ఈ పర్వతమునకు వెనుకభాగమున 'గౌరీకుండము' గలదు.

గంగాస్నానము, బిల్వకేశ్వరదర్శనములవలన కోటిజన్మల పాపము నశించును. ఇచట ఋచీకమహాముని యాశ్రమము గలదు. దీనికి సామీప్యమున 'శివధార' కలదు. దీని దక్షిణతీరమున నొక గుహాయందు దుర్గాదేవి యాలయము గలదు. ఈ ప్రదేశము ప్రశాంతముగ నుండును.

నీలపర్వతము:— హరిద్వారమునకు తూర్పున నీలపర్వతము గలదు. గంగ దాటవలయును. మార్గము కష్టతరముగ

నుండును. ఇచట చండీయాలయము గలదు. భాగీరథిలోని యొక పాయ చీలి యిచట 'నీలగంగ' యను పేర విరాజిల్లుచుండును. చండీయాలయమున కెదుట 'అంజనీదేవి' మందిరము చిన్నది కలదు. ఆంజనేయులు ఇచటనే జన్మించినట్లు పురాణగాథ కలదు. ఇచట కనతిదూరమున 'జీలేశ్వర' మందిరము గలదు, పూర్వము 'నలు'డను భక్తుడిచట తపమాచరించి యీశ్వరుని ప్రతిష్ఠించెను. ఈ కారణముచే నీ పర్వతమునకు 'నీలపర్వత' మనియు, శివునకు 'నీలేశ్వరు'డనియు, గంగకు 'నీలగంగ'యనియు సార్థక నామములు కలిగెను.

## కనఖలము

ఇది హరిద్వారమునకు దక్షిణమున ఆరుమైళ్ళదూరమున గలదు. చక్కని రోడ్డు కలదు. బండ్లు పోవును. ఇది యొక చిన్న గ్రామము. ఇచట యెట్టిదుర్మార్గుడు స్నానముచేసినను ముక్తిని పొందును. కాన మునీశ్వరులందరు దీని కీనామము చేసిరి. ఇచట గంగాతీరమున మహారాజులచే నిర్మించబడిన ఘట్టములు గలవు.

ఇచట 'దక్షేశ్వరస్వామి' యాలయము 'దక్షప్రజాపతి' యాలయములు గలవు. దీనికి దక్షిణమున 'వీరభద్రుడు' 'కాళి' యును గలరు. ఎదుట 'సతీకుండము' కలదు. పూర్వమిచ్చట దక్షప్రజాపతి యజ్ఞము చేసెను. సతీదేవి యగ్నిప్రవేశముచేసిన యగ్నిగుండము గలదు. యాత్రికు లందలి భస్మమును తీసుకొని పోవుదురు.

మాయాపురము:— హరిద్వారమునకు కనఖలునకు మధ్య గలదు. మొదటి మాయాపుర మిదియే. ఇచట పెద్దపెద్ద ధనికులు గలరు. ప్రాచీనకాలపు దృశ్యములు కొన్ని గలవు.

జ్వాలాపురము:— హరిద్వారమునకు 6 మైళ్ళ దూరమున గలదు. ఈ గ్రామము హరిద్వారముకన్న పెద్దది. ఇచట అక్వెడిట్ చూడతగినది.

ఆసాదేవి:— హరిద్వార్ స్టేషనుకు పశ్చిమమున కొంచెము దూరములో నొక పర్వతముమీద యీ మందిరము గలదు.

ఋషికులము:— ఇది సనాతన ధార్మికులకు శిక్ష నిచ్చు ఉత్తమసంస్థ. 1906 సం.లో రావుసాహెబ్ శ్రీ పండిత దుర్గాదత్త పంత్ గారిచే స్థాపితము. మాయాపురమందలి నహరీతీరమున గలదు. ప్రాచీన సంప్రదాయానుసారముగ నిందు వేద, వేదాంగ, దర్శన, వ్యాకరణ, జ్యోతిష, ఆయుర్వేదములు నేర్పుదురు. మా యాత్రాకాలమునకు క్రీ. శ. 1944 లో ఇందు 300 'బ్రహ్మచారులు' కలరు.

గురుకులము (గురుకులకాంగడీ):— ఇది శ్రీ స్వామి శ్రద్ధానందచే స్థాపింపబడిన పెద్దవిద్యాలయము. ఇందు సంస్కృతము, హిందీ, ఇంగ్లీషు మొదలగునవి బోధించెదరు. ఈ గురుకులము 600 ఎకరముల ప్రదేశమున గలదు.

జ్వాలాపుర మహావిద్యాలయము:— ఇదియు నుత్తమ విద్యాసంస్థయే. ప్రాచీనసంస్కృతినెడల నెక్కువ యభిమానము. ఇందు సంస్కృతమున ఉత్తమతరగతులు గలవు. ఇందు పండ్రెండు విభాగములు గలవు.

సంస్కృతపాఠశాల:— హారిద్వారమున సంస్కృత పాఠశాల లనేకములు కలవు. ఈ పాఠశాలలో విద్యార్థులకు వేతనము లేదు.

సాధుఆశ్రమము:— ఈ ఆశ్రమము లనేకములు గలవు. ఇందు వందలకొలది సాధువులకు అన్నదానము చేయుదురు. అన్నిటికన్న శ్రీ 108 బాబా కాళీకంబళీవాలా వారి యాశ్రమము పెద్దది.

శ్రీరామకృష్ణహాస్పటల్:— ఇందుచితముగ వైద్యము చేతురు. డాక్టర్లు మినహా మిగిలినవారందరు విరాగులే. డాక్టర్లకు మాత్రమె జీతము. రోగులకు సకలోపచారములు చేయుదురు. ఇందలిసేవ లోకాదర్శము.

## సత్యనారాయణ

హారిద్వారమునకు 8 మైళ్ళదూరమున హృషీకేశము పోవు మార్గమధ్యమున గలదు. ప్రసిద్ధమైనది. సత్యనారాయణమూర్తి మిక్కిలి సుందరముగ నున్నది. సమీపమున ధర్మశాల యొకటి గలదు. ఆలయసమీపమున 'కుండ' యొకటి కలదు. ఇందు మార్జనచేసికొని స్వామిని దర్శింతురు.

ఘోరాప్రచారనది:— ఈ ఆలయమునకు సమీపమున గలదు. ఈ నదీస్నానమువలన పిల్లినిచంపిన పాపము పోవును.

## హృషీకేశము

హారిద్వారమున కుత్తరమున ఋషీకేశము గలదు. హారిద్వారము - ఋషీకేశమునకు రెండుమార్గములు గలవు. రైలు,

కంకరరోడ్డు. (కార్లు, బండ్లు పోవుమార్గము) రైలుమార్గము 23 మైళ్ళు. కారుమార్గము 15 మైళ్ళు.

హృషీకేశము భాగీరథీతీరమున ననేక పర్వతమాలాలంకృతమై యెంతయు మనోహరముగ నొప్పారుచుండును. ఈ స్థానమందే శ్రీమహావిష్ణువు మధుకైటభాది రాక్షసులను సంహరించి రైభ్యమహర్షి నుద్ధరించినాడనియు, దన్మూలముననే ఈ ప్రదేశమునకు 'హృషీకేశము' అను సార్థకనామ మేర్పడినదనియు స్కాందపురాణమున గలదు.

హృషీకేశమున చక్కని భవనములు, ధర్మసత్రములు సాధువుల యాశ్రమములు నధికముగ గలవు. వైద్యాలయము, పోస్టు, టెలిగ్రాం, మునిసిపాలిటీ ఆఫీసులు గలవు.

ఆంధ్రాశ్రమము:— ఈ యాశ్రమ స్థాపకులు, నడుపువారు శ్రీ స్వామి సచ్చిదానందసరస్వతివారు. యాత్రికులకు వీరు చేయుసేవ, చూపుఆదరము చెప్పశక్యముగాదు. ఆశ్రమము మిక్కిలి పెద్దది. అంనముగాను, సుఖముగను ఉండును.

త్రివేణీస్నానము:— హృషీకేశమందు స్నానము చేయుటకు ప్రధానమయిన ఘట్టము. త్రివేణీతటము (త్రివేణిఘాటు.) ఇచ్చట శ్రీరామచంద్రుని దేవాలయము కలదు. అచటనే కుబ్జాభ్రకము, హృషీకేశకుండము నను నామాంతరము గల కుండ మొకటి కలదు. గంగ, యమున, సరస్వతి యను పేర్లుగల మూడు ప్రవాహముల జల మీ కుండములోనికి బారుచున్నది. ఇందు స్నానముచేసినవారికి త్రివేణీసంగమస్నాన ఫలితము లభించును. హృషీకుండమున కెదుట హృషీకేశస్వామి ఆలయము గలదు.

హరిద్వారములోని గంగాఘాటునందువలె నీ త్రివేణీఘాటునందు గూడ నిత్యము సాయంకాలము గం. 4-8 లు వరకు పురాణ ఉపన్యాసములు, భజనలు, హరికథలు జరుగును.



* హరిద్వారము
(పేజి 225 చూడుడు)

భరతమందిరము:— ఇది హృషీకేశమందలి ప్రధానదేవాలయము. పూర్వ మిచ్చట భరతుడు తపము చేసియుండెను. పూర్వ మీ దేవాలయము బౌద్ధుల యధీనమందుండెడిది. పిమ్మట వారి యధీనతను తొలగించి శ్రీ శంకరాచార్యులవారీదేవాలయము నుద్ధరించిరి. ఈ మందిరము చాల పురాతనమైనది. దీనికి దగ్గరగనే 'శ్రీ వరాహమూర్తి' యొక్క యాలయముగూడ కలదు.

పుష్కరమందిరము:— ఇది నిత్యము ఉదయము, సాయంకాలము సంకీర్తనజేయు నొక సంకీర్తనమందిరము.

హృషీకేశమునుండి షుమారు 1½ మైలు దూరమున లక్ష్మణఝూలా పోవుమార్గములో 'ఋషీధార' 'లక్ష్మణకుండు' అనునవి చూడదగినవి. ఇచటి ప్రకృతిసౌందర్యము చూడదగినదే కాని వ్రాయనలవిగాదు.

**శ్రీ 108 బాబాకాలీకమలీవాలావారి క్షేత్రము:—**

శ్రీ స్వామీ విశుద్ధానందజీ బాబాకాలీకమలీవాలావారు ఉత్తరయాత్రచేయు యాత్రికులకు దినదినము నధికాధికముగ సర్వవిధ సౌకర్యములను గలుగజేసిన పుణ్యపురుషులలో నగ్రగణ్యులు. వీరు మహావిరాగులు, మహాపురుషులు. ఇందు నిత్యము

సన్యాసులకు, యాత్రికులకు షుమారు 1500 మందికి యాతిథ్య మిత్తురు.

కైలాసాశ్రమము:— హృషీకేశమందు సాధువులకొరకై నిర్మింపబడిన యాశ్రమములలో కైలాసాశ్రమము ప్రధానమైనది. దీనిని 'శ్రీ స్వామి ధనరాజ గిరిజామహరాజు' వారు స్థాపించిరి. ఇందలి శ్రీ శంకరాచార్యాలయము, శ్రీ చంద్రమౌళీశ్వరాలయ మును ముఖ్యముగ జూడదగినవి.



* శ్రీ శివానందాశ్రమము

మునికీరేతి:— ఇచట శ్రీ స్వామి శివానందాశ్రమము కలదు. వేళకు వెళ్ళినవారందరకు ఈ ఆశ్రమములో భోజనము ఉచితముగ పెట్టబడును. విధి విరామములేకుండ 24 గంటలు భగవన్నామస్మరణ చేయబడును.

ధన్వంతరి మందిరము:— ఇది హృషీకేశమునకు, మునికీ రేతి యను స్థానమునకు మధ్య నున్నది. ఇందు ఆయుర్వేదవిద్యా లయము, ఔషధాలయమును కలవు.

గీతాభవనము:— గంగానది కావలియొడ్డున బిర్లా యను గుజరాతీషావుకారు 'గీతాభవన' మను పేరుతో నొక సుందర భవనమును కట్టించెను. చాల విశాలముగ నున్నది. దాని గోడల మీద గీతాశ్లోకముల నన్నిటిని సంస్కృతలిపితో వ్రాయించిరి. ఈ కారణమువలననే దీనిని 'గీతాభవన'మని పిలుతురు. బహు సుందరముగ యున్నది.

స్వర్గాశ్రమము:— గీతాభవనమునకు ఉత్తరమున 'స్వర్గాశ్రమ' మను పేర నొక సురమ్యము, సుప్రసిద్ధమునగు స్థానము గలదు. ఇది నిజముగ స్వర్గాశ్రమమే. 'స్వామి ఆత్మప్రకాశ్ జీ' అనువారు యీ యాశ్రమమును స్థాపించిరి. ఇపు డీ స్థానమందు వేరువేరు భండారములు, గ్రంథాలయములు, సుందరములగు నివాసగృహములు నేర్పడినవి. శ్రీ విశుద్ధానందజీ (కాళీకంబలీ వాలా) సమాధిచేయబడిన ప్రదేశ మిచట గలదు.

ఆ స్థానమును జేరుటకు నది దాటవలయును. స్వర్గాశ్రమ మందు నావ ఆగు స్థానమున 'రామకుండ' మను పేర నొక ఘట్టము, 'శ్రీరామేశ్వర' మహాదేవుని మందిరము గలవు.

హృషీకేశము లగాయితు ఉత్తరఖండయాత్ర. బదరీ, కేదారము మొదలగునవి ప్రారంభమగును.

☞ వివరములకు మా 'బదరీయాత్ర' (సచిత్రము) చూడుడు.

## లక్ష్మణఝూలా

హృషీకేశమునుండి లక్ష్మణఝూలా మూడుమైళ్ళ దూరమున్నది. ఇక్కడ శ్రీ లక్ష్మణుని దర్శించవచ్చును. గంగానదిని దాటుట కిక్కడ తీగెలతో నమర్చబడి ఊగుచు, నూగుచున్న వంతెన యొకటి గలదు. ఈ ప్రాంతము ప్రశాంతముగ నుండును.

లక్ష్మణఝూల కావలియొడ్డున సీతాకుండము, సూర్యకుండమును గలవు. ఇచట అనేక దేవాలయములు కలవు అందులో ముఖ్యమైనది లక్ష్మణాలయము. మరొక దేవాలయములో పార్వతీ


* లక్ష్మణమందిరము

పరమేశ్వరుల విగ్రహములు, సీతారాముల విగ్రహములు, రాధాకృష్ణుల విగ్రహములు ప్రతిష్ఠింపబడియున్నవి. ఇచట గంగానదిలో స్నానముచేయుటకు వీలుగ నున్నది. ఇచట కొన్ని ధర్మశాలలు, సాధువుల యాశ్రమములును గలవు.

# హస్తినాపురము

హరిద్వారమునుండి లక్సరా, సహరాన్‌పూర్, మీరట్‌ల మీదుగ 'ఖతౌలీ' స్టేషను చేరవలయును. ఇచ్చటనుండి తూర్పుగ 'హస్తినాపురము' పోవు మార్గము కలదు. ఇది వృద్ధగంగాతీరమున నున్నది. 'హస్తినాపురము'నుంచి మీరట్‌కు 22 మైళ్ళు. ఇది పాండవుల రాజధాని. ఈ ప్రసిద్ధనగరము కాలగతి ననుసరించి నశించిపోయెను. గంగానది వరదలకు ప్రాచీన నగరము సర్వము నాశనమయ్యెను. 'హస్తినాపురము'నశించగనే 'కౌశాంబీనగరము' పాండువంశీయులకు రాజధానియగునని పురాణములందు గలదు. హస్తినాపురమునందొక శివాలయము కలదు. ఇచ్చట సాధువు లధికముగ నివసించుచుందురు. ప్రాచీననగర చిహ్నము లింకను యిచ్చట కానవచ్చును.

# గఢ్‌ముక్తేశ్వరము

మీరట్‌కు దక్షిణపూర్వముగ 26 మైళ్ళ దూరమున గంగాతీరమున 'గఢ్‌ముక్తేశ్వరము' గలదు. ఇదియొక ఎత్తైన

ప్రదేశమున గలదు. ఈ గ్రామము చాల పురాతనమైనది. పూర్వ మిది 'హస్తిపురమునకు' చెందిన యొక పేటగా నుండెడి. ఇచ్చట నొక పురాతనమగు 'గఢ్' (దుర్గము) కలదు. ఇచటి ఈశ్వరుని పేరు 'ముక్తేశ్వరుడు'. అందుచే దీనికి 'గఢ్ముక్తేశ్వర్' అని పేరు వచ్చెను. ముక్తేశ్వరాలయము విశాలమైనది. ఈ మిట్టమీద గుడికి సమీపమున రెండుతీర్థములు గలవు. మరిరెండు తీర్థము లీ మెట్టకు దిగువ గలవు. ఇచ్చట కార్తీక శు ౧౫ కు పెద్ద ఉత్స వము జరుగును. ఈ యుత్సవమును గాంచుటకు సుమారు రెండు లక్షల యాత్రికు లరుదెంతురు. యాత్రికులు తీర్థమున స్నానము చేసి ముక్తేశ్వరునకు అభిషేకము, పూజయు చేయుదురు.

## మథుర

ఆహో మధుపురీ ధన్యా వైకుంఠాచ్చ గరీయసీ,
వినా కృష్ణప్రసాదేన క్షణమేకం నతిష్ఠతి॥ —స్కాందపురాణము

'మథుర ధన్యమైనది. వైకుంఠముకంటె గొప్పది. వైకుం ఠమును పురుషార్థముచే మనుజుడు ప్రవేశించవచ్చును గాని శ్రీకృష్ణానుగ్రహములేనిదే యీ నగరమున నొక్క క్షణమైన యుండజాలడు'. మరియు మోక్షమునిచ్చు సప్తపురములలో నొకటి. పూర్వ మొకప్పుడిది బౌద్ధులకు, జైనులకుకూడా పుణ్య క్షేత్రముగా నుండెను.

మీరట్ నుండి హత్రాస్ (జం) మారి మథుర చేరవల యును. ఇచట చాల ధర్మశాలలు గలవు. అందు రాజాసాహెబ్ తిలోయీ, రాజాసాహెబ్ అవాగఢ్ల ధర్మశాలలు గలవు.

ఇవి రెండును నగరమునకు మధ్య గలవు. వీనియందు సుమారు 3000 మంది యాత్రికులు బసచేయవచ్చును.

మథుర చాల ప్రాచీనమైన నగరము. పూర్వ మిచ్చట 'మధు'వను దైత్యుని క్రీడోద్యానముండెడిది. శ్రీరామచంద్రుని తమ్ముడగు శత్రుఘ్నుడు మధుదైత్యుని సంహరించి యీ నగరమును నిర్మించి, యీ నగరమును పాలించుటకు తన కుమారుడగు 'సుబాహు'ని నియోగించెను. కాలాంతరమం దీ నగరము చంద్రవంశీయుల యధికారములోనికి వచ్చెను. యదువంశాంతర్గతమగు భోజవంశమున జన్మించినవార లీ నగరమును చాలకాలము పాలించిరి. ఆ భోజవంశీయుడే ఉగ్రసేనుడు. ఉగ్రసేనుని కుమారుడు కంసుడు. కంసుని సంహరించి శ్రీకృష్ణుడు మరల ఉగ్రసేనుని రాజుగ జేసెను. అనంతరము ప్రభాసక్షేత్రమున యాదవులందరును నశించిగ మిగిలియున్న 'వజ్రు'డను పేరుగల శ్రీకృష్ణుని ప్రపౌత్రుని (మునిమనుమడు) యుధిష్ఠిరుడు మథురానగర సింహాసనమునం దభిషేకించెను.

అప్పటినుండియు మథురానగర మొక్కొక్కప్పుడు శిథిలమగుచున్నను మరల నౌన్నత్యము నొందుచుడెను. క్రీ.శ. 1017 సం.లో మహమ్మద్ గజనీ దీనిని లూటీచేసెను. అటుతరువాత క్రీ. శ. 1500 లో సికందర్ లోడీ దీనిని సర్వనాశనము చేసెను. క్రీ.శ. 1669 లో ఔరంగజేబున్ను, 1757 లో అహమద్ శాహ్ అబ్దాలీయున్ను దీనిని సర్వనాశనము చేసిరి. ఇటు లనేక సమయములందు శైథిల్యమునొందియు యీ నగర మత్యంత రమణీయమై తన యౌన్నత్యమును గోల్పోవకున్నది.

ఇది యమునానదీ దక్షిణతీరమున గలదు. యమున కావలియొడ్డునుండి యీ నగరమం దున్నతశిఖరములతో నొప్పు మందిరముల శోభ, ప్రాసాదముల రమణీయత, క్షేత్రఘట్టముల సౌభాగ్యము చూడదగినవి. శ్రీనారాయణతీర్థులవారు శ్రీకృష్ణ లీలా తరంగిణి యందు వర్ణించిన మథురానగరముయొక్క సౌంద ర్యము నిరుపమానము. నగరములోనికి వెడలుటకు నాలుగు ద్వారములు కలవు. 1 హోలీదర్వాజా (ద్వారము) 2 బృందా వన దర్వాజా 3 డీగ్ దర్వాజా 4 భరతపుర్ దర్వాజా.

ఈ నగరమునకు నలుదెసల నాలుగు శైవక్షేత్రములు కలవు. తూర్పున 'పిప్పలేశ్వరుడు', దక్షిణమున 'రంగేశ్వరుడు', పశ్చిమమున 'భూతేశ్వరుడు', ఉత్తరమున 'గోకర్ణేశ్వరుడు'ను కలరు. మధురకు నలుదెసల మహాదేవు డుండుటచే నాతనిని 'మథురాకా చౌకీదార్' (మథురా రక్షకుడు) అని యందురు.

యమునలో యథావిధిగ స్నానము, తీర్థవిధి చేయవల యును. ఇచ్చట పండాలను 'చౌబే'లని పిలతురు. యమునానదికి చాల ఘట్టములు కలవు. అన్నిటియందు 'విశ్రాన్తఘాట్' ముఖ్యమైనది. ఇదికాక 'బంగాలీఘాట్' 'ధ్రువఘాట్' 'కృష్ణా గంగాఘాట్' 'సోమతీర్థఘాట్' 'అసీకుండఘాట్' మొదలగు ఘట్టములు కలవు.

విశ్రాన్తఘాట్:— దీనిని 'విశ్రామఘాట్' అని కూడా పిలతురు. శ్రీకృష్ణుడు కంసుని సంహారించి యిచ్చట విశ్రాంతి తీసుకొనెను. అందుచే దీని కీపేరు వచ్చెను.

ధ్రువఘాట్:— క్రీ.శ. 1868 లో యీఘట్టము నిర్మింపబడెను. ధ్రువ డిచ్చటనే తపమాచరించెనని చెప్పుదురు. తీరమున ధ్రువుని యాలయము కలదు. ఇచ్చట తీర్థవిధి చేయుదురు.



* విశ్రామఘాట్

సోమతీర్థఘాట్:— దీనిని 'వసుదేవఘట్ట'మని కూడా పిలతురు. యాత్రికు లిచ్చట స్నానముచేసి యమునను పూజింతురు.

అసీకుండఘాట్:— ఇది మంచిరాతితో నిర్మింపబడెను. దీనిని 'వరాహక్షేత్ర'మని కూడా పిలతురు. ఇచ్చట నొక మందిరమున విఘ్నేశ్వర, వరాహ మూర్తులు కలవు

మధురలోని ప్రధానమందిరము:— మధురలో చాల మందిరములు కలవు. కాశీలో సందుసందుల సదాశివు డుండునటు లీ పట్టణమం దెటజూచినను శ్రీకృష్ణమందిరములు గలవు. అందు కొన్ని ప్రధానదేవాలయముల నీ దిగువ వివరించుచుంటిని.

ద్వారకాధీశజీమందిరము:— మధురలోని దేవాలయము లన్నింటియందు నిది చాల విశాలమైనది. పెద్దది అందమైనది, రాబడి ఎక్కువగలది. దీనిపొడవు 168 అ., వెడల్పు 120 అ. దీనిని గ్వాలియరురాజ్య కోశాధ్యక్షుడు సేఠ్ గోకులదాస్ క్రీ.శ. 1815 లో నిర్మించెను. దీని ఆదాయము రెండులక్షలు. ఇచ్చట వల్లభసంప్రదాయము ననుసరించి స్వామికి సేవజేయుదురు. నిర్దిష్ట సమయమున దక్క యెల్లవేళల స్వామి దర్శనము కాదు.

గోవర్ధననాథజీమందిరము:— ఇది ద్వారకాధీశ మందిరమునకు కొలదిదూరమున గలదు. ఈ దేవాలయముకూడ చాల విశాలమైనది. క్రీ. శ. 1830 లో 'సేఠ్ కాముదర్ బాపూ' అను పేరుగల గుజరాతీ మహాశయుడు దీనిని కట్టించెను. ఇందు రాతి శిల్పము మిక్కిలి యందముగ నున్నది.

కేశవదేవజీమందిరము:— ఈ మందిరము చాల పురాతనమైనది. శ్రీకృష్ణుని పౌత్రుడు 'వజ్రుడు' కేశవదేవుని స్థాపించెను. కాని ఔరంగజేబు దానిని ధ్వంసముచేసి, అచ్చట నొక పెద్ద మసీదును కట్టించెను. శ్రీకృష్ణుని జన్మస్థలము కూడ నిదియె. ఇప్పుడు మసీదువెనుక, మరల కేశవదేవజీమందిరమును నిర్మించిరి. ఈ మందిరమునకువెనుక 'పోతరాకుండము' కలదు. శ్రీకృష్ణుడు జన్మించినపుడు వస్త్రాదికములిందే యుతుకబడెనని చెప్పుదురు.

గతశ్రమనారాయణ మందిరము:— ఇచట శ్రీకృష్ణుడు తన శ్రమను దీర్చుకొనెను. అందుచే దానికీపేరు వచ్చెను. ఇందు శ్రీకృష్ణ విగ్రహమున కిరువైపుల శ్రీ రాధాదేవి, కుబ్జా విగ్రహములు కలవు.

ఈ మందిరము లన్నిటియందు నిత్యము భోగములు జరుగుచుండును. మరియు గోవిందదేవజీ మందిరము, మదన మోహన మందిరము, వరాహమందిరము మొదలైనవి కలవు. గోపీనాథజీమందిరము, మథురానాథజీమందిరము, దావ్జూ (బలరామ) మందిరము, వ్రజగోవిందజీమందిరము, రాధాకృష్ణ మందిరములు చూడదగినవి.

ప్రదక్షిణము:— ప్రతి సంవత్సర మనేక పర్యాయములు భక్తులు మథురాక్షేత్రమునకు ప్రదక్షిణము చేయుదురు. ప్రతి ఏకాదశి, అక్షయనవమిరోజులం దీ క్షేత్రమును సామూహికముగ నిచ్చటివారు పరిక్రమింతురు. ప్రదక్షిణము చేయునప్పు డీ దిగువ స్థానములన్నియు కానవచ్చును. విశ్రామఘాట్, గతశ్రమనారాయణమందిరము, కంసఘాట్, సతీబుర్జ్, చర్చికాదేవి, యోగఘాట్, పిప్పలేశ్వరమహాదేవుడు, యోగమార్గవటుక్, ప్రయాగఘాట్, వేణీమాధవమందిరము, శ్యామఘాట్, శ్యామ మందిరము, దావ్జూజీమందిరము, మదనమోహనమందిరము, గోకులనాథమందిరము, కనఖల్ తీర్థము, తిందుకతీర్థము, కోటితీర్థము, రావణటీలా, బుద్ధతీర్థము, బలిటీలా (ఇచ్చట బలి, వామనుల విగ్రహములు కలవు), రంగభూమి, రంగేశ్వరమహాదేవుడు, సప్తసముద్రకూపము, శివతాల్, బలభద్రకుండము, భూతేశ్వరమహాదేవుడు, పోతార్ కుండము, జ్ఞానవాపీ, జన్మభూమి, కేశవదేవ మందిరము, కృష్ణకూపము, కుబ్జాకూపము, మహావిద్యాసరస్వతీ ప్రవాహము, సరస్వతీకుండము, సరస్వతీమందిరము, చాముండా, ఉత్తరకోటితీర్థము, గణేశతీర్థము, గోకర్ణేశ్వరము, గౌతమఋషి సమాధి, సేనాపతిఘాట్, సరస్వతీసంగమము, దశాశ్వమేథ

ఘట్టము, అంబర్ షటీలా (మెట్ట), చక్రతీర్థము, కృష్ణగంగ, బ్రహ్మఘాట్, వైకుంఠఘాట్, వసుదేవఘాట్, అసీకుండము, వరాహక్షేత్రము, ద్వారకాధీశమందిరము, మణికర్ణికాఘట్టము, మహాప్రభు కచేరీ, విశ్రామఘాట్ మొదలగునవి క్రమముగా కానవచ్చును. ఇది కేవల మథురాక్షేత్రపరిక్రమణము. ఇదికాక 84 క్రోసుల వ్రజభూమి పరిక్రమణముకూడా చేయుదురు.


బిర్లామందిరము
(ఉత్తరప్రదేశ్ ప్రభుత్వ సౌజన్యముతో)

రెండవ పరిక్రమణము భాద్రపద బ౧౩కు ఆరంభమగును. 16 రోజులలో ముగియును. మూడవ పరిక్రమణము భాద్రపద శు ౧౧ కు గోస్వాయీలు చేయుదురు. ఈ ప్రదక్షిణము 15 రోజులు జరుగును. "వ్రజపురీ" పరిక్రమణమున 12 వనములు, 5 సరోవరములు, 84 కుండములు, 10 మహాదేవ స్థానములు, 9 శ్రీదేవీ స్థానములు, 4 నదులు, 26 ఉపవనములు, 12 కూపములు, 2 సరస్సులు, 7 బలదేవస్థానములు, 2 రాధాస్థానములు, 5 పర్వతములు కానవగును. పూర్వము విరక్తులుమాత్రమే ప్రదక్షిణము చేయుచుండువారు.

కాని వర్తమానమున గృహస్థులు కూడా యీ ప్రదక్షిణమును జేయుచున్నారు.

ఇతరస్థానములు:—

జామామసీదు:— ఇది వర్తమానమున నగరమధ్యమున గలదు. దీనిని అబ్దుల్‌నబీఖాన్ కట్టించెను. నాడిది మథురానగరమునకు బయట నుండెడిది. ఇచట మరికొన్ని మందిరములు గలవు.

మ్యూజియమ్:— ఇందు చారిత్రిక విగ్రహములు, వస్తువులు కలవు. పురాతత్త్వప్రేమికుల కిది చాల యుపయోగకరమైనది. ఇందు రెండువేల సంవత్సరములకు పూర్వము వ్రాయబడిన శిలాశాసనములు, మూర్తులు, నాణెములు కలవు.

శివాశ్రమము:— ఇది యొక వేధశాల. ఇందు 'మర్కటీయంత్రము, ఫలభాయంత్రము' మొదలగు నక్షత్రపరిశీలనయంత్రములు గలవు.

ఔరంగజేబు మసీదు:— '(శ్రీ) కేశవదేవ' మందిరమును పడగొట్టి ఔరంగజేబు దీనిని కట్టించెను. ఇదియే వాస్తవముగు శ్రీకృష్ణజన్మస్థానము. మథురలోని మసీదు లన్నిటియందు నిది చాల పెద్దది.

శిక్షావిభాగము:— ఇచ్చట 'విద్యాశాఖ'కు చెందిన సంస్థలు కలవు. హైస్కూలులు, కాలేజీలు, సంస్కృత విద్యాలయము, కన్యావిద్యాలయములు గలవు.

కొన్ని ఇతరవిషయములు:— మథురయందు మిఠాయి (SWEETS) కి ప్రసిద్ధి. ఇచ్చట భజనకుపయోగించు సితారు,

చిరుతలు మొదలగు వస్తువులను చాల సుందరముగ తయారు చేయుదురు. బంగారు, వెండి వీనితో తయారుచేయబడిన దేవతా కిరీటము నిచ్చట లభించును. స్వామి శృంగారమునకై వలయు సర్వసామగ్రి ఏనుగుదంతపు పిడిగల వింజామరలు మొదలగు వాని నిచ్చట చాలసుందరముగ తయారుచేయుదురు.

ఇచ్చట ప్రతిసంవత్సరము శ్రీకృష్ణాష్టమికి, శ్రావణ శుద్ధమున, ఆశ్వయుజ బ ౧౧ మొదలు శరత్పూర్ణిమ వరకు రామలీలోత్సవము, కార్తికమున దీపావళి మొదలగు ఉత్సవములు జరుగును.

మాహాత్మ్యము:— మథురా నగరము భగవంతునకు చాల ప్రియమైనస్థానము.

ఆహో నజానంతి నరా దురాశయా
పురీం మదీయాం పరమాం సనాతనీం,
సురేంద్ర నాగేంద్ర మునీంద్ర సంస్తుతాం
మనోరమాం తాం మథురాం పరాకృతిమ్.

— పద్మపురాణము

'దుష్టులు పరమసుందరమై సనాతనమైన మథురానగరమును చూడజాలరు. ఇది దేవతలకు, మునీశ్వరులకు స్వయముగ శేషునకుగూడ వందనీయమైనది. ఇది నాయొక్క (కృష్ణుని యొక్క) పరాప్రకృతి.' పురాణము లన్నియు నిదేవిధముగ మథురానగర మహత్త్వము నగ్గడించుచుండెను. 'మథుర' అను మూడక్షరములు వేదములకంటె నధికమైనవి. సాక్షాత్ యిది బ్రహ్మస్వరూపమని ఉపనిషత్తులు చెప్పుచున్నవి.

## బృందావనము

ఇది మథుర కుత్తరమున యమునానదీ దక్షిణతీరమున గలదు. వ్రజభూమికి సంబంధించిన ప్రధానక్షేత్రముల కన్నిటికి మథుర కూడలి. అచటనుండి అన్ని క్షేత్రములకు రోడ్లు కలవు. మథురనుండి బృందావనమునకు రైలుమార్గము 9 మైళ్ళు. రోడ్డుమార్గము 6 మైళ్లు.

భావుకులగు భక్తులకు మథురకంటె బృందావనము ప్రీతికరము. మథుర భగవంతుని జన్మస్థానముమాత్రమే. బృందావన మాతని దివ్యలీలావిహారస్థానము. ఇచటి వనములందు మనోహర నికుంజములందు, యమునాపులినతీరములందు గోపబాలురతో గూడి యాతడనేక దివ్యమధురలీలల గావించెను. (ఈ లీలల వివరము శ్రీమద్భాగవతము 10 స్కంధమున చూడనగును.) వర్తమానమునగూడ బృందావనమందలి ప్రశాంతములై, సఘనములై యుండు వన - ఉపవన రామణీయకత మథురలోని జనాకీర్ణ ప్రాసాదములందు గాన్పించదు.

శ్రీకృష్ణునికాలమున బృందావన మొక వనమాత్రముగ నుండెడిది. మథుర యంతకుపూర్వము నుండియు ప్రసిద్ధిజెంది సూర్యవంశీయులకు, చంద్రవంశీయులకు రాజధానిగ నుండెడిది. 'బృందా'శబ్దమునకు 'తులసి' యని యర్థము. అందుచే పూర్వ మిచట తులసివనముండెడిదని తోచుచున్నది.

తులసీమాహాత్మ్యము స్కాందమున, పాద్మమున విశేషముగ గలదు. బృందావనమున బృందాదేవి మందిరము కలదు. ఆమె తపమునకు ప్రసన్నుడై భగవంతుడీస్థానమామెపేర బరగు

నటుల వరమిచ్చెనని చెప్పుదురు. ఇచ్చట నెమిళ్లు, చిలుకలు, కోయి లలు, తమ మధురరుతములచే వీనులకు విందుగావించుచుండును.

మధురనుండి బృందావనమునకు పోవుమార్గమున అనేక దర్శనీయస్థానములును, ఎఱ్ఱరాతితో నిర్మింపబడిన బావియు గలవు.

అక్రూర మందిరము:— ఈ బావికి దక్షిణపూర్వమున 'అక్రూరమందిరము' కలదు. భగవానుడు మధురకు అక్రూరుని వెంట వచ్చుచు, నిచ్చట నాతనికి తన భగవత్స్వరూపమును సందర్శింపజేసెను. ఈ బావికి సమీపమున యజ్ఞపత్నులు భగవం తునికి భోజనముపెట్టిన స్థానము కలదు. పూర్వ మిచట నొక మందిరముండెడిది. దానిని ఔరంగజేబు నాశనము చేసెను.

"కృష్ణ ఏవహి లోకానా ముత్పత్తి రపిచావ్యయః,
కృష్ణస్యహి కృతే విశ్వమిదం భూతం చరాచరమ్ —మహాభారతము

బృందావనము:— ఇచట చాల ధర్మశాలలు కలవు. ఇందు యాత్రికులు సుఖముగ బసచేయవచ్చును. ఇవికాక కొన్ని మందిరములందుకూడా యాత్రికులు బసచేయుటకు తగు సౌక ర్యములు కలవు. పండాల గృహములందు కూడా బసచేయ వచ్చును. బృందావనము 25 వేల జనాభాగల పట్టణము. ఇచ్చట మునిసిపాలిటీ, హాస్పటల్, పోష్టాఫీసు కలవు. బజారులలో భోజనసామగ్రి సర్వము పక్వము - అపక్వము లభించును. కొన్ని మందిరములందు ప్రసాదమును విక్రయింతురు. అచ్చట 3, 4 అణాలు యిచ్చిన ఒకమనుష్యునకుచాలు భోజనము లభించును.

బృందావనమున యమునాస్నానము, తీర్థవిధి, దేవదర్శ నము, ప్రదక్షిణము ముఖ్యమైనవి. ఇచట యమునకు 32 ఘట్ట

ములు కలవు. అందు వస్త్రాపహరణఘట్టము, కాళీయఘట్టము, కేశఘట్టము ముఖ్యములు. బృందావనపరిక్రమణము 4 మైళ్లు. సామాన్యముగ ప్రతిఏకాదశికి భక్తులు ప్రదక్షిణము జేయుదురు. కొందరు సాష్టాంగపరిక్రమణము చేయుదురు.

బృందావనములోని మందిరములు:— బృందావనమున మందిరము లధికముగ కలవు. ఇన్ని మందిరము లితరక్షేత్రముల యందెచటను గానరావు. వ్రజభూమియందు మొత్తము 5000 మందిరములు కలవు. ఇచట వానరము లధికముగ గలవు.

గోవిందదేవజీమందిరము:— శ్రీరూప, సనాతన గోస్వాముల యాజ్ఞ ననుసరించి 'అంబర్' దేశాధీశుడగు 'మానసింహ



గోవిందదేవ మందిరము (ఉత్తరప్రదేశ్ ప్రభుత్వ సౌజన్యముతో)

మహారాజ్' జీ మందిరమును క్రీ.శ. 1590 లో కట్టించెను. ఇందలి మూర్తిని వజ్రనాభుడు (శ్రీకృష్ణుని ప్రపౌత్రుడు) తయారు జేయించెను. ఇది శ్రీరూపగోస్వామికి నందపురమున లభించెను.

ఈ మందిరము ఎట్టిరాత్రితో నిర్మింపబడెను, కలాకౌశలము ననుస రించి చూచిన యిట్టిమందిరము ఉత్తరభారతమునం దెచ్చటను గాన్పించదు. మొదట నిది చాల ఎత్తుగనుండెడిది. దీనికి శిఖర మున ప్రతిదినము ఒకమణుగు నేతితో దీపము వెలుగుచుండెడిది. ఈ దీపకాంతి ఢిల్లీకి గాన్పించెడిది. దీనిని గాంచి ఔరంగజేబు కుమార్తె సైన్యసమేతయై యిచ్చటకు వచ్చి మందిరమున ప్రవే శించబోయెను. కాని పూజారు లనుమతించలేదు. అందుచేత నామె కోపించి మందిరమును నాశనముచేయించి యమూల్యము లగు వస్తువులను లూటీచేయించెను. ఆ సమయమున గోవింద దేవుని మూర్తి ఎటులనో 'అంబర్' రాజ్యమునకు చేర్చబడెను. ఇప్పుడది జయపురరాజ ప్రాసాదమున కెదుట నొక మందిరమున గలదు. ఔరంగజేబుకూతురు యీ మందిరముయొక్క 5 అంత స్థులను కూలద్రోయించెను. అటులయ్యు నిపు డీ మందిరము మిగిలినమందిరములకంటె నున్నతముగనున్నది. దీనినిబట్టిచూచిన నా డీ మందిర మెంతయెత్తుగ నుండెడిదో యని తోచుచున్నది.

గోపీనాథమందిరము:— ఇదియును చాల ప్రాచీనమైన మందిరము. ఇది శ్రీకృష్ణచైతన్య సంప్రదాయమునకు చెందినది. జయపురనివాసియగు రాయశీలజీ యీ మందిరమును కట్టించెను. కాని దానిని తురకలు నాశనముచేయుటచే ప్రస్తుతమందిరమును 'శ్రీనందకుమారబాబు' అను నొక బంగాలీయువకుడు కట్టించెను.

యుగలకిశోరమందిరము:— ఇందు శ్రీకృష్ణ బలరాముల విగ్రహములు కలవు. క్రీ.శ. 1627 లో దీనిని చౌహాన్ వంశీయుడు 'నార్ కరణ్' కట్టించెను.

రంగమందిరము:— బృందావనమందలి మందిరము దిది చాల పెద్దది. ఇది తూర్పునుండి పడమరకు 775 అ. పొడవును, ఉత్తరమునుండి దక్షిణమునకు 440 అ. వెడల్పును యున్నది. ఇది తిరుచునాపల్లిలోని శ్రీరంగమందిరమువలెనే నిర్మింపబడినది. దీనికి 15, 20 అ. యెత్తుగల నాల్గు ప్రాకారములు కలవు. నాల్గవప్రాకారాంతరమున రాతిస్తంభముల మంటపమున భగవంతుని చతుర్భుజమూర్తి కలదు. క్రీ.శ. 1851 లో ఈ మందిరమును సోదరులగు 'సేఠ్ రాధాకృష్ణ, గోవిందదాస కట్టించిరి. స్వామిసేవకు 53 వేల రూపాయలు ఆదాయముగల 'ఎస్టేటు' కలదు.

బాంకేబిహారీమందిరము:— టట్టీ సంప్రదాయాచార్యుడగు శ్రీ హరిదాసజీకి 'బాంకేబిహారీ' ఇష్టదైవము. శ్రీ హరిదాసజీకి 'బిహారీ' విగ్రహము 'నిధివనము'న లభించెను. బృందావనమందలి విగ్రహములందిది చాల రమ్యమగు విగ్రహము. ఇచ్చట కొన్ని విషయములు విలక్షణముగ నున్నవి. స్వామి యము 10 గంటలకు మేల్కొనును. స్వామిని దర్శించునప్పుడు పూజారులు క్షణక్షణము పర్దా వేయుచుందురు. సంవత్సరమున కొక్కదినమున అక్షయతదియనాడు మాత్రము స్వామి చరణసరోజ దర్శనమగును. ఆశ్వయుజ శు ౧౫ కు మాత్ర కిరీటము నలంకరింతురు. శ్రావణ శు 3 న మాత్రము స్వా డోలారోహణము చేయింతురు. ఇచ్చట స్వామికి పాలు అ ప్రధానభోగము. మందిరమున శంఖముకాని, గంటకాని, కాని వాయించరు.

ఒకప్పుడొక భక్తుడీ స్వామిని చాల సమయమువరకు ముగ్ధుడై దర్శించుచు స్తుతించెను. అంత భక్తప్రియుడగు భగవంతుడా భక్తునివెంట పోవసాగెను. అనంతర మెంతయో ప్రార్థించిన కాని స్వామి మందిరమునకు తిరిగిరాలేదు. అందుచే భక్తులెవ్వరును స్వామిని చాలసమయమువరకు ముగ్ధులై గాంచకుండుటకు క్షణక్షణము పర్దా వేయుచుందురు.

శాహ్‌జీమందిరము:— లక్నోనగర నివాసులగు 'శాహ్ బిహారీలాల్ జీ' కుమారులు శాహ్ కుందనలాల్, శాహ్ ఫుందన లాల్ కలసి యీమందిరమును కట్టించిరి. ఈ సోదరు లిద్దరును మంచిభక్తులు, కవీశ్వరులు. బృందావనమునకు వచ్చినమీదట నీ సోదరులిర్వురు క్రమముగ 'లలితకిశోరీ' 'లలితమాధురీ' యను పేర్లతో ప్రసిద్ధినొందిరి. ఈమందిరము పాలరాతితో నిర్మింపబడెను.

గిరిధారీ మందిరము:— దీనిని రాధాగోపాల మందిరమనియు, బ్రహ్మచారీమందిరమనియు పిలతురు. గ్వాలియరు నరేశు డీ మందిరమును కట్టించెను. దీనిని కట్టించి ఆయన తన గురువగు 'గిరిధారీదాసజీ' కి సమర్పించెను. దీని ఆదాయము నాల్గులక్షలు. ఈ మందిరములోని మూర్తిని చూచితీరవలయును.

శ్రీ రాధారమణమందిరము:— ఇది మధ్వగౌడ సంప్రదాయాచార్యుల మందిరము. పూర్వము గోపాలభట్టను నొక భక్తుడుండెను. శ్రీ గోపాలభట్టజీకి శ్రీ రాధారమణు డిష్టదైవము. ఇందు సాలగ్రామమునకు సురుచిరములగు నాగప్రత్యంగములతో శ్రీరాధారమణరూపము కలదు. వైశాఖ శు ౧౫ నాడు భగవంతుని ప్రాకట్యోత్సవమును మిక్కిలి వైభవముగ చేయుదురు.

**శ్రీ రాధావల్లభ మందిరము:—** శ్రీ రాధావల్లభస్వామి 'శ్రీ హితహరివంశజీ' కి ఉపాస్యదైవము. ఇది క్రీ.శ. 1508 లో స్థాపించెను. హరివంశజీసంతానమే నేటికిని స్వామికి అర్చకులై యుండిరి.

**గోపేశ్వరమహాదేవ మందిరము:—** ఈ మహాదేవుని శ్రీకృష్ణుని ప్రపౌత్రుడగు వజ్రనాభుడు స్థాపించెను. శ్రీకృష్ణుని మహారాసమున పాల్గొనుటకై ఈశ్వరుడు గోపికారూపమును దాల్చివచ్చెను. ఆయనయే గోపేశ్వరమహాదేవుని రూపమున విరాజిల్లుచుండెను. ఈ స్వామిని దర్శించనియెడల బృందావన యాత్ర సఫలముకాదని చెప్పుదురు.



గిరినార్ - నేమనాథమందిరము

(చూడుడు 172 పేజీ)

**జయపురాధీశుని మందిరము:—** ఈమందిరమునునిర్మించుటకుసుమారు 30 సంవత్సరములు పట్టెను. సౌందర్యమున 'శాహజీ' మందిరముదక్క యితరములేవియు దీనితో సాటిరావు. దీని ఆదాయము 40 లక్షలు.

**సేవాకుంజము:—** ఇది శాహజీ మందిరమునకు వెనుక గలదు. ఇది బృందావనమున నొక ప్రసిద్ధస్థానము. ఇది ప్రాకారవేష్టితమగువనము. ఈవనమధ్యమున పాలరాతిమందిర మొకటి కలదు. నిత్యము భగవంతుడిచ్చట విహరించు (రాసలీల) చుండునని చెప్పుదురు. రాత్రి యీ వనమునం దెవ్వరు నుండరు. కోతులు, పక్షులు కూడ బయటికి వచ్చివేయును. ఒకవేళ నెవ

రైన రాత్రి యచటనుండిన మృతినొందగాని, మరణాసన్నుడై గాని మరునాడు కాన్పించును.

శ్రీకృష్ణాశ్రమము:— ఈ యాశ్రమము మిక్కిలి విశాల మైనది. చక్కని వసతి కలదు. మేము యుండే బసచేసితిమి. శ్రీ ఉడియాబాబా, శ్రీ హరిహరబాబా వీరుభయులు ఈ యాశ్రమమున ముఖ్యులు. మరియు లాలాబాబూ మందిరము, సేవాకుంజము, నిధివనము, వంశీవటము, కాళీయహ్రదము, మొదలగునవి ముఖ్యముగా చూడదగినవి. బృందావనములోని మందిరము లన్నియును భక్తులకు భగవంతుడు దర్శనమిచ్చి, ఆయన యనుగ్రహమున స్థాపించబడినవి. ఈ మందిరములకు లక్షలకొలది యాదాయము వచ్చును.

ఇతరములు:— ప్రేమమహావిద్యాలయము:- ఇది కేశీఘట్టమున కలదు. మెకానికల్ ఇంజనీరింగ్, ఫిట్టింగ్, మూర్తినిర్మాణకళ, టైపింగ్, కమ్మరము, వడ్రంగము, తివాసీలు నేయుట, కుట్టుపని, చిత్రకళ, మట్టిపని, పింగాణీపని, ప్రెస్సుపని నేర్పుదురు. జీత మేమియును తీసుకొనరు. కళాకౌశలమేకాక యిచ్చట 'మెట్రిక్' వరకు చదువుకూడ చెప్పబడును.

గురుకులము:— ఇది యుక్తప్రాంత ఆర్యసమాజ ప్రతి నిధి సభకు చెందిన విద్యాసంస్థ. ఇందు ఆర్యసమాజ సిద్ధాంత ముల ననుసరించి 'వేదవేదాంతములు, ఇంగ్లీషు' నేర్పబడును.

శ్రీ రామకృష్ణ సేవాశ్రమము:— ఇందు అసహాయులకు అనాథులకు సేవచేయబడును. శ్రీరామకృష్ణమిషనుకు చెందిన సన్యాసులు బ్రహ్మచారులు, యీసేవ చేయుదురు.

సహాయతాఫండ్:— ఇచ్చట భగవన్నామ సంకీర్తన పరులకు భోజనాది వ్యవస్థకై కొంతమంది త్యాగశీలురగు సజ్జనులు కొంత మూలధనముల నేర్పాటు చేసిరి.



ఇంద్రప్రస్థము - ఢిల్లీ (చూడుము 118 పేజీ)

శ్రీరాధా మాధవఫండ్:— దీనిని గ్వాలియర్ నివాసి 'శ్రీ బలవంతరావు సిందే' స్థాపించెను. ఆయన 20 లక్షల రూపాయలు యిచ్చెను. ఈ ఆదాయమును భగవన్నామ సంకీర్తన పరుల సేవాకార్యక్రమమునకై వినియోగింతురు.

కొన్నియితర విషయములు:— మథురయందు వలె బృందావనమునందుగూడ యనేకములగు ఉత్సవములు జరుగుచుండును. శ్రావణ మాసమున ఊయెలల ఉత్సవము, రాసోత్సవము, చైత్రమాసమున 'శ్రీరంగజీ రథోత్సవము' జరుగును. వేదములు, పురాణములు, శ్రుతులు యీ పుణ్యభూమి మహత్త్వము ననేకవిధముల ప్రశంసించెను. బృందావన యాత్ర

వలన గోలోకము ప్రాప్తించునని పురాణములు ముక్తకంఠమున పలుకుచున్నవి. శ్రీ మద్భాగవతమునందు బృందావన మహాత్వ మధికముగ వర్ణింపబడెను.

శ్రీకృష్ణున కనన్య భక్తుడగు ఉద్ధవు డొకప్పు డిట్లను కొనెను. 'బృందావనమునందు నేను లతౌషధీవనస్పతి రూపములం దుద్భవించియున్న నా ఆత్మీయులను, ఆర్యమార్గమును వీడి గోపికా చరణరేణు పరిపూతాంగుడనై శృతివిమృగ్యమగు ముకుంద సాన్నిధ్యమును పొందియుందును గదా!'. బృందావన స్థలీపరాగమే యింత పవిత్రమైయున్న నిక నా పవిత్రక్షేత్రమును గూర్చి వేరుగ చెప్పనేల ? ఇది దివ్యనదియగు కాళిందీకూలమున గలదు. — భాగవతము

## గోకులము - మహావనము

శృతిమపరే స్మృతి మపరే భారతమపరే భజన్తు భవభీతాః ।
అహమిహ నందం వందే యస్యాలిందే పరం బ్రహ్మ ॥

"వేదములను, స్మృతులను, భారతమును, సంసార గహనభీతు లగువారు సేవించిన సేవింతురుగాక ! తన గృహాము నందే పరబ్రహ్మ స్వరూపము నుంచుకొని నందునికి మాత్రము నేను నమస్కరింతును"

మథురకు దక్షిణముగ 6 మైళ్ళ దూరమున గోకులము కలదు. ఇది యమునానదికి ఎడమవైపున కలదు. ఇచ్చటి కొక మైలుదూరమున యమునా తీరమున మహావనము కలదు. ఈ వనమే ప్రాచీన గోకులము. వర్తమానమున గోకులమని పిలువ బడుస్థానము వల్లభాచార్యునిచే నూతనముగ నిర్మింపబడెను.

మహావనము:— మథురనుండి బలదేవ గ్రామమునకు పోవుమార్గమునం దీవనముకలదు. నందుడు నివసించిన పల్లె యిదియే. వసుదేవుడు యమునను దాటి బాలకృష్ణు నిచ్చటికే గొనివచ్చెను. శ్రీకృష్ణుడు బాల్యమున 'పూతనా సంహారము, శకటాసురవధ, తృణావర్త సంహారము, యమలార్జునోద్ధరణము' మొదలగు దివ్యలీలలను గావించిన దీప్రదేశముననే.

నందభవనమున యశోదానందుల విగ్రహములు, శ్రీకృష్ణుని ఊయెల, రాతిపెరుగుకుండ, కవ్వము కాననగును. ఇవికాక శ్రీకృష్ణుడు గోవత్సములను మేపిన ప్రదేశము, నందుడు పలు దోమిన మిట్ట, నందకూపము, పూతనచితి, 84 స్తంభముల మందిరము, మథురాధిపతి, ద్వారకాధీశుడగు శ్రీకృష్ణుని మందిరములు, గోశాల మొదలగు దర్శనీయ స్థానములు గలవు. ఇది 'మథుర' తహసీలుకు చెందిన గ్రామము. ఈ గ్రామమునందు సగభాగమున హిందువులు, సగభాగమున ముసల్మానులు నివసించుచుండిరి.

గోకులము:— ఇది యమునా తీరమున గలదు. ఇచట వల్లభ సంప్రదాయమునకు చెందిన గోస్వాముల పీఠము కలదు. ఇచట శ్రీవల్లభాచార్యుడు, శ్రీవిఠల్‌నాథుడు, శ్రీగోకుల నాథుడు, భాగవతము ననేక పర్యాయములు పారాయణచేసిరి. ఇచ్చట వారి ముఖ్యరి యాసనములును గలవు. శ్రీ గోకులనాథజీ అధికముగ నిచ్చటనే నివసించెడివారు. ఔరంగజేబు యీ గ్రామమును ధ్వంసము జేయనెంచగా ఆమహాసీయు డనేక చమత్కారముల నాతనికి జూపి యీ గోకులమును రక్షించెను. వల్లభ

సంప్రదాయమునకు చెందిన గుజరాతీలకు గోకులమువీద నభిమానము మెండు. వారు కోట్లకొలది రూపాయలను వెచ్చించి యిచ్చట కొన్ని మందిరములను ఘట్టములను నిర్మించిరి.

ఇచ్చటి మందిరములందు 'శ్రీ గోకులనాథజీ' మందిరము ప్రధానమైనది. ఇదికాక శ్రీమథురేశజీ, శ్రీ విఠల్ నాథజీ, ద్వారకాధీశజీ, శ్రీ గోకులచంద్రమాజీ, మదనమోహనజీ మందిరములు కూడా కలవు. యమునా తీరమున సుందరములగు ఘట్టములు చాల కలవు. అందు 'ఠాకురానీఘాట్' ప్రసిద్ధమైనది.

ఇచ్చట రెండు సంస్కృత పాఠశాలలు, అన్నసత్రము, పోష్టాఫీసు, తంతి కార్యాలయము మొదలగునవి కూడాగలవు. ఇచ్చటి వాతావరణము ప్రశస్తమైనది. ఇచ్చట మృతిపొందిన వారల కుత్తమగతులు గలుగునని పురాణములు ఘోషించుచున్నవి.

## బలదేవపురము

"వహసి వపుషి విశదే వసనం జలదాభం
హల హతిభీతి మిలిత యమునాభం
కేశవ! ధృతహలధరరూప! జయ జగదీశ! హరే!"

— గీతాగోవిందము

మహావనమునకు సుమారు 6 మైళ్ళదూరమున 'బలదేవపురము' కలదు. ఇచ్చట దీనిని 'రీడా' గ్రామమనికూడ పిలతురు. మహావనమునుండి టాంగాలుకలవు. నడచియుపోవచ్చును. బలదేవగ్రామము చాల సుందరమైనది. ఇచటి వాతావరణము

మిక్కిలి ప్రశస్తమైనది. ఇచట పోస్టాఫీసు, పాఠశాల, ఠాణా కలవు. అన్ని వస్తువులు లభించును.

బలరామమందిరము:— క్షీరసాగరమున కెదుట బలరామ మందిరము గలదు. బలరామవిగ్రహము విశాలమైనది. ఈ విగ్రహము సుమారు 7, 8 అ. యెత్తు గలిగియున్నది. ఈ విగ్రహమున కెదుట నొకప్రక్క 'రేవతిదేవి' (బలరామునిభార్య) విగ్రహము కలదు. విగ్రహములు రెండును నల్లనిరాతితో చేయబడెను. ఇచట పంచదారకలిపిన వెన్నను స్వామికి నివేదన చేయుదురు. బలరామునిరంగు ఎఱుపు. కాని యీ విగ్రహము నల్లగనున్నది. దీనినిగూర్చి యొక యితిహాసముకలదు. ధేనుకాసురుని, ప్రలంబాసురుని సంహరించు సమయమున శ్రీకృష్ణుడు తన తేజస్సును, బలరామునియందు ప్రవేశింప జేసెను. ఆ సమయమం దాయన శరీర మింద్రనీలమువలె నయ్యెను. అ భావమే ప్రస్తుత విగ్రహమందుకూడ ద్యోతన యగుచుండెను. ఇచ్చట ప్రతి వత్సరము భాద్రపద శు ౬, మరియు మార్గశిర ౧౫ కు ఉత్సవములు జరుగును.

క్షీరసాగర కుండము:— ఈ మందిరమున కెదుట 'క్షీరసాగర కుండము' కలదు. వ్రజనాభు డీబలరామమూర్తిని తయారు జేయించెనని చెప్పుదురు. ఈ విగ్రహము చాలకాలము వరకు క్షీరసాగమున బడియుండెను. ఒక దినమున బలరాముడు 'కళ్యాణజీ' అను బ్రాహ్మణునకు స్వప్నములో గాన్పించి 'క్షీరసాగరకుండము' నందున్న తన్ను వెలికిదీసి ప్రతిష్ఠించుమని చెప్పెను. ఆ బ్రాహ్మణు డీవిగ్రహమును వెలికిదీయించి యొక సామాన్య మందిరమున ప్రతిష్ఠించెను. యాత్రికు లీకుండమున

స్నానముచేసి రేవతీ బలరాములను పూజింతురు. కల్యాణజీ అనన్యభక్తుడు. చిరకాలము బలరాముని సేవించి యీయన యనుగ్రహమునకు పాత్రుడాయెను.

పూర్వమున ఔరంగజేబు యీ మందిరము మీదకు దాడివెడలెను. కాని మందిరమునుండి చాల తుమ్మెదలువచ్చి యాతని సైన్యమును కుట్టి పీడించ దొడగెను. అంత నాతడీకార్యక్రమమును విరమించి, తన తప్పును మన్నించుమని ప్రార్థించి స్వామి సేవా కార్యక్రమములకై 5 గ్రామముల నొసంగనని చెప్పుదురు.

శివాజీకాలమున మహారాష్ట్రు లభివృద్ధి గాంచినపుడు వారలు రెండు గ్రామముల నీస్వామి కొసంగిరి. ఈవిధముగ బలరామునకు 7 గ్రామములకు జమీందారు. ఈగ్రామములన్నియు కల్యాణజీ వంశస్థుల యధికారమున గలవు.

## గోవర్ధనము

గోవర్ధనము మథురకు 16 మైళ్ళ దూరమున గలదు. ఇచటకు మోటారుమీద, టాంగామీద వెళ్ళవచ్చును. ఇది భరతపూరు రాజ్యములోనిది. ఇచట గ్రామము గోవర్ధన పర్వత సమీపమున కలదు. ఇచట కొన్ని ధర్మశాలలు కలవు. అందు 'అర్జునసింహసింహాపీ' ధర్మశాల, తులారామ్ సాధూరామ్ ధర్మశాలలు సౌకర్యముగ నుండును. ఇచ్చట కన్యాపాఠశాల, పోస్టాఫీసు, తంతి కార్యాలయమును కలవు. అన్ని వస్తువులు లభించును.

గోవర్ధన అవతరణము:— గోవర్ధనము తొలుత గోలోకమందుండి శ్రీకృష్ణు ననన్యభక్తితో సేవించు చుండెను. త్రేతాయుగమున ప్రభువు శ్రీరాముడై యవతరించునని తెలుసుకొని యాతని దివ్యలీలలను గాంచుటకై గోవర్ధనము ద్రోణాచలమున కొక శిఖరముగ భూలోకమున నుద్భవించెను. సేతు నిర్మాణ సమయమున అంజనేయు డీశిఖరౌన్నత్యమును గాంచి పెకలించుట కుద్యమించెను. కాని గోవర్ధనము సాలగ్రామ మయమై



భగ్నమైన సిద్ధేశ్వరమందిరము (చూడుడు 139 పేజీ)

నారాయణ స్వరూపమై యుండుటచే కొంచెమైనను కదులలేదు. వాయునందనుడు యథార్థము తెలుసుకొని శ్రీరామునిచరణసన్నిధికి నిన్ను గొంపోయెదను, లెమ్మని ప్రార్థింప గోవర్ధనుడు భక్తివిహ్వలుడై తేలికయయ్యెను. ఆంజనేయుడు సునాయాసముగ నా పర్వతరాజమును మూపున నిడుకొని వచ్చుచుండెను.

శ్రీరాము డీవిషయమును గుర్తించెను. గోవర్ధనుడిట కేతెంచిన నా శ్రీకృష్ణరూపమును గాంచ నిచ్ఛగించును. ఆతని కోర్కెను దీర్చిన నా యీ అవతారమున మర్యాదాభంగము కలుగును అని భావించి, వానరులను పిలిచి, సేతునిర్మాణము పూర్తియైనది, కాన పర్వతము లింక నవసరములేదు. పర్వతములను దెచ్చుటకు వెళ్ళిన వానరులతో పర్వతముల నెంతవరకు దెచ్చిన నచ్చటనేయుంచి తిరిగి రావలసినదిగా చెప్పుమని యాజ్ఞాపించెను.

ఆసమయమునకు ఆంజనేయుడు గోవర్ధనముతో మథురా సమీపమునకు వచ్చెను. ప్రభుని యాజ్ఞను విని మారుతి గోవర్ధనము నచ్చటనేదించి శ్రీరామ సాన్నిధ్యమున కేతెంచి, గోవర్ధనుని భక్తిని, కోర్కెను ఎఱింగించెను.

అంత రాముడు 'గోవర్ధనునకు నాయీ రూపము, యిష్టము కాదు. ద్వాపరమున నే నాతనికి దర్శన మొసంగుటయే కాక నా చెలికాండ్రతో గూడి యాతనిపై క్రీడింతును. ఏడు అహోరాత్రము లాతని చేతితో ధరింతునని చెప్పు' మని యాంజనేయునితో చెప్పెను. ఆంజనేయు డీవార్త గోవర్ధనునకు తెలిపెను. అప్పటినుండియు గోవర్ధనుడు దినములను యుగముల వలె లెక్కించుచు ప్రభుదర్శనమునకై యచ్చటనే వేచి యుండెను. ద్వాపరమున నాతనికోర్కె దీరెను. ధన్యత గాంచెను. ఆకాలమునం దీ పర్వతము మిక్కిలి ఎత్తుగా నుండెడిది.

కలియుగము వృద్ధినొందిన కొలది యీ పర్వతము క్రమ క్రమముగ భూమిలోనికి దిగిపోవుచున్నదని చెప్పుదురు. వర్త

మానమున దీనిఎత్తు 100 అడుగులకు మించియుండదు. ఇచటి జను లీపర్వతమును మిగుల పూజ్యభావముతో చూచుచు పూజించు చుందురు. ఆషాఢ శుద్ధ పూర్ణిమకు, కార్తీక బహుళ అమావాస్యకు యీ పర్వతమునకు ప్రదక్షిణము చేయుదురు.

చాలమంది యాత్రికు లీపర్వతమును సాష్టాంగ ప్రణామములుజేయుచు పరిక్రమింతురు. దీని పరిక్రమణము 7 క్రోసులు. పరిక్రమణమున సుందరములగు నేకాంత ప్రదేశము లనేకము లున్నవి. ప్రదక్షిణము మానసీగంగ నుండి యారంభమగును. క్రమముగ బ్రహ్మకుండము, దానఘాట్, గోరోచనకుండము, కిల్లోలకుండము, మయూరవనము, మాధురీకుండము, రాధాకుండము, కుసుమసరోవరము మొదలగు పవిత్రస్థానము లనేకము కాననగును. వీని మహాత్త్వము 'బ్రహ్మవైవర్త పురాణము'న విపులముగ కలదు.

మానసీగంగ:— ఇది గోవర్ధన గ్రామము నందుగల సుందర సరోవరము. దీనికి మూడువైపుల మందిరములు కలవు. ఒక వైపున గోవర్ధన పర్వతము కలదు. ఇచట గోవర్ధన దేవాలయము కలదు. దీపావళినాడీ సరోవర మతి మనోహరముగ శత సంఖ్యాకములగు దీపపంక్తులతో నలంకరింపబడును. ఇందు స్నానముచేసిన గంగాస్నాన ఫలితము లభించును. యాత్రికు లిందు స్నానముచేసి లక్ష్మీనారాయణుని పూజింతురు.

— బ్రహ్మవైవర్త పురాణము.

లక్ష్మీనారాయణస్వామి:— ఇచట లక్ష్మీనారాయణ స్వామి మందిరము కలదు. ఇది ఉత్తర భారతమున రామానుజ

సంప్రదాయమునకు చెందిన 'గోవర్ధన పీఠము'ను పేర బరగు చుండెను. మానసీగంగా తీరమున 'భరతపూర్' రాజుల సమాధులు గలవు. అవి చాల నందముగ నిర్మింపబడెను.

మఱియు నిట భరతపూరు రాజావారి మంటపములు, ధర్మశాలలు కలవు. ఈ మంటపములలో పైభాగమున భాగవత దశమ స్కంధములోని కథలు చాల చిత్రముగ చిత్రవర్ణము లతో చిత్రింపబడినవి.

## శ్రీ నింబార్క సుదర్శనము



శ్రీ నింబార్కాచార్యస్వామి

గోవర్ధనమునకు పశ్చిమమున బరసానా పోవు మార్గమున 2 మైళ్ళలో శ్రీనింబార్కాచార్య అనుపేరు గల నింబగ్రామము గలదు. ఇది శ్రీనింబార్కుని తపోభూమి. ఇట నింబార్క తీర్థము గలదు. నింబార్కుని సాలిగ్రామ విగ్రహము కలదు. శ్రీఆచార్యులవారు చిరకాలము రాధాకృష్ణులను ఉపాసించి శ్రీ రాధాకృష్ణుల సాక్షాత్కారమును బడపెను. శ్రీ నింబార్కాచార్యు లిచ్చటనే వేదత్రయమునకు భాష్యమును వ్రాసిరి. శ్రీ సుదర్శనచక్రముయొక్క యవతారమె

శ్రీ నింబార్కాచార్యులవారు. శ్రీ సుదర్శనచక్రము యొక్కయు, శ్రీ నింబార్కుని యొక్కయు పాలరాతి ఆలయములు కలవు. ఆలయ సమీపమున సుదర్శనకుండము కలదు. ఈ కుండమునకు చక్కని ఘట్టము కలదు. ఇందలి జలము ఆచార్యుని చరణప్రక్షాళిత జలమని ఆచమించుదురు. స్నానము చేయరు. ఈప్రాంతమంతయు మిక్కిలి మనోహర ప్రకృతిదృశ్యములతో నలరారుచుండును.

## వృషభానుపురము

గోవర్ధనమునకు వృషభానుపురము 7 క్రోసుల దూరమున కలదు. ఈ గ్రామ మొక మెట్టప్రదేశమున కలదు. మార్గము చాల బాధాజనకముగ నుండును. 'డిగ్' అను గ్రామము మీదుగ నొక మంచి రోడ్డు కలదు. కాని యిది చుట్టు. ఈ మార్గము మీదుగ పోయిన 25 మైళ్ళ దూరము. వృషభానుపురము శ్రీరాధాదేవి జన్మస్థలము. దీని నిచ్చటివారు 'బరసానా' యనియు, 'బ్రహ్మసానుపుర' మనియు పిలతురు. వృషభానుడు రాధ తండ్రి. ఆత డీ గ్రామముననే నివసించెను. అందుచే దీనికి వృషభానుపురమని పేరు వచ్చెను. వృషభానుపుర మందమైన గ్రామము. ఇచటి ప్రకృతిదృశ్యము లతి మనోహరములుగ నుండును. వాతావరణము ప్రశస్తమైనది.

శ్రీ రాధికాదేవి మందిరము:— ఇచట నొక ఎత్తైన కొండమీద శ్రీ రాధికాదేవి మందిరము కలదు. పర్వతము మీదకు మందిరము వరకు మెట్లున్నవి. మందిరము విశాలముగా నున్నది. ఈ పర్వతమును బ్రహ్మస్వరూపముగ భావింతురు. దీనికి నాల్గు శిఖరములు కలవు. ఆనాల్గు శిఖరములు బ్రహ్మ

యొక్క చతుర్ముఖ స్వరూపములని చెప్పుదురు. ఆ నాలుగు శిఖములమీద నాలుగు మందిరములు కలవు.

కొండకు దిగువ గ్రామముకలదు. ఇచట భోజనసామాగ్రి సర్వము లభించును. ఈ పర్వతమును, గ్రామమును పరిక్రమించుటలో చాల మందిరములు, సరోవరములు కానవగును. ఇందు 'గహ్వారవనము, వృషభాను సరోవరము, సాకన్ ఖోర్, * మానగృహము, విలాసగఢ్' ప్రధానములు.



రామనగరు (చూడుడు కాశీ) ఫొటో: బ్రైట్ అండ్ కో, కాశీ.

గహ్వారవనము:— గహ్వారవనమున పూర్వము నారాయణదాసు అను బ్రాహ్మణుడు భజన చేయుచు నివసించెడివాడు. ఆయనకు శ్రీ రాధాదేవి స్వప్నమున గాన్పించి 'గహ్వార

---

* ఇది రెండుకొండలు కలసినచోటు. ఇది నావ ఆకారమున నున్నది. దీని వైచిత్ర్యమును చూచినగాని తెలియదు. రెండుకొండల సందునుండి కష్టముగ నొక మనుష్యుడు వెళ్లుట కవకాశము గలదు.

వనమున ఫలానా ప్రదేశమున నా విగ్రహము భూమియం దున్నది. దానిని వెలికిదీసి ప్రతిష్ఠించుము' అని చెప్పెను. అంత నా బ్రాహ్మణు డావిగ్రహమును బయటకు తీసి యొక కుటీరమున ప్రతిష్ఠించెను. ఆ బ్రాహ్మణుని వంశీయులే నేటికిని శ్రీ రాధా దేవికి అర్చకులుగ నుండిరి.

**మానగృహము:—** సాంకరీఖోర్ వద్ద నొక కదంబ వృక్షము కలదు. దీని ఆకులు అన్ని కదంబవృక్షముల వలెగాక దొన్నెలవలె నుండును. రాధిక కోపించగా కృష్ణు డనునయించిన ప్రదేశమును '**మానగృహ**' మని చెప్పుదురు.

వృషభానుపురమున భాద్రపద శు ౮ నుండి శు ౧౪ వరకు రాధ జన్మోత్సవము జరుగును. ఇచట 'హోలీ' చూడదగి నది. * ఈ రాధా మహత్వమును గురించి పురాణములలో మిక్కిలిగ వర్ణింపబడినది.

# నందపురము

"శ్రుతిమపరే స్మృతిమపరే భారతమపరే భజంతు భవభీతః,
అహమిహ నందంవందే యస్యాలిందే పరబ్రహ్మ."

వృషభానుపురమునకు నందగ్రామము ౩ మైళ్ళు. ఈ రెండు గ్రామములకుమధ్య 'ప్రేమసరోవర'మను సుందరమగు సరస్సు గలదు. శ్రీరాధాకృష్ణు లిచ్చట కలుసుకొనుచుండెడి వారు. దీనికి సమీపముననే సేఠ్ గురుసహాయమల్ జీ కట్టించిన 'శ్రీరాధా వినోదమందిరము' గలదు. గోకులమునం దుత్పాత

* రాధా స్వరూపతత్త్వములు తెలియగోరువారు, 40 గ్రంథముల సారమగు మా " రాధారహస్యము " ను చూడుడు.

ములు జరిగినకారణమున నందు డీ గ్రామమున నివసించెను. దీనిని 'నందిగ్రామ'మనియు పిలతురు. నందగ్రామవాసులు బరసానా గ్రామవాసులు పరస్పరము వియ్యంకులసంబంధమును నెరపుచుందురు. హోలీసమయమున నా రెండు గ్రామములవారు పరస్పరము వసంతోత్సవము వైభవముగా జరుపుకొందురు. నందగ్రామవాసులు వరపక్షమువారలనియు, బరసానా గ్రామవాసులు కన్యాపక్షమువారనియు పరస్పరము భావింతురు. నందగ్రామ మొక పల్లె. భోజనాది సామగ్రులు చాల తక్కువగ లభించును. ఇచటకు 'కోసీ' యను రైలుస్టేషను నాల్గుమైళ్ళ దూరమున గలదు.

నందగ్రామము కూడ బరసానావలె నొక మిట్టపైన గలదు. ఈ కొండను శివస్వరూపముగ భావింతురు. (గోవర్ధనము విష్ణుస్వరూపము. బరసానాకొండ బ్రహ్మస్వరూపము) ఈ కొండపైన నందుని మందిరము గలదు. అందు బలరామకృష్ణులయు, యశోదానందులయు విగ్రహములు గలవు. మూర్తు లతి మనోహరములుగ, వాత్సల్యరసోద్దీపకములై యున్నవి.

కదంబవనము:—ఇచట కడిమిచెట్లధికముగ గలవు. ఇందు 'పానసరోవర'మను పేరుగల నొక కుండము గలదు. శ్రీకృష్ణుడు గోవులకు యీసరస్సునందే నీళ్ళు త్రాగించెడివాడని చెప్పుదురు. మరియు 'లలితాకుండము' 'విశాఖాకుండము' మొదలగు సరస్సులు గలవు.

కోకిలవనము:— ఇచ్చట శ్రీకృష్ణుడు కోకిలవలె పంచమస్వరమున మాటలాడెను. ఒకప్పుడు నారదుడిచ్చట వీణ వాయిం

చెను. ఆ సమయమున రాళ్లుకూడ కరగిపోయెను. ఒక కరగిన రాతిపై శ్రీకృష్ణుని చరణచిహ్నములు నేటికిని కాననగును.

పూర్ణిమాసీకుండము:— 'పూర్ణిమాసి' నందునియింట నాడవారికి తగు నుపదేశముల నిచ్చుచు పురోహితునివలె నుండెడిది. ఆమెపేర నీకుండము ప్రచలితమయ్యెనని చెప్పుదురు.

కందుకక్రీడాస్థానము:— ఇది కొండమీాద గలదు. ఇచట శ్రీకృష్ణుడు బంతియాడెనని చెప్పుదురు. దీని నిచ్చటివారు 'గేందోఖర్' అని పిలతురు.

అంజనీశిలా:— ఇచట శ్రీకృష్ణుడు శ్రీరాధాదేవికన్నులకు కాటుకబెట్టెను. ఈ రాతిపై వేలుతోరాసి కండ్లకు బెట్టుకొనిన కాటుకవలె నంటుకొనును. అందుచే దీనిని 'అంజనీశిల' యని యందురు. ఒకభక్తుడు గోపికల సౌభాగ్యమునుగూర్చి యిటులనెను.

"ధన్యాగోకులకన్యా వయమిహ మన్యా మహాజగతి,
యాసాం నయనసరోజే అంజనభూతో నిరంజనో వసతి"

'నిరంజనుడగు పరబ్రహ్మ యంజన (కాటుక) సదృశుడై కనుదమ్ములందు నిరంతరము వసించుటచే గోపికలు ధన్యులు.'

వ్రజమండల మతి పవిత్రమగు ప్రదేశము. భావుకులగు శ్రీకృష్ణభక్తులకు వ్రజమండలభూపరాగము గంగాజలసదృశము. వ్రజమండలమును హిందువులేకాక యన్యులుకూడ యభిమానించియుండిరి.

'మధుర, బృందావనము, గోకులము మహావనము, బలదేవపురము, గోవర్ధనము, వృషభానుపురము, నందపురము'

యీ క్షేత్రములన్నియు వ్రజ మండలాంతర్గతములైనవి. మథుర కేంద్రముగా గలిగి 84 క్రోసులు విస్తీర్ణముగల దివ్యక్షేత్రము వ్రజమండలము. 'వ్రజ' మన 'శ్రీకృష్ణప్రాప్తికై వెడలు ప్రదేశ' మని యర్థము. (వ్రజన్తి అస్మిన్ జనాః శ్రీకృష్ణ ప్రాప్త్యర్థమితి వ్రజః)

## ఆగ్రా

మథురనుండి ఆగ్రా చేరవలయును. ఇది యమునా తీరమున గలదు. జనాభా షుమారు 3,75,660. ఒకప్పు డిది మొగలాయి రాజుల సామ్రాట్టు రాజధాని. 1526 లో దీనిపై దండెత్తిన బాబరు కోహినూరు వజ్రమును తరలించెను. అక్బరు దీనిని రాజధానినిగా జేసుకొని బ్రహ్మాండమైన ఆగ్రా కోటను నిర్మించెను. పిమ్మట యీయన మనుమడైన షాజహాను ప్రపంచ ప్రసిద్ధమైన తాజమహాల్‌ను,తన ప్రియ భార్యయైన



కోట - మాన్‌సింగ్ ద్వారము

ముంతాజమహాల్ స్మృతి చిహ్నముగ నిర్మించి అమరకీర్తి నార్జించెను. తాజమహాల్ పాలరాతితో నిర్మించబడెను. 22 వేల మంది పనివారు, 18 సంవత్సరములు పట్టెను. ఇందు షాజహాను యొక్కయు, ఆయన పట్టమహిషి యొక్కయు, సమాధులు

కలవు. దీనిలోపల రవ్వలు, వజ్రములు, వైడూర్యములను పోలిన విలువైన రాళ్ళతో రూపొందించబడినశిల్పము. ఇది అపూర్వమైన ఉద్యానవనముల మధ్య నిర్మించబడినది. దీని సౌందర్యము వెన్నెల రాత్రులలో చూడదగినది. నానా దేశవాసులు తాజమహాలు సౌందర్యమును చూచుటకై ఏతెంతురు.

అక్బరు సార్వభౌముడు నిర్మించిన కోట 70 అడుగుల ఎత్తు. కోట ప్రధానద్వారములు, లోపలి మసీదులు, దర్బారులు, అక్బరు నిర్మించిన జహాంగీరు భవనము, షమక్ బురుజు, షాజహాను నిర్మించిన మోతీమసీదు అందములో సాటిలేనివి. ఎంత చూచినను తనివితీరదు. యమునా నదికి ఆవలి యొడ్డున నూర్జహాన్ సామ్రాజ్ఞి తండ్రియగు 'ఇతిమత్ దౌలా' సమాధి కలదు.

ఇక్కడికి 5 మై. లో ఉన్న సికింద్రాదగ్గర రమ్యోద్యానమున అక్బరు సమాధి కలదు. నిరాడంబరముగ, గంభీరముగా నుండు వాటిలో దానికదేసాటి.

ఇక్కడ చక్కని ధర్మశాలలు గలవు. పరశురాముడు జన్మించినది యిచ్చటనె అని జనశ్రుతి కలదు. యమునలో తాబేళ్ళధికము. స్నానసమయమున మచ్చికగన్న వానివలె యాత్రికులను వెంబడించును - హిందూ కళాశాస్త్రజ్ఞునిచే షాజహాను తాజమహాలు నిర్మింపజేసి, బహుమానమునకయి కోటకు రమ్మని ఆతని శిరము నరికించెనని చెప్పుదురు. తాజమహాలు వంటిదికాని, అధికమైనదికాని యితడు నిర్మించిన తన కీర్తికి భంగము కలుగునని యిట్టిపని చేసె నందురు. ఆగ్రా విశ్వవిద్యాలయము చూడ

దగినది. గ్వాలియర్, ఝాన్సీలకు ఆగ్రానుండి కూడా వెళ్ళ వచ్చును. నాగపూరు మీదుగకూడ రావచ్చును. ( చూ. మధ్యభారతము )

## దయాల్ బాగ్

ఆగ్రాకు షుమారు 6 మై. లో రాధాస్వామి మతస్థాప కునిచే నిర్మింపబడిన పట్టణము. ఇచట స్వదేశ వస్తువు లన్నియు తయారు చేయుదురు. నిత్యము శిష్యులకు గురువులు పలువిష యముల గురించి ప్రబోధము చేయుచుందురు. ఈ సంస్థ తప్పక చూడదగినది.

## ఫతేపూర్ సిక్రీ

ఇది ఆగ్రాకు 26 మై. దూరమున గలదు ఇక్కడ నివ సించు సలీం చిస్తీసాహెబ్ అగ్బరు సార్వభౌమునకు కుమారుడు కలుగగలడని చెప్పిన జోస్యము నిజమైనందున అగ్బరు చక్రవర్తి తన కృతజ్ఞతకు చిహ్నముగా ఈ పట్టణమును నిర్మించెను. సలీమ్ చిస్తీ సమాధికలదు. పురాతన చిహ్నము లనేకములు గలవు. చూడదగిన ప్రదేశము.

## కరౌలీ

ఆగ్రానుండి హిండౌన్ స్టేషనులో దిగవలయును. ఇది రాజధానీ నగరము. కరౌలీకి రైలులేదు. హిండౌన్ స్టేషనులో దిగి మోటారుమీదగాని, టాంగాలమీదగాని చేరవచ్చును. క్రీ. శ. 1348 లో అర్జునదేవుడు కరౌలీనగరమును నిర్మించెను. ఈ నగరమునకు $2\frac{1}{2}$ మైళ్ళ పొడవుగల రాతిగోడ కలదు. ఇచ్చట

యాత్రికులు బసచేయుట కొక సత్రము కలదు. ఈ నగరమునం దనేక సుందరమందిరములు గలవు. వీనియందు మదనమోహన మందిరము సుప్రసిద్ధమైనది. శిరోమణి మందిరమను నొక దేవాలయము ఎఱ్ఱరాతితో చాల సుందరముగ నిర్మింపబడెను.

కరౌలీనగరమున 'కైలాదేవి' చాల ప్రసిద్ధమైనది. చైత్ర మాసమున కైలాదేవిమందిరమున నవరాత్ర్యుత్సవములు జరుగును. ఈ యుత్సవములందు పశువులను విక్రయింతురు. కరౌలీ నగరమున 'శికార్‌గంజ్, శికార్ మహల్, ఖవాస్ మహల్' అను పేర్లుగల వనములు సుప్రసిద్ధమైనవి. ఇవికాక నిచ్చటి రాజభవనములు కూడ చూడదగినవి.

బృందావనమందలి పురాతన మదనమోహన విగ్రహమే యిచ్చటి మదనమోహనమందిరమున ప్రతిష్ఠింపబడెనని చెప్పుదురు. ఇచ్చట నొక చిన్న పర్వతమువిూద కైలాదేవి మందిరము పాలరాతితో నిర్మింపబడెను. ఈ మందిరసమీపమునం దొక చిన్నసరస్సు గలదు. ఇచ్చటి ప్రకృతిదృశ్యము లతి మనోహరముగ నుండును. కైలాదేవి భారతదేశమునందంతట సుప్రసిద్ధమైనది. కరౌలీ రాజ్యమంతయు పర్వతప్రదేశము. ఈ రాజ్యమున కుత్తరముగ కొన్ని ముఖ్యపర్వతములు కలవు. ఈ కొండలనుండి మేలురకమురాళ్ళు లభించును. అక్బరు నిర్మించిన సుప్రసిద్ధ నగరమగు ఫతేపూర్‌సిక్రీలోని భవనములు, తాజమహాలు కరౌలీ కొండల రాళ్ళతోనే యధికాంశము నిర్మింపబడెనని చెప్పుదురు. ఇందొక పర్వతమునుండి 5 ధారలుగల యొక నది యుద్భవించుచున్నది. దీని నిచ్చటివారు పంచనదమని పిలతురు. ఈ పంచనదము త్తరముగ ప్రవహించి గంగానదిలో కలియుచున్నది.

# వటేశ్వరము

ఆగ్రానుండి శికోహాబాదు (జం) శికోహాబాద్ 16 మై. వటేశ్వరము - మరియు హాతీపురీ, వాహ్ స్టేషనులలో దిగియు వటేశ్వరము వెళ్ళవచ్చును. ఈ మూడు స్థానములనుండియు ఎద్దు బండ్లు, టాంగాలు, జట్కాలు కలవు. శికోహాబాదు నగర సౌందర్యము చూడతగినది. ఇచట ధర్మశాలలు గలవు. వటేశ్వరము పూర్వము శూరసేనుని నగరమని చెప్పుదురు. ఒకప్పుడిచ్చట గీర్వాణభాష యున్నత స్థితిలో నుండెడిది. అందుచే దీనిని ఛోటీ (చిన్న) కాశీ అని ప్రజలు పిలచుచుందురు. వటేశ్వరమున చక్కని ధర్మశాల కలదు. దేవమందిరమున కూడ యాత్రికులు బస చేయుదురు. ఇచట ప్రధాన నది యమున.

దేవదర్శన విధానము:—— ఈ క్షేత్రమందున్న 'గోకుల నాథుని' మొదట చూడవలయును. ఈ యాలయము మిక్కిలి యందముగ నుండును.

పంచముఖ మహాదేవుడు:—— ఈ మందిరము స్మశానమున గలదు. ఈ దేవాలయమున పాలరాతితో తయారుచేయబడిన, పంచముఖ మహాదేవుని విగ్రహ మతి మనోహరముగ నుండును. ఎదుట రెండు శివాలయములు గలవు. ఈ యాలయములు షుమారు 50 అడుగుల యెత్తుండును.

శివపార్వతీ మందిరము:- ఈ మందిరము చూడ మిక్కిలి యందముగ నుండును. ఆలయమందలి శివపార్వతుల మూర్తులు శోభాయమానముగ నుండును. ఇంత మనోరహమగు మూర్తులు వేరొండు-చోట కనజాలము.

వటేశ్వరుడు:— ఈయాలయమునకు నలువైపుల ప్రాకారముకలదు. దీనికి పెద్దపెద్ద ద్వారములు మూడు కలవు. ద్వారముల కెదురుగనే ఒకమఱ్ఱిచెట్టు కలదు. దానికినలువైపుల గచ్చు చేయబడిన యరుగు కలదు.

కార్తీక శుద్ధ పూర్ణిమకు యిచ్చట కనేకులు యాత్రికు లరుదెంతురు. ఈ వటేశ్వరుని గురించి భక్తులు, తమ కోరిక దీరిన నొక గంట కట్టుకొందుమని మ్రొక్కుకొందురు. అటు లనేకులు కట్టిన గంటలచే, నీ యాలయము, బయటనుండు మఱ్ఱిచెట్టుకూడ నిండియున్నవి. ఈ పుణ్యస్థలమున శ్రావణ మాసమున, మార్గశిర మాసమున ఉత్సవములు జరుగును. ఈ సమయమున వటేశ్వరనాథుని యలంకారము నిరుపమానముగా నుండును. దేవీఘాట్, విశ్రామఘాట్, సూర్యఘాట్ మొదలగు ఘట్టము లనేకములు గలవు.

శివాలయము:— ఇచ్చట నొక శివాలయము, బిహారీ మందిరము కలదు. బిహారీమందిర మొక మనోహరస్థానము. ఇచట పితృదేవతలకు పిండప్రదానము చేయుచుందురు.

యజ్ఞస్థానము:— ఇచ్చట పూర్వమందొక 'వాజపేయ' యాగము జరిగెనట. ఆ భస్మము యిప్పుడును లభించును. యజ్ఞస్థానమునకు ముందు పండ్రెండు చేతులుగల దేవీవిగ్రహము గలదు.

జైనతీర్థము:— ఇచట నొక మైలుదూరమున జైనుల తీర్థము గలదు. ఇచట చిన్నవి, పెద్దవి చాల దేవాలయములు గలవు. క్రీ. శ. 1916 సం.న జైనులిచట నొక సుందరమగు మందిరమును గట్టిరి.

శీతలాదేవి:— దీనికి కొలదిదూరమున భగవతి 'శీతలాదేవి' మందిరము కలదు. ఇక్కడకూడ చిన్నచిన్న మందిరములు చాల కలవు. శరన్నవరాత్రుల కిచట నుత్సవములు జరుగును.


ధర్మయోగి (చూడుడు సారనాథ్)

ఖండవ వటేశ్వరము:— శీతలాదేవి కెదురుగ వనమందు ఖండవ వటేశ్వరుని, ఆంజనేయుని విగ్రహములు గలవు. ప్రతివత్సరము కార్తీక శుద్ధ కి వటేశ్వర ప్రదక్షిణయాత్ర చేయుదురు. ఈ ప్రదక్షిణమున నింకను కొన్ని దేవాలయములు గలవు. ఇచటనున్న ప్రాచీనగుహలను, సాధువులను, మఠములను జూచిన నిది యొక తపోభూమి యని తెలియనగును.

ఇచట జమునాప్రసాద్ డిస్పెన్సరీ, హిందీ పాఠశాల, గ్రంథాలయమును గలవు. ఊరుమధ్య 'భదావరు మహారాజా' కోట గలదు. అది వర్తమానమున శిథిలమైయున్నది. భారత యుద్ధము జరిగినప్పుడు బలరాముడు తీర్థయాత్రలు చేయుచు, వటేశ్వరమునకు వచ్చి కొంతకాల ముండెనని, వటేశ్వర మాహాత్మ్యమున గలదు.

మాహాత్మ్యము:— శంకరు డత్రిమునితో నిట్లు చెప్పెను. 'వటేశ్వరము నా కత్యంత ప్రియమగుస్థలము. అచట యమున యందు స్నానముచేసి నన్ను పూజించుభక్తులు నన్ను జేరుదురు.

అచట మూడు రోజులు ప్రతిష్ఠయైయున్న మనుజుని కలిదోష మంటనేరదు. — శివపురాణము.

## ఫర్కాబాద్

శికోహాబాదునుండి ఫర్కాబాదు చేరవలయును. ఇది గంగాతీరమున రమ్యమైన పట్టణము. గంగలోయలో నున్న నవాబుల నగరిముంగిటయున్న మట్టికోట చూడ ముచ్చటగ నుండును. చూచితీరవలయును. చారిత్రికవిశేషములు చాలగలవు.

## అశ్వతీర్థము (కనౌజు)

ఫర్కాబాదునుండి కనౌజు స్టేషనులో దిగవలయును. పూర్వ మిది పెద్దపట్టణము. దీనిని అశ్వతీర్థమనియు చెప్పుదురు. పూర్వమొకప్పుడు ఋచీకమహాముని గాధిరాజుని కన్యనిమ్మని కోరగ, శ్యామకర్ణములుగల వేయి యశ్వముల తెమ్మనెను. ఋచీకుడు వరుణుని యనుగ్రహమున శ్యామకర్ణములుగల వేయి యశ్వముల నిచ్చెను. ఈ కారణమున నిది యశ్వతీర్థమని చెప్పబడుచున్నది. నేటికిని యిచ్చట ప్రాచీనచిహ్నము లనేకములు గలవు.

## బ్రహ్మవర్తము

"శ్రీ మద్బ్రహ్మ పురాఖ్యస్య పశ్చిమస్యాం దిశిస్థితమ్"

— సూతసంహిత.

కనౌజ్ స్టేషనునుండి బ్రహ్మావర్తము స్టేషను చేరవలయును. బిఠూరు (బ్రహ్మావర్తము) పరమ పవిత్రమగు గంగా

తీరమున గలదు. స్టేషనుకు సమీపమున ధర్మశాల యొకటి కలదు. తగు సౌకర్యములు గలవు. ఇది పల్లెయగుటచే విశేష కష్టముండదు. ఇచట బ్రహ్మఘాట్‌లో స్నానము చేసిన మిగుల పుణ్యప్రదమని చెప్పుదురు. బ్రహ్మజన్మించిన దిచ్చటనే. శ్రీమహా విష్ణువు నాభినుండి కమల ముద్భవించిన దిచ్చటనే. ఆ కమల మందు బ్రహ్మ యావిర్భవించెను. మధుకైటభులను విష్ణువు సంహరించిన దిచ్చటనే. ఇటులియ్యది జగదుత్పత్తికి ప్రథమ స్థానమైన యున్నది.



*సరస్వతి అంతర్వాహిని
(చూడుడు ప్రయాగ)

ఇచట బ్రహ్మ వేలకొలది సంవత్సరములు తపముచేసి యుండెను. బ్రహ్మఘాట్‌లో నొక యడుగు యెత్తుగల ఇనుప కొయ్య పాతబడి యుండెను. పూర్వము మనువు సరస్వతీ, దృషద్వతీ నదుల మధ్య నీ ప్రదేశమె బ్రహ్మవర్తముగ నెంచెనని యీ యినుపకొయ్యనుగురించి చెప్పుదురు. దీనిని యాత్రికులు పూజింతురు. కవికుల శిరోమణి కాళిదాసు తన మేఘసందేశమున నీ జనపదమును పేర్కొని, చక్కగ వర్ణించి యుండెను. పూర్వ మొకప్పు డిచ్చట యొక గొప్ప యజ్ఞము జరిగెను. ఆభస్మమును పాండేలు యాత్రికులకు చూపుదురు.

సిపాహి విద్రోహ నాయకుడగు నానాఫడనవీస్ యిచ్చట నుండెడి వాడట. ఆయన నివసించిన 'జూనాపాడా' భవన శిథిలములు నేటికిని కాననగును. అహల్యాబాయి, పేషనాబాడీ రావు కట్టించిన ఘట్టములుకూడ నిచట గలవు. ఇచ్చటి శిథిల

మందిరముల కొన్నిటిని శ్రీ స్వామి విశుద్ధానంద సరస్వతి పున రుద్ధరించెను.

రామాజ్ఞానుసారము లక్ష్మణుడు సీతను యిచ్చటనే దిగ విడచెనని చెప్పుదురు. కుశలవులు రాముని సైన్యముతో యుద్ధము చేసిన దిచ్చటనే. సాధ్వియగు సీతాదేవి తన సతీత్వమునకు ప్రమాణముగ భూగర్భమున ప్రవేశించిన దిచ్చటనే.

వాల్మీకి:— బిహారుకు కొంచెము దూరమునందు 'పరిహార' మను పేరుగల నొక స్థానము గలదు. ఇది వ్యాధుడగు వాల్మీకి తపస్సుచేసి, మహర్షియై శ్రీ మద్రామాయణమును రచియించిన ప్రదేశమని చెప్పుదురు. ఇచటకు సమీపమందే గల బేలగావ్ యందొక కూపము కలదు. వాల్మీకాశ్రమమున సీతాదేవికి కుశలవులు జన్మించిరి. బేలగావ్ రాక్షసులకు నివాస భూమియగు నరణ్యప్రాంతమగుటచే శిశువులగు కుశలవుల కేమైన కీడు కలుగునేమోయని వాల్మీకి యీగ్రామమును మంత్రబద్ధము గావించెను. అందుచే యిచ్చటి జనులు తమ యిండ్ల తలుపులకు గడియ వేసుకొనరు. గడియవేసుకొన్నవాని కేదోనొక యరిష్టము కలుగుచుండును. దొంగతనము లిచ్చట జరుగవు పూర్వాశ్రమమున వాల్మీకి యీకూపమందె దాగొని, దారులుకొట్టి, దోచుకొనుచుండెడివాడట.

కుశలవుల యుద్ధస్థానము:— బిహారుకు సమీపమున నున్న చకలకంసీ గ్రామమందు భూమిలో నిప్పుడును నాటి కుశలవుల యుద్ధమునకు సంబంధించిన శిథిలములైన బాణములు లభించుచుండును. ఇచట సీతామందిరము, సీతాకుండము గలవు.

గృహాలు, యజ్ఞవేదికలు కూడ కలవు. హిందీ, సంస్కృత పాఠశాలలు, పోష్టాఫీసు కలవు.

మహాభారతమున యీ బ్రహ్మావర్త మాహాత్మ్యమును గురించి విపులముగ గలదు. 'బ్రహ్మావర్త యాత్ర చేసినవారు మరణానంతరము చంద్రలోకమునకు వెళ్లుదురు. ఇచట గంగా స్నానము చేసిన దివ్యజ్ఞానము కలుగును. —మహాభారతము.

## ఖేరేశ్వర మహాదేవుడు

బ్రహ్మావర్తమునకు దక్షిణపూర్వముగ 'మంధనా' స్టేషను కలదు. ఈమంధనాస్టేషనుకు పశ్చిమోత్తరములందు 'రాజపూర్' రైల్వేస్టేషను కలదు. ఈ రాజపూర్ స్టేషనుకు 2 మైళ్ళ దూరమునందొక సుందరమగు మందిరమున 'ఖేరేశ్వరమహాదేవుని' లింగము కలదు. దీనిని 'ఖేరేశ్వర'మని కూడా పిలతురు. ఈ శివలింగమును 'అశ్వత్థామ' స్థాపించెనని చెప్పుదురు. ఈ మందిరమునకు సమీపముననే అశ్వత్థామ నివసించిన ప్రదేశము కలదు. ఇచ్చట ప్రాచీనవిగ్రహము లనేకములు గలవు. ఇందు చతుష్కోణాకృతిగ నుండు శ్వేతలింగము కూడా గలదు. ఖేరేశ్వర మహాదేవుని మందిరము విశాలముగ నున్నది. శివరాత్రిసమయమునందిచ్చట పెద్ద యుత్సవము జరుగును. ప్రతి సోమవారమునకుగూడ యిచ్చటకు చాలభక్తులు వచ్చుచుందురు.

## కానూ్పరు

మంధనానుండి కానూ్పరు స్టేషనుకు చేరవలయును. గంగానదికి కుడిభాగమున అనేక ఫ్యాక్టరీలతో పారిశ్రామిక కేం

ద్రముగా వెల్లివిరిసిన బ్రహ్మాండమైన నగరము. షుమారు జనాభా 7,05,380. ఇచట వెలసియున్న పరగనారాయణ గురుప్రసాద శుక్ల దేవాలయములు, కాలేజీలు, పారిశ్రామిక యంత్రశాలలు చూడదగినవి. ఇచటి బట్టలమిల్లులు, తోలు కార్ఖానాలు ఇండియాలోకెల్ల పెద్దవి.

## లక్నో

కాన్పూరునుండి లక్నో స్టేషను చేరవలయును. లక్నో స్టేషను ప్లాటుఫారం చాలపెద్దది. 2,250 అ. ఇది ఉత్తర ప్రదేశ్ రాజధాని. షుమారు జనాభా 6,32,15,740. లక్నో జనాభా 4,96,860. ఇది గోమతీ తీరమున గలదు. దీనిని ఉద్యాన నగరమందురు. ఇచట పలువిధములైన రమ్యోద్యానములు గలవు. మొగలాయి ప్రభువులనాటి మరపురాని భోగలాల సత్వమునకు గుర్తులనేకము లింకను ఇచట కలవు. ముఖ్యముగా చూడతగినవి మహమ్మదీయ శిల్పకళను ప్రతిబింబించు ఇమాంచారా, హుస్సేన్ బాగ్, ఛత్తర్ మంజిల్, సహజ సౌందర్యమగు జంతుప్రదర్శన శాల, 1851 లో స్వాతంత్ర్య సమరమున చరిత్ర ప్రసిద్ధమైన రెసిడెన్సీ, జుమ్మామసీదు మొదలైనవి ప్రధానములు. గ్రేట్ హిమాంచారాకు పెద్దగేటు గలదు. దీని హాలు 163×53×49 అడుగులు. ప్రపంచమునగల పెద్దహాలులలో నిది యొకటి. కళాశాలలు, శాసనభవనము, జనరల్ పోష్టాఫీసు, వీటిలో ప్రాచీన భారతీయ శిల్పము సమృద్ధముగ గలదు.


* 1857 స్వాతంత్ర యుద్ధకాలపు శిల్పము

ఇదిబంగారు, వెండి, జరీపనులకు, మట్టిబొమ్మలకు, పింగాణీపరిశ్రమకు మిక్కిలి ప్రసిద్ధమైనది. లక్నో విశ్వవిద్యాలయము చూడ తగినది. ఇచట వివిధశాఖలు కలవు.

# నైమిశారణ్యము

"నిర్మలం జ్ఞానదాతారం నైమిశారణ్య వాసినమ్,
హరి మవ్యయనామాన మాశ్రయే మునిసేవితమ్" —సనత్కుమారసంహిత

పూర్వము నైమిశమనబరగు ప్రదేశము నేడు 'నీమ్‌సార్' అని పిలువబడుచున్నది. లక్నో నుండి 'బాలామా' (జం), అటనుండి 'సీతాపూర్' పోవు బండిమీద 'నీమ్‌సార్' చేర వచ్చును. కాన్పూర్‌కు నీమ్‌సార్ 103 మైళ్లు. ఉన్నావ్‌నుండియు నైమిశమునకు పోవు బండి యొకటి కలదు.

స్టేషనుకు తీరస్థానమునకు సుమా రొక మైలుదూరము వుండును. ధర్మశాలలు కలవు. ఇచట 'గోమతి' ప్రధాన నది.

చక్రతీర్థము:— ఇది 125 గజముల వైశాల్యము గల కుండము. యాత్రికులు యథావిధిగా స్నానము, తీర్థవిధియు చేయుదురు. ఈ కుండమున స్నానము చేయుటచే పురాతన వ్యాధులు పోవును. చక్రతీర్థము ఒడ్డున కొన్ని దేవాలయములు గలవు.

నైమిశము:— పూర్వము కలిదోషభీతులగు మహర్షులు విష్ణుమూర్తిని కలిదోషరహితమగు స్థలము చూపమని ప్రార్థించిరి. అప్పుడా మహావిష్ణువు తన సుదర్శనచక్రమును భూలోకమున విసరి, యిది యెచ్చటబడునో, అచ్చట కలిప్రభావ ముండ

నేరదు అని చెప్పెను. ఆ చక్రము నైమిశమునబడెను. ఆచక్రము బడిన గుర్తే చక్రతీర్థము. ఇంగగాధమగు జలము గలదు. ఇందుండి బయటకుపారు జలమును 'గోదావరి' 'నర్మద' యని పిలతురు. ఒకప్పు డీ తీర్థమున స్నానముచేయుట కరికిన యాత్రికు లెందరో కనబడకుండ పోయిరి. అందుచే దీనిలో నినుపరేకులు వేయబడెను.

హాత్యాహారణము:— నైమిశారణ్యమునకు 7 మైళ్ళ దూరమున 'హాత్యాహారణ' మను నొక సరస్సు కలదు. ఇందు స్నానముచేసిన మనుజుల కాయిక, వాచిక మానసిక పాపములు నశించును. ఇచట తీర్థవిధికూడ చేయుదురు.

పంచప్రయాగ:— నైమిశారణ్యమున 'పంచప్రయాగ' అను పేర నొక సరస్సు గలదు. ఇందు స్నానము చేసినందువలన మహత్తరఫలము గలదు. దీనికి సమీపముననె — 'అక్షయ వటము' గలదు. దీనిని పాండేలు 'కల్పవృక్ష' మని పిలుతురు. దీనికి యాత్రికులు ప్రదక్షిణము చేతురు.

ఇతరములు:— మను శతగూపులు తపస్సుచేసిన ఫలము, జానకీకుండము, వ్యాసుడు శౌనకాదులకు 18 పురాణములుచెప్పిన స్థానము, శ్రీశుకుడు విద్యబడసిన యాసనము చూడ దగినవి. ఇచ్చట నొక సరస్సుయొద్దన 'అన్నపూర్ణా విశ్వనాథు'ల మందిరము కలదు. ఇచ్చట 'దశాశ్వమేధ' మను పేర నొక దేవాలయము కలదు. ఇందు పంచదేవుల విగ్రహములు గలవు. ఇవి కాక మార్కండేయాశ్రమము, మృకండుని యాశ్రమము నామమాత్రావసిష్టములగు వ్యాససరోవరము, గంగోత్రిసరోవరము, పుష్కరసరోవరము యిచ్చట చూడతగినవి.

నైమిశము 84 మైళ్ళు చుట్టుకొలతగల క్షేత్రము. దీనిని ప్రదక్షిణించుటకు, ఫాల్గుణ బ 30 న ప్రారంభించి చైత్ర శు ౧౫ కు ముగింతురు. ఈ పరిక్రమణామందింకను తీర్థములు, దేవమందిరములు కలవు.

వసిష్టుని యాజ్ఞానుసారము శ్రీరాముడిచ్చట నశ్వమేధ యాగము చేసెను. ఆ యజ్ఞమునకు సంబంధించిన భస్మమును పాండేలు చూపుదురు. ద్వాపరయుగమందు పాండవులిచ్చట చాలకాలము నివసించిరి. ఇచ్చట నొకమిట్టయందు పంచపాండవులయు, శ్రీకృష్ణునియు విగ్రహములు గలవు. ఇది 'చెఱకు' వ్యాపారమునకు కూడలియైయున్నది. ఇచట హిందీ సంస్కృత పాఠశాల, పోష్టాఫీసు గలవు.

## మిశ్రఖ్

ఇది నీమ్‌సార్‌కు 6 మై. 'మిశ్రఖ్' స్టేషనులో దిగి వచ్చును. స్టేషనుకు అరమైలు దూరమున తీర్థము గలదు — పూర్వము దేవతలందరు సర్వతీర్థము లందలి పుణ్యజలము నిందు నింపిరట. అందుచే దీనికి 'మిశ్రిత' మను పేరువచ్చెను. అదియే ప్రస్తుతము 'మిశ్రఖ' యయ్యెను. ఇచట ధర్మశాలలు గలవు. అన్నివస్తువులు లభించును. చెఱకు వ్యాపారమునకు కూడలి. సంస్కృత పాఠశాల, పోష్టాఫీసులు కలవు.

బాణగంగ:— పూర్వమిచట దధీచి తపస్సు చేసెను. దధీచి నిర్మితమగు 'బాణగంగ' కలదు. దానినే నేడు 'దధీచి కుండ' మనియు పిలుతురు. ఈ సరస్సును మహారాజగు విక్రమాదిత్యుడు పునరుద్ధరించెను. ఇచట తీర్థవిధి చేయుదురు.

బాణగంగా కూపము:— యాత్రికులు ఆ కూపము కడకుపోయి, అందలి యుదకమును ఆచమనము చేతురు. ఈ సరస్సు ఒడ్డున రెండు పురాతన వటవృక్షములు గలవు. యుధిష్ఠిరుడు రాజసూయము చేసినప్పుడు ఈ వృక్షముల నిచట నాటెనని పాండేలు చెప్పుదురు.



* గంగాతీరము (చూడుడు కాశీ)

దధీచి త్యాగము:— వృత్రాసురుని సంహరించుటకు తగిన యస్త్రములు లేమిచే బ్రహ్మ ప్రేరణచే యింద్రాదులు మిశ్రిఖ్ వద్ద తపము చేయుచున్న దధీచిని సమీపించి, ఆతని వెన్నెముక కోరగ, దధీచి మీ కోరిక నెరవేర్చెదను. కాని యీ దేహముతో సర్వతీర్థములు సేవింపదలచితిని, అన దేవతలు సర్వ

తీర్థోదకముల దెచ్చి మిశ్రిఖ్ నం దుంచిరి. దధీచి ఆజలముల సుస్నాతుడై యోగమార్గమున దేహము విడచెను. దేవతలా యస్థుల గ్రహించి, విశ్వకర్మచే వజ్రాయుధమును చేయించి వృత్రాసుర సంహారము గావించెను. దధీచి త్యాగమునకు సంతసించి, దేవత లీ సరస్సున స్నానముచేసి, ఇందు స్నాన మాచరించువారు సర్వతీర్థముల స్నానముచేసిన ఫలము కలుగునని వరమిచ్చిరి. ఇచట తీర్థవిధి చేయుదురు. ఇచట దధీచి ఆలయము గలదు.

పంచప్రయాగ:— దేవతలు సర్వతీర్థముల నాహ్వానించుతరి, తీర్థరాజు అందుల కంగీకరించని కారణమున, యీ పంచ ప్రయాగ తీర్థమును దేవతలు సృజించిరి. మిశ్రిఖతీర్థప్రదక్షిణమున నింకను తీర్థములు గలవు. దేవత లిచట నొక యజ్ఞము చేసిరి.

## విశ్వాన్

మిశ్రిఖ్ నుండి సీతాపూరు (జం) లో దిగవలయును. ఇచటకు 22 మైళ్ళు విశ్వాన్. 1350 లో విశ్వనాథఫకీర్ దీనిని నిర్మించెను. మాస్కో షాజహానుకాలమునాటి మొగలాయీల శిల్పవైభవముగల గోరీలు చాల కలవు. ఇచటి శిల్పము చూడ తగినది. ఇచట కుండలపైని చిత్రించు శిల్పము చెప్పతగినది.

## హరగాన్

సీతాపూరునుండి హరగాన్ స్టేషనులో దిగవలయును. షట్చక్రవర్తులలో నొకడైన హరిశ్చంద్రమహారాజు కాలము నాటి శిల్పసంపద యిచట యధికముగ గలదు. అంతకుముందున్న హిందూదేవాలయముపై తురకలు ఒక దర్గాను నిర్మించిరి.

# గోకర్ణనాథము (వైద్యనాథము)

స్నాత్వా క్షేత్రేషు సర్వేషు యజన్తశ్చ సదాశివమ్,
లభన్తే యత్ఫలం మర్త్యాః తత్సర్వం తత్రదర్శనాత్.

— మార్కండేయ పురాణము

హరగార్ నుండి గోకర్ణనాథ స్టేషనులో దిగవలయును. గోకర్ణనాథమహాదేవుని మందిరము స్టేషనుకు ½ మైలు దూరమందు కలదు. ఇచ్చట నది శివగంగ. ధర్మశాలలు గలవు.

గోకర్ణము - వైద్యనాథము:— త్రేతాయుగమందు రావణుండు కైలాసమున నిరాహారియై మహాదేవునిగూర్చి తపస్సు చేసెను. అప్పుడు శంకరుడు ప్రసన్నుడై రావణుని వరమడుగుమనెను. రావణుడు శంకరుని స్తుతించి 'నేను నీ దర్శనమునకు లంకయందుండి యిచ్చటకు వచ్చుటకు మిగుల కష్టపడుచుంటిని. కాన నీవు కైలాసమును వీడి లంకకు రావలయు'నని వేడెను. అంత శంకరు డాతనికి రెండు శివలింగముల నిచ్చి, 'నీవు వీనిని లంకకు గొనిపొమ్ము. కాని మార్గమం దెచ్చటను భూమిమీద వీనిని వుంచకుము. అట్లు భూమిమీద నుంచిన యవి యచ్చటనే స్థాపితము'లగు'నని చెప్పెను.

రావణుడా లింగములను కావడియందుంచి మోసి తెచ్చుచుండెను. మార్గమున నాతడు లఘుశంకదీర్చుకొనదలంచి సమ్ముఖమున నేతెంచు 'బైజూభక్తుని'కా కావడి యప్పగించి, యేగెను. కాని యీ భక్తు డీ లింగముల బరువును మోయలేక భూమియందుంచెను. అంత నవియచ్చటనే స్థాపితము లయ్యెను. అవియె

నేడు 'గోకర్ణనాథము' 'వైద్యనాథము' అని ప్రసిద్ధి కెక్కినవి. గోకర్ణనాథుని 'చంద్రఖాల్ దేవు'డని గూడ పిలతురు.

శివగంగ:— ఇచట పరమపావని యగు శివగంగ కలదు. పూజాసామగ్రియంతయు నిచ్చట లభించును. శివరాత్రికి, చైత్ర మాసమందును నిచ్చటకు లక్షలకొలది యాత్రికులు వత్తురు.

గోకర్ణనాథుని మహిమ:— గోకర్ణనాథుడు పరమ కృపాళువు. భక్తవత్సలుడు. ఇటీవలనే జరిగిన యితిహాస మొండు కలదు. అంధుడు శివభక్తుడు నగు దేవీసహాయుడను భక్తుడు శివ దర్శనమునకు శివరాత్రి కిచ్చటకు వచ్చెను. అర్ధరాత్రివరకు జనము క్రిక్కిరిసి యుండిరి. దర్శనమున కాతనికి తగు నవకాశము లభించ లేదు. పూజారి ద్వారము మూయుసమయమునందా యంధుడు దర్శనము చేయించుమని కోరెను కాని అతడు విసుగుచూపించి ద్వారములు మూసివేసెను.

భగవంతుని దర్శనము కాజాలనందులకు వ్యాకులపడుచు, నాభక్తుడాలయమునకు ప్రదక్షిణము చేయదొడగెను. ప్రతిప్రదక్షి పరిసమాప్తియందు నాతడు శంకరుని నొక గీతముచే స్తుతించు చుండెను. ఇటులాతడు 108 ప్రదక్షిణములు చేయగనే ద్వార ములు తమంతట తామె తెఱచుకొనెను. అంధుడగు నాభక్తుడు చూపునుగూడ బడసెను. అంత నాతడు శంకరుని దర్శించి తరు వాత, 'శైవమనోరంజని' యను గ్రంథమును రచియించెను. ఈ గ్రంథము శివభక్తుల కత్యంతము ప్రీతికరమైనది.

ఇచ్చటనుండు వూరుపేరు 'గోలా గోకర్ణనాథము' ఇచట సాధువులు, సన్యాసులు నిరంతరము నివసించుచుందురు.

ఈ యాత్ర చేసిన మనుజుని కోరికలన్నియు దీరును. శివగంగ యందు స్నానముచేసిన దివ్యజ్ఞానము లభించును.

## అయోధ్య

"ప్రథమం తత్రతీర్థంతు కథయామి వరాననే !,
స్వర్గ ద్వారం సముత్పన్నం ప్రథమం సరయూతటే.
స్వర్గద్వార సమం తీర్థం నభూతం నభవిష్యతి,
సత్యం సత్యం పునః సత్యం నా సత్యం మమభాషితమ్.

— రామాయణము.

పరమపావనియగు సరయూతీరమున నొప్పు అయోధ్య వంటి క్షేత్రము లేనేలేదు. ఇది ముమ్మాటికి సత్యము.



* సరయూతీర స్వర్గద్వారము

గోకర్ణమునకు అయోధ్యకు 125 మైళ్లు. దూరము. గోకర్ణము నుండి అయోధ్య చేరుటకు సీతాపురము చేరవలయును. అచట నుండి మీటర్ గేజి మీద చౌకాఘాట్, మనకాపూర్ల మీదుగా నయోధ్య చేరవచ్చును.

బ్రాడ్ గేజి అయోధ్యస్టేషనుకు సమీపమున మహాదేవ ప్రసాద్ ధర్మశాల కలదు. ఇది చాల పెద్దది. స్టేషనుకు ఊరుకు సుమారు మైలుపైగా నుండును. ఇచ్చట ఎక్కాలు, టాంగాలు దొరకును. అయోధ్య సరయూనదీతీరమున గలదు. సరయూ

ఘాట్ వద్ద నొక ధర్మశాల గలదు. ఇవిగాక చిన్నవి, పెద్దవి వందలకొలది ధర్మశాలలు గలవు. అయోధ్య పెద్దపట్టణము. విశేష శోభాయమానముగ నుండును. అయోధ్యలో షుమారు నూరు దేవాలయములకు పైగా కలవు. విశేషముగ సాధువులు నివసించుచుందురు.

స్వర్గద్వారఘాటు:— యాత్రికులు మొదట సరయూనది స్వర్గద్వారఘట్టమున యథావిధిగా స్నానముచేసి తీర్థవిధి చేయవలయును. సరయూనదిలో తాబేళ్ళు అధికముగ గలవు. తరువాత నచ్చటకు సమీపమునగల నాగేశ్వరనాథమందిరమందు శంకరుని దర్శించవలెను. స్వర్గద్వారఘాటులో శ్రీరామనవమికి జన మధికముగ నుండుటచే స్నానముచేయుటకు తగినవసతి లేదు. ఇచట పండా లుందురు. వార లీ క్షేత్రమున చూడతగిన స్థానముల నన్నిటిని వెంటనుండి చూపుదురు. ఇచట పండాలు కఠినహృదయులు. నాగేశ్వరనాథుని దర్శించినపిమ్మట—

శ్రీరామజన్మస్థానము:- శ్రీరాముడు జన్మించిన భవనమును పడగొట్టి, ముగలు లచ్చట నొక మసీదు కట్టిరి. మన దేశమున గల ప్రతిక్షేత్రమునందలి, పట్టణమందలి ప్రాచీన భారతీయుల కళాసంపద సర్వవిధముల మహమ్మదీయ పరిపాలనకాలములో నీరీతిగా ధ్వంసము చేయబడినది. నాటి భారతీయ కళాసంపద నేడు నామమాత్రావశిష్టమై కొన్నిచోట్ల శిథిలములు కాననగును. శ్రీరాముని జన్మస్థానము ప్రస్తుత మీ మసీదు నానుకొనియే యున్నది. రామ జన్మస్థానమును దర్శించిన మనుజుడు ఎనుబదినాల్గుకోట్ల యోనులందు గల కష్టములనుండి విముక్తు

డగునని చెప్పెదురు. జన్మస్థానమందు శ్రీరాముని బాల్యమును సూచించు చిన్నచిన్న విగ్రహములు గలవు. దీని కెదురుగనే— *‘ఛఠీ’ గలదు. ఇచ్చట కొన్ని రాతిపాత్రలుగలవు. కౌసల్యాదేవి యిచ్చట వంట వండెడిదని చెప్పుదురు. పూర్వము రాణులు గూడ స్వయముగనే వంట చేయుచుండెడివారట.

హనుమాన్‌గఢీ:— ఇది 100 గజములు యెత్తుగల నొక పర్వతమును నలుపలకలుగ దొలిచి నిర్మించిరి. ఇది ఎత్తుగ నుండుటచే దూరమునుండియే చూడవచ్చును. శ్రీరాముని కాలమం దీ పర్వతమునందు హనుమంతుడు నివసించెడివాడట. అయోధ్యయందిది యొక ప్రధానస్థానము. హనుమాన్‌గఢీకి చాల భూమి కలదు. పుణ్యాత్ములెవరేని అయోధ్యలో సత్రము కట్టించదలచిన హనుమాన్‌గఢీ ధర్మకర్తలవలన భూమి లభించును. ఇచట వానరసైన్య మధికము. వాని బాధయు నధికమె. ప్రసాదమును యెంతజాగ్రతగ గ్రహించినను రామసైన్యము మచ్చికగన్నవానివలె చేతినుండి లాగికొనును.

రోడ్డుమీదనుండి సుమారు ఏబది మెట్లెక్కిన గఢీ ముఖద్వారము వచ్చును. లోపల హనుమానుని విగ్రహము కలదు. ఇచ్చట నీ విగ్రహము, విశ్రాంతి దీసికొనుచున్నటుల మలపబడి యున్నది. ప్రతి మంగళవారము, శ్రీరామనవమికి యిచటకు చాలమంది జనము వత్తురు. అయోధ్య యందు గోస్వామి తులసీదాసు రచించిన ‘హనుమాన్ చాలీసా’ ను

* శిశువు జన్మించినప్పుడు ఆరవదినమందొక యుత్సవము చేయుదురు. ఆ దినమునకు “ఛఠీ” యని పేరు. ఆ యుత్సవము చేసినచోటు యీ ఛఠీ

రోజునకొక 100 పర్యాయముల చొప్పున 21 రోజులు పఠించిన నభీష్ట సిద్ధియగునని చెప్పుదురు. అయోధ్య రోడ్డమీదనుండి చూచిన నిదియొక కోటవలె కానవగును.

చింతతోట:— హనుమాన్‌గఢీకి వెనుక 'చింతతోట' కలదు. ఇచట చాల చింతచెట్లు కలవు. ఇది చాల పెద్దతోట. గఢీ మహంతుద్వారా నిచ్చట ప్రాతః సాయంసమయములందు శనగ గుగ్గిళ్లు వేలకొలది వానరములకు పెట్టబడును. ఆ సమయమందలి వానరసైన్యము చూడదగినది. శ్రీరామచంద్రుని స్మృతి చిహ్నము లీపట్టణమునం దనేకములు గలవు. అందు కొన్నిటిని మాత్ర మీదిగువ వ్రాయబడుచున్నవి.


* కనకభవనము

కనకభవనము:— టీకమ్‌గఢ్ మహారాజీ మందిరమును లక్షలకొలది రూప్యములు వెచ్చించి కట్టించెను. ఇది చాల సుందరమగు మందిరము. నిత్యము యేదోయొక యుత్సవ మిచ్చట జరుగుచుండును. లోపల సీతారాముల విగ్రహములు గలవు. ఎదుట నొక పెద్ద సభామండపము, ఒక పూలతోట గలవు.

కోప భవనము:— మంథర చెప్పిన చాడీలను విని కైకేయి కోపించి దశరథుని వరములడిగిన దిచ్చటనే. కైకేయి దశరథమూర్తులు కలవు.

సీత వంటిల్లు:— ఇచ్చట సీతాదేవి వంట చేయుచుండెడి దట. ఇచట సీతారాములు రాణులతోకూడిన దశరథుని విగ్రహములు గలవు. ఇచట భూగర్భమందు సీత వంటచేయు ప్రదే

శము గలదు. దానిని చూచుటకు మెట్లుదిగి లోనికి వెళ్ళవల యును. ఇచ్చట పొయ్యి, కొన్ని పాత్రలు గలవు. మఱియు వసిష్ఠుడు, సీత, లక్ష్మి విగ్రహములు గలవు.

రాజమహాల్:— ఇచ్చట నొక మందిరమందు లక్ష్మణ భరత శత్రుఘ్నులతో కూడిన, సీతారాముల విగ్రహములు, వసిష్ఠుని పాదుకలు గలవు.

రత్న సింహాసనము:— సీతారామ లక్ష్మణుల విగ్రహ ములు గలవు. శ్రీరాముడు రాజ్యముచేయు సమయమం దిచ్చ టనే శ్రీరాముడుండెడి వాడని చెప్పెదరు.

ఆనంద భవనము:— ఇచ్చట కౌసల్య వడియందు రాముడు, కైక వడియందు భరతుడు, సుమిత్ర వడియందు లక్ష్మణ శత్రుఘ్నులున్న విగ్రహములు గలవు. ఇచ్చటకు శ్రీరా ముని బాల లీలలను జూచుటకు కాకభుశుండమహర్షి వచ్చు చుండెడివాడట. ఇచ్చట కాకభుశుండుని విగ్రహముకూడ కలదు.

రాముని కచేరీ:— ఇది శ్రీరాముని న్యాయస్థానము. ఇచ్చటనే రాముడు సీతనుగూర్చిన లోకాపవాదమును వినెను.

నందిగ్రామము:— ఇది అయోధ్యకు 14 మైళ్ల దూర మున యమునాతీరమున గల పవిత్రస్థానము. రాముడు వన వాసము చేయుచుండ భరతుడు శ్రీరాముని పాదుకలను సింహా సనమందుంచి, వల్కలధారియై తపస్సుచేసిన ప్రదేశ మిదియే. ఇచ్చట భరతుని స్మృతి చిహ్నములుగ భరతమందిరము, భరత కుండము మొదలగు స్థానములు గలవు

లక్ష్మణకిల్లా:— స్వర్గద్వారఘాటుకు కొంచెము దూర మందొక మిట్టయందు లక్ష్మణమందిరముగలదు. ఇచ్చట లక్ష్మణ విగ్రహము గలదు. ఇచ్చట నెవ్వరు నసత్యము పలుకరు. అట్లు పలికిన యుక్తముగుశిక్ష నాత డనుభవించును. ఇచ్చటి కోర్టులు కూడ పెద్దపెద్ద విషయముల నీ లక్ష్మణునియందు భారమువైచి నిశ్చింతగ నుందురు. లక్ష్మణునిమీద నొట్టుపెట్టిన వానినిగూర్చి జనులకు సందేహముండదు.

మణిపర్వతము:— ఇచ్చట సీత ఊయల యూగుచుండె డిదట. ఇప్పుడుకూడ శ్రావణమాసమందు, ప్రథమమున ఇచ్చ టనే యీ యుత్సవ మారంభింపబడును తరువాత అయోధ్య యందలి జనులందరును, ఊయల నూగుదురు.

గుప్తారఘాటు:— ఇది అయోధ్యకు 7 మైళ్లు. పైజా బాదుకు మూడు మైళ్ళు. ఇచ్చటనుండియె రాముడు *'సాకే తము' నకు వెడలెనట. లక్ష్మణుడు యోగమార్గమున శరీర మిచ్చటనే త్యజించెను. అంత భ్రాతృవియోగ ఖిన్నుడగు రాము డయోధ్యా పురజను లందరితో, దివ్యవిమానారూఢుడై సాకేత ధామమును జేరెను. ఆవిషయము నీ ఘట్టము స్మృతికిదెచ్చును. ఇచ్చట సరయూనది యనేక పాయలుగాచీలి గంగవలె, వేగ ముగా ప్రవహించుచుండును. ఈ దృశ్యము చూచుట కతి మనోహరముగ నుండును. ఈ కారణముచే దీనిని సహస్రధారా యని జనులు వాకొనుచుందురు. ఇచ్చట 'గుప్తహరి' మంది రము గలదు. యాత్రికులు స్వామిని దర్శించి పూజింతురు.

---

[* సాకేతము, వైకుంఠము పర్యాయపదములు. వైకుంఠము శ్రీవిష్ణు ధామమైన, సాకేతము శ్రీరామధామము.]

సూర్యకుండము:— ఇది సూర్యవంశస్థుల స్మృతిచిహ్నముగ త్రవ్వబడిన సరస్సు. దీనికి మూడువైపుల రేవులు గలవు. ఇది రామఘాటుకు నాలుగుమైళ్ల దూరమున గలదు. సరస్సు ఒడ్డున "సూర్యమందిరము" కలదు. యాత్రికులు సరస్సున స్నానముచేసి, సూర్యుని యారాధింతురు.

రఘునాథదాసబాబా శిబిరము:— ఇచ్చట చాలమంది సాధువులు నివసించుచుందురు. వారికి భోజనాదిక మిచ్చుటనే లభించును. రాఘునాథదాసొక చౌకీదారు. అతనికి రామాయణ మన్న మిక్కిలి ప్రీతి. ఒక దినమం దాతడు రామాయణమును వినుచు, తన్మయుడై తన డ్యూటీకి పోలేదు. కాని భక్తవత్సలు డగు శ్రీరాము డాతని కర్తవ్యమును, చౌకీదారు వేషము ధరించి నిర్వర్తించెను. సమయము దాటినమీదట, స్మృతి వచ్చి, రఘునాథదాసు చౌకీదారువేషముతో వెళ్లునప్పటి కాతని కీవార్త తెలిసెను. భక్తవత్సలుని వాత్సల్యము గని, ప్రేమవిహ్వలుడై యాతడు నౌకరీవీడి, రామభజన చేయదొడగెను. క్రమముగ నాత డొక గొప్ప మహాత్ము డయ్యెను. ఆయన చనిపోయిన రోజున అయోధ్యా పురవాసులు చాలమంది యుపవసించి, యాయన చితాభస్మమును నుదుట ధరించిరి. ఇట్టి మహాత్ముల స్థానము లింకను అయోధ్యలో చాల కలవు.

మనీరామ్‌బాబా స్థానము:— బాబా రఘునాథదాసు స్థానమునకన్న నిది పెద్దది. సుమారు రెండెకరముల భూభాగము రేకుషెడ్లతో నిండియున్నది. ఇచట చాలమంది మహాత్ములు గలరు. బాబామనీరామ్ చాల మహాత్మ్య సంపన్నుడగు సాధువు.

బాబామాధోదాస్ అఖాడా:— ఇచ్చట గురునానక్ పంథీయులగు సాధువు లధికముగ నుందురు. వారల కిచ్చట భోజన సౌకర్యము గలదు.

అయోధ్యలో నింకను నిత్యము 100 మంది సాధువులకు సన్యాసులకు భోజనము పెట్టు సంస్థలు షుమారు రిరువదికి పైగా కలవు. ఈ ప్రదేశములందు సర్వదా అఖండ సీతారామనామ సంకీర్తన జరుగుచుండును.

తులసీచౌరా:— ఇది యొక పెద్ద యరుగు. ఇచ్చటనే గోస్వామి తులసీదాసు రామచరిత మానస (రామాయణము) మును వ్రాసెను. ఇచ్చట తఱచు రామాయణ పురాణ కాల క్షేపము జరుగుచుండును.

ఇంకను చూడదగినవి:— రత్నభవనము, త్రేతాయుగ దేవాలయము, శిరోజరాయమంటపము, శ్రీరామ పంచాయతన సువర్ణవిగ్రహములు, కుబ్జాఘాటువద్దగల యశోకవృక్షము, (ఇచట శ్రీరామనవమికి విశేషముగ నుత్సవము జరుగును. లక్షల కొలది యాత్రికు లరుదెంతురు) నాగేశ్వర దేవాలయము, తులసీదాసు మందిరము, దశరథభవనము, భువనేశ్వరీ హరిహరేశమందిరము, రూపకల్యాణమందిరము, సరయూదేవి, సరయూఘట్టములు, కాలారామ్‌మందిరములు, (ఇట కోట్లకొలది రామకోటి గ్రంథములు చక్కనిబీరువాలలో నలంకరించి నిత్యము భక్తితో పూజించుచు, సంకీర్తన చేయుదురు) దీపశాలామందిరము, శ్రీరామ సతీర్థదాస వేదాంతజీ, శ్రీ పరమహంస రామమంగళదాస్‌జీ, (ఇట గోడలమీద పండాలు మోసముచేయుదురని, ఇంగ్లీషువారు

ఇంగ్లీషులో పెద్దయక్షరములతో (వ్రాసిరి) విక్టోరియామహారాణి తోట మొదలగుస్థానములు చూడతగినవి. తులసీదాసు రామాయణమున గల విశేషములన్నియు చూడతగినవి.

అయోధ్యలో నిత్యము యిరువదినాలుగుగంటలు అఖండ హరినామసంకీర్తనము చేయు సంస్థలు చాల కలవు. ఈ సంస్థలు కొన్ని వత్సరములనుండి యీరీతిగా చేయుచున్నవి. ఈ సంస్థలు కొన్ని గవర్నమెంటు రిజిష్టరు అయినవి.

చరిత్రలు:— రావణసంహారముచేసి శ్రీరాముడు హనుమ ద్విభీషణాంగద సుగ్రీవాదులతో నయోధ్యకు వచ్చెను. అపుడు రాముడు వారలుండుటకు తగినగృహములను నిర్మింప జేయించెను. అవియన్నియు నిపుడు కాలగర్భమున లీనమై జీర్ణించి పోయినవి. కాని వారిపేరున బరగు 'విభీషణకుండము' 'సుగ్రీవ కుండము' 'సీతాకుండము' 'అగ్నికుండము' మొదలగు సరస్సులు నేడును కాననగును.

కాశీయందువలె నిచ్చటను మహారాజుల భవనములు గలవు. అందు 'దరువాడీమహాల్' చూడతగినది. అయోధ్య యందు 'అయోధ్యరాజ లైబ్రేరి' యను పెద్ద గ్రంథాలయ మొకటి కలదు. అయోధ్యయందు సంస్కృతవిద్యా ప్రచార మధికము. ఇక్కడ 'బడేస్థాన్' ఒక పెద్ద విద్యాలయము. ఇంకను చిన్నచిన్న పాఠశాలలు చాల గలవు.

అయోధ్య ప్రదక్షిణము:— ఈ క్షేత్రము వాల్మీకి రామాయణము ననుసరించి 12 యోజనముల పొడవు, 3 యోజనముల వెడల్పు గలది. కార్తీకమాసమున నీ క్షేత్రమును

ప్రదక్షిణము చేయుటకు లక్షలకొలది యాత్రికులు సీతారామ నామ సంకీర్తనము చేయుచు బయలుదేరుదురు. ఈ పరిక్రమ యందింకను దేవాలయములు కాననగును. భూగర్భమునం దిప్పుడుకూడ పెద్దపెద్ద యిటుకలు, భస్మము మొదలగు పరికరములు ప్రాచీనాయోధ్యాపట్టణ స్మృతిచిహ్నములుగ లభించును.

అయోధ్య వనయాత్ర:— అయోధ్యవనయాత్ర కూడ యాత్రికులు చేయుదురు. ఈ యాత్రయందు 'పావనవనము, పుష్కరవనము, ఘోరవనము' మొదలగునవి కాననగును. కాని యీ యాత్రకు కాల మధికమగును. కాన నీ యాత్ర చేయువారలు చాల తక్కువగ నుందురు. భరతుడు దశరథునకంత్యేష్టి చేసిన ప్రదేశ మయోధ్యకు 7 మైళ్ళ దూరమున సరయూతీరమున గలదు.

అయోధ్యయందు 15 వేల వైష్ణవులు గలరు. కాశీయందువలె నిచ్చటను మరణించుట కేతెంచి, భక్తులు నివసింతురు.

"అయోధ్యా మధురా మాయా కాశీ కాంచీ అవంతికా,
పురీ ద్వారవతీచైవ సప్తైతే మోక్షదాయకాః॥

ఇటులీ క్షేత్రము మోక్షము నిచ్చు సప్త పురములం దొకటియై యున్నది. మహాభారత వనపర్వమున, 'అయోధ్యను దర్శించి, గుప్తారఘాటులో స్నానముచేయు మనుజుడు సర్వపాపవినిర్ముక్తుడగును. మఱియు నిచ్చట మరణించినవారలు మోక్షము బడయుదు' రనియు కలదు. అయోధ్యను గురించి, యింకను రామాయణమున, దేవీభాగవతమున, విష్ణుపురాణమున విపులముగ వర్ణింపబడినది.

శివ మందిరములు, నాగేశ్వర మహాదేవాలయము:—శ్రీరాముడు తన యవతారము చాలించగనే అయోధ్య జన శూన్యమై పోయెను. కుశుడు మరల నయోధ్యను పాలించుచు, ఒకనాడు సరయూనదిలో జలక్రీడ చేయుతరి, కుశుని చేతికంకణము నదిలో జారిపోగా, దానిని నాగకన్య లపహరించిరి. ఈ సంగతి తెలిసి కుశుడు నాగముల సంహారింపదొడగగ, శివభక్తులగు నాగకన్యలు శివుని ప్రార్థించగ శివుడు ప్రత్యక్షమై కుశుని శాంతింపజేయ, కుశుడు శివుని అయోధ్యలో నుండుమని ప్రార్థించెను. శివుడు నాటియుండియు నాగేశ్వరుడని పిలువబడుచుండెను. ఈ స్వామిదర్శనము వినా అయోధ్యయాత్ర వ్యర్థము.

దర్శనేశ్వర మందిరము, రాజరాజేశ్వర మందిరము, ఈ రెండును శివాలయములె. ఈ రెంటిని దర్శనసింహమహారాజు కట్టించెను.

త్రేతానాథమందిరము:— ఈ మందిమున త్రేతాయుగము నాటికి 14 విగ్రహములు బంగారపువి గలవు. రామలక్ష్మణ భరత శత్రుఘ్నుల, వారి భార్యల విగ్రహములు కలవు. ఒక్క ఏకాదశినాడుమాత్రమే దర్శనము. ఇతరరోజులలో రు. 1-4-0 యిచ్చినగాని దర్శనము లేదు.

## జౌనపురము (జమదగ్ని పురము)

అయోధ్యకు జౌనపురముస్టేషనుకు 50 మైళ్ళదూరము. పట్టణము స్టేషనుకు చేరియున్నది. ఇచ్చట టాంగాలు, ఎక్కాలు దొరకును.

ప్రాచీన యమదగ్ని పురమే యామనపురమై, నేడు జౌనపురమైనది. పరశురాముని తండ్రి యమదగ్ని (జమదగ్ని) తపస్సు చేసిన ప్రదేశమిదియె. పిమ్మట దీని కీపేరు వచ్చినది. కాశీకి, అయోధ్యకు మధ్యనుండుట చే నిచ్చటకు సర్వదా



* కాశీఘాట్ - (చూడుడు కాశీ.)

యాత్రికు లరుదెంచుచుందురు. గంగాసాగర యాత్రాసమయ మందిచ్చటకు దూరదూరములందుండి మహాత్ము లరుదెంతురు. ఇచ్చట నది 'గోమతీ'. గోమతీతీరమున 'కృష్ణకుటీర' మను పేర చక్కని పెద్ద ధర్మశాలయొకటి కలదు. రెండువందల మంది సుఖముగ నివసించవచ్చును. అన్ని వసతులు గలవు. జౌనపురము జిల్లా హెడ్ క్వార్టర్సు. ఇచట సంస్కృతపాఠశాల, కన్యాపాఠశాలయు గలవు.

హనుమాన్‌ఘాటు:— ఇది ధర్మశాల కెదురుగనున్నది. ఇందనుమద్విగ్రహము గలదు. ఈ మందిరమున కెదురుగ, నశ్వత్థ వృక్షము కలదు. ప్రతి మంగళవార మిచ్చటకు చాలమంది భక్తులు వత్తురు. ఈ దేవాలయమునకు సమీపముననే 'శివాలయము, సత్యనారాయణస్వామి కోవెల' కలవు. ఈ కోవెల కెదుట నొక చిన్న ధర్మశాలయు, 'మిశ్రానీ' మందిరము కలవు. ఇందు 'శ్రీకృష్ణ విగ్రహ' మతి మనోహరముగ నున్నది. పూజా సామాగ్రి యంతయు లభించును.

గూలరీఘాట్:— ఇది యొక విశాలమగు దేవాలయము. ఇందు రాధాకృష్ణుల విగ్రహములు గలవు. సాధువులు, సన్యాసులు ఆగుటకు తగు సౌకర్యములు గలవు.

అచలాఘాట్:— ఇది గురునానక్ మార్గగామి యగు నారాయణదాసుని స్థానము. కాని యిచ్చట నన్ని సాంప్రదాయముల వారికి భోజనాది సౌకర్యములు లభించును. ఈ ఘట్టము చాల పెద్దది. ఇందు 200 మంది జను లొకసారి స్నానము చేయ వచ్చును. ఘట్టము ఒడ్డున నొక ధర్మశాల కలదు.

యమ (జమ)దగ్ని ఆశ్రమము:— నేడు దీనిని "జమేధా" యని పిలతురు. ఇచ్చటకు మూడుమైళ్లదూరమున గోమతీ తీరమున నొక యాశ్రమము కలదు. కొలది కాలము క్రిందట నిచ్చట నొక పరమహంస నివసించు చుండెను. ఆయన యోగ మార్గమున శరీరమును విసర్జించి, యోగాగ్ని చే శరీరమును దగ్ధ మొనర్చెను. ఇచ్చట యా యోగీశ్వరుని సమాధి కలదు. ప్రతి

సంవత్సరము కార్తీక బ ౨ పరమహంస నిర్యాణదినము. ఆ సమయమున వేలాదిజను లాయన సమాధిని పూజింతురు.

యాకియాదేవి:— ఇదియొక ప్రసిద్ధమైన సిద్ధపీఠము. ఇచ్చట నొక దేవీ ఆలయము గలదు. సోమవారమునకు, పూర్ణిమకు ఇచటకు చాలమంది యరుదెంతురు. మందిరమునకు సమీపమున నొక సరస్సు గలదు. దాని యొద్దున "రాధాకృష్ణా" ఆలయము కలదు. ధర్మశాల, కొన్ని దుకాణములు కలవు.

సూర్యఘాట్:— గోమతీ తీరమందలి యొక ప్రసిద్ధమగు ఘట్టము. ఇచట చాల దేవాలయములు గలవు.

వామఘాట్:— ఇది రుద్రభూమి. యమదగ్నిపురము యమునపురమైన రోజులలో, నిచ్చట యవనులు రాజ్యాధికారము నెరపుచు, చాల దేవాలయములను ధ్వంసముచేసి మిగుల నెత్తగు రెండు మసీదులను కట్టిరి. ఆ దేవాలయ శిథిలములు నేడును కాననగును.

ఫిరోజ్‌షాహ్‌కోట:— ఇది గోమతీ తీరమున గలదు. కోట గోడలు లోపల, బయట గడ్డిగాదముతో నిండియున్నవి. లోపలి భవనము లింకను మంచిస్థితియందున్నవి. గోమతీ నదిమీద సికందర్ షాహ్ కట్టించిన వంతెనకూడ కలదు. వంతెనమీదకూడ దుకాణములు గలవు.

సాంప్‌నాథ్:— (సర్పనాథము) ఈ దేవాలయము జౌన్‌పూరుకు 5 మైళ్ల దూరమున గలదు. ఇచట శివుడు "సర్పనాథు" డను పేర వెలసియుండెను. ఆలయమునకు సమీపమున నొక సరస్సు గలదు. క్రీ. శ. 1930 సం. మున, యిచ్చట నొకమిట్టను

త్రవ్వగా, నొక శివాలయము బయటపడెను. ఇటు లిచ్చట భూగర్భమునుండి, యాలయములు, శిథిలభాగము లప్పుడప్పుడు బయల్పడుచుండును. ఇట్టి మహత్తర దేవాలయము లింకను భూగర్భమున నెన్నిగలవో కదా! పితృప్రేమను చూపి ప్రకటించిన పరశురాముని పరమపవిత్రస్థాన మిదియె. ఈ స్థానము నుండియే పరశురాముడు జైత్రయాత్రకు వెడలెను.

## ప్రయాగ (అలహాబాదు)

"పంచయోజన విస్తీర్ణం ప్రయాగస్యతు మండలమ్,
ప్రవిష్టస్యైవ తద్భూమా వశ్వమేధః పదేపదే."

"యత్ర గంగాచ యమునా యత్రచైవ సరస్వతీ,
తత్ర స్నాత్వా చ పీత్వాచ ముక్తిభాగీ నసంశయః."

— పద్మపురాణము.

గంగా, యమునా, సరస్వతీ సంగమమున స్నాన, పానములచే తప్పక ముక్తి కలుగును.

జౌన్‌పూర్ - జఫరాబాద్ (జం) - ఫాఫామావ్పూ(జం) ల మీదుగ అలహాబాద్ చేరవలయును.

అలహాబాద్ పెద్ద జంక్షను. ఇది చాల పెద్దపట్టణము. షుమారు జనాభా 3,32,290. ప్రతిసంవత్సరము దేశదేశములనుండి యాత్రికులు లక్షలకొలది యీ క్షేత్రమునకు వచ్చుచుందురు. కుంభమేలాసమయమున నిచట కపార జనసముదాయము వచ్చును. ఇది జంక్షనగుటచే నిటనుండి దశదిశలకు రైల్వేమార్గము లేర్పరుపబడినవి. ఇచటగల రైల్వేమార్గములు సంక్షేపముగ నీదిగువ వివరింపబడుచున్నవి.

అలహాబాదుజంక్షన్:— ఇక్కడనుండి ఢిల్లీ, ఝాంసీ, జబల్‌పూరు, కలకత్తా, కాశీ, లక్నో మొదలగు ప్రదేశములకు రైళ్ళు పోవును.

నైనీ:— ఇది అలహాబాదు జంక్షనుకు 4 మైళ్ళ దూరమున గలదు. కలకత్తా, జబల్‌పూరు, ఝాంసీ పోవుబండ్లు ఈ స్టేషను నుండి పోవును.

ప్రయాగ:— అలహాబాదుస్టేషన్ నుండి కాశీ పోవునపుడు 2 మైళ్ళదూరమున మొదటవచ్చు స్టేషన్ ప్రయాగయే. దీని కెదురుగనే గంగ కావలియొడ్డున 'ఫఫామావ్రూ' స్టేషను కలదు.

ప్రయాగ ఘాట్:— గంగాస్నానమునకు వెళ్ళుటకు ప్రయాగస్టేషనునుండి యొక బ్రాంచి దారాగంజివరకు పోయినది. ఈ స్టేషన్ పేరు ప్రయాగఘాట్. ఈ రైలు కేవలము ఉత్సవ సమయములందు మాత్రమే నడుపబడును.

త్రివేణీసంగమస్టేషను:— ఇది సంగమమునకు సమీపమున ఆనకట్టకుదగ్గర 1930 లో కట్టిరి. ఈ లైను అలహాబాదు జంక్షన్ నుండి వచ్చుచున్నది. దీనినికూడ ఉత్సవసమయములందే ఉపయోగింతురు.

అలహాబాదుసిటీ:— ఇది పట్టణమునకు మధ్యగలదు. ఇచ్చటనుండి కాశీ, గోరఖ్‌పూరు, కటిహార్‌కు వెళ్ళవచ్చును.

ఐజిట్ బ్రిడ్జి:— ఇది అలహాబాదుసిటీకి 3 మైళ్ల దూరమున నున్న రెండవస్టేషను. దీనితో "దారాగంజ్" బస్తి కలసి యున్నది.

ఝూసీ:— ఇది గంగ కావలియొడ్డుననున్న ఏజిట్ బ్రిడ్జికి మొదటి స్టేషను.

వసతులు:— యాత్రీకు లాగుట కిచ్చుట ధర్మశాలలనేక ములు గలవు. పండాల గృహములుకూడ చాలగలవు. యాత్రీకులు పండాల గృహములందును బసచేయుదురు. ప్రయాగ స్టేషనుకు సమీపమున నొక ధర్మశాల కలదు. అలహాబాదు జంక్షను వద్ద మరియొకటి కలదు. ఈ ధర్మశాల చాలయందముగ సౌకర్యముగ నుండును.

ముఠ్ఠిగంజిలోను, ధారాగంజిలోను ఖుస్రూబాగ్ సమీపమునను ధర్మశాలలు కలవు.



* త్రివేణీ సంగమము

ప్రాచీన చరిత్ర:— ప్రాచీనకాలమం దీ క్షేత్రము "వాసుకీదహ" మని పిలువబడుచుండెడిది. బ్రహ్మ యిచట నొక పెద్దయజ్ఞముచేసెను. అప్పటినుండియుదీనికి ప్రయాగ యని పేరు వచ్చెను. అక్బరు దీనికి అలహాబాదని పేరు పెట్టెను. నేడధికముగ నీక్షేత్ర మీపేరనే వాడబడుచున్నది.

సంకల్పము:— ...... భరతఖండే ఆర్యావర్తాంతర్గత బ్రహ్మావర్తైకదేశే విష్ణుప్రజాపతిక్షేత్రే షట్కోణమధ్యే,

అంతర్వేద్యాం భాగీరథ్యాః పశ్చిమేభాగే, కాళింద్యాః ఉత్తరేతీరే, వటస్యపూర్వదిగ్భాగే, విక్రమశకే బౌద్ధావతారే...... సంవత్సరే (అని సంకల్పము చెప్పుకొనవలెను)

కుంభమేళా సమయమున నిత్యము రాత్రిభాగము త్రివేణీ సంగమము చూడదగినది. స్త్రీలు గంగను వివిధ పూలతోను, దీపములతోను పూజింతురు. సహస్ర సంఖ్యాకములగు దీపములు నదిలోచూడ చుక్కలవలె ప్రకాశించుచు నేత్రపర్వ మొనర్చును. స్త్రీలు నావలో భగవన్నామ సంకీర్తనము చేయుచు, నదిలో ప్రయాణము చేయుతరి దృశ్యముచూడ మిక్కిలి యానందదాయకముగ నుండును. కుంభమేలాకు వివిధ ప్రాంతములనుండి, మహారాజులు, జమీందారులు, మహంతులు వారివారి పరివారముతో విచ్చేయుదురు.

త్రివేణీ:— గంగా- యమునలు ప్రత్యక్షముగను, సరస్వతి యంతర్వాహినిగను కలిసినచోటే త్రివేణియని పిలువబడుచుండెను. త్రివేణి త్రివిధతాపములను హరించును. అన్యక్షేత్రములందుకంటె ప్రయాగయందు ముండనమునకు విశేష మహాత్మ్యము కలదు.

"రాజా వా రాజపుత్రో వా లక్ష్మీపతిరేవవా,
ప్రయాగేవపనం కుర్యా దన్యక్షేత్రే కదాచన॥"

అన్యక్షేత్రములందు వపనము మానినను ప్రయాగయందు విధిగా ముండనము చేయించుకొనవలయును. వపనము చేయించుకొని, త్రివేణియందు యథావిధిగా స్నానమాచరించి తీర్థవిధి చేయవలయును. సంగమస్థానము బురదగనుండుటచే, యాత్రి

కులు నావయందు సంగమస్థానమున కేగి స్నానము చేయుదురు. అన్నశ్రాద్ధము చేయతలచిన పండాలు తమ గృహమున నన్ని యేర్పాట్లు చేయుదురు. చాలమంది యాత్రికులు ఆమశ్రాద్ధము (పిండితో) గ చేయుదురు. — ప్రయాగ సర్వతీర్థముల కధిరాజు. (తీర్థరాజమని సార్థకనామము) ఇది మూడుభాగములుగనున్నది.

1. ప్రయాగ:- గంగాయమున మధ్యభాగము.

2. అలహాబాద్ - లేక అరైల్:- యమున పశ్చిమతీరము.

3. ప్రతిష్ఠానపురము - లేక ఝూసి:- గంగా దక్షిణతీరము.

ప్రయాగ ప్రజాపతి క్షేత్రము. ఇచ్చట మాఘస్నానమనంత పుణ్యప్రదము. మాఘస్నాన మహిమ, ప్రయాగ మహిమ - నారద, విష్ణు, పాద్మ, స్కాంద పురాణములలో విశేషించి వర్ణింపబడినది.

గంగ పట్టుట:— ప్రయాగలో గంగను పూజించి, కలశములలో గంగను నింపి, మరల పూజించి యాత్రీకులు గృహములకు దెత్తురు. హిమాలయముల నుండి గంగ యితర నదుల సంబంధము లేకయె వచ్చినందున అసలుగంగను యిచట గ్రహింతురు. ఇది మొదలు కాశీకి చేరులోగా కొన్ని నదులు కలియును. హరిద్వారము వెళ్లతలచినవారు, హరిద్వారములో పట్టుదురు.

వేణీప్రదానము:— పసుపువస్త్రములు దంపతులుధరించి త్రివేణికిచేరి, అచట స్త్రీకి ప్రాయశ్చిత్తము చేయించి, జుట్టు మధ్యగల కేశములు చిన్నజడగనల్లి, దానిని భర్త కత్తిరించి, ఆ వేణినిపూజించి, త్రివేణియందుంచుదురు. ఆదింపతులు ధరించిన

పసుపు వస్త్రములను పండాలు తీసికొందురు. ఈ వేణీప్రదాన మహోత్సవము పురాణములలో మిక్కిలి వర్ణింపబడినది.

అక్షయవటము:— త్రివేణిలో స్నానాదికృత్యము లాచరించినవెనుక నక్షయవటమును దర్శించవలయును. ఇది అక్బరు క్రి. శ. 1515 లో నిర్మించిన కోటయందు కలదు. కోటయందు పూర్వముగల యంతఃపురములు నేడు శస్త్రాగారములుగనున్నవి.



ఆనందభవనము

(ఉత్తరప్రదేశ్ ప్రభుత్వ సౌజన్యముతో)

కోటలో గల నక్షయవటమును సర్వసాధారణముగ నందరు దర్శించవచ్చును. కోటలోని మిగిలిన భాగములు జూచుటకు ప్రత్యేకమగు ననుమతిని పొందవలయును. ఈయక్షయవటము నొక గుహాయందున్నది. మొదటిభాగముమాత్రము కాననగును. మధ్యభాగము కాశియందున, అగ్రము గయయందు చూడనగును. అక్షయవటముగల గుహను పాతాళమందిర మని పిలతురు. మెట్లు దిగి లోనికేగవలయును. దీపపు వెలుతురున, నన్నియు దర్శించ వచ్చును. శాస్త్రము లీయక్షయ వటము, ప్రలయకాలమునగూడ నశించదనియు, దర్శనమాత్రమున పాపములను నశింపజేయు ననియు చెప్పుచున్నవి.

ఈ అక్షయవటమువద్ద ధర్మరాజు, అన్నపూర్ణ, సంకట మోచన, మహాలక్ష్మి, ఆదిగణేశ్వరుడు, బాలముకుందుడు, శూలటంకేశ్వరమహాదేవుడు, గౌరీశంకరుడు, నరసింహస్వామి, దత్తాత్రేయుడు, సూర్యుడు, అనసూయాదేవి, వాయువు, వరుణుడు, మార్కండేయుడు, అగ్ని, దుగ్ధనాథుడు, దూర్వాసుడు, గోరఖ్‌నాథుడు వీరల మూర్తులు కాననగును.

ఇది భూగర్భమున నిటు లెందు కేర్పరుపబడెనో సహేతుకముగ తెలియదు. ఇచ్చటనే అశోకుడు (క్రీ. పూ. 3 శ) పాతిన 29½ అ. ఎత్తుగల స్తంభము గలదు. స్తంభమున శిలాశాసన మొందు గలదుగాని, అది యేదో స్పష్టముగ తెలియుటలేదు.

భరద్వాజాశ్రమము:— ఇచ్చట భరద్వాజ మహర్షి తపస్సు చేసెను. శ్రీరాముడు వనమునకు వెళ్లిన తరువాత, భరతుడు సైన్యసమేతుడై, రాముని అయోధ్యకు తీసికొని వెళ్లుట కేగుదెంచినపుడు భరద్వాజమహర్షి తన తపఃప్రభావము వలన సైన్యముతోసహా భరతున కిచ్చటనే షడ్రసోపేతమగు విందుచేసెను. ఇచ్చట భరద్వాజుడు ప్రతిష్ఠించిన "భరద్వాజ శివుని" మందిరము కలదు.

సప్తర్షులగుహ:— భరద్వాజాశ్రమోప్రాంతమున నొక గుహ కలదు. ఇచ్చట సప్తర్షులయొక్కయు, అగస్త్యునియొక్కయు విగ్రహములు గలవు. ఈ గుహకుబయట నొకమందిరము గలదు. అందు వాల్మీకి, శేషుడు, బ్రహ్మ వీరల విగ్రహములు గలవు.

వాసుకి:— ఇది నాగరాజగు వాసుకి దేవాలయము. ఇది 'బక్షీము హల్లా' లో నొక యెత్తైన మిట్టమీద కలదు.

ఇందు నల్లరాతితో చేయబడిన విశాలమైన వాసుకిమూర్తికలదు. ఇది స్వయముద్భవము. ఈ స్థానము మిక్కిలి మనోహరమైనది.

వేణీ మాధవుడు:— అది వేణీమాధవుని జలమయ విగ్రహము. త్రివేణి యందుగలదు. అదికాక నొక మాధవుడు, ధారాగంజిలోను, రెండవది యమున అవ్వలియొడ్డున గలదు. ఇందు ధారాగంజిలోని వేణీమాధవుడు ముఖ్యము. ఇచ్చట లక్ష్మీమాధవుల విగ్రహము లతి మనోహరముగ నున్నవి. యమున కావలియొడ్డున నున్న వేణీమాధవుని దర్శించుటకు, నావలో వెళ్ళవలయును.

"నమస్తే కామరూపాయ లావణ్యాకర భూమయే,
మనోహరాయ భూమాయ మాధవాయ నమోనమః. — పాద్మము

సోమేశ్వరనాథుడు:— వేణీమాధవునకు పశ్చిమమున, గంగకుడియొడ్డున దేవాలయము కలదు. శివరాత్రి కిచ్చటకు చాలమంది యాత్రికు లరుదెంతురు.

సరస్వతీ:— యమున కావలియొడ్డున నొక కుండము సరస్వతియను పేరున గలదు.

హనుమాన్:— ధారాగంజికి పోవుమార్గమున నీయాంజనేయ దేవాలయము గలదు. ఇది చాల పెద్ద విగ్రహము. ఇది పరుండియున్నట్లు మలపబడియున్నది.

ఝూసీ:— ఇది గంగ కవ్వలియొడ్డున నున్నది. ఇందు ఐలతీర్థము గలదు. పూర్వమిది ప్రతిష్ఠానపురమను పేర బరగుచుండెడిది. చక్రవర్తి పురూరవుని తండ్రి యొకప్పుడు, శాపవశమున "ఇల" యను స్త్రీగా మారెను. అంత నామెకు బుధుని

సంయోగమున పురూరవుడు జనించెను. ఇల కుమారుడగుట నాతడు "ఇలుడనియు, నాత డేర్పఱచిన తీర్థమగుట నైలతీర్థ" మనియు ప్రసిద్ధి కెక్కెను. ఇది పురూరవుని రాజధాని. ఇచ్చట చాలకాలమునుండి తపస్సుచేయు మహాత్ములు, వృద్ధులు అనేకులు గలరు. అదృష్టవంతులకుగాని వారి దర్శనము కానేరదు.

పరమహంస కూపము:— గంగానది దాటిన కొలది దూరమున 32 మెట్లెక్కిన నొక కటీరము, దాని కెదుట నొక కూపము (నుయ్యి) కనబడును. అచటనుండి మరల 31 మెట్లు ఎక్కిన నొక గుహ కానవగును. దానిపైన 16 మెట్లు ఎక్కవల యును. ఇచ్చటనుండి గంగానది యతి మనోహరముగ కాను పించును. ఇచటనుండి క్రిందికి దిగిన నొక సుందరమగు గృహము కలదు. దాని కెదురుగ ఫలపుష్పభరితమగు నొక చక్కని యుద్యా నముగలదు. ఆ యుద్యానమునకు మధ్య నొకకూపము 'పరమ హంసకూపము' అనుపేర గలదు. యాత్రికు లీకూపమును దర్శించి నమస్కరింతురు.

హనుమంతుడు:— పరమహంస కూప సమీపమున నొక గుహయందు 26 మెట్లుదిగిన 'హనుమాను' ని దర్శించ వచ్చును. దీని కెదురుగ గంగపై పునఃనొక సురంగముగలదు. దీనికి రెండువైపుల గుహలుగలవు. ఇవి యెంత పొడవైనవో పరికిని తెలియదు. మా యాత్రలో ఈ గుహయందు కొంతదూరమున నొక సిద్ధుని గాంచితిమి. ఆయన మౌనముద్రాంకితుడై తపస్సున నుండెను. వారిదర్శనము మాత్రము మాకు లభించినది.

సముద్రకూపము:— ఝూసీ కోటబయట మిట్టయం దీ కూపము గలదు. కూపమును సమీపించుటకు పూర్వ మొక

ద్వారముగలదు. ఈ కూపమునకు చుట్టు ఉద్యానవనము గలదు. కూపము, ఇనుపచువ్వలచే కప్పబడియున్నది. మిక్కిలి లోతున జలముగలదు. దీనిపేరు సముద్రకూపము. ఇచట నొక రాతిపలక మీద నీ కూపమహత్వము నగ్గడించు పద్మపురాణములోని శ్లోకములుగలవు. పూర్వమిచట బ్రహ్మ ఒక యజ్ఞముచేసి, ఆ యజ్ఞమునకయి తెచ్చిన సప్తసముద్ర తీర్థముల నిందుంచెనని చెప్పుదురు. అదిగాక సముద్రగుప్తుడు రెండశ్వమేధములను జేసి, స్మృతిచిహ్నముగ, నీకూపమును నిర్మించి, యిచ్చట రెండు గుబ్బములనుగూడ స్థాపించెనని వదంతికూడ కలదు. గుబ్బములు మాత్రము నేడు లక్నో మ్యూజియమునకు గొంపోబడినవి. ఇచట మనుజుడు కామ క్రోధములనువీడి, మూడుదినములున్న, అశ్వమేధఫలమున్న, చిత్తశుద్ధియు బడయును. సముద్రకూపము నందలి జలము, అచటగల మహంతు తోడియాత్రికుల హస్తము లందుంచును. యాత్రికులాజలమును ఆచమింతురు. మార్గమధ్యమున నొక గుహాయందు, సాక్షిగోపాలస్వామి, ఆంజనేయస్వామి విగ్రములు గలవు. ఈ గుహ చాల పురాతనమైనది.

హంసతీర్థము:— ఇదియొక యోగిక స్థానము. ఇది సహస్రార కమలమువలె నేర్పరుపబడినది. దీనిని భాగల్పూరు జమీందారొకడు "హంస" సన్యాసియై కట్టించెను. ఇందు 'త్రికుటి, అంతఃకరణము, భ్రమగుహ, సుషుమ్నా కూపము, మేరుదండము' మొదలగు స్థానము లతికుశలముగ నేర్పరచిరి.

సంధ్యావటము:— హంసతీర్థమునకు వెనుక నొక వట వృక్షముగలదు. దీనిక్రింద సంధ్యావందన మాచరించిన సంధ్య చేయని దోషము నశించును.

దశాశ్వమేధేశ్వర మహాదేవుడు:— ఝూసీనుండి రైల్వే వంతెనదాటి, ధారాగంజికిపోవు మార్గమున నీ మందిరము కానన గును. ఇట బ్రహ్మ యశ్వమేధమును చేసెనట.

పరిక్రమ:- ఇవి కాక యింకను నామమాత్రావశిష్టము లగు తీర్థము లనేకములు గలవు. ప్రయాగ 5 క్రోసులు వైశాల్యము కలది. దీనిని పరిక్రమించు నాచారము లుప్తమైపోయెను. కాని శ్రీ 108 ప్రభుదత్త బ్రహ్మచారి మహారాజుగారీ పరిక్రమను పునరుద్ధరించిరి. దీనిని పరిక్రమించుటకు 12 రోజులు పట్టును. ఇంకను తక్కువ సమయమందుకూడ ప్రదక్షిణము చేయవచ్చును. చైత్ర బ 3 మొదలు 30 వరకు నీక్షేత్రము నిచ్చటి సాధువులు పరిక్రమింతురు.



ఆగ్రావిశ్వవిద్యాలయము (ఉత్తరప్రదేశ్ ప్రభుత్వ సౌజన్యముతో)

కృష్ణకుంజము:— ఈ భవనమును శ్రీ కన్హయాలాల్ ఎం. ఏ., ఎల్. ఎల్ బి. అనువారు సంకీర్తన సంస్థకు దానమొసంగిరి. భవనము సుమారు 2 లక్షల ఖరీదు చేయును. ప్రతిదినము

దయము, సాయంకాలము అనేక వాద్యములతో సంకీర్తన, తులసీరామాయణ పారాయణ జరుగును. అలహాబాదు పట్టణ మంతయు, ఈ సంకీర్తనము వినబడునట్లు దూరశ్రవణయంత్రము లేర్పరుపబడినవి. ఈ సంఘమునకు కొంతకాలము మాలవ్యగారు, కొంతకాలము మహాత్మాగాంధి అధ్యక్షులుగా నుండిరి. ప్రస్తుతము శ్రీ రాజేంద్రప్రసాద్‌గా రధ్యక్షులు. తప్పక చూడతగినది. ఈ సంస్థపేరు "ప్రయాగ పంచక్రోశీ సంకీర్తన ప్రచారసమితి."

కోట:— దీనినిగూర్చి అక్షయవట సందర్భమున సంక్షేపముగ జెప్పబడెను. దీని నశోకుడు కట్టెననియు, ననంతర మందలి రాజులు దీనిని పునరుద్ధరించిరనియు చెప్పుదురు.

అక్బర్ కా బాంద్:— కోటను గంగానది వరదనుండి సంరక్షించుట కక్బరు, ఒక ఆనకట్టను కట్టించెను. దీనివలన కోటయేకాక ప్రయాగపట్టణ మంతయుకూడ గంగానది వరదల వలన భయములేక సురక్షితమై యున్నది.

ఖుస్రూబాగ్:— జహాంగీరు తన కుమారుడగు ఖుస్రు స్మృతిచిహ్నముగ దీనిని నిర్మించెను. లోపల నందమగు బాటలు, పలువిధములగు వృక్షములు కలవు. ఇందు 3 గోరీలు కలవు.

హైకోర్టు:— ఇది తెల్లని రాతితో మిగుల నందముగ నిర్మింపబడెను. పైభాగమున జడ్జీలుందురు. క్రింద ఆఫీసు గలదు. ఇది నూతనముగ నిర్మింపబడెను.

పార్కు:— ప్రయాగయందు చాల పార్కులు గలవు. అందు అల్ఫ్రెడ్ పార్కు, మిన్టోపార్కు, పురుషోత్తమపార్కు ప్రసిద్ధమైనవి.

ఆనందభవనము:— కీ. శే. మోతీలాల్ నెహ్రూ దీని
ాసమునకు కట్టించెను ఇది చూడతగిన గొప్పభవనము.
గులలో పుష్పములు, పత్రములు, లతలు వింతలుగొలుపు
ను. ఎట్టి కఠినహృదయునకైనను ఇది చూచినంతనే ఆనం
లుగును. దీనికి సమీపముననే ప్రాతభవనము గలదు.
యన రాష్ట్రీయమహాసభకు వితరణము చేసెను.

ప్రయాగ విశ్వవిద్యాలయము:— 1920 కి పూర్వము
్యాలయము యుక్తప్రాంతము రాజపుతానాయందు గూడ
చెందియుండెను. కాని వర్తమానమున కేవల మిది అలహా
రకె సంకోచింపబడెను. ఇందు చాల విషయముల గూర్చి
నున్నతమగు విద్య చెప్పబడును. ఇందు 2000 విద్యార్థు
విద్య నభ్యసించుచుండిరి. దీనికి సంబంధించి యొక పెద్ద
లయము కలదు.

మ్యోర్‌కాలేజీ:- మొదట నిది ప్రయాగయందలి కాలేజీ
ోను పెద్దదై యుండెడిది. ప్రస్తుత మిందు విశ్వవిద్యా
యునకు సంబంధించిన విజ్ఞాన విభాగము కలదు.

కృషి విద్యాలయము:- ఇది యమునకు కుడివైపున
ను కొలదిదూరమున నున్నది. దీని నొక యమెరికన్
స్థాపించెను. 600 ఎకరముల భూమి దీనిక్రింద నున్నది.
దేశములోని యన్ని ప్రాంతములనుండి దీనియందు విద్య
ెకు విద్యార్థులు వత్తురు.

హిందీ విద్యాపీఠము:— కృషి విద్యాలయమునకు పశ్చి
యమునకు కుడివైపున దుహాబాగ్రామమందు హిందీ

హిత్య సమ్మేళనమునకు చెందిన, హిందీ విద్యాపీఠము కలదు. ఇందు సమ్మేళనమునకుచెందిన యన్ని పరీక్షలకు చదువుచెప్పబడును. ఇందు విద్యార్థులు జీతము చెల్లించవలసిన యవసరము లేదు!

హిందీ సాహిత్య సమ్మేళనము:— చౌకునకు కొలదిదూరమున నీ కార్యాలయము కలదు. భారతదేశమున హిందీని రాష్ట్రభాషగచేయ యత్నించు సంస్థ యిది యొకటి మాత్రమే. ప్రతి సంవత్సర మిందు హిందీలోని ప్రకాండపండితుని యధ్యక్షతన నొక సభజరుగును. ఇందు ప్రతిసంవత్సరము 'ప్రథమ, మధ్యమ ఉత్తమ' పరీక్షలు జరుపబడును. ప్రతిసంవత్సరమొక యుత్కృష్ట గ్రంథ లేఖకున కిచ్చుట "మంగలాప్రసాద పారితోషికము" రు 1200/- లు యివ్వబడును.

హిందీస్తానీ ఎకాడమీ:— ఇది ప్రయాగ స్టేషనుకు సమీపమున కలదు. ఇది హిందీ, ఉర్దూ సాహిత్యములకు సంబంధించిన మంచి గ్రంథములను వెలువరించు సంస్థ.

నైనీ:— యమున కావలియొడ్డున ప్రయాగకు $3\frac{1}{2}$ మై. దూరమున నైనీ స్టేషను కలదు. ఇది మొదట చిన్నగ్రామమయ్యు నేడు యంత్రాగారములవలన పెరుగుచున్నది. ఇచట పంచదార ఫ్యాక్టరీ, అద్దముల తయారుచేయు ఫ్యాక్టరీ కలవు. ప్రయాగ సెంట్రల్ జైలుకూడ నిచట కలదు. పాదరీలు (క్రైస్తవ సన్యాసులు) నడుపు కుష్ఠురోగుల చికిత్సాలయము, గ్రుడ్డివారల చికిత్సాలయములు యిచట గలవు. కుష్ఠురోగుల సంతానమునకిచట చదువుచెప్పు నేర్పాటు కలదు. ఇచట నొక ధర్మశాల, పోస్టాఫీసు కలవు.

కుంభపర్వము:— (కుంభమేలా) పూర్వ మొకప్పుడు దేవాసుర సంగ్రామము జరిగెను. అందు దేవతల పక్షము బహీనముగ దోచెను. అంత బృహస్పతి రాక్షసులు జయమొంది నమృతము నాస్వాదించి, యమరు లయ్యెదరని భయమంది, యమృతకలశమును చేగొని, పారిపోసాగెను. రాక్షసు లిదిగని, యాతనిని వెంబడించి గంగా, త్రివేణీ, క్షిప్రా, గోదావరీ నదుల యొద్దున నమృతకలశమును లాగుకొనుటకై పెనగులాడిరి.

ఆసమయమం దచ్చట కొన్ని యమృతబిందువులు క్రింద బడెను. అందుచే నీ ప్రదేశములందు కుంభోత్సవము చేయుదురు. ఈ ప్రదేశములందు స్నానము చేసిన నమరత్వము లభించు నందురు. భారతదేశమున "ప్రయాగ, హరిద్వారము, ఉజ్జయిని, నాసిక" యీనాలుగు ప్రదేశములందు ప్రతి 12 సంవత్సరముల కీయుత్సవము జరుగుచుండును. గురుడు (బృహస్పతి) కుంభరాసి యందున్నపుడు, హరిద్వారములోను, వృషభరాశియందున్న పుడు, ప్రయాగలోను సింహరాశియందున్నపుడు ఉజ్జయినీ, నాసికలందును నీయుత్సవము జరుగును. ఇది మనప్రాంతమున పుష్కరమనుపేర వాకొనబడుచున్నది. గురుడు ఒకరాశినివదలి మరల నారాశి చేరుటకు 12 సంవత్సరములు పట్టును. అందుచే 6 సంవత్సరములకు గూడ నర్ధకుంభోత్సవమని, హరిద్వారమున, ప్రయాగయందున జేయుదురు. ఈసమయమున నిచటకు లక్షల కొలది స్త్రీపురుషులు, సాధువులు, మహాత్ములు వచ్చెదరు. కుంభోత్సవ మహాత్వము పద్మపురాణమున విపులముగా వర్ణింప బడియున్నది.

**మాహాత్మ్యము:—** పర్వదినములందు ప్రయాగకు సమస్త దేవతలు, సర్వతీర్థములు వచ్చి నివసించునని పురాణములందు గలదు త్రివేణీసంగమమున స్నానముజేసిన మనుజుని సర్వపాపములు నశించును. ప్రయాగయందు దొనర్చిన ద్రవ్యదానము, సువర్ణదాన మనంత పుణ్యప్రదమై యనేక జన్మలవఱకు దారిద్ర్య బాధ లేకుండ జేయును. ఈ క్షేత్రము సర్వాభీష్టముల నొనగూర్చును. యాత్రీకులిచట దానమునుమాత్రము ప్రతిగ్రహించకూడదు. ప్రయాగ మాహాత్మ్యము – స్కాంద, మధ్య, పద్మ పురాణములలో విశేషముగ కలదు.

అలహాబాదు నుండి చిత్రకూటము వగయిరా వెళ్ళవచ్చును. నాగపూరు మీదుగాకూడ రావచ్చును.

(చూడుడు మధ్యభారతము)

**శ్రీ 108 ప్రభుదత్తబ్రహ్మచారి గారు:—** వీరి యాశ్రమము ఝూసీలో గలదు. పేరు "సంకీర్తన భవన్". ఇక్కడ నిత్య సంకీర్తన, భాగవత కాలక్షేపము జరుగును. శ్రీబ్రహ్మచారి గారు ఆజన్మ బ్రహ్మచారులు. 35 సం॥ ములనుండి మౌనులు. తపస్సంపన్నులు.

## విరాట్ సంకీర్తన

భారతదేశము స్వాతంత్ర్య పోరాటములోనుండి రెండవ మహాయుద్ధమున పాల్గొనలేదు. అయినను బ్రిటిష్‌వారు దీనిలో పాల్గొని యుద్ధభయమును మనదేశమునకు దెచ్చిరి. దేశమంతయు నల్లకల్లోలముగ నుండెను. సమస్త ప్రపంచము అశాంతముగ నుండుటచే, అశాంతి నివారణకు సంకీర్తనముదప్ప వేరు

గతిలేదని నమ్మిన శ్రీ ప్రభుదత్తబ్రహ్మచారిగారు ప్రయాగలో త్రివేణీ మైదానమున (1944 సం.) విరాట్ సంకీర్తన యజ్ఞమును జేసిరి. ఆయజ్ఞమును జూచితీరవలసినదేకాని వర్ణింప నలవికాదు. భారత దేశములో సమస్త రాష్ట్రముల లోని భజన సంఘములు నాహ్వానింపబడినవి. లోగడ శ్రీ బ్రహ్మచారి గారితో పరిచయ ముండుటచే శ్రీ కుందుర్తి వెంకట నరసయ్యగారికి శ్రీ బ్రహ్మచారిగారు తెలుపగా, శ్రీ వెంకట నరసయ్యగారితో మేము కొందర మిత్రులము 18మంది కలసి సంకీర్తనకై వెళ్లితిమి. త్రివేణీ మైదానములో అనేక



శ్రీ 108 ప్రభుదత్త బ్రహ్మచారిగారు

పాకలు, డేరాలు, యజ్ఞశాలలు, పురాణ సంకీర్తన ఉపన్యాస వేదికలు ఏర్పరుపబడినవి. షుమారు 250 గొప్పగొప్ప భజన మండలులు వారివారి సమస్త వాద్య విశేషములతో విచ్చేసిరి. అచ్చట 11 రోజులు అఖండ సంకీర్తనము, వేరొకచో రుద్ర

యాగమును జరిగెను. అఖండ సంకీర్తన పాళీలుగా వేసిరి. మాకును ఉ॥ గం. 4-6, సా॥ 4-6 లు,గా రెండు పాళీలు వేసిరి. నిత్యము ఉ॥ గం. 6-7, సా॥ గం. 6-7 విరాట్ సంకీర్తన జరిగెడిది. ఆసమయమున శ్రీ ప్రభుదత్తబ్రహ్మచారిగారు సమస్త పరివారము తోను, మహాత్ముల, సాధువుల బృందముతో సంకీర్తనకు విచ్చే సెడివారు. ఆసమయమున నీ 250 భజనసంఘములు అచటికే సంకీర్తనకు రావలెను. వేలకొలది సంకీర్తనము అనేక వాద్య విశేషములతో జేసెడివారు. షుమారు 150 డోలకులు ఏకకాల మున మ్రోగెడివి. భూనభోంతరాళములు సంకీర్తన మయ మయ్యెడివి.

నిత్యము పురాణములు, హరికథలు, ఉపన్యాసములు, నాటకములు ప్రత్యేక సంకీర్తనలు జరిగెడివి. ఈసందర్భమున షుమారు 4, 5 వేలమంది మహాత్ములేతెంచిరి. ఒకనాడు మహా త్ముల యొక్కయు, అశేష భజన సంఘముల ప్రతినిధుల యొక్కయు, భక్తులయొక్కయు సన్నిధానమున, వివిధ దేశముల భజనసంఘముల సంకీర్తనము షుమారు 10 ని.ల చొ॥ చేయిం చిరి. అందు మేముకూడ పాల్గొనినాము. మనదేశము తరఫున ఒక ½ గం. మాలోనొకరైన శ్రీ వెంకటనరసయ్యగారు హిందీలో నామమహిమను గురించి నుపన్యసించిరి. అలనాటి ధర్మజుని రాజసూయము, అశ్వమేధము తలపునకు వచ్చినవి. ఒకలక్ష రూపాయలు ఖర్చు అయియుండునని అంచనా వేయబడినది.

వేలాది మహాత్ముల సందర్శనము, పరమపావని తీర్థరాజ మగు త్రివేణీతీరమున అనవరతము భగవన్నామ సంకీర్తన వినుటయు, ఎన్నోజన్మలలో చేసిన మహత్తర ఫలముగాని వేరొండు

కాదు. ఈసందర్భమున వచ్చిన మహాత్ముల చరిత్రలు వ్రాయుట ప్రత్యేక గ్రంథమగును. ఒక్కరిని గురించి మాత్రము సంగ్రహముగ వ్రాయుచుంటిని.

అనామబ్రహ్మచారి (అంతర్ధానస్వామి):— ఈ మహాత్ముని పేరా దేశ్యులకే తెలియదు. ఆయన చెప్పడు. పేరడిగిన పైకి జూపును. లేక దేవతామూర్తుల పటములు చూపును. మీ ఆశ్రమ మేది యనిన హృదయము చూపును. దివ్య తేజస్సుగల బ్రహ్మచారి. ఆహారము దానికదే నోటికి రావలెను. నోటిలో బెట్టిననే తినును. ఒక కౌపీనము, ఉత్తరీయము, చేత నొక మంటి ముంత - ఇట్టి విలక్షణపురుషుడు ఒకనాడు శ్రీ వెంకటనరసయ్యగారికి కనుపించగా మా కుటీరమునకు తీసికొనివచ్చిరి. వీరికి హిందీ, సంస్కృతము, ఉర్దు, ఇంగ్లీషు మొదలగు భాష లెన్నో తెలియును. నిరంతరము 'శ్రీరామ జయరామ జయజయరామ' అను మంత్రమును జపించుచుందురు. మా కుటీరమున భిక్ష తీసికొనిరి. నాటి సాయంకాలమే అంతర్ధానమైరి. మరల మరునాడు సాయంకాలము దర్శనమిచ్చి మేమిచ్చిన రొట్టె, పాలను స్వీకరించిరి. ఆ మరునా డుదయము మా ప్రయాణము. శ్రీ స్వామివారు తెల్లవారుజామున 4 గంటలకే గంగాస్నానము చేసివచ్చి మా కందరకు శ్రీరామమంత్రోపదేశము చేసిరి.

విరాట్ సంకీర్తన అయినపిమ్మట ఉత్తర, తూర్పు యాత్ర యంతయు చేయవలయునని మాకు కోరిక జనింపగ, శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారిగారు ఆ యా క్షేత్రములలోని ప్రధానులకు ఉత్తరములిచ్చి, మమ్ము ఆశీర్వదించి పంపిరి. శ్రీ బ్రహ్మచారిగారి ఉత్తరములవలన నాయా క్షేత్రములలో సంపూర్ణ యాత్ర

సుఖముగ జేయగలిగితిమి. మా యీ యాత్రకు ముఖ్యకారకులైన శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారిగారికి మా అందరితరఫున నమస్కారములు చేయుచుంటిమి.

మా యాత్రాసమయమున మహత్తర తపస్సంపన్నులగు మహాత్ము లనేకులను దర్శించు భాగ్యము కలిగినది. మధుర, బృందావనము, గోవర్ధనము, ప్రయాగ, కాశీ, హరిద్వారము, హృషీకేశము మొదలగు స్థలములలో గల మహాత్ముల కొందరి నామములు శ్రీఅంతర్ధానస్వామి, శ్రీహరేరాంబాబా, శ్రీఉడియాబాబా, శ్రీహరిహరబాబా, శ్రీ నరనారాయణులు, శ్రీ నారదానందజీమహరాజు, శ్రీ ఆనందమాయి, శ్రీ స్వామి శివానంద మొ॥

## వింధ్యాచలము

అలహాబాదునుండి వింధ్యాచలము స్టేషనులో దిగవలయును. ఇది 'మొగల్‌సరాయి', అలహాబాదులకు మధ్య గలదు. ఇచ్చట 3 ధర్మశాలలు గలవు. వింధ్యాచలమున శ్రీ వింధ్యవాసినీదేవి కలదు. ఇది యొక దేవీపీఠము. చైత్రమాసమున, ఆశ్వయుజమాసమున నవరాత్రుల కిచ్చటకు చాలమందియాత్రికులరుదెంతురు. ఇచ్చట యాత్రికులు గంగలో స్నానము చేసి తరువాత శ్రీ వింధ్యవాసినీదేవిని సందర్శింతురు. వింధ్యవాసినీ మందిరము బస్తీలో కలదు. ఇందు దేవి సింహారూఢయై మనోహరరూపమున విరాజిల్లుచున్నది.

కాళీ:— భగవతి సింహవాహినిని దర్శించి యాత్రికులు 'కాలీఖోహ్ త్రికోణ్' (ఇది యొక త్రికోణాకారమైన గుహ) కు వెళ్లుదురు. ఇచట కాళిక అష్టభుజములతో గూడుకొనియున్నది.

శుంభ నిశుంభమర్దనీ విగ్రహముకూడ యిచ్చట కలదు. ఇది సిద్ధపీఠమగుటచే నేడు సిద్ధిజెంది, శాక్తులనేకులిచ్చట గానవత్తురు. కొలదికాలముక్రిందట నిచట నొక చిత్రము జరిగెను. ఒకదినము రాత్రి మందిరమును మూసివేసినపిదప నిచటకు కొందరు శాక్తులరుదెంచి యొక పుష్పమాలికను, కొన్ని పుష్పములను ద్వారము ముంగిట నుంచి వెడలిపోయిరి. ఉదయము తలుపులు తెరువగనే యా మాలిక భగవతి కంఠమునను, పుష్పము లామె పాదములందును గలవు. ఈ విషయమును పండాలేకాక యితరులును చెప్పుదురు. ఇచట భక్తులు 'మార్కండేయపురాణము' 'దుర్గాసప్తశతి'ని యెల్లప్పుడు చదువుచుందురు. వింధ్యపర్వతమున కొంత కాలము నియమముగనున్న, సిద్ధులగు శాక్తుల దర్శనము కలుగును. తరచు వీరలు నగ్నముగా దర్శనమిత్తురు.

వింధ్యపర్వతము:— ఇచటి శిలలన్నియు నేటవాలుగా పరుండినటులున్నవి. పూర్వము వింధ్యపర్వతము పెరిగి సూర్యుని మార్గమును నిరోధించెను. అగస్త్యుడు వింధ్యమునకు గురువు. అందుచే దేవతలాతనిని శరణొందిరి. అంత నగస్త్యుడు వింధ్య పర్వతముదగ్గరకు వచ్చెను. గురువునకు వింధ్యము సాష్టాంగప్రణామము జేసెను. అగస్త్యుడు వింధ్యము నాశీర్వదించి "నేను తిరిగి వచ్చునంతవరకు నీవీ విధముగనే యానందముతో పడియుండుమని" యాజ్ఞాపించి దక్షిణాపథమునకు వెడలెను. అప్పటినుండి నేటివరకు వింధ్యమటులే పడియున్నది.

వింధ్యేశ్వరుడు:— ఇచట వింధ్యేశ్వరుడు కలడు. ఈ మందిరమున కాశీరాజు పూర్వులు వ్రాయించిన శిలాశాసన

మొందు గలదు. కాని అది పూర్తిగా తెలియుటలేదు. క్రీ. శ. 1676 అని మాత్రము తెలియుచున్నది.

తారకానాథకుండము:— ఇచ్చట తారకానాథకుండము కలదు. దీనికి సమీపమున తారకేశ్వర, భృంగీశ్వర, అష్టాదశాంగులేశ్వర, సారస్వతేశ్వర, సర్వతీర్థేశ్వర, మహేశ్వర, రత్నేశ్వర, ధర్మేశ్వర యను పేర్లుగల శివలింగములు గలవు. వీనిని దర్శించినంతనే పాపములు శమించును.

నారాయణ సరస్సు:— తారకేశ్వరునికి పశ్చిమమున 'నారాయణ సరస్సు' కలదు. ఇందు యాత్రికులు స్నానము చేసి పితృదేవతలకు తర్పణము చేయుదురు. ఇచ్చట 'బ్రహ్మర్షి కుండము' 'సప్తర్షి కుండము' 'లక్ష్మీకుండము' గలవు.

త్రికోణయాత్ర:– అష్టభుజాన్వితయగు కాళికను దర్శించు యాత్రకే త్రికోణయాత్రయని పేరు. పూర్వము కంసుడు దేవకి పుత్రుల నేడ్గురను సంహరించి ఎనిమిదవసంతానము స్త్రీగ జన్మించినదని దేవకి చెప్పిన యోగమాయను గూడ సంహరించుట కుద్యుక్తుడై యామెను పైకెత్తి పాషాణమున బడవేయ నుంకించెను. కాని యామె యష్టభుజాన్వితయై విచిత్రముగ పైకెగసి పోయి వింధ్యపర్వతమున నివసించెను. ఈ యోగమాయనే దుర్గ, కాళి యని పిలతురు. ధర్మరాజుకూడ వనవాససమయమున నిచట నివసించెనని 'మహాభారతములో – విరాటపర్వమున' గలదు.

ఇచ్చటకు యాత్రికులు సర్వదా వచ్చుచునే యుందురు. ఇచ్చటి జలవాయువులు స్వాస్థ్యప్రదములగుటచే యనేక రోగులు తమరోగములను నివారించుకొనుట కిచ్చటకువచ్చి నివసించు

చుందురు. వర్షాకాలమున వింధ్యపర్వతసౌందర్యము చూడదగినది. కవులచ్చటచ్చట "వింజమాకు దొడగినట్లు" అని వర్ణింతురు.

వింధ్యాచలమున 'కాశీరాజుతోట' చూడదగినది. ఇట సంస్కృత పాఠశాల, పోష్టాఫీసు, హాస్పటల్ కలవు. భోజన సామగ్రి యంతయు లభించును.

**మాహాత్మ్యము:—** వింధ్యపర్వతమున సిద్ధులు, గంధర్వులు, చారణులు, దేవతలు నివసించుచుందురని చెప్పుదురు. ఆశ్వయుజ శు ౧ మొదలు ౯ వరకు దేవి శుంభ నిశుంభులతో పోరి వారిని వధించెను.

# కాశీ

**అహం కాశీం గమిష్యామి తత్రైవ నివసామ్యహమ్,**
**ఇతి బ్రువాణ సతతం కాశీవాసఫలం లభేత్. — కాశీఖండము**

వింధ్యాచలమునుండి కాశీ చేరవలయును. కాశీలో 4 స్టేషనులు కలవు. రెండు మీటరుగేజి, రెండు బ్రాడ్ గేజి. ఈ 4 స్టేషనులలోను యాత్రికులు దిగుదురు. మొదటి 2 స్టేషనులు 'కాశీ' (రాజఘాట్), 'బెనారస్' (సింగరాల్). ఇవి పెద్దలైను. ఇక చిన్నలైనులోనివి 'అలంపూరు లేక బెనారస్ సిటి'. రెండవది 'మరువాడీహ్'. కాశీలో సుమారు 3,55,778 జనాభా గలదు.

వింధ్యాచలమునకు కాశీకి 49 మైళ్లు. రాజఘాట్ (కాశీ) వంతెనమీదకు ధూమశకటము రాగానే కాశీపట్టణము దృగ్గోచరమగును. ఇచటనుండియే కాశీ రామణీయకత యాత్రికులు

కనుగొందురు. అన్ని స్టేషనులలోను పండాలు 'మా బసకు రండి' యని యాత్రికులను ఆహ్వానింతురు. ఎక్కాలు, టాంగాలు దొరకును. కాశీస్టేషనుకు కొలదిదూరమున నొక ధర్మశాల కలదు. బెనారస్‌స్టేషనుకు సమీపమునగూడ నొక ధర్మశాల గలదు. దీనిపేరు శ్రీకృష్ణధర్మశాల. కాశీ, బెనారస్ స్టేషనులనుండియే బస్తీ ప్రారంభమగును. స్టేషనుకు - విశ్వనాథ మందిరమునకు 2 మైళ్ళు. మందిరమువద్ద 'రాధాకృష్ణ శివదత్తరాయ్' ధర్మశాల కలదు. దీనిని జ్ఞానవాపియని కూడ పిలతురు. మందిరమునకు సమీపమున నుండుటచే నిందు చాలమంది యాత్రికులు బస చేయుదురు. ఇంకను చాల ధర్మశాలలు కలవు. ముఖ్యములగు పర్వదినములందు యాత్రికు లధికముగ నున్నపుడు పండాలు వారిని తమ తమ యిండ్లకు గొంపోదురు.


* మణికర్ణికాఘట్టము

కాశీపురము వ్యాపారమునకు, కళలకు గూడ యునికిపట్టు. ఇచ్చటి పట్టుబట్టలు, ఇత్తడిగిన్నెలు భారతదేశమునం దంతటను ప్రసిద్ధిచెందెను. ఇచట వెండిపని చాల యందముగ జేయుదురు. ముఖమల్, పట్టువస్త్రములమీద చేయు జరీపనిగూడ మిగుల నందముగ నుండును. కాశీ రుద్రాక్షలకు పుట్టినిల్లు. ఇచట పలు విధములగు రుద్రాక్షలు లభించును. మాల 108 పూసలు. 0-4-0 లు మొదలు రు. 15/– ల వరకుండును. నీటిలో మునిగినచో రుద్రాక్షలు. మునుగనిచో భద్రాక్షలు. భద్రాక్షలు యోగ్యములు కావు.

కాశీనామ నిర్వచనము:— సర్వకాలముల ప్రకాశించు నది కాశీ — వరణ అసి నదుల మధ్య నున్నది వరణాసి — పాపములనుండి విముక్తిజేయునది అవిముక్తక్షేత్రము — శివున కానంద దాయక మగునది ఆనందవనము — మోక్షమిచ్చునది ముక్తిపురి — సర్వేంద్రియకృత పాపముల నశింపజేయునది వారణాసి — రాత్రిం బవళ్లు ప్రతిషేధము లేకుండ దహనసంస్కారము చేయతగిన స్థానముగాన మహాశ్మశాన మనియు కాశీకి పేర్లు గలవు.

కాశీలో స్నాన, జప, దాన, హోమ, తర్పణ, శ్రాద్ధ, పూజాదు లనంతఫల మొసంగును. ఇచట బ్రహ్మాది దేవత లెల్లప్పుడు నివసించియుందురు. దర్శనమాత్రముచేతనే పొందరాని మహాఫలము లభించును. బ్రహ్మఘాతుకుడైనను కాశీపుర ప్రవేశమువలన పునీతు డగును. ఈ క్షేత్రమున ప్రతిపదమున క్షేత్రములు, తిలప్రమాణ సదృశమగు ప్రతిస్థానమున లింగములు గలవు. నూరుయోజనముల దూరమునుండి గంగాస్మరణముచే పాపవిముక్తు డగును.

ఇచట పండాలు తాము గంగాపుత్రుల మనియు, తమలోని దోషముల నన్నిటిని గంగ హరించుననియు చెప్పుదురు. కాశీలో 360 సత్రము లుండెడివి. ప్రస్తుతము చాలవరకు నామమాత్రావశిష్టములైనవి. ఇట్లె 360 ఘట్టములు, 360 తీర్థములు, 360 సందులు, 360 ప్రధానలింగములు కలవు. ఇవియు చాలవరకు నామావశిష్టములుగానున్నవి. కాశీపట్టణమంతయు ప్రకృతి సౌందర్యముతో నొప్పారుచుండును. ముఖ్యముగ కేదార, మణికర్ణిక, దశాశ్వమేథ, అహల్యాబాయి ఘట్టముల సౌందర్యము లసు ముగ్ధులై కాశీవాసులే నిరంతరమిచట నివసించుచుందురు.

# గంగోత్పత్తి

"గంగా గంగేతి యోబ్రూయాత్ యోజనానాం శతైరపి,
ముచ్యతే సర్వపాపేభ్యః, విష్ణులోకం సగచ్ఛతి"

పరమపావనియగు గంగామహాత్మ్యము అష్టాదశపురాణము లభివర్ణించినవి. స్మరణమాత్రముచేతనే మానవుడు తరించును.

పూర్వము పార్వతీకల్యాణమునకు, బ్రహ్మ పౌరోహిత్యమును వహించెను. ఆ సమయమున ఇంద్రాది సర్వదేవతలు, వసిష్ఠాది ఋషీశ్వరులు, సరిత్సాగరములును, భూదేవియును కల్యాణముగాంచ నరుదెంచిరి. పురాణ దంపతులు సప్తపదీ ప్రదక్షిణము చేయుచుండిరి. ఆ సమయమున పార్వతిపాణిని, ఈశ్వరుడు గ్రహించెను. ఈ దృశ్యమునుగాంచి బ్రహ్మ సమ్మోహితుడయ్యెను. వెంటనే యాతనికి వీర్యస్ఖలన మయ్యెను. ఇది గాంచిన సురలు తన్నధిక్షేపింతురని, బ్రహ్మ యావీర్యమును కాలరాయ దొడంగెను.


* విశ్వవిద్యాలయము

దేవతలందరు నిది గాంచి బ్రహ్మను పాపి యనిరి. అవమానితుడై బ్రహ్మ యచట నుండి నిర్గమించెను. ఈశ్వరు డిది గాంచి బ్రహ్మను పిలచి, నీపాపమును నేను శమింప జేతునని, 'భూమియు, జలమును దక్కనితరములేవియు పాపుల పాపముల శమింప జేయజాలవు.' ఈ రెంటియొక్క సారము, నేను నీకిచ్చెదనని జెప్పి, భూమితో కమండలవు నిర్మించి, సరిత్సాగరముల నందు నిడి, బ్రహ్మకిచ్చి యిట్లు చెప్పెను. "ఇది సర్వతీర్థసారము, దీనిని

ర్శించినంతమాత్రమున సర్వపాపములు శమించును. స్పృశించి స్నానముచేసి, యాచమించిన నిక చెప్పునదేమి? నీవు పాపముక్తుడ వైతివి’’ అని పలికెను. బ్రహ్మయు పునీతుడై సత్యలోకమునకు వెడలెను.

అనంతరము కొంతకాలమునకు దైత్యేంద్రుడగు బలి సురరాజ్యము నపహరించగ, నింద్రాదేవతలు విష్ణువును ప్రార్థించిరి. విష్ణువు వామనరూపమున బలిని దర్శించి, మూడడుగుల నేలకోరి, విశ్వరూపధరుడై, యొకపాదమున భూమిని, వేరొకపాదమున నూర్ధ్వలోకములను నాక్రమించి, మూడవపాదమున బలిని రసాతలమున కంపెను.

ఊర్ధ్వలోక ప్రసారితమగు విష్ణుపాదము సత్యలోకము ప్రవేశించగ దానిని బ్రహ్మగాంచి, భక్తితత్పరుడై తన కమండలోదకము నర్ఘ్యముగ విష్ణుపాదమునం దర్పించెను. ఆ పాదమునుండి తూర్పుగ ప్రవహించిన జలమును, ఋషులును, దేవతలును గ్రహించిరి. దక్షిణముగ ప్రవహించిన జలము నీశ్వరుడు గ్రహించి జటలందు ధరించెను. పశ్చిమముగ ప్రవహించిన జలమును బ్రహ్మ గ్రహించెను. ఉత్తరముగ ప్రవహించిన జలమును స్వయముగ విష్ణువు గ్రహించెను.

శంకర జటాసంస్థితయగు గంగను భగీరథుడు, గౌతముడును భూమికి దెచ్చిరి. భగీరథుడు తెచ్చిన గంగ భాగీరథి (గంగానది) యనియు, గౌతముడు తెచ్చినగంగ గౌతమి (గోదావరి) యనియు పేరొందెను. —గౌతమీ మాహాత్మ్యము

"అనిచ్ఛయాపి సంస్పృష్టో దహనోహి యథా దహేత్,
అనిచ్ఛయాపి సంస్నాత్వా గంగాపాపం తథా దహేత్.
— స్కాందము

తెలియక స్పృశించినను, అగ్ని దహించును. అట్లే గంగ యందు అనిచ్ఛాస్నాతుడైనను పాపవిముక్తినొందును.

మణికర్ణికా:— అధికముగ మణికర్ణికా, దశాశ్వమేధ ఘట్టములలో స్నానము చేయుదురు. పూర్వము దక్షుడు యజ్ఞము చేయుచు దేవతలందరి యెదుటను శివుని నిందించెను. భర్తయొక్క నిందను వినజాలని సతిదేవి, ప్రాణములను యోగ మార్గమున త్యజించెను. అంత శివుడు వ్యాకులతనొంది, యా దేవి శరీరమును భుజమున నిడుకొని, యున్మత్తునివలె చరించ సాగెను. అంత విష్ణువు తన సుదర్శనముచే 'సతీదేవి శరీరమును' ఖండించెను. ఆమె యవయవ ఖండములు పడిన ప్రదేశము లన్నియు సిద్ధపీఠములయ్యెను. మణికర్ణికాఘట్టమున నామె కుండలము పడెనందురు. ఈఘట్టమున యాత్రికులు తీర్థవిధిచేయుదురు.

దశాశ్వమేధఘట్టము:— ఇచట బ్రహ్మ పది యశ్వమేధములు చేసెను. అందుచే దీనికీ పేరు వచ్చెను.


* దశాశ్వమేధఘట్టము

హరిశ్చంద్రఘాట్:— ఈ ఘట్టమును దర్శించగనే సత్యనిష్ఠుడై, యిడుముల గుడిచి, కాటికాపరియైన హరిశ్చంద్రుడు గుర్తుకు వచ్చును. కాశీమృతుల కిచటనె దహనసంస్కారము. మృతకళేబరము లెల్లపుడు 4, 5 నిలవయుండును. ఇక్కడ

రాతియందు వెండిరూపాయలు అతుకబడియుండెను. ఒక బంగాళీ భక్తు డీరూపాయల స్థాపించెను. మందిరమున కుపరిభాగమున నొక స్వర్ణశిఖరము కలదు. ఈ యాలయమును పంజాబ్ కేసరి మహారాజు రణజీత్ సింహుడు క్రీ. శ. 1339 సం॥లో కట్టించెను. విశ్వనాథుని మందిరమునకు నలువైపుల నాలుగు ద్వారములు గలవు. ఈ ద్వారములు యిత్తడిరేకుతో అతుకబడి యుండెను.


* విశ్వనాథాలయము

విశ్వనాథునికి వెండిబిందెలతో అభిషేకము చేయుదురు. ఆలయమున సర్వదా గోఘృత దీపము ప్రకాశించుచుండును. ఉదయము 6 గం. మొ॥ 11 గం. వరకు, సాయంత్రము 3 గం. మొ॥ 6 గం. వరకును ఇచట జన సమ్మర్ద మధికముగనుండును. అన్నిజాతుల వారు విశ్వనాథుని స్పృశించి స్వయముగా నభిషేకము చేయుదురు. పగలు 10 గంటలకును రాత్రి 11 గంటలకును నాగకోట తరపున విశ్వనాథునకు అభిషేకము, పూజ, హారతియు జరుగును. ఈసమయమున నితరులకు ప్రవేశ ముండదు. ఈ నాగకోటవారు విశ్వనాథునకు ప్రతి రోజు రు. 200/- లు యిత్తురు.

అభిషేకము, పూజయు యథాశాస్త్రీయముగ చేయించుట కీట బ్రాహ్మణులు కలరు. వారందరు రజతకలశములతో గంగా జలమును, గోక్షీరమును దెచ్చి, విశ్వనాథున కభిషేకింతురు. రాత్రి 11 గం.ల కిచ్చు హారతి చూచితీరవలయును. ఇది చూడదగిన దృశ్యము. విశ్వనాథునకు చేయించు పూజ, భోగము 0-4-0 లు మొ, రు 1.6/ల వరకు గలదు. ఆలయము ప్రక్కన

గల ఆఫీసులో డబ్బుచెల్లించిన రశీదిత్తురు. ఈరశీదు ఆలయమున
చూపిన ఆప్రకారము అర్చనాదులు చేయుదురు.

విశ్వనాథాలయ ప్రదక్షిణమందింకను కొన్ని దేవతా
విగ్రహములు కానవగును. ఇచట నొక కుండమునందు "విశ్వ
నాథుని స్నానార్థ ముపయోగించిన జలము కలదు." యాత్రి
కులు దీని నాచమింతురు. ఇటుల ప్రదక్షిణముచేసి, మందిరము
యొక్క స్వర్ణపతాకమునుచూచి భగవంతునికి నమస్కరింతురు.

అన్నపూర్ణ:— యాత్రికులు విశ్వనాథుని దర్శించిన
తరువాత నన్నపూర్ణను దర్శింపవలెను. అన్నపూర్ణాలయము
విశ్వనాథుని మందిరమునకు సమీపముననే కలదు మందిరమున
కెదుట పూజాసామగ్రి విక్రయించబడుచుండును.

దేవాలయద్వారము ప్రవేశించగనే యాత్రికులకు దేవా
లయ ధ్వజము కనబడును. మందిరమున కంతట నెర్రరంగు వేయ
బడెను. ఇచట ఉదయము మొదలు మధ్యాహ్నము 12గం. వర
కును కొందరు భక్తులు వివిధ వాద్యములతో నన్నపూర్ణను
గురించి భజన చేయుదురు. యాత్రికులు అన్నపూర్ణా దేవిని
స్వయముగ పూజించదలచిన ప్రాతఃకాలముననే వీలుండును.
మందిరమునకు నలువైపుల నింకను దేవతామూర్తులు కలవు.
ప్రదక్షిణ సమయమున నొకచిన్న మందిరమం దొక సూర్యవిగ్ర
హము మనోహరమై కానవగును.

ఆలయప్రాకారమున పెద్దపెద్ద గోవులుండును. పచ్చగడ్డి
విక్రయించుచుందురు. యాత్రికులు రెండుకానులిచ్చి కొని గోవు

లకు వేయుదురు. మందిరమున యాత్రికుల నిమిత్తము చండీమం
త్రము, దుర్గాసప్తశతి పండితులు పారాయణ చేయుచుందురు.

ప్రతి శుక్రవారము అన్నపూర్ణాలయమున చేయు అలం
కారము చూడతగినది. శంకరుడు భిక్షాపాత్ర చేబూని నిలుచుని
ఉన్నట్లు, అన్నపూర్ణ సువర్ణపాత్ర చేతధరించి, బంగారు గరి
టెతో భిక్షుమిడుచున్నట్లు నలంకరింతురు. ప్రతి శుక్రవారము
అన్నపూర్ణకు సువర్ణకవచము అలంకరింతురు.

కాశీనివాసి, ధనవంతుడు నగు శ్రీపురుషోత్తమదాస్‌ఖత్రీ,
సుమారొక లక్షరూపాయిలు వ్యయించి అన్నపూర్ణమందిరము
నకు నికటముననే యొకమందిరమును గట్టించెను. ఇందు గంగావ
తరణము, రామపంచాయతనము, శివపంచాయతనము, కాలీ,
రాధాకృష్ణ, నృసింహమూర్తులు పాలరాతితో తయారుచేయబడి
మనోహరములుగ నున్నవి. యాత్రికు లీరీతి అన్నపూర్ణాదేవి దర్శ
నముచేసి, పిమ్మట ఢుండిగణపతిని సందర్శించుటకు పోవలయును.

ఢుండిగణపతి - దండపాణి:— అన్నపూర్ణా మందిరము
నకు సమీపముననే ఢుండిగణపతి మూర్తి కలదు. ఈ మూర్తి
యంతయు వెండికవచముతో కప్పబడి యుండెను. ఢుండిగణపతి
కుత్తరముగ నున్న గదియందు "దండపాణి" విగ్రహము కలదు.
ఆవిగ్రహమున కిరుకెలంకుల "శుభ్ర, విభ్ర" అను పేరుగల
గణుల విగ్రహములు గలవు.

జ్ఞానవాపి:— ఇది యొక పెద్దబావి. ఈ కూపోదకమును
త్రావిన, జ్ఞానోదయము కలుగును. ఇది విశ్వనాథుని మందిరము
నకు వెనుకభాగమున కలదు.

మసీదు:— జ్ఞానవాపికి సమీపమునకే యొక పెద్దమసీదు కలదు. దీనిని ఔరంగజేబు, ప్రాచీన విశ్వనాథాలయమును ధ్వంస మొనర్చి, నిర్మించెను ఇప్పటి మసీదు వెనుకగోడ విశ్వనాథాలయ మునకు సంబంధించినదే యై యుండెను. ఆసమయమున విశ్వ నాథుడీ కూపజలమున నురికెనట. అందుచే నీజల మిత పవిత్ర మైనదని చెప్పుదురు.



విశ్వేశ్వరుడు (ఫొటో: బ్రైట్ అండ్ కో.)

ఆదివిశ్వేశ్వరుడు:— జ్ఞానవాపికి సమీపము నందున్న ఔరంగజేబు మసీదునకు పశ్చిమమున "కారమా ఇకేల్" లైబ్రరీ గలదు. దీనికి పశ్చిమోత్తరము గ నాదివిశ్వేశ్వరుని మందిరము గలదు. మందిర మంతయు పాలరాతితో గచ్చు చేయబడి యుండెను. ఆలయదృశ్యము మిక్కిలి మనోహరముగ నుండును. ఇత్తడిరేకులు తాపిన యొక కుండమం దీయాదివిశ్వేశ్వరుని చిన్న లింగము కలదు.

గోపాలమందిరము:— ఇది చౌఖంబామొహల్లాలో నున్న వల్లభసంప్రదాయమువారి మందిరము. ఇది చాల యందమైనది. పెద్దది. ఇచట శ్రావణమాసమందు స్వామికి జరుగు 'ఝూల

నోత్సవ' (ఊయలయందుంచి స్వామిని ఊపుట) మతి రమ్యముగ నుండును. కాశీయందు వల్లభసంప్రదాయమువారి మందిరము లింకను గలవు. అందు 'రణఛోరజీ, బడేమహారాజ్ జీ, దావూజీ, బలదేవజీ' మందిరములు ప్రసిద్ధములైనవి.

కాలభైరవుడు:— ఈ కాలభైరవుడు శివుని యాజ్ఞచే కాశీని రక్షించుచుండును. ఈ మందిరము 'భైరవనాథ్ ముహల్లా' లో గలదు. మందిరమునకు మూడువైపుల మూడుద్వారములు గలవు. పాలరాతితోను, నల్లరాతితోను మందిరము గచ్చుచేయబడి యుండెను. ద్వారమున కెడమవైపున రాతితో చేయబడిన పెద్దకుక్కయు, దానిని రెండువైపుల చేతులతో పట్టుకొనిన గణవిగ్రహమును, దీనికి వెనుకభాగమున కాలభైరవమూర్తియు కలవు. క్రీ.శ. 1885 స॥ లో బాజీరావ్ జీపీష్వా యీ మందిరమును గట్టించెను. కాశీతోరములు ఆలయమునకు బయట విక్రయింతురు. వీనిని యాత్రికులు కొని పూజారులకిచ్చిన భైరవుని సన్నిధానమునసుంచి, నెమిలిపింఛముతో మంత్రించి యాత్రికుల చేతి కొక తోరమును కట్టి నెమలిపింఛముతో యాత్రికుల వీపున యాత్ర పూర్తియైనదని తట్టుదురు. కృష్ణాష్టమికి ఇచ్చటకు చాలమంది యాత్రికు లరుదెంతురు.

నైపాలీ మందిరము:— ఈ శివమందిరము లలితాఘట్టమున కుపరిభాగమున గలదు. ఇది చీనా మందిరములవలె నుండును. ఈవిధమగు దేవాలయము కాశీలో మరియొకటిలేదు. దీనికి ప్రక్కనే యొక పెద్ద నంది కలదు. నేపాలీలు బసచేయుట కొక ధర్మశాలకూడ నిచట కలదు.

మానమందిరము:— గంగ యొడ్డునగల పురాతనభవనము లన్నిటియందిది పురాతనమైనది. మిక్కిలి పెద్దది. మహారాజామానసింహుడు దీనిని కట్టించెను. దీని పై అంతస్థున రాజా జయసింహుడు కట్టించిన నక్షత్ర వేధశాల కలదు. ఇందు కొన్ని యంత్రముల సాయమున గ్రహగతులు పరీక్షించబడును.

రామమందిరము:— దీనిని గ్వాలియరు దీవాన్ దినకరరావు కట్టించెను. ఇందు బహు మూల్య వస్త్రాభరణ సుసజ్జితములగు సీతారామలక్ష్మణుల విగ్రహములు గలవు.

గోరఖ్‌నాథ మందిరము:— మందాకినీ మొహల్లాలో 'గోరఖ్‌టీలా' యను పేరుగల మిట్టయందీ దేవాలయము కలదు. ఇందు గోరఖ్‌నాథాబాబా చరణచిహ్నములు గలవు. ఇచట గోరఖ్ పంథీ సాధువు లుందురు.

దుర్గామందిరము:— ఇది అస్సీఘాటుకు ½ మైలు దూరమున గలదు. కాశీలోని ప్రసిద్ధక్షేత్రములందిది యొకటి. ఇచట మండపమందొక పెద్ద గంట కలదు. చుట్టుప్రక్కల చాల దేవతా విగ్రహములు కలవు కాశీలో నవదుర్గలు గలవు.

సంకటమోచనుడు:— అస్సీఘాటుమీద గోస్వామి తులసీదాసు యీ ఆంజనేయ విగ్రహమును ప్రతిష్ఠించెను. ఈ ప్రతిష్ఠా సమయమునకు రాజపురోహితు డొక పెద్ద సంకటమున చిక్కుకొని స్వామియనుగ్రహమున విముక్తినొందెను. అందుచేతనేగాక యీ యాంజనేయునే స్తుతించుచు తులసీదాసు 'సంకటమోచన స్తోత్రమును' వ్రాసియుండుటచేతను గూడ నీ స్వామికి 'సంకట మోచను' డని పేరు వచ్చెను.

పిశాచమోచన కుండము:— సంకటమోచనము నుండి కొలదిదూరము నడచిన యీ పిశాచమోచనకుండము కలదు. ఇచట నియమపూర్వకముగ కొన్నిదినము లుండి తీర్థవిధి మొదలగునవి జరిపిన భూత ప్రేత పిశాచబాధలు తొలగును. ఇచట మార్గశిర శు ౧౪ న గొప్ప ఉత్సవము జరుగును.

పంచతీర్థములు:— అసీసంగమము, వరణాసంగమము, పంచగంగా, మణికర్ణికా, దశాశ్వమేధము - వీనిని పంచగంగా తీర్థము లందురు. ఇచట యథావిధిగా తీర్థవిధిచేసిన మనుజుడు సర్వపాప విముక్తుడగును.

కాశీలోని కుండములు:—

లోలార్క కుండము:— ఇది 'భదైనీ సముహల్లాలో' తులసీ ఘాటుకు సమీపముగల యొక బావి. ఈ బావి చుట్టుకొలత 15 అడుగులు. దీనికి సమీపమున దీనికంటె పెద్దదగు చతుష్కోణముగ జలరహితమగు నొక కుండము గలదు. ఈ కుండమునకు ఒడ్డున లోలాదిత్యుని, లోలార్క మహాదేవుని మందిరములు గలవు. ఇచట భాద్రపదమాసమున ఉత్సవము జరుగును.

పుష్కరకుండము:— ఈ సరస్సు మిగుల పెద్దది. ఇది అసీనదీ తీరమున గలదు.

దుర్గాకుండము:— ఇది దుర్గామందిర సమీపమున గలదు. దీనికి మంచి రేవులు గలవు.

కురుక్షేత్రకుండము:— ఇది దుర్గాకుండమునకు సమీపముననే గలదు. కాని జలముండదు.

నాగకూపము:— దీనిని 'కర్కోటక' తీర్థమనియు పిల తురు. పట్టణమునకు పశ్చిమోత్తరముగ 'నాగేశ్వరీదేవీ మందిర ము'న కించుకదూరమున నిది కలదు. దీని లోపలకు దిగుటకు షుమారు 150 మెట్లు కలవు. ఇది లోపల గుండ్రనిబావి. బయ టకు చతురస్రముగ నుండు సరస్సువలె నుండును. దీనికి పైన రెండు రాతిసర్పములు గలవు. ఇందు స్నానముచేసిన సర్పవిషము విరుగునని చెప్పుదురు.

కపాలమోచన కుండము:— ఇది 'సింగరాల్' స్టేషను నుండి రాజఘాటుకుపోవు రోడ్డుమీాద నున్నది. ఇది పెద్దసరస్సు. దీనికి నలువైపుల రాతిమెట్లు కలవు. ఇందు ముఖ్యముగ భాద్ర పద పూర్ణిమకు స్నానము చేయుదురు.



పంచగంగాఘాటు ఫొటో: బెనారస్ ఫొటో ప్రకాస్.

అమృతకుండము:— ఇందలి జలముతో నియమపూర్వ కముగ కొంతకాలము స్నానముచేసిన కుష్ఠురోగము పోవునని చెప్పుదురు.

చూడతగినవి:—

భరతమాతమందిరము:- భరతమాత కంకితము చేయబడిన యీ మందిరము 1932 సం॥ గాంధీమహాత్మునిచే తెరువబడినది. దీనిలోపలగల తెల్లని చలువరాతిపై చెక్కబడిన హిందూదేశపు భౌతికపటమును జనులు అధికమైన భక్తిభావముతో జూతురు. ఇదియొక కళాసౌందర్య గుళిక. ఇందు చూపబడిన పర్వతముల యెత్తు, పొడవు, వెడల్పులలో కచ్చితమైన అనురూపసంబంధము కలిగి దేశమందలి దారులు, మైదానములు వీసముకూడ హెచ్చు తగ్గులు లేకుండగ చూపును. దీనికి అనుబంధముగ చక్కని గ్రంథాలయ మొకటి కలదు. ఇందుత్తమమైన గ్రంథములు, చిత్రములు కలవు.

హిందూ విశ్వవిద్యాలయము:— కాశీక్షేత్రమునకు వచ్చిన ప్రతి యాత్రికుడు నీ విద్యాలయమును చూడ నేతెంచును. ఈ విద్యాలయమును గాంచిన, ప్రాచీనభారత మందలి తక్షశిలా, నలందా విశ్వవిద్యాలయములు జ్ఞప్తికి వచ్చును. డా. అనిబిసెంటుచే సెంట్రల్ హిందూకళాశాల పేరిట స్థాపింపబడినవి. 4 చ. మైళ్లు ఆవరించి చిన్నపట్టణమై యొప్పు యీ విశ్వవిద్యాలయము దానికదే సాటి. ఈ విద్యాలయము చూడనిదే కాశీయాత్ర ముగియదు. దీని ఆవరణయందే అన్ని శాఖలకు జెందిన కళాశాలలు, రసాయనశాలలు, భోజన వసతిశాలలు, ఆటస్థలములు గలవు. దీనిని నిర్మించుట తమ జీవితకర్తవ్యముగ నెంచిన మాలవ్యా, మహారాజ దర్భాంగ మిగుల స్తోత్రపాత్రులు. త్యాగశీలురగు మహాజను లీ విద్యాలయమునకు విరాళములిచ్చిన వారి కోరిక ననుసరించియే ఆ ధనము వినియోగింపబడును. ఈ విధముగ

నీ విశ్వవిద్యాలయమునకు భారతదేశమందలి భిన్నభిన్న ప్రాంతములనుండి, ప్రతిసంవత్సరము లక్షలకొలది రూపాయలు విరాళరూపమున నొసగబడుచున్నవి. ఈ విద్యాలయమున ఇంగ్లీషు, హిందీ, ఉర్దు, సంస్కృతము, పారసీభాషలు, సైన్సు, హిష్టరీ, గణితము, ఇంజనీరింగు, డాక్టరు, వైద్యము, కృషి మొదలగు విషయములనుగూర్చి యున్నతశిక్ష యొసంగబడును.

ఇచట పైవిషయములన్నియు చక్కగ బోధించుటకు ప్రకాండులగు పండితులు గలరు. దీని ప్రయోగశాల, రసాయనశాల, గ్రంథాలయము మొదలగునవి భారతదేశమునం దంతటను ప్రసిద్ధములైనవి. ఇందు మూడు నాలుగువేలమంది విద్యార్థులు వివిధప్రాంతములవారు విద్యాభ్యాసము చేయుచుండిరి. కొంత వేతనముకట్టిన విద్యార్థుల కన్నిసౌకర్యములు విద్యాలయాధికారులు (పాలకవర్గము) కలుగజేయుదురు. మేము వెళ్లినప్పటికి విద్యార్థులు విద్యుత్ యంత్రముల సాధనమున పలువిధములగు పింగాణీపాత్రలు తయారుచేయుచుండిరి.

క్వీన్సుకాలేజి:— ఇది భారతదేశమందలి ప్రాచీనముగు విద్యాలయములం దొకటి. దీనిని ప్రభుత్వము నడుపుచుండును. కాశీలోని సంస్కృతకాలేజి కూడ దీని యధీనముననే గలదు. ఈ కాలేజి గ్రంథాలయమున ఉత్తమ ప్రాచీనములగు ఇంగ్లీషు, సంస్కృత గ్రంథములు చాల గలవు. ఇది క్రీ. శ. 1852 లో కట్టబడెను.

కాశీ విద్యాపీఠము:— 1921 సం.లో నీ రాష్ట్రీయసంస్థ స్థాపింపబడెను. దీనిని నడుపుటకు బాబుశివప్రసాదగుప్త 10 లక్షల

రూప్యముల నిచ్చెను. ఇందు విద్యాలయవిభాగము, పాఠశాలా విభాగము, శిల్పశాలావిభాగము నని మూడు భాగములు గలవు. విద్యాలయవిభాగమున ముఖ్యముగ 'దర్శనము, అర్థశాస్త్రము, హిష్టరీ, రాజనీతి, సంస్కృతము, హింది' మొదలగు విషయములు బోధింపబడును. ఇందు ఇంగ్లీషు అనివార్యముగ నేర్చుకొనవలయును చదువు పూర్తియైన పిమ్మట "శాస్త్రి" యను బిరుదము నిత్తురు. ఇక పాఠశాల విభాగమున 6 మొ॥ 10 క్లాసుల వరకు చదువు చెప్పబడును. ఈ పాఠ్యక్రమము పూర్తికాగానే "శాస్త్రి" అను బిరుదము నిత్తురు. ఇందు సైన్సు అనివార్యముగ నేర్పబడును. శిల్పవిభాగమున వివిధములగు చేతిపనులు నేర్పబడును. ఈ విద్యాపీఠమున విద్యార్థులు ఫీజు చెల్లించ నవసరములేదు.



* కాశీఘాట్

నాగరీ ప్రచారణీసభ:— ఇది సంస్కృతమునకు, ఆధ్యాత్మికవిద్యకు, హిందీకికూడా ప్రధానకేంద్రమై యున్నది. ఇచట 'నాగరీ ప్రచారణీసభ' అను నొక ప్రాచీన హిందీప్రచార సంస్థ కలదు. అందుగల హిందీ పండితులు మరెచ్చట నుండరనుట యతిశయోక్తి కాదు.

ఇవికాక కాశీలో చాల సంస్కృత పాఠశాలలు కలవు. కాశీ సంస్కృతవిద్యకు కేంద్రస్థానము. ఇచ్చటి పాఠశాలలందు షుమారు 20 వేల విద్యార్థులు విద్య నభ్యసించుచుండిరి. చాల వరకు గీర్వాణము నభ్యసించు విద్యార్థులు కలరు. ఇచట కొన్ని విద్యాలయములందు విద్యార్థులకు వేతనము, పుస్తకములు, బట్టలుకూడ నివ్వబడుచుండును. మరియు జోశీరామ్‌మత్రీవా సల్ మహావిద్యాలయము, మారవాడి మహావిద్యాలయము, రాజస్థాన్ మహావిద్యాలయము, బిర్లా మహావిద్యాలయము, రుఇయా మహావిద్యాలయములు ప్రసిద్ధములైనవి.

కాశీలో చాల నన్నసత్రములు, మహాంతులుండు గొప్ప స్థానములుకూడ కలవు అసీనదీ తీరమున 'ముముక్షుభవన' మను పేర నొక ప్రసిద్ధసంస్థ కలదు. ఇందన్నసత్రము, పాఠశాల కలవు. మరియు గృహస్థులు కొంతకాలమువరకు కాశీవాసము చేయుటకు తగిన బసలుకూడ గలవు.

శివకోటిబ్యాంకు, రామకోటిబ్యాంకు:— శివ, రామ నామములు 108 కోట్లు వ్రాయించి, చక్కని అద్దాలబీరువాలలో నుంచి నిత్యము పూజాసంకీర్తనలు చేయు సంస్థలు. ఇవి చూచి తీరవలయును.

అనాథాలయము:— అనాథ బాలబాలికల పోషణకై యిచ్చట క్రీ. శ. 1927 లో రిటైర్డు కాశీ కలక్టరు శ్రీ మెహతా గారి భార్య యొకసంస్థను నెలకొల్పెను. మెహతా చాల నుదార స్వభావము గలవాడు. సత్పురుషుడు,

మాధవరామ్‌ధరహరా:—(బురుజు) మాధవరామఘట్టము వద్ద నొక మిట్టమీద ఔరంగజేబు కట్టించిన మసీదు కలదు. ఆ మసీదునకుముందు మాధవరామ్ అనునతడు కట్టించిన మూడు బురుజులు గలవు. వీని యెత్తు 142 అ. లోపలినుండి పైకి వెళ్ళుటకు గుండ్రని మెట్లు కలవు. కాశీపట్టణమంతయు నీ బురుజుల మీదనుండి యతి రమణీయముగ కానగును.

## రామనగర్ (వ్యాసకాశి)

ఇది అసీసంగమమునకు 1 మైలు దూరమున దక్షిణమున గలదు. ఇచ్చటకు వెళ్లుటకు నగవాఘాటులో నావలు దొఱకును.



* వ్యాసకాశి

ఇది కాశీరాజు రాజధాని. క్రీ.శ. 1750 లో రాజా బలవంతసింగ్ దీనిని నిర్మించ నారంభించెను. అనంతరము రాజా చేతసింహుడు దీనిని పూర్తి చేసెను. రాజమహాలుకు 1 మై. దూరమున, రాజా చేతసింహుడు త్రవ్వించిన చెఱువు కలదు. ఇచ్చట నొక మందిరము కూడ కలదు. ఇది హిందువుల శిల్పకళకొక ప్రమాణముగ రాజిలుచున్నది. ఇచట నాశ్వీయుజమాసమున రామలీల మహోత్సవము మహోత్సాహముగ జరుగును.

వ్యాసాశ్రమము:— రామనగరులో 'వ్యాసాశ్రమము' కూడ కలదు. ఇందు వ్యాసుని తైలచిత్రమొకటి కలదు. ఇచట ఫాల్గుణమాసమున నుత్సవము జరుగును. ఈ సమయమున కాశీరాజు భవనమును చూచుటకు యాత్రికుల కనుమతి యొసంగబడును. వ్యాసకాశీ దర్శనము చేయకయే మరలు యాత్రికులకు

కాశీయాత్ర వ్యర్థమని వ్యాసమహర్షి ఆదేశము. కనుక తప్పక దర్శించితీరవలయును.

పంచక్రోసీ పరిక్రమా:— కాశీక్షేత్ర వైశాల్యము 5 క్రోశములు. దీనికి ప్రదక్షిణము చేయుటయందింకను తీర్థస్థానములు కానగును. ఈ ప్రదక్షిణము కార్తీకమాసమున నారంభింతురు. 'ప్రలయానంతరమున శివుడు ఈ పంచక్రోశస్థానమును తాను తన శక్తితో నివసించుటకై సృజించెను.' ఇచట మృతి చెందిన పశు, పక్షి, కీటకాదులకును మోక్షము తప్పక లభించునని శాస్త్రములు చెప్పుచున్నవి.

మాహాత్మ్యము:— కాశీ 'సప్తపురము'లలో నొకటి. 'కాశ్యాం మరణాన్ముక్తిః' అని సర్వశాస్త్రములు చెప్పుచున్నవి. అందుచే నిచట ననేకులు సాధువులు, సజ్జనులు, మహాత్ములు నివసించుచుందురు. కాశీ పండితులకు పుట్టినిల్లు. బుద్ధుడు, శ్రీ శంకరాచార్యుడు, శ్రీరామానుజాచార్యుడు, శ్రీవల్లభాచార్యుడు, శ్రీచైతన్యమహాప్రభువు, రామానందాచార్యుడు, శ్రీతులసీదాసు, రైదాసు, కబీరు మొదలగు మహానుభావు లిచటనే నివసించిరి. ఆధునికులగు నారాయణభట్టు, శంకరభట్టు, నీలకంఠుడు, భట్టోజీదీక్షితులు, నాగోజీభట్టు మొదలగు ప్రకాండ పండితులకును వాసభూమియై యున్నది.

కాశీ అవిముక్తక్షేత్రమనియు, పర్వములందుత్తరవాహిని యగు గంగానదియందు స్నానమొనర్చుటకు — ప్రయాగ, పుష్కరము, కురుక్షేత్రము మొదలగు తీర్థములు; గోదావరి, నర్మదా,

కావేరీ మొదలగు నదులుకూడ వచ్చునని శాస్త్రములు చెప్పు చున్నవి.

కాశీసంకల్పము:— ........ ఆర్యావర్తైకదేశే, అవిముక్త వారణాసీక్షేత్రే, అసీవరణ యోర్మధ్యే, మహాస్మశానే, ఆనందవనే, గౌరీముఖే, త్రికంటకవిరాజితే, భాగీరథ్యాః పశ్చిమే తీరే, ఉత్తరవాహిన్యాం, బ్రహ్మనాళయోర్మధ్యే, మణికర్ణికా క్షేత్రే, విశ్వేశ్వరాది త్రయస్త్రింశత్కోటి దేవతా చరణ సన్నిధౌ, బౌద్ధావతారే, కలియుగే విక్రమశకే...సంవత్సరే....

హరిద్వారసంకల్పము:— (చూ. హరిద్వారము 324 పేజి) "......మాయాపురీ మండలే, దక్షప్రజాపతిక్షేత్రే, హిమాలయదేశే, బదరికారామే, వాలఖిల్యాశ్రమే, కేదారఖండే, నీలధారే, బిల్వపర్వతే, హరిద్వారే, బ్రహ్మకుండతీర్థే, కుశావర్త ఘట్టే, గంగాతీరే, బౌద్ధావతారే, కలియుగే, విక్రమశకే, బార్హస్పత్యమానే......సంవత్సరే......"

యాత్రావిధానము:— జరామరణములు దుఃఖప్రదములు. జీవుడు నవమాసములు మాతృగర్భమున నుండును. మాతృగర్భ నరకవిముక్తుడగుటకు గాను, తొమ్మిదిమాసములు కాశీనివాసము చేయవలయునని శాస్త్రములు చెప్పుచున్నవి. అందుకు సాధ్యముకానిచో తొమ్మిదిరోజులు లేక ఐదురోజులు, కడవరకు మూడురోజులు తక్కువకాకుండ నివసించవలయును. తొమ్మిది రోజుల యాత్ర అయినా చేయుట యుత్తమము. తొమ్మిదిరోజుల యాత్ర వివరము.

మొదటిరోజు:— కాశీక్షేత్రము చేరినతోడనే మణికర్ణికా తీర్థమున మహాసంకల్పముతో స్నానము, సర్వప్రాయశ్చిత్తము, వపనము (పిండప్రదానము చేయనివారల కవసరము లేదని ప్రమాణము కలదు), కట్టువస్త్రములతోనే గంగాస్నానము, పిమ్మట శుద్ధవస్త్రముల ధరించి, శ్రీవిశ్వేశ్వర, అన్నపూర్ణ, ఢుండిగణపతి, జ్ఞానవాపి, సాక్షిగణపతి, శ్రీ కాశీవిశాలాక్షీ దర్శనములు చేసి, నాడు క్షేత్రోపవాసము చేయవలయును.

రెండవరోజు:— తీర్థశ్రాద్ధము పెట్టవలెను. ఈ శ్రాద్ధము సర్వతీర్థములకధివాసమైన మణికర్ణికా (చక్రపుష్కరిణి) క్షేత్రమునందే చేయవలయును. ఇందులకు శాస్త్రప్రమాణములనేకములుగలవు. ఇతరత్ర చేయరాదు. తొల్లి విష్ణువీమణికర్ణికాతీర్థమును తన చక్రముచే త్రవ్వి, దానిని తన స్వేదోదకముచే నింపెను. కాన దీనికి తొలుత చక్రతీర్థమని పేరు గలిగెను. మరియు "కాశ్యాం బ్రహ్మనాళే, మణికర్ణికాప్రయుక్త తీర్థ శ్రాద్ధే" అని సంకల్పముకూడ కలదు గాన సర్వవిధముల యిచటనే శ్రాద్ధము చేయవలయును. ఈ శ్రాద్ధము మూడు విధములు. అన్నశ్రాద్ధము, ఆమశ్రాద్ధము హిరణ్యశ్రాద్ధము.


గోల్డెన్ టెంపుల్

మూడవరోజు:— పంచతీర్థయాత్ర. 1. అస్సీఘట్టము:- ఇచట అసీనది గంగలో కలియుచున్నది. ఇచట స్నానము, సంగమేశ్వరదర్శనము 2. దశాశ్వమేధఘట్టము:- (దీనినే రుద్రసరోవర తీర్థమందురు) ఇట స్నానము. దశాశ్వమేధనాథుని, సీతలాదేవిని దర్శించుట. 3. వరణాఘట్టము:- ఇది వరణానది గంగలో కలియు చోటు. ఇట స్నానము. వరణాసంగమేశ్వరుని, ఆదికేశవుని దర్శనము. 4. బిందుమాధవ ఘట్టము:- దీనికి పంచనదతీర్థమని పేరు. (పంచగంగలు) ఇట స్నానము. బిందుమాధవ, పంచగంగేశ్వరుల దర్శనము. 5. మణికర్ణికాఘట్టము:- ఇట మణికర్ణిక, చక్రపుష్కరిణులలో స్నానము పిమ్మట గంగాస్నానము, మణికేశ్వర సిద్ధివినాయకుల దర్శనము. (పై స్థానములలో సంకల్పపూర్వకముగ స్నానము చేయవలయును) పిమ్మట అన్నపూర్ణ, విశ్వేశ్వరుల దర్శనము చేయవలయును.

నాల్గవ దినము:— నిత్యయాత్ర. దీనినే ఉత్తరయాత్ర యందురు.

"విశ్వేశం మాధవం ఢుండిం దండపాణిం చ భైరవమ్,
వందే కాశీం గుహాం గంగాం భవానీం మణికర్ణికామ్.

ఈ పది దేవస్థానముల దర్శించి, మణికర్ణికా స్నానము, అన్నపూర్ణా విశ్వేశ్వరుల దర్శనము చేయవలయును.

ఐదవరోజు:— దక్షిణయాత్ర. అనగా — కేదారేశ్వర, హనుమదీశ్వర, తిలభాండేశ్వర, చింతామణిగణపతి, దుర్గాదేవి, కౌడీబాయి (గవ్వలమ్మ) యీ ఆరు దేవస్థానములు చూడవలయును. కౌడీబాయి:- ఈమె విశ్వేశ్వరుని భర్తృరాలు. ఈమెను

దర్శించనిది కాశీయాత్ర సఫలముకాదని విశ్వేశ్వరుడు వరమిచ్చి నందున యాత్రికులు తప్పక యీమెదర్శనముచేసి గవ్వలు కానుకలుగా సమర్పింతురు.

ఆరవదినము:— గంగా భాగీరథీ నిమిత్తము మూసి వాయనము, (ఈ దానముచే స్త్రీలకెన్ని జన్మలెత్తినను వైధవ్యము రానేరదు.) మధ్యాహ్నము వ్యాసకాశీ వెళ్ళి అచట వేదవ్యాసులు, రామలింగేశ్వరుని, శ్రీ శుకుని, వ్యాసప్రతిష్ఠయగు విశ్వేశ్వరుని దర్శనముచేసి రావలయును.

ఏడవదినము:— శ్రీ విశ్వేశ్వరునకు రుద్రాభిషేకము, సహస్రనామార్చన, అన్నపూర్ణా విశాలాక్షులకు (ఇది అష్టాదశ పీఠములలో నొకటి) కుంకుమార్చనయు, దుండిగణపతి పూజయు చేయవలయును. కుంకుమార్చన స్వయముగా కూడ చేయవచ్చును.

ఎనిమిదవ దినము:— కాలభైరవ ప్రీతిగా కాలాష్టకము; యతి, బ్రాహ్మణ, సువాసినీలకు శక్తికొలది సమారాధన చేయవలయును.

తొమ్మిదవ దినము:— గంగాస్నానము, అన్నపూర్ణా విశ్వేశ్వరుల దర్శనము, అన్నపూర్ణాలయమునకు 108 ప్రదక్షిణములు చేయనగును. ఈ ప్రదక్షిణము భూ ప్రదక్షిణ ఫలితమిచ్చును. దంపతీపూజకూడ చేయవలయును.

పదియవ రోజు:— గంగాస్నానము. భాగీరథీ నిమిత్తము గంగపూజ, అన్నపూర్ణా విశ్వేశ్వరుల దర్శనము — ఈ రీతిగా యాత్రచేయుట ఉత్తమము.

అస్థినిక్షేపము:— 'కాశ్యాం మరణాన్ముక్తిః' అను సూక్తిచే అస్థికలు కాశీలో మణికర్ణికా బ్రహ్మనాళసహిత ఉత్తర వాహినిలో నిక్షిప్తము చేసినందున కాశీమరణము వలన కలుగు ముక్తి లభించునని శాస్త్ర ప్రమాణము.

పంచకోశ (క్రోశ) యాత్రా విషయమున కాశీపురము ఐదుక్రోశుల పట్టణమనియు, దీనికి ప్రదక్షిణమె, పంచక్రోశ యాత్రయనియు నర్థము. ఈ యాత్రను స్థూలరూపమున పంచ కోశయాత్రగా గ్రహించిరి. అన్నమయ, ప్రాణమయ, మనో మయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశములు. మొదటిరోజు మణికర్ణికాస్నానము. కర్దమేశ్వరము(ఊరు) వెళ్ళి అచట కర్దమతీర్థ స్నానము, తీర్థవిధి, కర్దమేశ్వర దర్శనము. 2వ రోజు:- భీమచండి. స్నాన,తీర్థవిధులు. 3వ రోజు:- రామేశ్వరము. వరణానదీస్నానము, తీర్థవిధి, రామేశ్వర దర్శనము. 4వ రోజు:- కపిలధార. స్నాన, తీర్థవిధులు. 5వ రోజు:- మణికర్ణిక చేరి స్నాన, తీర్థవిధులు చేసి గృహము చేరవలయును. ఈ యాత్ర 26 క్రోసులు. 5 దినములు ప్రయాణము. ప్రతి నలమున ధర్మశాలలు దుకాణములుగలవు. పై 5 కోశములను 5 స్థానములుగ భావించి చివరది ఆనందమయకోశమగు మణికర్ణికా సమీపమున విశ్వే శ్వర దర్శనము చేయవలయును.



* ధమెక స్థూపము

(సారనాథ్ చూ 351 పే)

చతుర్దశలింగయాత్ర:— ఓంకారము, మత్స్యోదరము, త్రివిష్టపము, కృత్తివాసము, రత్నేశము, చంద్రేశము, కేదా

రము, ధర్మేశ్వరము, వీరేశము, కామేశ్వరము, విశ్వకర్మేశ్వరము, మణికర్ణిక, అవిముక్తేశ్వరము - ఈ పదునాలుగు లింగముల సందర్శనము చతుర్దశ లింగయాత్ర అందురు.

తిథియాత్ర:— కృష్ణపాడ్యమి మొదలు 15 రోజులు. కాశీవాసుల కీయాత్ర చాలముఖ్యము.

ఆదిత్యాది వారయాత్ర:— మాఘమాసమున తొలి ఆదివారము మొదలు ఏడురోజు లీయాత్ర చేయుదురు.

ఇంకను: సప్తపురీయాత్ర, చతుర్ధామయాత్ర, అంతర్గృహ యాత్ర, అనుక్రమయాత్ర, అర్ధభైరవయాత్ర, నవదుర్గాయాత్ర, దశమహావిద్యాయాత్ర, ఏకాదశరుద్రయాత్ర, ద్వాదశాదిత్య యాత్ర, ఛప్పన్న (56) వినాయకయాత్ర, చతుష్షష్టి (64) యోగినీయాత్ర మొదలగు అనేకయాత్రలు కలవు. కాశీలో 9 మాసములుండిన కాశీఖండము ప్రకారము యాత్రలన్నియు చేయవచ్చును.

ద్వాదశాదిత్యులు:— లోలార్క, ఉత్తరార్క, సాంబాదిత్య, ద్రుపదాదిత్య, మయూఖాదిత్య, ఖఖోలార్క, అరుణాదిత్య, వృద్ధాదిత్య, కేశ్వరాదిత్య, విమలాదిత్య, గంగాదిత్య, యమాదిత్య — ఈ పండ్రెండు సూర్యస్థానముల సందర్శనముచే భిన్నభిన్న ఫలములు కలుగును.

## సారనాథ్

ఇది కాశీకి 5 మైళ్ళు. చక్కని మార్గము. టాంగాలు, ఎక్కాలు మొదలైనవి దొరకును. ఇది ప్రపంచములో బౌద్ధ

మతమునకు మూలకేంద్రము. శాంతికి నిలయము. దీనిని హారిణ మందురు. ఇచటనే బుద్ధుడు 522 బి సి. ప్రాంతమున ఆషాఢ శు ౧౫, సాయంసమయమున ప్రజలకు తన మొట్టమొదటి మత విషయకమైన యుపన్యాసమిచ్చెను. నాటినుండియు నిది బౌద్ధులకు ప్రధాన యాత్రాస్థలమైనది. అశోకచక్రవర్తి తన గురువగు బుద్ధుని గౌరవార్థము ఒక స్థూపమును, ఒక స్తంభమును కట్టించెను. ఆ స్తంభమందలి సింహాముద్రయే మన భారత ప్రభుత్వము ప్రధాన చిహ్నముగా గ్రహించెను. బ్రాహ్మీలిపిలో అశోకుని శాసనము కలదు.


* బౌద్ధాలయము

ఈ స్థల వృత్తాంతమును గురించి అందలి పురాతన వస్తు ప్రదర్శనశాలయందు చూడనగును. క్రీ. శ. 1794 లో రాజా చైత్‌సింగ్ దివానగు జగత్‌సింగ్ అశోకనిర్మిత స్థూపమును పడగొట్టించెను. అందు పాలరాతిపాత్రలు బయటబడినవి. ఆ పాత్రలలో మానవుని శల్యములు, ముత్యములు, బంగారు ఆకులు కలవు. అదిమొదలీ ప్రదేశము త్రవ్వ మొదలిడిరి. క్రమముగ సారనాథ్ బయటపడినది. ఈవిషయమున తుదిసారి ప్రయత్నము చేసినది - ఇండియా గవర్నమెంటులో అప్పటిలో పనిచేయుచున్న జార్జిమార్షల్.

1500 సం॥లకు పూర్వము కట్టబడిన ధమెకస్థూపము, ధర్మరాజస్థూపము, అనేక చైత్యవిహారములు చూడతగినవి. ఇక్కడి ప్రధానదేవాలయము దర్శించుటకు చీనా మొదలైన

అన్యదేశములనుండియు యాత్రీకు లరుదెంతురు. ఇచట గ్రంథాలయము, ధర్మశాల, బుద్ధమందిరము, ఔషధాలయము, మహాబోధి సమాజమునకు సంబంధించిన పాఠశాల, బిర్లాచే నిర్మించబడిన విశ్రాంతిభవనము, మ్యూజియము తప్పక చూడతగినవి. ఇచటింకను చూడతగిన విశేషములు చాల గలవు.

## సయ్యద్‌పూర్ (భిత్రి)

కాశీనుండి ఘుజ్రా పోవు బండిలో సయ్యద్‌పూర్ భిత్రి (23 మై) స్టేషనులో దిగవలయును. స్కందగుప్తుని కాలమునాటి స్తూపములు, అతని దిగ్విజయ స్తంభములు గలవు. ఆనాటి శిల్ప సంపదతో కూడిన ఒక పాతమంతెన కలదు. చూచితీరవలెను. ఇచట అన్ని సౌకర్యములును గలవు.

## గయ (పితృతీర్థము)

"వక్ష్యే తీర్థం పరం పుణ్యం శ్రాద్ధాదౌ సర్వతారకమ్,
గయా తీర్థం సర్వదేశే తీర్థేభ్యోప్యధికం శృణు"

— నారదపురాణము.

కాశీనుండి గయ 143 మైళ్ళు స్టేషనుకు సమీపముననే 'సూరజ్‌మల్ ధర్మశాల' కలదు. ఇదికాక నిచ్చట యింకను విశేషముగ ధర్మశాలలు కలవు. పండాల గృహములందుకూడ యాత్రికులు బసచేయుదురు. కాశీనుండియే పండాలు గయకు తీసికొనివచ్చి యాత్ర చేయించుచుందురు. యాత్రయంతలి కార్యక్రమమంతయు (భోజనాదులు కూడ) వారే ఏర్పాటు చేయుదురు. యాత్రికు లిట్లు తొలుత యేర్పరచుకొనిన, యాత్ర సుఖా

ముగా జరుగగలదు. గయయందు శ్రాద్ధము తప్పక ఆచరించ వలయునని శాస్త్రములు చెప్పుచున్నవి. గయకు చుట్టును పర్వతములు కలవు. ఆ కొండలమీద ననేక తీర్థస్థానములు కలవు. వాటిని దర్శించుటకు ధర్మాత్ము లనేకులు చక్కని మెట్లు కట్టించిరి. గయలో ప్రధాన నది ఫల్గునీనది. ఇచట సంస్కృత పాఠశాల, ఔషధాలయము, అన్నసత్రము, గవర్నమెంటు హాస్పటల్, కలెక్టరు ఆఫీసు, పోష్టాఫీసు, తంతికార్యాలయము మొదలగునవి కలవు. గయ చక్కనిపట్టణము. షుమారు జనాభా 1,33,710.

గయయందు పితృదేవతలకు పిండప్రదాన మవశ్య కర్తవ్యము. ఈ క్షేత్రమునకు యాత్రికులు సర్వకాలములందు వచ్చు చుందురు. భాద్రపద కృష్ణపక్షమందు విశేషముగ యాత్రికులు వత్తురు. ఫల్గునీనదియందు వర్షాకాలములోదక్క యితరకాలముల యందు జలము స్వల్పముగా నుండును. అటులయ్యును దీని యందే పిండప్రదానము చేయుదురు.

గయయందు శ్రాద్ధముచేయుటకు చాల వేదికలు (అరుగులు) కలవు. యాత్రికులు వీనిమీదనే పిండప్రదానము చేయ వలయును. గయలో ముఖ్యముగా ఫల్గునీతీరమున, విష్ణు పాదములయందు, వటవృక్షచ్ఛాయయందు యీ మూడుచోట్ల శ్రాద్ధము చేయవలయును. శ్రాద్ధమునకై 3 నూతన భాండము (కుండ) లతో బియ్యము, వానికి సరిపోవు మూతలు, పిడకలు పండాలే తెచ్చియిత్తురు. ఆ మూటిని వేరువేరుగ పక్వముచేసి పై మూడు స్థానములందు పిండప్రదానము చేయవలయును. ఫల్గునీతీరమందలి శ్రాద్ధపిండములను నదిలోనే వేయుదురు, విష్ణు

పాదములందు వటవృక్షమువద్దచేసిన శ్రాద్ధపిండములను గోవులు భక్షించును. ఇచటి గోవులు పరమసాధువులు. ఇవి యాత్రికు లను వెంటాడుచుండును.



* జైనాలయము (సారనాథ్ చూ. 351)

వర్షాకాలమున ఫల్గునీ నదియందు నీరధికముగ నుండుటవలన 'గాయత్రీఘాట్, బ్రహ్మణీఘాట్, బకువాఘాట్, గదాధర ఘాట్' మొదలగు ఘట్టములవరకు నీరు వచ్చును. ఇతర సమయములందు నీరు తక్కు వగా నున్నను యిసుకను తొలగించిన స్వచ్ఛ మగు జలము కానగును. యాత్రికులు దీనితోనే శ్రాద్ధమును నిర్వర్తింతురు. గయాశ్రాద్ధ కార్యక్రమము 16 రోజులు పట్టును.

సంకల్పము:— భరతఖండే వైవస్వత మన్వంతరే, మేరోః దక్షిణ దిగ్భాగే, ఆర్యావర్తాంతర్గత మగధదేశే, గయా గదాధరక్షేత్రే, కోలాహలపర్వతే మధువనే, విక్రమశకే, బౌద్ధా వతారే, బార్హస్పత్యమానే......సంవత్సరే......

| తిధి | శ్రాద్ధస్థానములు |
| --- | --- |
| భాద్రపద పూర్ణిమ— | ఫల్గునీ నదీతీరమున నొకవేదికయందు పాలతో పిండప్రదానమును, భగవం తుని పాదపూజయు చేయవలయును. |
| భాద్రపద. బ. ౧— | రామశిల, రామకుండము, ప్రేతశిల, బ్రహ్మకుండము, కాకబలి అను నీ యైదు వేదికల మీదను పిండప్రదా నము చేయవలయును. |

| తిథి | శ్రాద్ధస్థానములు |
|---|---|
| భాద్రపద బ. విదియ— | ఉత్తరమానసము, ఉదీచి, కనఖలము, దక్షిణ మానసము, జిహ్వాలోలము అను నీయైదు స్థలములందు శ్రాద్ధము చేయవలెను. |
| ,, బ. తదియ— | మతంగవాపీ, ధర్మారణ్యము, బౌద్ధగయ యీస్థానములలో పిండప్రదానము చేయవలయును. |
| ,, బ. చవితి— | బ్రహ్మసరోవరము, కాకబలి ఈరెండుచోట్ల శ్రాద్ధము చేయవలయును. |
| ,, బ. పంచమి— | రుద్రపాదము, బ్రహ్మపాదము, విష్ణుపాదము యీ మూడుచోట్ల పిండప్రదానము చేయవలయును. |
| ,, బ. షష్ఠి సప్తమి అష్టమి } | ఈ మూడు తిథులందును క్రిందివ్రాసిన 16 వేదికలందు శ్రాద్ధము చేయవలయును. కార్తికపాదము, దక్షిణాగ్ని, గార్హపత్యాగ్ని, ఆహవనీయాగ్ని, సత్యాగ్ని, ఆవసథ్యాగ్ని, సూర్యపాదము, చంద్రపాదము, గణేశపాదము, దధీచిపాదము, కణ్వపాదము, మతంగ పాదము, క్రౌంచ పాదము, ఇంద్ర పాదము, అగస్త్య పాదము, కశ్యప పాదము యీ 16 చోట్ల చేయవలెను. |

| తిథి | శ్రాద్ధస్థానములు |
| --- | --- |
| భాద్రపద బ. నవమి— | రామగయ, సీతాకుండము. |
| ,, బ. దశమి— | గయాశిరము, గయాకుండము. |
| ,, బ. ఏకాదశి— | ముండపృష్ఠ, ఆదిగయ, ధౌతపాదము. |
| ,, బ. ద్వాదశి— | భీమగయ, గోప్రచారము, గదాలోలము. |
| ,, బ. త్రయోదశి— | ఫల్గునీనదిలో స్నానముచేసి పాలతో తర్పణము చేయవలయును. |
| ,, బ. చతుర్దశి— | వైతరణీ కుండమున తర్పణముచేయవలయును. |
| ,, అమావాస్య— | అక్షయవట సమీపమున పిండప్రదానము చేయవలయును. |

ఈ పై స్థానములందు దేవతామూర్తులు, దేవాలయములు, దర్శనీయములగు వృక్షములు గలవు. శ్రాద్ధముచేసి వీనిని భక్తితో దర్శించవలయును.

ఈ పితృకార్యమంతయును యోగ్యులగు విద్వాంసుల ద్వారా జరిపించిననే సఫలమగును. ఈ విధముగ గయలో ప్రధానముగ జేయవలయును. తమతమ యవకాశముల ననుసరించి పై విధముగ 16 రోజులుగాని, లేక పూర్వము తెలిపిన ప్రకారము 3 రోజులుగాని, లేక ఒకరోజుననే ఫల్గునీనది, విష్ణుపాదము, అక్షయవటము యీ మూడుచోట్లగాని చేయువచ్చును — ఈ మూడుస్థానములలో అక్షయవటము దగ్గర పండాలు తమ పాద

ములు కడిగించుకొని ఒక పూలమాలను యాత్రికుని రెండు చేతులకు చుట్టి విశేషదానము చేయుమని కోరుదురు. తాము తృప్తినందిన పితృదేవతలు తృప్తిపడి తరింతురని కూడ చెప్పుదురు. రు 116/- లు తొలుత కోరుదురు. చివరకు రు 1/- యిచ్చినను తీసికొందురు. కాని ఒకవిధముగ రూపాయికి అంగీకరించరు. యాత్రికులు తమతమ శక్తికొలది దానము చేయుదురు. అట్లు దానమును గ్రహించి పితృదేవతలు తరించిరని పలుకును. పిమ్మట ఏదైనా తన కభిమతమగు వస్తువును విడిచిపెట్టి (జీవితములో నెన్నడు గ్రహింపకుండునట్లు) దాని నిమిత్తము కొంత ధనమునిమ్మని పాండా కోరును. యాత్రికులు తమకభిమత వస్తువును విడిచినట్లు ప్రతిజ్ఞచేసి పాండాకు కొంతదక్షిణ యిత్తురు.

ఈ విషయమున నొక యంతరార్థమున్నది. చంచలములగు నింద్రియములను వశపరచుకొనినగాని మానవుడాముష్మికముగ నౌన్నత్యము నందజాలడు. కామ క్రోధాదులను బరిత్యజించనంతవరకు యింద్రియములు స్వాధీనముకావు అందుచేత కామ క్రోధాదులగు నరిషడ్వర్గమునం దొకదానిని యిచట విడుచుట యాత్రికుని కర్తవ్యము. కలికాలమగుట నా యరిషడ్వర్గమును వీడలేనివారు తమకు మిక్కిలి యభిమతమగు వస్తువును నిచ్చుట పరిత్యజింతురు.

గయాసురుడు:— గయాక్షేత్రమును గూర్చి వాయు పురాణమున నీ విధముగ వ్రాయబడియున్నది. పూర్వము గయాసురుడను నొక రాక్షసుడు గలడు. వాని తండ్రిపేరు త్రిపురాసురుడు. తల్లి ప్రభావతి. ఒకప్పు డారాక్షసుడు ఘోరమగు తపస్సు

నాచరించి విష్ణువును ప్రసన్నుని గావించుకొని 'తన శరీర మతి పవిత్రమై స్పర్శమాత్రమున సర్వజీవులను తరింపజేయునటులుండ వలె'నని వరము వేడికొనెను. విష్ణువును 'తథాస్తు'ని యంతర్హితు డాయెను. దేవత లీ విషయమును విని యాశ్చర్యపడిరి. అంత వారందరును గయాసురుని సమీపించి 'మేమొక యజ్ఞముచేయ సంకల్పించితిమి, అందులకు పరమపవిత్రస్థాన మొండు కావల యును. నీశరీరము చాలపవిత్రమై స్పర్శమాత్రమున సర్వజీవులను తరింపజేయ సమర్థమైనది. నీ పృష్ఠభాగమున (వీపున) యజ్ఞము చేయుటకు నీ వనుమతించవలయును' అని వేడిరి. పరోపకార పారీణుడగు గయాసురు డందుల కిచ్చగించి పరుండెను. దేవత లందరు విష్ణువును, బ్రహ్మను వెంటనిడుకొని యజ్ఞము నారం భించిరి. గయాసురుడును తన ప్రాణములను విసర్జించెను. అంత దేవతలందరు నాతని త్యాగమునకు ప్రీతులై యాతని శరీరమున దమ యంశలతో నుండుటకు నిశ్చయించుకొని యీ శరీరమున పితృదేవతలకు పిండప్రదానము చేయువారలాచంద్రతారార్కము స్వర్గమున దివ్యభోగముల నందుదురని వరమిచ్చిరి. ఈ విధముగ పరమపవిత్రమగు నీ గయాక్షేత్ర ముత్పన్నమయ్యెను.

గయలో పలువిధములగు స్ఫటికములు లభించును. 108 పూసల మాల రు. 1 మొ॥ రు. 50 లు విలువగలవి లభించును.

**గయలోని మందిరములు:—**

శ్రీ విష్ణుపాద మందిరము:— ఇది ఫల్గునీ, మధుశ్రవా నదులయొద్దున గలదు. ఇచట శ్రీమహావిష్ణువు పాదచిహ్నములు గలవు. ఈ పాదములు స్ఫుటముగ కనుపించవు. కాశీలోని కేదార

నాథమందిరమందలి కేదారనాథస్వరూపమువలె నుండును. ఈ పాదములకు చుట్టును ½ అ. యెత్తున గచ్చుతో గట్టుగా కట్టబడి



విష్ణుపదదేవాలయము

యున్నది. ఒకేసమయమున 6 గురు యీ పాదములందు పిండశ్రాద్ధము చేయవచ్చును. ఇట గోవులధికము. పిండప్రదాన సమయమున పిండము లుంచుటయే తడవుగ గోవులు గ్రహించుచుండును. పిండప్రదాన మగువరకు గోవు లట్లు గ్రహించ కుండ చూచుకొనుట అవసరము. క్రీ.శ. 1766 లో 'ఇండోర్ రాణి' అహల్యాబాయి యీ మందిర మును కట్టించెను.

బ్రహ్మయోని పర్వతము:— విష్ణుపాద మందిరమునకు సుమా రొక మైలుదూరమున బ్రహ్మయోనిపర్వతము కలదు. దీనిమీదకు ఎక్కుటకు 'ఇండోర్' మహారాజు మెట్లు కట్టించెను. ఈ పర్వతమున 2 గుహలు కలవు. వీనినుండి నిర్గమించిన జన్మ రాహిత్యము కలుగునని చెప్పుదురు. వర్ణసాంకర్య ప్రోద్భవుడగు మనుజుడు వీనిని నిర్గమించజాలడను కింవదంతికూడ కలదు.

రామశిలా:— ఇచటకు 2 మై. దూరమున 'రామశిలా' పర్వతముకలదు. 'టికార్' ప్రభువు దీనికి మెట్లు కట్టించెను. ఇచట నొక పెద్దదేవాలయమున రామలక్ష్మణులు, పాతాళేశ్వరుని విగ్ర

హములు కలవు. ఈ కొండకు దిగువ 'రామకుండ'మను పేర నొక కుండము గలదు. యాత్రికులిట స్నానముచేసి పిండప్రదానము చేయుదురు.

ప్రేతశిలా:— 'రామశిల'కు 3 మై. దూరమున 'ప్రేతశిలా పర్వతము' కలదు. ప్రేతశిలకు సమీపమున 'బ్రహ్మకుండ' మను నొక సరస్సు గలదు. ఇచట స్నానముచేసి యాత్రికులు పిండప్రదానము చేయుదురు. అనంతరము ప్రేతశిలాపర్వతము నధిరోహింతురు. పర్వతశిఖరమునగూడ పిండప్రదానము చేయుదురు. ఇచట పిండప్రదానముచేసిన ప్రేత యోనియందు పరిభ్రమించు పితరులుకూడ ముక్తి నొందుదురు.

సీతాకుండము లేక రామగయ:— ఫల్గునీనది కావలి యొడ్డున కొండకు దిగువ నొక మందిరము కలదు. అందు సీతాదేవి దశరథునకు పిండప్రదానము చేయుచున్నట్లును, దశరథుడు చేయిజాపి యందుకొనుచున్నట్లును విగ్రహములు కలవు. ఇచట శ్రాద్ధము, తర్పణము, మిక్కిలి భక్తితో చేయవలయును. దీనికి సమీపమున నింకను మందిరములు కలవు. లంకనుండి తిరిగి వచ్చుచు రాముడు దశరథునకిట శ్రాద్ధము జేసెనట. ఈ తీర్థము నాటి స్మృతిచిహ్నమే.

గయాశిరము:— విష్ణుపాద మందిరమునకు కొలదిదూరమున గయాసురుని మస్తకము కలదు. ఇచటకూడా పిండప్రదానము చేయవలయును.

గయాకూపము:— గయాశిరమునకు ముందు 'గయాకూపము' కలదు. దానికి సమీపమున నొక వటవృక్షము కలదు.

ఈ కూపమున నకాలమరణము నొందిన పితృదేవతలకొక టెంకాయను సమర్పించిన వారలు ముక్తి చెందుదురందురు. ఇచ్చట పండాలు యాత్రికులవలన ప్రథమమున నిర్ణయించుకొనిన తమ దక్షిణను పుచ్చుకొందురు.

సూర్యకుండము:— దీనిని సూర్యవంశీయులు కట్టించిరని చెప్పుదురు. ఈ కుండమున నియముగ కొంతకాలము స్నానము చేసిన కుష్టురోగము శమించును. ఇదియేకాక యిచ్చట నింకను సరస్సులు మందిరములు చాల గలవు. యాత్రికులు వానినిగూడ భక్తితో దర్శించి శక్తికొలది ధర్మము చేయవలయును.

కాళేశ్వరి:— గయకు 25 మైళ్ళ దూరమున 'కాళేశ్వరీ' పర్వతము కలదు. చాలమంది యాత్రికు లింతవరకు వెళ్ళును. వనవాస సమయమున పాండవులిట నివసించిరని చెప్పుదురు. ఇచ్చట నేడును అర్జునుని బాణమువలన నుద్భవించిన "గంగాకుండము" కలదు. ఇది అగాధ జలపూరితమై యున్నది.

ఇచట ననేకములు ప్రాచీన చిహ్నములు నశించి భూగర్భములో జీర్ణమై పోయెనని పండాలు చెప్పుదురు. గయలోకూడ భూమిలోకలసి నామమాత్రావశిష్టములైన తీర్థములు, కుండములనేకములు గలవు.

యాత్రికులు గయలో నెంతకాలముందురో, అంతవరకు నిత్యము ఈదేవతలను దర్శించుచుండవలయును. ఆదిగదాధరుడు, విష్ణుపదము, పదునెనిమిది వేదులు, సూర్యుడు, అక్షయవటము, ఫల్గునదీ తీర్థము, లక్ష్మి, మంగళగౌరి, గయేశ్వరి.

మాహాత్మ్యము:— గయలో శ్రాద్ధముజేసిన మనుజుని పూర్వపు పదితరములవారును, ముందు పది తరములవారును ముక్తి నొందుదురు. అక్షయవటమున పిండప్రదానము చేసిన వారల కనంతసుఖము కలుగును. పితృదేవతలు తమకులమున గయాశ్రాద్ధముచేయు పుత్రు డేనాడుద్భవించునా యని చింతించు చుందురు. అని "యాజ్ఞవల్క్యస్మృతి" యందు గలదు. గయా శ్రాద్ధమాహాత్మ్యమును పురాణములు, స్మృతులు ముక్తకంఠముతో గొనియాడినవి.

## బుద్ధగయ

గయకు 7 మై. దూరమున బుద్ధగయ కలదు. గయనుండి టాంగామీదుగ వెళ్ళవచ్చును. ఇది పూర్వము బౌద్ధుల యధీనమందుండెడిది. కాని శంకరాచార్యులు దిగ్విజయమును బడసిన మీదట శంకరుని యనుయాయులగు మహంతుల యధికారమున నుండుచువచ్చెను. ఇది హైందవులకు, బౌద్ధులకుగూడ చూడదగిన ప్రదేశము. ఇట చక్కని ధర్మశాల కలదు.

ఈ ప్రదేశమునకు, బుద్ధుని జీవితమునకు మిక్కిలి సంబంధము గలదు. బుద్ధునికి జ్ఞానోదయమైన ప్రదేశ మీ పవిత్ర క్షేత్రమె. ఇటనుండియె బుద్ధు డఖిలప్రపంచమునకు జ్ఞానోపదేశము చేసెను. అందుచే నిది బౌద్ధులకు పుణ్యక్షేత్రము.

బుద్ధాలయము:— ఇచ్చట నొక మందిరము గలదు. సుమారు రేబదినంవత్సరములకు పూర్వ మీ దేవాలయ శిఖరము మాత్రము గోచరించుచుండెడిది. మిగిలినభాగమంతయు భూమిలో కప్పబడియుండెడిది. ప్రభుత్వసాయమున భక్తులు కొందరు దీని

నుద్ధరించిరి. ఇది అశోకుడు కట్టించిన మందిరము. ఇందు బుద్ధుని విగ్రహము బంగారు రేకుతో నమర్చబడియున్నది. సుమారు రెండువేల సంవత్సరములకు పూర్వపు కట్టడమయ్యు నిది నేటికిని చెక్కు చెదరలేదు. ఇప్పటి బుద్ధగయా దేవాలయము 10 వ శతాబ్దములో పునరుద్ధరించబడినది. దీనికిచుట్టూ కట్టబడిన రాతి గోడ క్రీ. పూ. 2 వ శతాబ్దము నాటిదని భావింపబడుచున్నది. ఇచట బోధివృక్షము అసలు బోధివృక్షము సంతతియని చెప్పుదురు. మందరమునకు వెనుక నొక యశ్వత్థవృక్షము కలదు. ఈ వృక్షరాజము క్రిందనే శాక్యముని అయిన గౌతముడు బుద్ధుడై జ్ఞానోదయము కలవాడయ్యెను. దానికి సమీపముననే బుద్ధుడు తపముజేసిన ప్రదేశము గలదు. ఈ అలయమందలి శిల్పము నిరుపమానము. ప్రతి యుంగుళమున బుద్ధుని ప్రతిమ గలదు.


* బుద్ధుని ఆలయము

జగన్నాథ మందిరము:— బుద్ధగయలో 'అహల్యాబాయి' కట్టించిన జగన్నాథమందిరము కలదు. ఇందు సీతారామ లక్ష్మణుల మూర్తులు కలవు. దీనికి సమీపముననే బుద్ధగయా మహంతుయొక్క విశాల భవనము కలదు. ఇచ్చటకు చీనా, బర్మా, జపాను దేశములనుండి బహుళముగ బౌద్ధులేతెంచు చుందురు. ఇచట యాత్రికులు బుద్ధకుండమున నిరంజనా నదీతీరమున పిండప్రదానము చేయుదురు.

గుహలు:— బుద్ధగయకు సుమారు 12 మైళ్ళ దూరమున నతి ప్రాచీనములగు బౌద్ధగుహలు కలవు. అశోకుడు వీనిని

బౌద్ధులు తపస్సు చేసుకొనుటకు నిర్మించెను. ఈ గుహాలు 25 మూరల పొడవు 11 మూరల వెడల్పు గలిగియున్నవి.

బుద్ధగయ బజారు చిన్నది. ఇచట ఫలములు, భోజన సామాగ్రి సర్వము లభించును. ఇచ్చట మహంత్ తెరచిన సంస్కృత పాఠశాల, అన్నసత్రము కలదు. ఇది వైరాగ్యమున కుపయుక్తమగు నొక పుణ్యక్షేత్రము.

## నీరాజనం



అమ్మయ్య! ఇప్పటికి శాస్త్రిగారి పుణ్యమా అంటూ కాశ్మీరునుంచి కన్యాకుమారివరకు, కచ్ నుంచి కలకత్తావరకూ గల యావత్ భారతదేశ పర్యటన మన కందరికీ ఒక్క ఆరురూపాయల ఖర్చుతో లభించింది. కాశ్మీర్ కమనీయసౌందర్యాన్ని, ఉత్తరప్రదేశ్ మనోజ్ఞదృశ్యాలను, అనేక సామ్రాజ్యములకు జన్మభూమి అయిన ఢిల్లీ నగర వైభవాన్ని, దాని చారిత్రక ప్రశస్తిని, ప్రకృతిమాత వంగదేశంలో తీర్చిదిద్దిన రంగవల్లులను, మహాభక్తులకు నిలయములైన గుజరాత్, మహారాష్ట్ర దేశములను, హిందూ, మహమ్మదీయ సంస్కృతుల మేలుకలయికకు మంచి నిదర్శనమైన హైదరాబాదును, అక్కడి శిల్పసంపదను, ఆవేశానికి, ఆత్మార్పణకు ఆటపట్టయిన ఆంధ్రావనిని, వ్యాపార దక్షతకు, దేవాలయ నిర్మాణ శిల్పచాతురికి నిలయమైన తమిళనాడును, పాండ్య, చేర సంస్కృతులకు కాణాచియైన కేరళదేశాన్ని, అక్కడి వింతలను యీ యాత్రాక్రమంలో మన కళ్ళకి కట్టినట్టు చూపించారు. అతివృద్ధ, అయి

నప్పటికీ నిత్యనూతన అయిన భారతమాత సహజ సుందర స్వరూపాన్ని యాత్రికుల చర్మ చక్షువులకే కాక చదువరుల మనో నేత్రాలకు కూడా సాక్షాత్కరింపచేశారు.

## భారతావని విరాట్ స్వరూపం

ఉత్తరాన హిమాలయాలనుంచి, దక్షిణాన రత్నాకర మహోదధి సంగమస్థానం వరకు గల ఈ మహాదేశం వైశాల్యం పన్నెండులక్షల ఇరవై వేల చదరపుమైళ్లు. ఇంక నదులు, నదాలు, పర్వతాలు, పీఠభూములు, అడవులు ఎన్నెన్ని రకాలో ఉన్నాయి. ఈ ప్రపంచంలో ఎన్ని రకాల నైసర్గిక విశేషాలున్నాయో, శీతోష్ణ స్థితులున్నాయో అవి అన్నీకూడా ఈ దేశంలో ప్రత్యక్షమవుతాయి. ఇందులో అతిసారవంతమైన గంగా, యమునా మైదానం ఆర్య నాగరికతకు ఆలవాలం. ఈశాన్యసీమలో అస్సాంగుండా బ్రహ్మపుత్రానది ప్రవహిస్తున్నది. నర్మదా, తపతి, మహానది, గోదావరి, కృష్ణా, కావేరినదులు యుగయుగాలుగా భారతీయ సంస్కృతికి సజీవ చిహ్నాలుగా ప్రవర్తిల్లుతున్నవి.

భారతీయ నాగరికత, ప్రపంచంలో అతి ప్రాచీనమైన నాగరికతలలోకల్లా ప్రాచీనతమమైనది. ఆర్యులు ఈ దేశమునకు మొదట క్రీస్తుకుపూర్వం పదిహేనువందల సంవత్సరంలో వచ్చారు. అప్పటికే ఈ దేశంలో తమ నాగరికతకంటే ఉత్కృష్టమైన జానపద నాగరికత వర్ధిల్లినట్లు కనుగొన్నారు. ఆనాటి బస్తీలు, విశాలమయిన వీధులతో, ఆరోగ్యప్రదమయిన మురుగునీటి వసరులతో, స్నానపమందిరాలతో, పండుయిటికల యిళ్ళతో, ధాన్యాగారాలతో విలసిల్లేవి. ఆనాటి ప్రజలకు లిపి తెలుసు.

లోహవిజ్ఞానం తెలుసు. ఆర్య, ఆర్యేతర సంస్కృతుల సమ్మేళనం వల్ల మూడు మహామతములు ఇక్కడ ప్రభవించాయి. వేద ప్రతిపాదితమైన హిందూమతం, బౌద్ధమతం, జైనమతం, వాటికి అనుబంధంగా తత్వశాస్త్రాలు ప్రోక్తమయ్యాయి. ఇక భౌతికంగా చూస్తే బ్రహ్మాండమయిన దేవాలయములు, మఠములు, శిల్పములకు కాణాచులయిన మందిరములు, కుడ్యచిత్రములు ఎన్నో మనకు యావత్తుదేశంలోనూ అడుగడుగునా కనపడుతూనే యున్నాయి. ఈ నాటికీ దేశదేశాలనుంచి వచ్చే యాత్రికులకు ఇవి అవశ్య దర్శనీయములుగా భాసిల్లుతున్నాయి.

అతి ప్రాచీన కాలంలోనే "బాబిలోనియా" వంటి దేశాలతో ఇండియాకు వాణిజ్య సంబంధాలుండేవి. ఆ తరువాత ఇండియాలో పండే ముడిసరుకు, తయారుచేయబడిన రకరకాల వస్తువులకోసం ఈజిప్టునుంచి, రోమక సామ్రాజ్య దేశాలనుంచి, చైనానుంచి వ్యాపారు లెగబడుతూ వుండేవారు. భారతీయ సంస్కృతీ వైభవదీప్తులు మధ్యాసియా, ఆఫ్గనీస్థాన్ పర్షియా, లంక, ఇండోనీసియా, బర్మా, చైనా వగైరా పరిసర దేశాలకు వ్యాపించి వాటిని జ్యోతిర్మయం చేశాయి. మహమ్మదీయ మతం — అరబ్బు వ్యాపారులద్వారా దండయాత్రలు చేసిన సాహసికులద్వారా ఎనిమిదవ శతాబ్దిలో ఈ దేశానికి వచ్చి ఇక్కడ పాతుకొని పోయింది. ఈ దేశాన్ని పరిపాలించిన ముస్లింరాజులు ముఖ్యంగా మొగలాయీలు. భారతదేశ సాంస్కృతీశబలతను వికసింప చేయడానికి చేకూర్చిన దోహదం, యింతింతనరానిది. పదిహేడవ శతాబ్ది ప్రారంభములో కలిగిన

పాశ్చాత్యసంపర్కంవల్ల ఆధునికవిజ్ఞానదృష్టి, సాంకేతిక పరిజ్ఞానం ఈ నాటి ప్రజాస్వామ్యవ్యవస్థలు భారతీయులకు లభించాయి.

జనాభాలో ప్రపంచం మొత్తం మీద చైనా తరువాత ఎక్కువమంది యిక్కడే ఉన్నారు. ప్రపంచం జనాభాలో ఏడవ వంతు అనగా ముప్పదిఐదు కోట్లమంది ఇక్కడున్నారు. వీరు అంతా ఏక భారతజాతి. అయినప్పటికి వీరిలో ఎన్నెన్ని ఆచారములు, ఎన్నెన్ని మతాలు, ఎన్నెన్ని భాషలు, ఎన్నెన్ని వేషాలు, ఇన్నిరకాల ప్రస్ఫుటంగా కనిపించే వైవిధ్యంలోనూ, మనకు అనుస్యూతమై, అంతర్గతముగా ఒక ఏకత్వం ఎప్పుడూ కనబడుతూనే ఉంటుంది. మొత్తంమీద ఇక్కడప్రజలు అందరూ కష్టజీవులు. పౌరుషపరులు. అతిథిమర్యాదలు చక్కగా తెలిసినవారు. వితరణ శీలురు.

## ప్రభుత్వ వ్యవస్థ

భారత రిపబ్లిక్‌లో ఆంధ్రతోసహా ఇరువై ఎనిమిది రాష్ట్రాలున్నాయి. అన్నింటిలోనూ ప్రజాస్వామ్య ప్రభుత్వాలున్నాయి. ఇందులో కొన్ని రాష్ట్రాలు గ్రేట్‌బ్రిటన్, ఇటలీల కంటె పెద్దవి. యూనియన్ ప్రభుత్వానికి అధిపతి రాష్ట్రపతి. కార్యనిర్వాహక అధికారం అంతాకూడా పార్లమెంటుకు బాధ్యులయిన యూనియన్ ప్రభుత్వ మంత్రిమండలిది. ఇంక సార్వభౌమ అధికారం నవభారత రాజ్యాంగంప్రకారం ప్రజలది. అనగా ప్రజా ప్రతినిధులతో రెండు శాసనసభలతో కూడిన భారత పార్లమెంటుది. ఇందులో దిగువ సభను ప్రజా ప్రతినిధి సభ అంటారు. ఎగువ సభను రాజ్యసభ అంటారు. ఈ ప్రజా ప్రతినిధులందరూ వయో

జన, నియోజకాధికారం ప్రాతిపదికగా ఎన్నుకోబడినవారు. అలాగే ప్రతిరాష్ట్రానికి కూడా శాసనసభలు, మంత్రిమండలి, గవర్నరు ఉంటారు.

## ప్రజల వేష భాషలు

హిందీ ప్రభుత్వభాష. కానీ విద్యావంతులందరికీ ఇంగ్లిషుతో పరిచయముంది. ఇవిగాక పధ్దెనిమిది ప్రాంతీయ భాషలున్నాయి. ప్రపంచంలో ఎన్ని మతాలున్నాయో వాటన్నింటికి ఈ దేశ ప్రజలలో ప్రాతినిధ్యం ఉంది. అన్నిటిలోకి హిందూమత ప్రాబల్యం చాలా ఎక్కువ. దాదాపు ఇరువదినాలుగుకోట్లమంది హిందువులు. మిగతావారిలో నాలుగుకోట్లమంది ముస్లిములు. వీరు కాకుండా క్రైస్తవులు, శిక్కులు, బౌద్ధులు, పారశీలు, యూదులు, ఇతరమతాలవారు అనేకమంది ఉన్నారు. కన్యాకుమారినుంచి కాంచనగంగవరకూ ఉన్న రెండువేల మైళ్ల దూరం వరకూ వ్యాపించియున్న యీ మహాదేశంలో మండుటెండలు లగాయతు మంచుపడేవరకు యుండే అన్నిరకాల శీతోష్ణసితులు తారసిల్లుతాయి. ప్రాంతాలనుబట్టి, ఋతువులనుబట్టి శీతోష్ణసితి మారుతుంటుంది. దేశం మొత్తంమీద నవంబరునుంచి మార్చి వరకు శీతాకాలమని చెప్పాలి. ఈసమయంలో శీతోష్ణసితి చాలా సుఖదంగా ఉంటుంది. ఉత్తరదేశంలో అప్పుడప్పుడు చలిగా యుంటుంది. కొండలమీద మంచు దట్టంగా పడుతుంటుంది. ప్రాచ్యభారతంలో చలికాలం చాలాకాలం ఉండదు. బొంబాయిలోనూ, దక్షిణాదిని శీతగాలియంటూ ఏమీయుండదు. సముద్ర మట్టానికి ఐదు, ఆరువేల అడుగుల ఎత్తున శీతోష్ణసితి ఎంతో

హాయిగా ఉంటుంది. ఇంక వేసవికాలం వచ్చిందంటే - ఏప్రిల్, జూన్ నెలలు - ఇండియా మొత్తంమీద ఎండలు మండిపోతూ యుంటవి. అయితే ఈలాంటి మండు వేసవిలో కూడా యాత్రికులు కాశ్మీర్, కులు లోయ, సిమ్లా, ముసోరీ, నైనిటాలు, డార్జిలింగ్, కొడైకెనాల్ వగైరా పర్వత కేంద్రాలకు వెళ్ళి సుఖంగా కాలక్షేపం చెయ్యవచ్చు. అక్కడ ఎప్పుడుకూడా వాతావరణంలో వేడి అరవై, డెబ్భై డిగ్రీలకు మించదు. సాధారణంగా జులైలో వర్షాలు మొదలౌతాయి. సెప్టెంబరు నెలాఖరువరకు జడివానలు పడుతూనేయుంటవి. మొత్తంమీద ఇండియాలో ఏదోమూల ఎవరికి అనువైన శీతోష్ణస్థితి వారికి అందుబాటులోనే యుంటుంది.

ఇండియాలో ముఖ్యమయిన పట్టణాలన్నింటికి రైలు, రోడ్డు, విమాన మార్గాలున్నాయి. ఈ దేశానికి ఒక ప్రత్యేకమయిన కాలమానం వుంది. దీనిప్రకారమే రైళ్లు నడుస్తాయి.

## ఇక్కడి ఆకర్షణ

ఇది అంతా చూస్తే ఈ దేశం అంత అందమైంది, ఆనందకరమైంది ప్రపంచంలో మరొకటి లేదని చెప్పాలి. ఇక్కడి ప్రాచీన కట్టడాలు, భవనాలు ఈ దేశపు విజ్ఞానానికి, పురావైభవానికి, నిదర్శనానికి నిలచి ఉన్నాయి. ఇక్కడి ఆచారవ్యవహారాలు, పండుగలు, మతాలు, సంస్కృతి అన్నీ గరీయసమైన ప్రాచీన భారతీయ సంస్కృతికి ప్రతి రూపములుగా పరిఢవిల్లుతున్నవి. సృష్టి సౌందర్య సందర్శనోత్సుకులయిన వారికి, వృక్ష శాస్త్ర

నేత్తలకు, ప్రకృతి పరిశీలకులకు ఇక్కడి అడవులు, పర్వతాలు, లోయలు, మైదానాలు, ఎడారులు అపూర్వ విజ్ఞానభాండారాలు.

అలాగే మృగయా వినోదులకు, మత్స్య గ్రహణ వినోదులకు, కలాయుగ్రసణ వినోదులకుకూడా ఇక్కడిఅరణ్యములు, నదులు, సరస్సులు మంగొంగు బంగారములు. ఒళ్లు గగురు పొడిచే గుఱ్ఱపు పందెములకు, సాహసానికీ, నైపుణ్యానికీ నిదర్శన మైన పోలో, గోల్ఫు, క్రికెట్టు, టెన్నిసు వగైరా పాశ్చాత్య క్రీడలను, శీతాకాలపు క్రీడలను చూడాలంటే అందుకు ఈ దేశంలోగల అవకాశాలు కొల్లలు. సముద్రస్నాన సుఖం పొంద దలచిన వారికి యీ దేశంలో ఉన్నన్ని సౌకర్యాలు, తావులు, మరెక్కడాలేవు. పర్వతారోహణ దక్షులయిన వారికి అత్యున్నత మయిన మన హిమాలయాలకన్న ఆకర్షణీయమైంది యింకొకటి ఏమున్నది?

అలాగే అపూర్వ కళాఖండాలను మధుర స్మృతి చిహ్నలను సేకరించడములో ఆసక్తిగలవారికి సయితం ఇవి యిక్కడ వెక్కసంగా లభిస్తాయి. భారతదేశపు కళాకారులు సృష్టించిన అపూర్వవస్తు విశేషాలకు విదేశాలలో ఏనాడయిన బోలెడంత గిరాకియుంది. స్వయం భువమైన సౌందర్యతృష్ణ, అపారమైన ఓర్మి, శతాబ్దులుగా సంక్రమించిన విన్నాణము యివియన్ని కలసి భారతీయ కర్మకారులకు అపూర్వ శిల్పరచనా కౌశలమును సంత రించి పెట్టినవి. ఆ కారణంచేతనే జరీ, బుటేదారీ పనులతో నేత్ర పర్వంగా సుఖ స్పర్శదమైన కాశ్మీర్ దుశ్శాలువలు, కాశీ, మూర్షి దాబాదు జరీచీరలు, ఢిల్లీ, జయపురం నగలు, మైసూరు, తిరు

వాక్‌పూరులలోని దంతపు బొమ్మలు, మూర్షిదాబాదులోని లోహపాత్రలు, ఫెరోజిదాబాదులోని గాజులు యిలా ఎన్నెన్ని చెప్పడం. ఈ దేశంలో అనుపదంగా ఎదురుపడే అనేక రకములైన వస్తు సంచయం మాన్యులకే కాక సామాన్యులకు సయితం నేత్ర, మనోల్లాసకరంగా యుంటాయని చెప్పడానికి ఆశ్చర్యమేముంది ?

## మన కర్తవ్యం

మనం భారతీయులుగా పుట్టడమే గొప్ప గౌరవం ప్రపంచంలో. యుగయుగాలుగా కర్మభూమిగా వాసికెక్కిన ఈ పవిత్ర దేశంలో, అందునా ఈ సమయంలో అన్యదుర్లభమైన భారతీయ జన్మ పొందగలగడం పూర్వపుణ్య విశేషం. ఇది సార్థకం కావడం స్వామికార్యము పేరుతోనైనా, స్వకార్యము పేరుతోనైనా దేశం గఱుమూలలు పూర్తిగా తిరిగి ఏకరూపమయ్యా, అడుగడుగునా వైవిధ్యశోభను వెలార్చుతుండే భారతమాత సురుచిర సౌందర్యోజ్జ్వల దివ్యరూప దీధితులను రేఖామాత్రంగా అయినా దృగ్గోచరం చేసుకోగలిగిననాడే. ఇందుకు మొదటిమార్గం ఆంధ్ర కవితా పితామహుడయిన అల్లసాని పెద్దన మహాకవి సృష్టించిన ప్రవరుని పాదలేపం మనకు లభించకపోయినా, ఆయన మన స్తత్వము మాత్రము మనదేశంలో అందరికి ఆదర్శంకావాలి. "పోయి సేవింపలేకున్నఁ బుణ్యతీర్థ మహిమ వినుటయు నఖిలకల్మష హరంబు" అన్నమాట మన దేశంలో ఆబాల గోపాలానికి తారకమంత్రం కావాలి. తీర్థయాత్రాచణ శీలత్వం ప్రతివారికి రెండవ స్వభావంకావాలి. ఎవ




శ్రీ ధన్యంరాజు అప్పారావుగారి సౌజన్యముతో.

# ద్వితీయ భాగము

## * కొన్ని ప్రధానాంశములు *

### జగన్నాథ ఖండము

పాట్నా
హరిహర క్షేత్రము
వైద్యనాథము
తారకేశ్వరము
కలకత్తా
నవద్వీపం
గంగాసాగరం
వైతరణి
భువనేశ్వరం
పూరి
కోణార్కం
సాక్షిగోపాలం
శ్రీకూర్మం
సింహాచలం
అన్నవరం
భీమాగామం
పాదగయ
రాజమండ్రి
చిన్నతిరుపతి
బెజవాడ - (పరిసరములు)

### మధ్యభారతము

నాగపూరు
ఇటార్సి
భోపాల్
సాంచి
గ్వాలియరు
ఝాన్సి
చిత్రకూటం
కాళింజరు
రీవా
ఓర్చా
జబల్‌పూర్
ఖజురాహో
అమరకంటకం

### రామేశ్వర ఖండము

కాళహస్తి
తిరుపతి
కంచి
మదరాసు
మహాబలిపురం
కుంభకోణం
తంజావూరు
శ్రీరంగము
రామేశ్వరం
కన్యాకుమారి
కొచ్చిన్
కోయంబత్తూరు
గోకర్ణం
మైసూరు
హంపి
శృంగేరి

## భగవత్ప్రాప్తి-ఉపాయములు 0-4-0

"...ఇందు భగవత్ప్రాప్తికి దగు మార్గావలంబన మభిర్ణితము—"

— రామకృష్ణప్రభ

ఇందు సాధకుని శక్తి ననుసరించి ఉపాయానేకము మొదలు ఏకోపాయము వరకుగూడ ఆచరింపదగిన ధర్మములు సప్రమాణముగ వివరింపబడినవి—"

— శ్రీహరనాథమురళి

## హరినామ మహిమ శతకము 0-4-0

"—ఈకలికాలమున మానవుడు సర్వవిఘ్నముల తరించుటకు నామమే శరణ్యమను విషయ మిందు చక్కగ నిరూపితమైనది."

— మోక్షసాధని

"—నామ మహిమను వర్ణించు గ్రంథము సంస్కృతమున నింతకు మించినది లేదు."

— శ్రీ హరనాథమురళి

## గీతాప్రతిభ 0-12-0

"...ఈగీతాప్రతిభ, జనసామాన్యమునకు గీతాపారాయణ ఫలమును కథారూపమునఁ దెలుపఁగలిగి యున్నది..."

— శ్రీరామకృష్ణప్రభ

"...అందరును చదివి భక్తి జ్ఞాన వైరాగ్యములను సంపాదించుకొనుటకు నొక సోపానముగ నున్నది."

— శతావధాని, శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి

## పరమ సాధన 0-12-0

"—పరమార్థమును బొందుటకు ప్రాచీనులు త్రొక్కిన సాధనపథముల తెల్పుటలో మీ గ్రంథము చాల ముఖ్యమైనది."

— శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి

"పరమ సాధన సాధకులకు పరమధనము...పాశ్చాత్యవాసనా సంఘట్టనచే సంశయ పూరితులైనవారికి భగవద్విశ్వాసము కలిగించి పరమ ధ్యేయమగు పరమాత్మను పొందుటలో తోడ్పడుటకు ఈ గ్రంథ మెంతయు యుపయుక్తముగ నుండును."

— ఆంధ్రపత్రిక

## శ్రీ కాళహస్తీశ్వర శతకము 0–8–0

"ప్రచురణ విషయములో మీరు చేసిన కృషి ప్రశంసా పాత్రముగ నున్నది."

— శ్రీ పింగళి లక్ష్మీకాంతము

"ఆంధ్ర శతకములోనికెల్ల నిది తలమానికమైనది."

— శ్రీ దివాకర్ల వేంకటావధాని

"ధూర్జటి అమృత హస్తముల నవతరించిన శతపత్రము."

— ఆంధ్ర పత్రిక

"ఈశతకమందలి పాఠాంతరములు ప్రతి పద్యములోని గూఢాభిప్రాయముల కవిహృదయమును, రచనావైశిష్ట్యమును తెలియపరచుచు శ్రీ బులుసు వేంకటేశ్వర్లుగారు రచించిన పీఠిక ఈగ్రంథమునకు ఒక ప్రత్యేకాలంకారము."

— ఆంధ్రప్రభ

"— ఇంతటి చక్కని రూపములో ధూర్జటియే తన శతకమును చూచి కొనిన ఎంతగ మురిసుకొనునో ?"

— శ్రీ నిర్వికల్పానంద స్వామి

## కల్యాణకుంజము 1–4–0

రచన : స్వామి శ్రీ శివానంద సరస్వతి

"మీరొనర్చు కృషి ఆరురుక్షులకు మిక్కిలిగ నుపయోగించును."

— శతావధాని, శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి

"— జిజ్ఞాసువులందరు చదివి మహోపలబ్ధి నందవలసిన గ్రంథము."

— శ్రీ బులుసు వేంకటేశ్వర్లు

# ఆధ్యాత్మిక పత్రికలు

౧. యథార్థభారతి : ఇది ౨౭ ఏండ్లనుండి, ఆబాల గోపాలమునకు వేదాంతతత్త్వము అర్థమగునట్లు ప్రచారము చేయుచున్న మాసపత్రిక. వ్యాసాశ్రమం, ఏర్పేడు. సం. చం. రు 4_0_0.

౨. యోగవాసిష్ఠము : 3౨ వేల శ్లోకములు. శ్లోకతాత్పర్య సహితముగా, సంపూర్ణముగ, నాలుగు సంపుటములలో వెలువరింపబడినది. ఆధ్యాత్మికాసక్తి గల ప్రతి ఆంధ్రుడును చదివితీరవలయును. అనువాదకులు, శ్రీ నిర్వికల్పానందస్వామివారు. వెల రు ౫0_0_0 లు.

వ్యాసాశ్రమం, ఏర్పేడు.

3. శాంతి : ఓంకారస్వామివారిచే ౧౨ ఏండ్లనుండి, శాంతి ప్రచారార్థము శాంతి ఆశ్రమం వాత్తేరునుండి ప్రకటింపబడుచున్నది.

సం. చం. రు 3_0_0 లు.

౪. రామదర్శనం : గుంటూరు జిల్లా, పిడుగురాళ్ళ, రామతీర్థ సేవాశ్రమము నుండి, శ్రీ కేశవతీర్థులవారిచే రామతీర్థ భావప్రచారార్థము ౫ ఏండ్లనుండి ప్రకటింపబడుచున్నది. సం. చం. రు 3_0_0 లు.

౫. ముముక్షువు : కృష్ణాజిల్లా, పెదముత్తేవి, శ్రీ కృష్ణాశ్రమము నుండి ఉడయవరులచే, ౪ ఏండ్లనుండి, వైష్ణవభక్తిని ఉదారభావ పూరితముగ ప్రచారము చేయుచున్నది. సం. చం. రు ౫_0_0 లు.

౬. గీతావాణి : కర్నూలు జిల్లా, ఆళ్ళగడ్డ, గీతాసాహిత్య సేవాసమితి పక్షమున స్వామి రామకృష్ణగారిచే ౪ ఏండ్లనుండి, కేవల భగవద్గీతా ప్రచారార్థము ప్రకటింపబడుచున్నది. సం. చం. రు ౪_0_0 లు.

# గీతాకదంబము

## అనువాదకులు : శ్రీ గట్టి లక్ష్మీనరసింహశాస్త్రి

మహాపురాణ ఉపపురాణములలో 'గీతలు' అను పేర కొన్ని ఘట్టములు గ్రథితములై యున్నవి. అవి సనందనాది బ్రహ్మపుత్రులు, లేక వసిష్ఠవామదేవాది మహర్షులు, లేక నారాయణ నారదులు, మరీచ్యాదులకు, దేవగణములకు, మహర్షులకు, లేక సాక్షాద్భగవానుడే స్వభక్త శిష్యగణములకు బోధించియుండిరి. ఇహపరకల్యాణమును బడయుటకు గీతాభ్యాసముకన్న సులభమార్గ మింకొకటిలేదు. ఆ గీతలన్నియు శ్లోక తాత్పర్యములతో గీతాకదంబ సంపుటములలో దళములుగా, వరుసగ సాధక పాఠకలోకముల కరకమలాంజలుల కందజేయగలము.

ప్రథమదళము: రు 1-4-0. ఇందు, ౧ గోపికాగీత, ౨ భ్రమరగీత, 3 హంసగీత, ౪ భిక్షుగీత, ౫ అవధూతగీత.

ద్వితీయదళము: రు 1-4-0. ఇందు, ౬ ఐలగీత, ౭ శ్రుతిగీత, ౮ శ్రీరామగీత, ౯ యమగీత, ౧౦ వేణుగీత, ౧౧ యుగళగీత.

☞ వరా:— రెండు భాగములు తీసికొనిన రు 2/- లు మాత్రము.

## బదరీయాత్ర (సచిత్రము - తృతీయముద్రణము) రు 1-0-0

"వివిధ క్షేత్రాలను సందర్శింప దలచిన యాత్రికులు గమనించవలసిన విధులు, అనుసరింపదలచిన ఆచారాలను చక్కగ ఇందులో వివరించారు. యాత్రికులకు అత్యంతము ఉపయుక్తమైన గ్రంథం." — ఆంధ్ర ప్రభ

"—పుణ్యక్షేత్ర తీర్థాటనాదులు ముక్తిమార్గ సోపానములుగాన మీ పుస్తకము జిజ్ఞాసువులకు, యాత్రికులకు ధన్యతనర్థించువారికి పరమోపకారము."
— శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి

"అసమర్థులమైయున్న అస్మదాదులకు తత్తత్క్షేత్రసందర్శనఫలలాభమును కలిగించియున్నారు." —శతావధాని, శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి

# సాధన గ్రంథ మండలి ప్రచురణలు

| | |
|---|---|
| అష్టాదశ శ్లోకగీత | 0-12-0 |
| అర్థపంచకము | 0-12-0 |
| ♦ ఆశ్వీన మాహాత్మ్యము | 2- 0-0 |
| ఈశ్వర సాక్షాత్కారము | 0- 3-0 |
| ఉపాసనీబాబా జీవితము | 1- 8-0 |
| కల్యాణకుంజము | 1- 4-0 |
| గురుశిష్యులు | 1- 0-0 |
| (శ్రీరామకృష్ణవివేకానందులు) | |
| గీతాప్రతిభ (2వ కూర్పు) | 0-12-0 |
| గీతాకదంబము ౧వ దళము | 1- 4-0 |
| ,, ౨వ దళము | 1- 4-0 |
| గోవిందదామోదరస్తోత్రము | 0- 8-0 |
| జడభరతుడు | 0-12-0 |
| * నరసదాసు కీర్తనలు | 0-10-0 |
| పరమసాధన (2వ కూర్పు) | 0-12-0 |
| పరమార్థతత్త్వము | 0-12-0 |
| పద్మపురాణము(ఆదిమఖండం) | 1- 8-0 |
| ,, (భూమిఖండము) | 2- 0-0 |
| ,, (బ్రహ్మఖండము) | 1- 0-0 |
| బదరీయాత్ర (3వ కూర్పు) | 1- 0-0 |
| భగవత్ప్రాప్తి-ఉపాయములు | 0- 4-0 |
| భక్తితత్త్వము | 0-12-0 |
| భక్తిరసాయనము | 2- 0-0 |
| భారతీయ తత్త్వశాస్త్రము | 2- 0-0 |
| ♦ భాగవతకథ | 2- 0-0 |
| భారతీయదర్శనము (ప్ర.ఖం.) | 1- 8-0 |
| * మానవధర్మము | 1- 0-0 |
| * ముక్తిగీత | 0- 6-0 |
| రాధారహస్యము | |
| (40 గ్రంథములసారము) | 1- 4-0 |
| శంకరగ్రంథరత్నావళి(300 పే) | 3-0-0 |
| (ఉపదేశప్రకరణగ్రంథములు 40) | |
| * శ్రీరామపూజా విధానము | 0- 4-0 |
| శ్రీకాళహస్తీశ్వరశతకము | 0- 8-0 |
| * శ్రీసీతారామ శతకము | 0- 2-0 |
| * శ్రీత్యాగరాజ చరిత్ర | 0- 4-0 |
| * శ్రీరామనామ ప్రభావము | 0- 6-0 |
| శ్రీశుకుడు | 0-12-0 |
| శ్రీత్రిపురాంతకేశ్వరశతకము | 0- 4-0 |
| * సప్తమహావ్రతములు | 0- 6-0 |
| సిద్ధాంత కల్పవల్లి | 1- 0-0 |
| సంకీర్తన మీమాంస | 1- 0-0 |
| హరినామ మహిమ శతకము | 0- 4-0 |
| * హిందూకోడ్ బిల్ సమీక్ష | 1- 0-0 |

షరా:- రు 1 కు లోపు వి. పి. లేదు. రు 5/-లకు మించిన ఆర్డరుకు రు 1 కి 0-3-0, రు 25/- లకు రు 1 కి 0-4-0 లు, రు 100/- లకు రు 33/- లు కమీషను యివ్వబడును. సమర్థులగు ప్రచారకులు కావలయును.

☞ పై గ్రంథములన్నియు ఒకేసారి తీసుకొనిన రు. 100 కి రు. 33 లు కమీషను. ఈ అవకాశము కొలదిరోజులే.

మీ ఆర్డరు యిచ్చునప్పటికి ఉన్న గ్రంథములే పంపబడును. వి. పి. తీసికొన ప్రార్థన.